VPVMOLA 108

సాహిత్య ప్రస్థానం
సంపుటి : 11 జూన్ & జూలై 2011 సంచిక : 66

మా మాట

తెలకపల్లి రవి

# నాటికి....నేటికీ....

రెండేళ్ల విరామం తర్వాత సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక వెలువడుతున్నది. ఇది మామూలు ప్రత్యేక సంచికలకంటే మరింత ప్రత్యేకమైన సంచిక. ఇందులో వున్న రచనలేవీ ప్రత్యేకంగా ఈ సంచిక కోసం రాసినవి కావు. కాని ఏ సమయంలో ఏ సంచికలో వేసినా చాలా ప్రత్యేకంగా కనిపించేవి. నిరంతర ప్రాధాన్యత కలిగినవి. సరిహద్దు రేఖలకూ, సమయం పరిమితులకూ లోబడనివి. ఇవన్నీ ఇప్పుడు రాయని మాట నిజమే గాని ఎప్పటికైనా అక్కరకు రాగలవి. ఇప్పుడు తెలుగునాట మనం చూస్తున్న రాజకీయ సామాజిక సాంస్కృతిక అనిశ్చితిలో మార్గదర్శకం చేయగల మహా రచయితలను కవులనూ తేరిపార చూడటం అవసరమనిపించిన ఫలితమే ఈ ప్రత్యేక సంకలనం. గతంలో పాత కథలు, కవితలతో కొన్ని పత్రికల ప్రత్యేక సంచికలు వచ్చాయి. బృహత్ సంకలనాల వంటి పుస్తకాలూ వచ్చాయి. కాని ఒక పత్రిక ఇలాంటి రచనలు ఎంపిక చేసి ప్రచురించడం గతంలో జరిగి వుండకపోవచ్చు. అదే అన్నిటికన్నా పెద్ద ప్రత్యేకత.

**2**

ఈ సంచికలో దాదాపు ఏభై మంది మహా రచయితల కలాల నుంచి వెలువడిన వివిధ రకాలైన రచనలున్నాయి. ఆత్మకథలు అనుభవాలు, అభిప్రాయాలు, సలహాలు, సంభాషణలు, సంవాదాలు, లేఖలు, ఇంటర్వ్యూలు, స్వీయ పీఠికలూ వున్నాయి. ప్రాంతీయ స్థాయి నుంచి ప్రపంచ స్థాయి వరకు రచయితలు అనేకమంది ఇందులో దర్శనమిస్తారు. ఎంపికలో అన్నిటికీ ఒకే సూత్రం కుదరలేదు. కనకనే నిడివిలోనూ స్వల్ప తేడాలు వచ్చాయి. ఈ ఎంపికకు ప్రత్యేకమైన కొలబద్దలేమీ పాటించలేదు. ఒకటి రెండు మినహాయింపులతో వీరంతా ప్రగతిశీల దృక్పథం గలవారే. అలా కాని వారి రచనలు ఇచ్చినప్పుడు నేరుగా వారి మాటల్లోనే ఆ తేడా తెలిసిపోతుంది కూడా. అది తెలియడం కూడా అవసరమే. వాస్తవానికి అభ్యుదయ అభివృద్ధి నిరోధక దృక్పథాల మధ్య తేడాను తెలియజేయడం ఈ సంచిక ముఖ్య లక్ష్యాలలో ఒకటి. అలాగే మంచి రచయితలమని తమకు తామే అనుకొని ఇతరులు అనుకోనందుకు విచారించే కొంతమంది నిజంగా సాహిత్యం అంటే ఏమిటో, సాధన అంటే ఏమిటో ఎలా వుండాలో తెలుసుకోవడానికి కూడా ఇవి బాగా ఉపయోగపడతాయి. మహా రచయితలైన వారు కూడా సాహిత్య సేవలో ఎలా అష్టకష్టాలు పడ్డారో తెలుసుకుంటే ఇప్పుడు కొందరు చూపించే తాపత్రయం ఎంత హాస్యాస్పదమో బోధపడుతుంది. తెలుగు కథ అనగానే గుర్తు చేసుకునే శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి లేఖ ఇందుకో ఉదాహరణ మాత్రమే.

ప్రపంచంలో నూతన సాహిత్య ప్రస్థానానికి వైతాళికుడైన మాగ్జింగోర్కి తానెలా రాయడం నేర్చుకున్నదీ చెప్పుకున్న తీరు నాటికి నేటికీ కూడా రచనా రంగంలో వారందరికీ శిరోధార్యమైంది. విస్తారమైన ఆ అధ్యయనం లేకుండా జీవిత పరిశీలన లేకుండా వూహాశక్తితోనే కేవలం చూసిన దాన్ని యథాతథంగా అక్షరీకరించడం ద్వారానే సృజన శిల్పం పూర్తి కాదని ఈ అనుభవాలు తెలియజేస్తాయి. అలాగే అరాచక జీవుల్ని ఆకర్షణీయంగా చిత్రించే అవలక్షణాన్ని కూడా గోర్కి చక్కగానే ఎత్తి చూపించాడు.

గోర్కి రచనలో మానవుడి మహత్తర శక్తిని చెప్పిన తీరు రవీంద్రనాథ్ ఠాగూరు భావనలు, ప్రేమ్‌చంద్, సుబ్రహ్మణ్య భారతి అభిప్రాయాలు వగైరాలు కొన్ని విషయాల్లో ఒకే విధంగా కనిపించడం యాదృచ్ఛికమేమీ కాదు. మానవ మహా ప్రస్థానాన్ని వీక్షించడంలో మహా రచయితలందరూ ఎక్కడున్నా

ఒకే విధంగా ఆలోచించారని స్పందించారని దీన్ని బట్టి తెలుస్తుంది. అలా చూడటం అవసరమనీ అవగతమవుతుంది. మనిషిలో చైతన్యాన్ని మేల్కొల్పడం, తన భవిష్యత్తుకు తానే కర్త అన్న జాగృతి పెంచడం నిజమైన రచయితకు లక్ష్యం కావాలని ఈ వాస్తవం చెబుతుంది. రచయితలపైన పెద్ద సామాజిక బాధ్యత వుంటుంది గనక వారు బాధ్యతాయుతంగా స్పందించాలే గాని స్వకపోల కల్పిత లోకంలో తేలియాడటం సరికాదు. సమాజంలోని దోపిడీ పీడన వంటి వాటి మూల కారణాలను చూడకుండా కేవలం తమ స్వీయానుభూతులు సుఖ దుఃఖాలలో కొట్టుకుపోయి వాటినే పాఠకుల నెత్తిన రుద్దడం కాదని కూడా తెలుస్తుంది.

రాస్తూ వుంటే రచనా శక్తి దానికదే వస్తుందన్నట్టు భావించడం గాక విశ్వ సాహిత్యాన్ని నిరంతరం అధ్యయనం చేయాలి. ప్రపంచ శ్రేణి రచయితల మూల రచనలను చదవాలి తప్ప వారి గురించి ఇతరులు రాసింది విని సంతృప్తి పడితే చాలదు. ఈ సంచిక వెనక వుద్దేశాలలో అదీ ఒకటి. ఒకప్పుడు తెలుగులో విశ్వ సాహిత్యం, ఇతర భారతీయ భాషల సాహిత్యం విస్తారంగా లభించేది. ఇప్పుడు అంతగా లభించడం లేదు. దొరికిన మేరకైనా సద్వినియోగం చేసుకుంటున్నదీ స్వల్పం. శిల్పం, ఇతివృత్తం, కథా గమనం, కవితా గుణం వంటి వాటికి పాఠ్య పుస్తకాలనదగిన వారి రచనలు చదవకపోతే ఇవన్నీ ఎవరికైనా ఎలా పట్టుపడతాయి?

ఇక సంప్రదాయం మూఢత్వం వంటి వాటిపై మహా రచయితల భావాలను గమనిస్తే మతాన్ని ఆధ్యాత్మికతను ప్రస్తావించే వారు కూడా మనిషి ఔన్నత్యం నిలబెట్టాలన్నదే నొక్కి చెప్పడం చూస్తాం. ఇప్పుడు ఆధునిక కాలం అనుకుంటూనే పరోక్షంగా మూఢత్వాన్ని ప్రబోధించే మేధావంతులకు ఇది కనువిప్పు కాగలదు. ప్రపంచీకరణపై పోరాటానికి వేప మండలతో నృత్యం చేసే గణాచారిని నమూనాగా చిత్రించిన ఒక మేధావి రచయిత ఈ సందర్భంలో గుర్తుకు వస్తున్నాడు. ప్రపంచీకరణను వ్యతిరేకించే పేరిట కాలం చెల్లిన ఆచారాలను ఛాందసాలను గొప్పగా చిత్రించే అశాస్త్రీయత అగుపడుతుంది. వందేళ్లకన్నా ముందే ఇలాంటి వాటిపై చెప్పిన తీరు గమనిస్తే తామెంత తప్పుగా వున్నదీ వీరికి తెలుస్తుంది.

ఇందులోనే కొంతమంది రచయితలు శుద్ధ సౌందర్య చిత్రణకు పెద్ద పీట వేస్తే మరికొందరు శ్రమ జీవన సౌందర్యాన్ని మానవ ఉత్పత్తి సామర్థ్యాన్ని గొప్పగా చిత్రించాలన్నారు. ప్రకృతి అందాలను ఎంతగా చెప్పినా ప్రజల స్థితిగతులే అంతిమంగా ప్రధానమవుతాయి. కాని ఈ రెంటికీ రచనా శిల్పంలో స్థానముంటుందనేది నిర్వివాదాంశం.

పాత్రల ఎంపిక, చిత్రణ వంటి అంశాలపై ఇల్యాఎహ్రెన్ బర్గ్ రాసిన పుస్తకం చాలా ప్రసిద్ధమైంది. నూతన సోషలిస్టు సమాజం నిర్మించబడుతున్నప్పుడు అందులో సాహిత్య సృజన ఎలా వుండాలో ఆయన బాగా వివరించారు. ఇప్పుడు ఆ సమాజాలలో అనేకం విచ్ఛిన్నమై పోయినా ఆనాడు సాగిన చర్చలు ఎలా వుండేవో తెలుస్తుంది.

**3**

గతంతో పోలిస్తే ఇప్పుడు తెలుగులోనూ పుస్తకాల ప్రచురణ, ప్రచారం బాగా పెరిగాయి. అయితే ఆ మేరకు వాటి పరిధి పెరిగిందా? కుదించుకుపోయిందా? ఈ సంచికలో మనం చదివేలాంటి సాహిత్య వ్యాసాలు ఏ సాహిత్య పేజీలోనైనా వస్తున్నాయా? లేక వ్యర్థ వివాదాలే సరిపోతున్నాయా? ఈ ప్రశ్నలకు సమాధానాలు ప్రతి వారికీ తెలుసు. సాహిత్య సృజన, విమర్శల పరిధి పెరగాల్సింది పోయి కుదించుకుపోతున్నది. ప్రపంచదేశం గురించిన స్పృహ పూర్తిగా మృగ్యమై నేను నా ఇల్లు నా వూరు నా కులం నా ప్రాంతం అంటూ వాటి చుట్టూనే ప్రదక్షిణలు చేసే ధోరణి పాతుకుపోయింది. దీనికి అస్తిత్వవాదం అన్న వర్ణన బాగా అమరింది. సోషలిస్టు శిబిరాన్ని విచ్ఛిన్నం చేయడంలో జయప్రదమైన సామ్రాజ్యవాదం ఆ సిద్ధాంతాన్ని కూడా దెబ్బ తీసేందుకు దాన్నే కవచంగా చేసుకుంటున్నది. అవగాహన లోపం వల్లగాని, ఆవేశం వల్ల గాని అమాయకత్వం వల్ల గాని చాలామంది కొత్త రచయితలు కూడా అదే సాహిత్య స్వభావమనే దుర్భ్రమలో కొట్టుకుపోతున్నారు.

మరో వైపున ఈ సిద్ధాంతాలు ప్రచారంలో పెట్టిన సామ్రాజ్యవాదులేమో ప్రపంచీకరణ అనే ముద్దు పేరుతో ఏ దేశంలో ఏ మారుమూలనైనా చొరబడే హక్కు సంపాదించుకుంటున్నారు. అధిపత్యం

చలాయిస్తున్నారు. మరి ఈ స్పృహ మన రచయితలు, కవులు, కళాకారులు ప్రదర్శిస్తున్నారా? ఎన్ని రచనల్లో సామ్రాజ్యవాద ప్రస్తావన వుంటున్నది? ఇటీవలనే మరణించిన నోబుల్ గ్రహీత హెరాల్డ్ పింటర్ ప్రసంగమే వీటికి సమాధానమిస్తుంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణను ప్రతిఘటించాలని ప్రశ్నించాలని చెబుతుంది. ఒక మహా సామ్రాజ్యవాద దేశానికి చెందిన రచయితే ఆ విధంగా హెచ్చరిస్తుంటే దాని పాలనలో మగ్గిపోయిన వాళ్లం, నేటి సామ్రాజ్యవాద దేశపు కోరల్లో చిక్కుకున్న వాళ్లం మనమెంత అప్రమత్తంగా వుండాలి? ఏ మేరకు వున్నాం? కుక్లక్స్ క్లాన్ వంటి జాత్యహంకార సంస్థల గురించి రవీంద్రనాథ్ ఠాగూరు వందేళ్లకు పూర్వమే హెచ్చరికలు చేశారు గాని ఇప్పటికీ అవి కొనసాగుతున్నాయని గుర్తిస్తున్నామా?

**4**

సామ్రాజ్యవాదం, పెట్టుబడి దారీ విధానం వంటి వాటి గురించి ఆలోచించకుండా కళ్లముందరి విషయాల్లోనే కొట్టుమిట్టాడేలా చేయడానికే అస్తిత్వవాద సిద్ధాంతాలకు అమిత ప్రచారం ఇచ్చారు. స్వాతంత్ర్య పోరాటం ముందు నుంచి కూడా మన దేశంలో సామ్రాజ్యవాదం, శాంతి కాముకత, ప్రగతిశీల ప్రాపంచిక దృక్పథం వున్నాయి. అనేక విముక్తి పోరాటాలను మనం ఆనాడే బలపర్చాము. అలాగే దేశంలోనూ విముక్తి కోసం అనేకానేక పోరాటాలు నడిచాయి. స్వదేశీ సంస్థానాలలో నిరంకుశ పాలకులను ఎదుర్కొనేందుకు కాంగ్రెస్ నేతలు సిద్ధపడకపోతే కమ్యూనిస్టులు ముందు నిలిచారు. వీర తెలంగాణా, తెభాగా, పున్న ప్రా వాయలార్ వంటి పోరాటాలన్నీ అందులో భాగమే. విచిత్రమేమంటే ఇప్పుడు చాలా గొప్ప మాటలు వల్లించే అనేక మంది మేధావులు, రాజకీయవేత్తలు ఈ నిరంకుశత్వంపై పోరాటాన్ని గాక ఆ రాచరిక పాలకులను గొప్పగా చిత్రిస్తుంటారు. ఈ సంచికలో దాశరథి కృష్ణమాచార్యుల రచన చూస్తే నిజాంకు వ్యతిరేకంగా నాడెంత తీవ్ర పోరాటం నడిచిందో తెలుస్తుంది. అలాగే ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తుకు సంబంధించిన రాజకీయ రాజ్యాంగ సమస్యను భాషకు, భావావేశానికి సంబంధించినదిగా చిత్రించడమూ జరుగుతున్నది. ఈ సంచికలో కాళోజీ నారాయణరావు ఆత్మకథ భాగాలు చదివితే ఇవన్నీ ఎంత దుర్బల వాదనలో తెలుస్తుంది. అలాగే సురవరం ప్రతాపరెడ్డి అన్య భాషా పదాల విశ్లేషణ చూస్తే అందులో ఒకటి ఎక్కువనీ మరొకటి తక్కువనీ కీచులాడుకునే అవసరమే లేదని అర్థమవుతుంది. ఇంకా బుచ్చిబాబు మాటల్లోనూ ప్రాంతీయ అంతరాలపై ఆలోచనలు చూస్తాం. విచిత్రంగా చైనా రచయిత లూసన్ వ్యాసంలోనూ ఇతర కోణాలతో పాటు ఈ ప్రస్తావనలు చూస్తాము. ప్రాంతీయ భాషలను ఆకాశానికెత్తినంత మాత్రాన వొరిగేది లేదని ఆయన చెప్పడం తన అనుభవాల సారం.

**5**

లూసన్ వ్యాసంలోనే మనం రచయితలు దారి తప్పడానికి గొప్పలు పోవడానికి గల కారణాలు కూడా చూస్తాము. ప్రగతి వాదులమనుకునే వారు ప్రగతి నిరోధకులుగా మారిపోవడం చాలా సులభమని ఆయన సోదాహరణంగా చెబుతాడు. సమగ్ర దృష్టి లోపించడమే ఇందుకు కారణమవుతుంది. అలాగే ప్రజలతో సంబంధం లేని రచయితలు కొందరు ఇష్టానుసారం వ్యాఖ్యానాలు రాసేసినా వారిది ఉపరితల అవగాహన ఉత్తుత్తి పదాడంబరం మాత్రమేనని ఆయన చెప్పిన దానికి ఉదాహరణగా కళ్ళ ముందు కొందరు కనిపిస్తారు. ప్రగతిశీల సాహిత్యకారులను మరింత మందిని తయారు చేసుకోకపోతే వున్నవాళ్లే అన్ని కెలికేసి నాణ్యతను బలిపెట్టే ముప్పును కూడా ఆయన చక్కగా వివరించారు. రచయితలు తాము చాలా గొప్పవాళ్లం గనక జనం తమను నెత్తిన పెట్టుకోవాలని ఆశించడం ఎంత అవివేకమో కూడా సూటిగానే చెబుతాడు. ఊహాజనిత విప్లవకారులు దారితప్పడం ఎంత సులభమో భగత్‌సింగ్ పీఠికలోనూ చూడొచ్చు.

లూసన్‌లాగే అమెరికన్ నల్లజాతి రచయిత రిచర్డ్ రైట్ భావాలు కూడా సిద్ధాంతపరంగా చాలా ప్రాధాన్యత కలిగినవి. నల్లజాతి సాహిత్యం ఎలా విశాలం కావాలో, ప్రగతిశీలవాదులతో కలిసి ప్రపంచ దృక్పథంతో ఎలా నడవాలో ఆయన చక్కగా వివరిస్తారు. వాస్తవికత పేరుతో పాత కాలంలోనే మునిగి తేలడం సరికాదని స్పష్టీకరిస్తారు. ఏ ఇజమూ వద్దని చెప్పడం అనివార్యంగా చైతన్యాన్ని మొద్దుబారుస్తుందని హెచ్చరిస్తారు. సాంస్కృతికంగా సంక్రమించిన రూపాలనే ఉపయోగించుకుంటూ సంప్రదాయంపై

పోరాడాలని పిలుపునిస్తాడు. జాతీయ దృష్టిని జాతి విముక్తిని కూడా ఎలా మేళవించాలో చెబుతాడు. భారతదేశంలోనూ, ప్రపంచంలోనూ కూడా అస్తిత్వవాదం లేవనెత్తే అనేక సమస్యలకు ఈ రచనలో అనుభవపూర్వకమైన సమాధానాలు లభిస్తాయి.

**6**

విశ్వనాథ సత్యనారాయణ తన రచనల గురించి రాసుకున్న వ్యాసంలో కొన్ని భాగాలు గమనిస్తే ఆయన ఎందుకు తిరోగామి రచయిత అనిపించుకున్నదీ అర్థమవుతుంది. మహతి వ్యాసంలో శ్రీశ్రీ "30ల దాకా తెలుగు సాహిత్యం నన్ను నడిపించింది, తర్వాత నేను నడిపిస్తున్నాను" అని చమత్కార ధోరణిలో అంటే అహంభావానికి దాన్ని పరాకాష్టగా చూపించిన వారు విశ్వనాథ అదే సంచికకు రాసిన ఈ వ్యాసంలో అడుగ'డుగునా అతిశయం చాటిన తీరును పట్టించుకోకపోవడం విచిత్రం! దయ్యాలున్నాయని నవలలో ఒక కోణంలో రాసిన వీరేంద్రనాథ్‌ను క్షుద్ర రచయితగా విమర్శించాము గాని ఆ మాట బల్లగుద్ది మరీ చెప్పిన విశ్వనాథ తీరును కూడా ఇందులో చూడొచ్చు.

**7**

1930లలో కనుపర్తి వరలక్ష్మమ్మ రాసిన కథను చదివితే ఇది ఈ కాలంలో వాళ్లను చూసి రాసిందేమో అన్న సందేహం ఎవరికైనా కలగవచ్చు. కాని, కాదు 70 ఏళ్ల కిందటనే ఆమె రచయితల శృతి మించిన అతిశయాన్ని పరస్పర రాగద్వేషాలను వివరించారు. ఒకరినొకరు పొగుడుకోవడం కాకుండా సమాజ హితం కోసం రచనలు చేయాలని నాటి తన పరిధిలో పిలుపునిచ్చారు. ఈ ఇతి వృత్తాన్ని కథా రూపంలో రాయడం, అది కూడా భర్తపై చురకలతో నడపడం విశేషమే. రచయిత్రులకు తగిన ప్రాతినిధ్యం లేదన్న భావన మాకే వున్నప్పటికీ ఈ కథ ఆ లోటును చాలా వరకూ తీర్చింది. తెలుగులో తొలి కథ అచ్చమాంబ రాయడం ఒకటైతే అసలు కథలన్ని అమ్మల దగ్గరే పుట్టాయని వరలక్ష్మమ్మ గట్టిగానే రాశారు. ఇంతకూ మహిళలకు సంబంధించి ఇలాంటి మరో ప్రయత్నం భవిష్యత్తులో చేస్తామని పాఠకులకు (పాఠకురాళ్లకు ప్రత్యేకంగా) మనవి చేసుకుంటున్నాం.

**8**

ప్రక్రియల పరంగా కూడా అవగాహన కోసం కొడవంటిగంటి చిన్న నవల రచనను ప్రచురించాము. తెలుగులో చిక్కటి నవలలు సరిగ్గా రావడం లేదన్న విమర్శ నేపథ్యంలో కనీసం చిన్న నవలలైనా రాయాలంటే ఏ కొలబద్ధలు పాటించాలో ఆయన బాగా విశ్లేషించారు. ఇంతకూ ఈ సంచికలో కథలు, నవలల భాగం ఎక్కువై కవితాంశ తగ్గిందని ఎవరైనా అనుకోవచ్చు గాని ఆ తేడాలు చాలా స్వల్పమైనవి. వాస్తవంలో పాట, నాటకం ఇతర కళారూపాలు చలన చిత్రాల రచయితలపై కూడా వచ్చే ఏడాది ప్రత్యేక సంచిక తీసుకువచ్చే ప్రయత్నం చేస్తాము. అలాగే ఒక విమర్శ సంచిక.

కిషన్ చందర్, వల్లథోల్, రాల్ఫ్‌పాక్స్, నెరుడా, బెర్నార్డ్ షా, వీరేశలింగం, వట్టికోట ఆళ్వారుస్వామి, మయకోవస్కీ వంటి పలువురి రాతలు లేకపోవడం కొరతగానే వుంది. స్థలం సమస్య ఒకటి, ప్రత్యక్ష రచనలు, భాషణలు లేకపోవడం మరొకటి కారణాలయ్యాయి. ఇది మాకే అసంతృప్తిగా వుంది. భవిష్యత్‌లో ఈ కొరతను అధిగమించే ప్రయత్నం చేయగలము.

**9**

చివరగా - జూన్ నెల సంచిక కూడా పంపాలని అనుకున్నప్పటికీ అనేక కారణాల వల్ల సాధ్యం గాక రెండు మాసాలకూ కలిపి ఇది తీసుకొచ్చాము. పాఠకులు అర్థం చేసుకుని ఆదరిస్తామని ఆశిస్తున్నాము.. ఇవన్నీ ఒక్క చోట దొరకడం కొన్ని అసలు దొరకడం చాలా కష్టం. ఇందులోని రచనలు సేకరించుకోవడానికి అవకాశం ఇచ్చిన వారందరికీ కృతజ్ఞతలు. ఇందులో ఎవరినీ కావాలనీ మినహాయించడం గాని పని గట్టుకుని చేర్చడం గాని జరగలేదు. మహామహులెందరికో ఇప్పటికీ చోటు లభించలేదని మాకు తెలుసు. అంచనాల రీత్యా కూడా ఒక్కొక్కరు ఒకలా భావించవచ్చు. అలాంటి మినహాయింపులు కనిపిస్తున్నా వున్న మేరకు ఈ సంచిక ఉపయోగపడుతుందనే భావిస్తున్నాము. దైనందిన జీవిత పోరాటంలో పరుగుల ప్రపంచంలో అవసరమైన మేరకు చదివే అవకాశం లేక కొరతపడుతున్న తెలుగు రచయితలు, కవులకు దీన్ని కానుకగా సమర్పిస్తున్నాము. దీనిపై సలహాలు, సూచనలు, విమర్శలను ఆహ్వానిస్తున్నాము.

## ఈ సంచికలో...

ముఖ చిత్రం : **అక్బర్**

సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వొరప్రసాద్
హిమజ్వాల

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com








# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
# ప్రాథమిక విద్యాశాఖ
# రాజీవ్ విద్యా మిషన్ (SSA)

గౌ॥ శ్రీ నల్లారి కిరణ్ కుమార్ రెడ్డి
ముఖ్యమంత్రి, ఆంధ్ర ప్రదేశ్

గౌ॥ డా॥ ఎస్. శైలజా నాథ్
ప్రాథమిక విద్య, సర్వశిక్షా అభియాన్, ఓపెన్ స్కూల్స్, లైబ్రరీలు, మహిళా సమతా సొసైటీ శాఖామాత్యులు, ఆంధ్ర ప్రదేశ్

**"పిల్లల చేత చాకిరి చేయించడం అమానుషం, అనాగరికం"**

**"బాలల హక్కుల పరిరక్షణ - మనందరి బాధ్యత"**

**బాలల హక్కులు :**
- జీవించే హక్కు ◆ చదువుకునే హక్కు ◆ ఆరోగ్య మరియు పోషణ హక్కు ◆ కూడు, గుడ్డ, నీడ హక్కు
- ఆట పాటలతో కూడిన వినోదం, విశ్రాంతి పొందే హక్కు ◆ పని నుండి విముక్తి పొందే హక్కు
- కూలి జీవితం నుండి బయటపడే హక్కు ◆ కుల మత వర్గ విచక్షణ లేని హక్కు
- దౌర్జన్యాల నుండి రక్షణ పొందే హక్కు ప్రత్యేకించి ఆడపిల్లలు దుర్మార్గుల నుండి రక్షణ పొందే హక్కు

## బాలల ఉచిత, నిర్బంధ విద్యా హక్కు చట్టం, 2009 - ముఖ్యాంశాలు

- పిల్లలందరు ఉచిత, నిర్బంధ ఎలిమెంటరీ విద్య పొందే హక్కు కలిగి ఉంటారు.
- పాఠశాలల ఏర్పాటు, పాఠశాల భవనం, బోధనా సిబ్బంది, బోధనాపరికరాలతో సహా మౌలిక సదుపాయాలను ప్రభుత్వం ఏర్పాటు చేయాలి.
- పిల్లలందరినీ తప్పకుండా బడిలో చేర్చి, బడి మానకుండా చూడాల్సిన బాధ్యత ప్రభుత్వం మరియు తల్లిదండ్రులపై ఉంటుంది.
- బడి బయట ఉన్న పిల్లలను వారి వయస్సుకు తగిన తరగతులలో చేర్చి ప్రత్యేక శిక్షణను ఇవ్వాల్సి ఉంటుంది.
- బడిలో ప్రవేశం పొందిన పిల్లలను అదే తరగతిలో మళ్లీ కొనసాగించడం లేదా బడి నుండి తీసివేయడం చేయకూడదు.
- బాలలను శారీరకంగా, మానసికంగా వేధించడం లాంటివి చేయకూడదు. ఎవరైనా ఈ విధంగా ప్రవర్తిస్తే వారిపై చర్యలు తీసుకోబడును.
- పాఠశాలలన్నీ చట్టంలో పేర్కొన్నట్లు సరైన ప్రమాణాలు పాటించాలి. అలా పాటించని పాఠశాలలకు గుర్తింపు రద్దు చేయబడును.
- ప్రైవేట్ పాఠశాలలు తప్ప అన్ని పాఠశాలల్లో బడియాజమాన్య కమిటీలు ఏర్పాటు చేయాలి. ఈ కమిటీలు పాఠశాలల పనితీరును సమీక్షించడం, నిధుల వినియోగాన్ని పర్యవేక్షించడం వంటి విధులను నిర్వహిస్తాయి.
- నిర్దేశిత విద్యార్హతలు ఉన్న వారినే ఉపాధ్యాయులుగా నియమించాలి.
- ఉపాధ్యాయులు సమయపాలన పాటించడం, సకాలంలో పాఠ్యాంశాలు బోధించడం, తల్లిదండ్రులతో క్రమం తప్పకుండా సమావేశాలు నిర్వహించడం వంటి విధులను తప్పక నిర్వహించాలి.
- అన్ని పాఠశాలల్లో చట్టంలో పేర్కొన్న విధంగా తగినంత మంది ఉపాధ్యాయులను నియమించాలి. అలాగే పాఠశాలలన్నింటికి కనీస సదుపాయాలు కల్పించాలి.
- ఈ చట్టం అమలు తీరును పర్యవేక్షించడానికి రాష్ట్రస్థాయిలో బాలల హక్కుల పరిరక్షణ కమీషన్ ఏర్పాటు చేయాలి.

సార్వత్రిక ఎలిమెంటరీ విద్యా సాధనకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంయుక్తంగా 2001-02 నుండి నిర్వహిస్తున్న కార్యక్రమమే "సర్వశిక్షా అభియాన్". ఈ కార్యక్రమాన్ని మన రాష్ట్రంలో రాజీవ్ విద్యా మిషన్ ద్వారా అమలు చేస్తున్నాం.

## ప్రాధాన్యతాంశాలు

- 5 సం॥లు నిండిన పిల్లలందరినీ ఒకటో తరగతిలో చేర్పించడం
- బడి బయట పిల్లలను, బాల కార్మికులను పాఠశాలల్లో చేర్పించడం
- బాలికల విద్యను ప్రోత్సహించడం
- 100% విద్యార్థులను, క్రింది తరగతుల నుండి పై తరగతులకు పంపించడం
- "ప్రత్యేక అవసరాలు" గల పిల్లలకు అందరితో సమానంగా విద్యను అందించడం
- ఎస్సీ, ఎస్టీ, బిసి, మైనారిటీ & బలహీన వర్గాల వారిపై ప్రత్యేక శ్రద్ధ
- పిల్లలందరికీ విద్యనందించే దిశగా అడుగులేద్దాం

ప్రత్యేక అవసరాలు గల పిల్లలకు అందరితో సమానంగా విద్యను అందిద్దాం ! శారీరక, మానసిక లోపం కలిగిన పిల్లల్లో ఆత్మస్థైర్యాన్ని పెంచుదాం ! వారి జీవితాల్లో వెలుగు నింపుదాం ! అందరికీ విద్యను సాధిద్దాం !!

6 నుండి 14 సంవత్సరాల వయస్సు గల బాలికల సాధికారత, సంపూర్ణ విద్యా వికాసం, భద్రమైన భవిత కొరకు ప్రత్యేకంగా
**"ఎలిమెంటరీ స్థాయి బాలికల జాతీయ విద్యా కార్యక్రమం (NPEGEL)"**

అట్టడుగు వర్గాల బాలికల కోసం - గుణాత్మక విద్యతో పాటు బాలికల వ్యక్తిత్వ వికాసం, లింగ వివక్షత నిర్మూలన, బాలబాలికల నమోదు, నిలకడల మధ్య గల అంతరాన్ని తగ్గించడానికి, బడి బయటి బాలికలకు ఆవాస విద్యాలయాలు
**"కస్తూర్బా గాంధీ బాలికా విద్యాలయాలు"**

**"మదర్సా"** లలోని పిల్లలకు రెగ్యులర్ పాఠశాల విద్యను బోధించడానికి విద్యా వాలంటీర్లను, పాఠ్యపుస్తకాలను అందించడం జరుగుచున్నది.

చదువుకోవడం పిల్లల హక్కు పిల్లలందరు చదువుకోడానికి బడిలో చేర్చే బాధ్యతను స్వీకరిద్దాం.
చట్టం అమలుకు సహకరిద్దాం.



# సర్వ శిక్షా అభియాన్



**అందరూ చదవాలి - అందరూ ఎదగాలి**



# సాహిత్యంలో సమధర్మం

## గురజాడ అప్పారావు

**(21.9.1861 - 30.11.1915)**

**ఆధునిక తెలుగు సాహిత్య వైతాళికుడు.**

ఆధునిక కవులు అటుగాక మనుష్యుల సుఖ దు:ఖములు అన్నియును వొక్కలాటివే యనియు మనిషి అయివుండుటలో వకని తక్కువ, వకని హెచ్చులేదనియు, సుగుణములు సత్ప్రవర్తన గొప్ప అవస్థలో నుండువారికిని తక్కువ అవస్థలో నుండు వారికిని సామాన్యములనియు, కావ్యములో రసోదయమును కలిగించుటకు రాజుల రెడ్ల బ్రాహ్మణుల చర్యల వర్ణన యెటుల తగియున్నదో రైతుల యొక్కయు తక్కువ జాతులవారి యొక్కయు చర్యలు గూడ నటులనే తగియున్న వనియు నభిప్రాయపడి, ఇంపయిన కావ్యములు తక్కువ స్థితిలో నుండు మనుజుల సుఖ దు:ఖముల గూర్చి వ్రాసిరి. వర్డ్సువర్తు అందుచేతనే ఒక గొల్లవాడి బ్రతుకును గూర్చి కావ్యము వ్రాసెను.

మన పండితులీ కావ్యమును జూచినచో "ఇదియా కావ్యము! ఒక గొల్లవాడు కొండల వెంట దిరిగెనట. వాని కుమారుడు చెడు తిరుగుళ్ళు తిరిగి దేశాంతరగతుడాయెనుట. తండ్రి మందకు పాక కట్ట నారంభించి దు:ఖముచే ముగించలేక పోయెనట! ఇదియా కావ్యమునకు తగిన కథ?" అని నవ్వుదురు.

పుట్టుకవల్ల గొప్ప రానేరదు. గుణ యోగ్యతలవలననే గొప్ప వచ్చును. పెద్ద యవస్థలో నుండు దుర్జునని కన్న తక్కువ స్థితిలో నుండు సజ్జనుడు నిజమైన గొప్పవాడు కాడా?

వర్డ్సువర్తు కవిత్వమునకును, అంతకు పూర్వము కవిత్వము వ్రాసిన యింగ్లీషు కవీశ్వరుల కవిత్వమునకు చాలా భేదము కలదు. అతనికి ముందు పదునెనిమిదవ శతాబ్దమున నుండిన కవులు రెండు నిశ్చయములు చేసుకొని యుండిరి. అవేమంటే 1) కావ్యమున నుపయోగించు మాటలు (Poetic Diction) నాజూకుగ నుండవలయుననియు 2) కవిత్వమున వర్ణించతగిన వస్తువులు (Subjects) కూడా సామాన్యమైనవి కాక నాజూకుగాను, లలితముగాను, గొప్పవిగాను నుండవలయుననియు....

మనలో కూడ కావ్యములు లోకములో వాడుకలోలేని గ్రాంథిక భాషలోనే వ్రాయవలయునని లక్షణములు వ్రాసిన కవులు నిర్ణయము.

అలాగాక, సామాన్యమగు వస్తువులను గూర్చి వాడుకలో నుండు మాటలలో కవిత్వము చెప్పి కవితా సామర్థ్యము వలన వానికి సొంపు తెచ్చి చదువరుల మనసుల రంజింపజేయు వచ్చునని వర్డ్సువర్తు అభిప్రాయము. అట్లని నాజుకు మాటల నతడు ఉపయోగించకపోలేదు. నాజూకగు సంగతులు గూర్చి కావ్యములు వ్రాయకపోలేదు. ఇతని కాలమునుండి ఇంగ్లీషు కవిత్వము తోవయే మారి మిక్కిలి గొప్ప స్థితికి వచ్చినది.

మన దేశపు కవులు కావ్యములలో వర్ణించు పాత్రములు, దేవతలు, దేవతా స్త్రీలు, రాజులు, రాజకుమారికలు, పెద్దయింటి పురుషులు, స్త్రీలు, వీరి చర్యలు అవస్థలే వర్ణింతురు. అందులో కథానాయకులకు (Heroes of the Poem) లోకములో కానరాని

గుణ సంపత్తి, పరాక్రమాదులు, సౌందర్యమును ఆరోపింతురు. తక్కువ జాతి వారిని గూర్చి వర్ణించి వ్రాయరు. కవిత్వమున వ్రాయతగిన చర్యలు అట్టి తక్కువ మనుష్యుల బ్రతుకులలో నుండనేరవని మన దేశపు కవుల అభిప్రాయము. వర్డ్సువర్తుకు పూర్వపు కవుల అభిప్రాయము గూడ కొంతవరకట్టిదియే.

ఆధునిక కవులు అటుగాక మనుష్యుల సుఖ దు:ఖములు అన్నియును వొక్కలాటివే యనియు మనిషి అయివుండుటలో వకని తక్కువ, వకని హెచ్చులేదనియు, సుగుణములు సత్ప్రవర్తన గొప్ప అవస్థలో నుండువారికిని తక్కువ అవస్థలో నుండు వారికిని సామాన్యములనియు, కావ్యములో రసోదయమును కలిగించుటకు రాజుల రెడ్ల బ్రాహ్మణుల చర్యల వర్ణన యెటుల తగియున్నదో రైతుల యొక్కయు తక్కువ జాతులవారి యొక్కయు చర్యలు గూడ నటులనే తగియున్న వనియు నభిప్రాయపడి, ఇంపయిన కావ్యములు తక్కువ స్థితిలో నుండు మనుజుల సుఖ దు:ఖముల గూర్చి వ్రాసిరి. వర్డ్సువర్త అందుచేతనే ఒక గొల్లవాడి బ్రతుకును గూర్చి కావ్యము వ్రాసెను.

మన పండితులీ కావ్యమును జూచినచో "ఇదియా కావ్యము! ఒక గొల్లవాడు కొండల వెంట దిరిగెనట. వాని కుమారుడు చెడు తిరుగుళ్ళు తిరిగి దేశాంతరగతుడాయెనుట. తండ్రి మందకు పాక కట్ట నారంభించి దు:ఖముచే ముగించలేక పోయెనట! ఇదియా కావ్యమునకు తగిన కథ?" అని నవ్వుదురు.

పుట్టుకవల్ల గొప్ప రానేరదు. గుణ యోగ్యతలవలననే గొప్ప వచ్చును. పెద్ద యవస్థలో నుండు దుర్జునని కన్న తక్కువ స్థితిలో నుండు సజ్జనుడు నిజమైన గొప్పవాడు కాడా?

టెన్నిసన్ అనెను :

"Kind hearts are better

than coronets and served

Faith than Norman blood,"

పెద్ద ప్రభువులై యుండుట కంటె దయగల హృదయము కలిగియుండుటే శ్రేష్టము. రాజ రత్నము కన్న నమ్మిన నీతియే శ్రేష్ఠము.

బర్న్సు అనే కవియనెను :

"Rank is but guinea stamp

The man is the gold for all this"

లోకములో యెక్కువ తనది అనునది తెచ్చిపెట్టుకున్నది. నాణెముపై ముద్దర వంటిది. మనుష్యుడే బంగారము. అనగా గుణయోగ్యతలను బట్టి మనిషికి విలువ కలుగును గాని ఉద్యోగములవలన ధనధాన్యముల వలన పెద్దింట పుట్టుట వలన కలుగనేరదు.


# 'ప్రస్థానం'కు చందా కట్టండి!
## నెల నెలా మీ ఇంటికే ప్రస్థానం తెప్పించుకోండి!!



ప్రత్యేక తగ్గింపు!

అయిదేళ్లకు : రు. 500/-
పదేళ్లకు : రు. 1000/-
సంవత్సర చందా (వ్యక్తులకు) : రు. 120/-
సంవత్సర చందా (సంస్థలకు) : రు. 150/-
విడి ప్రతి : రు. 10/-



ఒక మంచి పత్రికకు చందా కట్టండి! - తెలుగు సాహిత్య కృషిని ప్రోత్సహించండి!!

ప్రస్థానం

ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-20

వివరాలకు : 040-27660013, సెల్: 9490099059 ; ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in



# దేశి సాహితి సొంపు

## వేటూరి ప్రభాకరశాస్త్రి

**(7.02.1888-29.08.1950)**

ఆంధ్రజాతి యాచార వ్యవహార ప్రవాహములో అంతర్లీనములయి - పోయినవి ప్రాచీన కాలపు దేశి రచనా ప్రభేదములు. అవి యెంతగా అంతర్లీనములయినవీ అంటే వాని ఆనుపానులు సరిగా ససిగా నేటివారు అనుమానించడానికైనా సాధ్యపడనంత వింతగా అంతర్లీనములయినవి. నేటికాలపు తెలుగు పాండితి వాటి వాసననైనా యెరుగనక్కరలేనంత యవనతితో ఉన్నది. మన ప్రాచీన కవీశ్వరులు ఈ దేశీ రచనా భేదములను బాగా యెఱిగినవారై ఉండేవారని, రచించగలవారై కూడా ఉండేవారని చెప్పడానికాధారములున్నవి. నాచన సోమన వసంత విలాసమని గ్రంథము రచించినాడట. అది దొరకలేదు గాని దానిలోని రచన మొకటి లక్షణ గ్రంథాలలో ఉదాహృతమై ఉన్నది.

"వీణాగానము వెన్నెల తేటా
రాణ మీఱగా రమణుల పాటా
ప్రాణమైన పిన బ్రాహ్మణువీటా
జాణలు మెత్తురు జాజరపాటా"

ఈ జాజర పాట దేశిరచనా ప్రభేదమే. వసంత విలాసము యక్షగానమేమో!

అల్లసాని పెద్దన చతుర్విధ కవితా విశారదుడు. ఆశు, మధుర, చిత్ర విస్తరములని చతుర్విధ కవితల పేర్లు, అందు దేశి గేయరచనలకే మధుర కవితలని పేరు.

దేశి రచనలు ఆచార వ్యవహారములలో అంతర్లీనమై ఉండటము కొంత వివరిస్తాను.

"వాడు నన్ను 'ఎగతాళి' చేస్తున్నాడు" అన్న నానుడి ఆంధ్ర దేశం అంతటా ఉన్నది. ఇందులోని 'ఎగతాళి' పదం పుట్టుపూర్వోత్తరాలు ఎట్టాంటివో ఎరిగున్నవారెందరో ఉండరు. ఎగతాళి అన్నది ఒక దేశి రచనా ప్రభేదము. 'ఏకతాళి' 'ఎగతాళి' రూపభేదములే. శాతవాహనులనాటి దగు బృహద్దేశి, చాళుక్య సోమేశ్వరుని మానసోల్లాసము, చాళుక్య జగదేకమల్లుని సంగీత చూడామణి, కాకతీయులనాటి జాయ సేనాపతి నృత్త రత్నావళి, యీ 'యేకతాళి'ని పేర్కొన్నవి.

"వాడు చిందులు తొక్కుతున్నాడు. ఆ వీధిలో వంకాయలు వాలలాడుతున్నవి. ఇత్యాది వ్యవహారములలోని 'చిందులు' దేశి రచనా ప్రభేదములే.

"వేడుకతో చిందు పాడంగ నుబ్బి
కోణింగియాటల గునిసెడివారు" అని

చిందుపాటను పాల్కురికి సోమనాథుడు పేర్కొన్నాడు.

"గీతార్థానయోపేతై ర్ద్విపదై శ్చిందు సంజ్ఞకైః" అని చిందులు రెండేసి పదములు గలవిగా జాయ సేనాపతి చెప్పినాడు. యక్షగానములలో కొన్నింట చిందు రచనలు కానవచ్చు. అవి ఆంధ్రదేశము నుండి అరవ దేశమునకు కూడా ఎగబ్రాకి అక్కడ లక్ష్య లక్షణ ప్రయోగ ప్రసిద్ధి పడసియున్నవి. 'కావడిచిందు' 'నొండి (=కుంటి) చిందు' ఇత్యాదులు అక్కడి ప్రభేదములు.

"వాడు 'తందనా'లాడుతున్నారు. అన్న వ్యవహారములోని 'తందనాలు' తందాన పదములన్న పేర ప్రసిద్ధిగాంచిన పదములే. వాటిలో తందానే అన్నది ఆ పదమునకు పల్లవిగా - అంటే ఊత పలుకుగా ఉంటుంది.

"ఇదేమిటో పెద్ద 'రగడ'గా నున్నదే" అన్న పలుకుబడి లోని 'రగడ' గేయరచనా ప్రభేదమే. రగడలు కొంత మార్పు పొంది, పొందకుండా కూడా తెలుగులో ఎన్నో రకాల గేయరచనలయినవి.

“అల్లో నేరేళ్ళు” అనే పేరు గేయ రచనలకు వింత తీరుగా వచ్చినది. అల్లో నేరేళ్ళలో 'వెలది రుక్మిణి సమర్త వేడుక లాయె' అని ఉపక్రమము గల పాతకాలపు పాట ఫణితిని రచితములైన గేయములన్నిటికీ 'అల్లో నేరేళ్ళు' అన్న పేరైంది. 'అల్లో నేరేళ్ళల్లో' పాటలు వెన్నెల రాత్రులందు ఆరుబైట కన్యకలు రెండు వరుసలుగా వేరుపడి ఆడుతూ పాడే పాటలు, ఇది మిక్కిలి ప్రాచీనమైనది.

“తాళాఖ్య తాళేన గేయా స్యా దేశతాళికా”

అని సంగీత చూడామణి

యక్షగానములలో కొన్నింట ఎకతాళి రచనలున్నవి.

“వాడు చిందులు తొక్కుతున్నాడు. ఆ వీధిలో వంకాయలు వాలలాడుతున్నవి. ఇత్యాది వ్యవహారములలోని 'చిందులు। దేశి రచనా ప్రభేదములే.

“వేడుకతో చిందు పాడంగ నుబ్బి

కోణింగియాటల గునిసెడివారు” అని చిందుపాటను పాల్కురికి సోమనాథుడు పేర్కొన్నాడు.

“గీతార్థానయోపేతై ర్ద్విపదై శ్చిందు సంజ్ఞ కైః” అని చిందులు రెండేసి పదములు గలవిగా జాయ సేనాపతి చెప్పినాడు. యక్షగానములలో కొన్నింట చిందు రచనలు కానవచ్చు. అవి ఆంధ్రదేశము నుండి అరవ దేశమునకు కూడా ఎగబ్రాకి అక్కడ లక్ష్య లక్షణ ప్రయోగ ప్రసిద్ధి పడసియున్నవి. 'కావడిచిందు' 'నొండి (=కుంటి) చిందు' ఇత్యాదులు అక్కడి ప్రభేదములు.

“వాడు 'తందనా'లాడుతున్నారు. అన్న వ్యవహారములోని 'తందనాలు' తందాన పదములన్న పేర ప్రసిద్ధిగాంచిన పదములే. వాటిలో తందానే అన్నది ఆ పదమునకు పల్లవిగా - అంటే ఊత పలుకుగా ఉంటుంది.

“ఇదేమిటో పెద్ద 'రగడ'గా నున్నదే” అన్న పలుకుబడి లోని 'రగడ' గేయరచనా ప్రభేదమే. రగడలు కొంత మార్పు పొంది, పొందకుండా కూడా తెలుగులో ఎన్నో రకాల గేయరచనలయినవి.

“ధవళాలు పాడుతున్నారు” అనే నానుడిలోని “ధవళాలు” వివాహాది శుభకార్యములలోను, యక్షగానములలోను ప్రసిద్ధి గాంచియున్నది.

“కథాసు షట్పదీయోజ్యా వివాహే ధవళ స్తథా” అని చాళుక్య సోమేశ్వరుడు చెప్పినాడు. 'నీకే వచ్చు సువాలయున్ ధవళ మింతీ, 'అల్లో నేరళ్ళు గౌరీ కల్యాణము' ఇత్యాదిగా పాంచాలీ పరిణయమునను.

“ఆ లలనామణి కాగ

య్యాళి యొకానొక్క వేళ నక్కరతో సు

వ్వాలలు సోబానలు ధవ

ళాల్ మొదలైన పాటలాడదట నేర్పున్”

అని 'శుకసప్తతి' లోనూ ధవళాలు పేర్కొనబడినవి. యక్షగానములలో ధవళములు అధికముగా గానవచ్చును.

ఇంకా ఏల పాటలు అనేవి కూడా దేశి రచనా ప్రభేదములే. చాళుక్య జగదేకమల్లుడు సంగీత చూడామణిలో కర్ణాటలాట గౌళాంధ్ర ద్రావిడ భాషలలో ఏలలు కలవనీ అందులో ఆంధ్రుల 'ఏలలు' మిక్కిలి మనోజ్ఞములనీ చెప్పియున్నాడు. యక్షగానములలోను, సామాన్య జన వ్యవహారములలోను ఎన్నో రకాలైన ఏలలు సర్వాంధ్ర దేశమునను వ్యాపించియున్నవి.

సువాలలు, ఉయ్యాలలు, ఓలలు కూడా అట్టివే.

“అల్లో నేరేళ్ళు” అనే పేరు గేయ రచనలకు వింత తీరుగా వచ్చినది. అల్లో నేరేళ్ళలో 'వెలది రుక్మిణి సమర్త వేడుక లాయె' అని ఉపక్రమము గల పాతకాలపు పాట ఫణితిని రచితములైన గేయములన్నిటికీ 'అల్లో నేరేళ్ళు' అన్న పేరైంది. 'అల్లో నేరేళ్ళల్లో' పాటలు వెన్నెల రాత్రులందు ఆరుబైట కన్యకలు రెండు వరుసలుగా వేరుపడి ఆడుతూ పాడే పాటలు, ఇది మిక్కిలి ప్రాచీనమైనది.

“వెన్నెల దినముల, నల్లో నేరేళ్ళుగాక యావల గలవే” అని రామాయణ సుందరకాండములో గలదు. యక్షగానములలో గేయ భాగములుగాను, ఇంకా అనేక కథా ప్రధాన గేయములు గాను ఈ అల్లో నేరేళ్ళున్నవి.

“వాడు కూనరాగాలు తీస్తున్నాడు” అన్న నానుడి సర్వాంధ్ర విదితము. ఈ కూనరాగాలు “కూనలమ్మ పదాలు” అనే వింత తీరు పద రచనలు.

ఇంకా 'శోభనాలు', 'కొట్నాల పాటలు', 'గౌరీ కల్యాణము', 'అర్ధ చంద్రికలు', 'జంపెలు', 'కురుచజంపెలు', 'త్రిభంగులు', 'వెన్నెల పదాలు', 'తుమ్మెద పదాలు', 'చిలుక పదాలు', 'త్రిపదలు', 'షట్పదులు', 'సప్తపదులు' మొదలైన పదాలెన్నో లక్ష్య లక్షణ స్వరూపాలలో వున్నవి. మార్గశిరమాసము వస్తున్నది. ఆ నెలలో ఆంధ్ర దేశమంతటా కన్యకలు గొబ్బిళ్ళు అని పేడబొమ్మలు పెట్టి గొబ్బి పాటలు పాడే సంప్రదాయం ఉన్నది. 'గొబ్బియలు', 'గొబ్బిళ్ళు' అనే పదము 'గోపికలు' అన్న పదము నుండి పుట్టినది. గొబ్బిళ్ళ యాట రాసక్రీడా నృత్యమే. గొబ్బిళ్ళ పాటలు పెక్కుతీరులవి కలవు. పై వాటిలో కొన్నింటికి మాదిరులు వినండి.

**గొబ్బిపాట**

కొలనిదోపరికి గొబ్బిళ్ళో యదు

కులస్వామికిని గొబ్బిళ్ళో, కొండ

గొడుగుగా గోవులc గాచిన

కొండుక శిశువుకు గొబ్బిళ్ళో,

దుండగంపు దైత్యుల కెల్లను తల

గుండు గండనికి గొబ్బిళ్ళో
పాప విధుల శిశుపాలుని గొట్టిన
కోపగానికిని గొబ్బిళ్ళో
ఏపునఁ గంసుని యిడుమల బెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్ళో
దండి వైరులను తఱిమిన దనుజుల
గుండె దిగులునకు గొబ్బిళ్ళో
వెండి పైఁడియగు వేంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్ళో

**ఉయ్యాలపాట**

అలరఁ జంచలమైన ఆత్మలం దుండని
అలవాటు సేసే నీ వుయ్యాలా....
పలుమారు నిశ్వాస పవనమం దుండ నీ
భావంబు దెలిపె నీ వుయ్యాలా....
ఉదయా స్తశైలంబు లొనర గంభము లైన
ఉడుమండలము మోచె నుయ్యాలా
అదన నాకాశపద మడ్డదూలం బైన
అఖిలంబు నిండె నీ వుయ్యాలా
పదిలముగ వేదములు బంగారుచేరు లై
పట్ట వెరుపై తోచె నుయ్యాలా
వదల కిటు ధర్మదేవత పీఠ మై మిగుల
వర్ణింప నరు దాయె నుయ్యాలా....

**అల్లోనేరేళ్ళు**

(అల్లో నేరేళ్ళలో వెలది రుక్మిణి సమర్త వేడుకలాయె... అనే మట్టుతో)
అల్లో నేరేళ్ళలో చెలువ కృష్ణుం
దనుచు చెప్పరే మీరు అల్లో...
అల్లో నేరేళ్ళలో కరివేల్పు
మన దొరకు కలిగినే నేడూ
అల్లో నేరేళ్ళలో గిరిపరుని వలె నితడు
చెలగుచున్నాడూ
అల్లో నేరేళ్ళలో తరుణీ యశోదకూ
తనయు డై నాడూ
గురికానివలె నితడు గునియుచున్నాడూ
మింటపూవుల వాన మెలత కురిసేనే
వింటిరే ఖేరీలు వేడ్క మొరసేనే. అల్లో...

**వెన్నెల పదము**

ఎన్నాడు వానికి నే లలన నైతినో
వెన్నెలారో, వాడు
నన్నెద దలచడు
నేనేమి చేతును, వెన్నెలారో
చాలగా నమ్మి తా చక్కని చెలిమికి
వెన్నెలారో, నా
మేలును నింతైన మనసు
నుంచ డాయె వెన్నెలారో
వలపు నిల్ప నాదు వశము కాదు
ఇంక వెన్నెలారో

**చిలుక పదము**

మనవి నొక్కటి చెప్పేనే రామచిలుకా, నా
మనవి గైకోవే వో రామచిలుకా...
వజ్జరం గొట్టేనే వో రామచిలుకా, వాని
బుజ్జగించి తోడితేవే రామచిలుకా...

**ధవళము**

జయ జయా జ్ఞానసంపన్నా
జయ జయా నిన్ను బుధు లెన్నా
జయము నీ పదములూ గన్నా
జయ మౌను ఒడయ నంచెన్నా

**ఏల (తత్త్వము)**

నీవూ నేనూ గూడీ భావనా కొలదీ
కేవల బ్రహ్మను గీలు కొల్పుదమూ – నీవూ,
సారె సారెకు వారీ సరస సంగములా
తీరుగా జలముల ద్రిప్పుచుందామె
మానవీ గణముల మమత నొందించీ
పూని భ్రాంతులలోన పొరలజేయు
దమూ – నీవూ (జ్ఞానకురవంజి)

**సువాల**

మానవ సంహరుండు తొల్లి
దారువనములో మునుల
చారుముఖులతో రమించు జార విద్యలన్
తేటగనేనే సువాల పాటగా రచించువాడ
పాటలాగంధు లెల్లఁ బ్రౌఢి బాడఁగా
హరుడు నొక్కనాడు తారకా చలంబునందు తనకు
నర్హ మైనరత్న సింహాసనంబునందునా (దారువనక్రీడనము)

**తుమ్మెద పదము**

ఆదినాథుడ రావె తుమ్మెదా, అ
ల్లతడూ వూరికి పోయె తుమ్మెదా, నా
వద్ద నెవ్వరు లేరు తుమ్మెదా, వచ్చి
వాలలాడిపోవె తుమ్మెదా

**వెన్నెల పదము**

అక్కలమ్మకు సారెపోయ వెన్నెలారో, ఇపుడు
లెక్కలేని కదుపు లాయె వెన్నెలారో,
కుందులమ్మ పుణ్యాన వెన్నెలారో
నందునికి కొడుకు కల్గె వెన్నెలారో
పొంగళ్ళు పెట్టుదుము వెన్నెలారో మంచి
బోనాము ముద్దెలంది వెన్నెలారో

# నా కుటుంబం చెట్టు కింద వుంది




## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

**(23.04.1891-25.02.1961 )**


***పురిపండ అప్పలస్వామి గారికి!***

ఇవాళ తెల్లవారేటప్పటికి నాకివాళ పక్షవాతం సందేహం కలిగింది మీరు హైదరాబాదు నుంచి ఎప్పుడు వస్తారు?

నాగేశ్వరరావు గారికి కథలు పుస్తకాలు ఇచ్చెయ్య దలచుకున్నాను. వెనక ఒక మాటు వారు పేజికి మూడు రూపాయల చొప్పున బేరం చేసి స్థిరపరచుకున్నారు. నేను కథలు పట్టుకువెళ్ళి యివ్వబోతే, డబ్బు లేదు ఇప్పుడు వద్దన్నారు. ఆ బేరం మొన్న జ్ఞావకం చేశాను. నిజమే అప్పుడు డబ్బులేకపోయిందన్నారు. ఇప్పుడు ఆ రేటున పైసలు చెయ్యండి. కుదరకపోతే మీ యిష్టం వచ్చినట్లు పైసలు చేయండి. తక్కిన పుస్తకాలున్నూ యిప్పించేయండి. వారికి నాలుగువేల చిల్లర బాకీ. నవలలూ, నాటకాలు వగైరా కాపీరైట్లూ స్టాకు అంతా యిప్పించండి. మీకు సాధ్యమైన ధరకు యిప్పించి రుణం లేదనిపించి అదనంగా యిస్తే అది నా భార్య చేతికి ఇవ్వండి. నా కుటుంబానికి మీరే సాయం చెయ్యగలరు. కథలు సాపు రాసి వున్నాయి. పేపరు కటింగులున్నాయి. ముందు చికిత్సకూ, తిండికి డబ్బు కావాలి. ఇప్పించండి. ఈ నెల ఇంకా అద్దె యివ్వలేదు.

పుస్తకాల వ్యవహారం పూర్తిగా పరిష్కరించి మరీ వెళ్ళాలి మీరు. అనుభవాలు – రెండు విశాఖపట్నం పంపాలి. పోషకులకూ తక్కినవారికీ, రాజమండ్రిలో మైలవరపూ, వింజమూరీ, రామ చంద్రాపురంలో దువ్వూరీ, చావలీ, వేపా మాత్రమే యిచ్చాను. వేపావారు రు.116/- లు ఇస్తానన్నారు. ఇప్పుడే కొంత ఇవ్వవచ్చు. కాకినాడ సాహిత్యవేత్త గారంటే శ్రీ పార్థసారథిగారు. వారికి నా యెడ చాలా దయ. మీరు చెపితే నాకు గాని, నా కుటుంబానికి గాని వారేమైనా సాయం చేసి చేయించవచ్చు.

నా కుటుంబం చెట్టు క్రింద వుంది. మీరు సాయం చెయ్యండి. విశాఖలో కూడా ఏమైనా వీలవుతుందేమో చూడండి.

గుంటూరులో చావలి సూర్యనారాయణగారు (ITLD లేబరు ఆఫీసరు) రు.66/–లు ఇవ్వాలి. ప్రయత్నం చెయ్యండి, వారు రామచంద్రాపురం గాంధీ డాక్టరు గారి అన్నగారు. డాక్టరు గారి ద్వారా ప్రయత్నించండి. డాక్టరుగారున్నూ రామచంద్రాపురం మిత్రులచేత యేమైనా చేయించవచ్చు. నెల్లూరి శివరామయ్య గారేమైనా పంపవచ్చు. డాక్టరు కనకరాజుగారున్నూ చెయ్యవచ్చు.

శ్రీ నాగేశ్వరరావు గారి విషయం – వారికి అభ్యుదయం నా చేతనైనంతా కలిగించాలనుకున్నాను. భగవంతుడిలా చేశాడు. నేను వ్యర్థుణ్ణయిపోయాను. స్నేహితులైనందున మీకీ శ్రమ మాత్రం కలిగిస్తున్నాను.

నాగేశ్వరరావు గారి వ్యవహారం మీరే పరిష్కరించడం నా ఆశ. మీరు మిక్కిలీ ఘనంగా సన్మానించారు. మీకు శ్రమ మాత్రమే కలిగించాన్నేను. శ్రీ సింహాచలం గారి స్నేహం నాకు మహా మేరువు. వారికి నా కృతజ్ఞత సరిగా చూపించలేకపోయాను.

మీకు నేను బరువైనట్టే నిశ్చయం, మీలాగ మనసిచ్చిన వారు నాకు మరొకరు లేరు. మీ రుణం తీర్చుకోలేను. అది తీర్చు కోడానికయినా మరో జన్మం యెత్తుతాను. ఒకటి కాదు, పది వంద ఎత్తుతాను. ఒక సామాన్యుడికి మీరూ, సింహాచలంగారూ కనకాభిషేకం చేయించారు. ఇది నాకు పరమేశ్వరుడు చేయించలేనిది.

ఇలాంటి స్థితిలో నేను భారం అయిపోతున్నాను. విచారించను. అది తీర్చుకోవడానికి కయినా మరో జన్మ యెత్తుతాను కనుక నాకేమీ విచారం లేదు. నా భార్య నన్నేనేక విధాల కాపాడింది. చిన్నప్పట్నుంచి దాన్ని కష్టపెట్టానుగాని సుఖ పెట్టలేకపోయాను. ఇప్పుడు ఇక ఆ వూసేలేదు కదా?

నిరర్థక జన్మ అయిపోయింది నాది. రచనలయినా సమర్పించుకోలేకపోయాను. పరమేశ్వరుడు మీకు సకల సుఖాలూ కలిగించాలి. సారస్వత సేవలో మీకు సాపురాసి అన్నీ జాతికి సాఫల్యం పూర్తిగా కలిగించాలి. మీ కలం జాతిని ఉద్ధరిస్తుంది.”

**(అనుభవాలు - జ్ఞాపకాల నుండి)**



# సత్యమే రాజద్రోహమా?


## గరిమెళ్ళ సత్యనారాయణ

**(14.07.1893 - 18.12.1952)**


మా కొద్దీ తెల్లదొరతనం' పాట ద్వారా ప్రసిద్ధులు. అనేక శిక్షలు అనుభవించారు. అజ్ఞాతంగా 1952లో మరణించారు.

నేనీ దేశమున పౌరుడను. అట్టివారిలో నేనే ప్రథముడనుగాను, వారి పాదధూళినంటుటకైన నేనర్హుడనుగాకున్నను ఆ ధన్యుల పవిత్రనామముల నేనిచట వివరింపగోరెదను. లోకమాన్య బాలగంగాధర తిలక్, లాలాలజపతిరాయి, మౌలానా మహమదాలీ, మౌలానా కలేలిగార్లును, సాధుపుంగవుడగు గాంధీ మహాత్మునను మరి పెక్కువేల మందియును గూడ నిట్టివేటి నాయకులే. వీరిలో లోకమాన్యుడు వీరస్వర్గమును చూరగొనబోయెను. తక్కినవారు కారాగృహము లలో నున్నారు. గాన నేను వ్రాసిన విషయములనట్లు వ్రాయక యేమాత్రము తగ్గించి వ్రాసినను నేను నా అంతరాత్మకును, దేశమునకును, దేశీయులకును గూడ ద్రోహినగుదును. దురదృష్టమున నీ బ్రిటిషు ప్రభుత్వమునందు సత్యము రాజద్రోహముగ పరిణమించినది. సత్యమును పలుకుటయు, నా అభిప్రాయమును స్పష్ట పరచుటయు, ప్రభుత్వమును వేసార్థకనామమును ధరించిన వారికి కలుగు నష్టమునకు లెక్క చేయక మా విధిని నెరవేర్చుడని నా దేశీయులకు బోధించుటయు రాజద్రోహమగు నని రాజద్రోహము నొనర్చితినని చెప్పగలిగినందుల కెంతయు గర్వితుడనగు చున్నాను.

ఇతరుల మనసు నొచ్చుననియో వారు మనతో చేరక పోదురనియో మనకిష్టము లేకున్నను సఖ్యత చెడకుండుటకు కొన్నింటిని వదులు కొనుచుండు పద్ధతియే జాతీయతాభివృద్ధికి గొప్ప అనర్థకమై యున్నది.

హిందూదేశమున స్వాతంత్ర్యము కొరకు బ్రిటీషు ప్రభుత్వముతో ప్రతిఘటించుట నేడు మనకు క్రొత్తగాదు. బ్రిటిషు ప్రభుత్వము మన దేశమున పూర్తిగా నెలకొన్నప్పటి నుండియు కూడా నీ సంఘర్షణము ప్రారంభమైనది. ఇతరులు చెప్పిన దానిని కాదనజాలక విధిలేక సమ్మతించుట, మంచికాలము వచ్చినప్పుడన్నియు వానియంతటనవియే చక్కపడునను నమ్మకము, మనము అతి మిక్కిలికి పోగూడదను తలంపు అనునవి భారతీయులకు ప్రకృతి సిద్ధములగుటచే రాజనీతిజ్ఞుల సభలలో కూడ నీనైసర్గికములే చెలగుచున్నవి. వీని వలన అభివృద్ధికి నిరోధము కలుగుటయేగాక పాదిత్య దౌష్ట్యములతో గూడిన సమాధానపు నైచ్యభావము కూడా ప్రబలినది. సర్వసన్నాహములను సమకట్టకుండ విప్లవమునకు గడంగుట, ప్రాణనష్టము మున్నగు ననర్థకములు దీని వలన తొలగిన మాట నిజమేగాని వీనివలన జాతీయ శక్తికే ముప్పు వాటిల్లినది. మోటారును పగులగొట్టుటకు ప్రయత్నించుటలో దానిని నడిపించు నైపుణ్యమును గోల్పోతిమి. న్యాయముగ వ్యవహరింపవలెనను ప్రయత్నమున మనకు చాపల్య లక్షణములు పట్టుపడెను. విరోధుల దోషములను క్షమింపవలెనను అభిలాష వలన వారొనర్చిన అవమానములను మనము ఖండించుటయే మరిచిపోతిమి. ఈ రీతిగా సమాధాన భావము భారత జాతీయాభివృద్ధికి నిరోధకమైనది. ఇయ్యది మనలనెల్లప్పుడును విదేశీయుల అనుగ్రహమున కధీనులనుగ చేసినది.

**ఈ ముప్పది వేలమందిని కారాగృహములకు పంపిన మరల ముప్పది వేలమంది ముందుకు రారు. చెరసాలలో నుంచబడిన వారినచట, గాసిబెట్టిన వారి యుత్సాహమచటనే ఒకటి రెండేండ్లలో అంతరించునుగాన యధేచ్ఛగా ప్రజాభిలాషల నురుమాడవచ్చునని ప్రభుత్వము వారూహించిరి. వారి యూహకేవలము నిరాధారముగాదు గాని ఆ స్థితి అటులే దీర్ఘకాలము దేశమునందు నిలువబడునని తలంచుట మాత్రమే గొప్ప పొరబాటు.**

ఇట్టి సమాధాన భావమును పూర్తిగా ధిక్కరించుటయే అసహాయోద్యమ సిద్ధాంతము. బ్రిటిషు నిరంకుశత్వము వలన కలిగినట్టి నైచ్యస్థితికంటె అధమమగు మరియొక స్థితి మరే కారణము వలన కూడ కలుగదుగాన నీ నిరంకుశత్వమును తొలగించుటకు దేశీయులెట్టి మహాత్యాగములైన చేసి తీరవలె ననియే, అసహాయోద్యమము ఖండితముగా నడుపుచున్నది. భారత ఖండము నిట్టి నైచ్యస్థితికి తెచ్చు దౌర్భాగ్యము కేవలము బ్రిటిషువారికి మాత్రమే చెందదు. ఏ దేశమునందైనను పరిపాలనాధికారము మరియొక దేశము వారి వశమైనచో వారు తెలిసియో తెలియకయో ఆ పాలిత దేశమునందిట్టి నీచస్థితినే కలిగించుట నిశ్చయము. తనకు మాలిన ధర్మము లేదు. వారు ముందు మాంచస్టరు లాభము చూడవలెనుగాని ధక్కా లాభమునుగాదు. ఇక ముందీ పద్ధతి మారవలెను. హిందూ దేశమును బ్రిటిషు సామ్రాజ్యమునందు బ్రిటిషువారు నిలుపుకొనగోరినచో భారతీయుల షరతుల కన్నిటికిని బ్రిటిషువారు తలయొగ్గవలెను.

ఈ కారణమున ఏదేశమునైన పరిపాలించు ఏ విదేశీయ ప్రభుత్వమునకైనను ముఖ్యులుగా హిందూదేశము నేలు విదేశ ప్రభుత్వమునకును నేను విరోధినని ప్రకటించుచున్నాను. ఏలనన నేను భారతమాత పుత్రుడను. నేనీ దేశమునపుట్టి పెరిగితిని. నేనీ దేశమున పౌరుడను. అట్టివారిలో నేనే ప్రథముడనుగాను, వారి పాదధూళినంటుటకైన నేనర్హుడనుగాకున్నను ఆ ధన్యుల పవిత్రనామముల నేనిచట వివరింపగోరెదను. లోకమాన్య బాలగంగాధర తిలక్, లాలాలజపతిరాయి, మౌలానా మహమదాలీ, మౌలానా కలేలిగార్లును, సాధుపుంగవుడగు గాంధీ మహాత్మునను మరి పెక్కువేల మందియును గూడ నిట్టిమేటి నాయకులే. వీరిలో లోకమాన్యుడు వీరస్వర్గమును చూరగొనబోయెను. తక్కినవారు కారాగృహములలోనున్నారు. గాన నేను వ్రాసిన విషయములనట్లు వ్రాయక యేమాత్రము తగ్గించి వ్రాసినను నేను నా అంతరాత్మకును, దేశమునకును, దేశీయులకును గూడ ద్రోహినగుదును. దురదృష్టమున నీ బ్రిటిషు ప్రభుత్వమునందు సత్యము రాజద్రోహముగ పరిణమించినది. సత్యమును పలుకుటయు, నా అభిప్రాయమును స్పష్ట పరచుటయు, ప్రభుత్వమును వేసార్థకనామమును ధరించిన వారికి కలుగు నష్టమునకు లెక్క చేయక మా విధిని నెరవేర్పుడని నా దేశీయులకు బోధించుటయు రాజద్రోహమగు నని రాజద్రోహము నొనర్చితినని చెప్పగలిగినందుల కెంతయు గర్వితుడనగుచున్నాను.

ఈ ముప్పది వేలమందిని కారాగృహములకు పంపిన మరల ముప్పది వేలమంది ముందుకు రారు. చెరసాలలో నుంచబడిన వారినచట, గాసిబెట్టిన వారి యుత్సాహమచటనే ఒకటి రెండేండ్లలో అంతరించునుగాన యధేచ్ఛగా ప్రజాభిలాషల నురుమాడవచ్చునని ప్రభుత్వము వారూహించిరి. వారి యూహకేవలము నిరాధారముగాదు గాని ఆ స్థితి అటులే దీర్ఘకాలము దేశమునందు నిలువబడునని తలంచుట మాత్రమే గొప్ప పొరబాటు.

నా యూహలు నిర్హేతుకములు గావు. దొరతనమువారు నిపుణతతో ఆందోళకులను కారాగృహములకు పంపి నిర్బంధ విధానమును ప్రయోగించిరి. ఖద్దరు బట్టలను కట్టుకొనిన వారిని గాబరా చేయదగిన సర్ప వృశ్చికాది విషజంతువులనందగు అదనపు వన్నులను, దేశమునందంతటను తిరిగి యుపన్యసించుచు సభలకు పోవుచు నూరేగింపులు జరుపుచు నున్న గ్రామవాసుల నడలగొట్టదగిన అదనపు పోలీసు దళములను, కొరడా దెబ్బల బెదిరింపులను, స్వరాజ్య పతాక హోమములను తలచూపినవి. తాత్కాలికముగ దేశీయులు భయవిహ్వలులైరి. ప్రభుత్వమునకు తోడ్పడునట్లు వారు నిర్బంధింపబడిరి. దొరతనము వారికి విచ్చలవిడి చేకూరినది. గవర్నరుకు దేశీయులు స్వాగత మొసంగితిరని దంభోక్తులు పలుకనను వు కలిగినది. తమ మధ్య నుండి బలవంతమున గొనిపోయి కారాగృహములందు బంధించిన దేశారాధన తత్పరులగు వీరులు దీర్ఘకాలము తమకు దూరమై కారాగృహములందు శిక్షను పూర్తిగా ననుభవించి మరల స్వగృహముల కేగినపుడు ప్రేమ వెల్లివిరియనెదురేగి గాఢాలింగన మొనర్చుకొని స్వాగత మొసంగకుండ నభిమానధనులగు దేశపుత్రులనెవరు నిరోధింపగలరు. ఏ పోలీసులు– ఏ సైనికులు

> వానిని తగులబెట్టుట వలన కలుగు మంటలు ఛందోబద్ధమగు గానమును వాయుమండలమున వ్యాపింపజేయును గాక! వాని నావరించు క్రిమిజాలము వాని యందలి యుత్సాహ భావమును క్రిమి ప్రపంచమున వ్యాప్తిమొనరించును గాక. సముద్ర తరంగ కన్యకలు తీరపరిసరమున నృత్యమొనరించుచున్నంత కాలమును మంద మారుత కిశోరములు ద్యానముల విహరించునెంత కాలమును నా జాతీయ గీత రాగవల్లులు దేశభక్తుల వీనుంగవలకు విందొనరించుచునే యుండునని మాత్రము నేను ప్రభుత్వమునకు స్పష్టపరుపగోరెదను.

నిరోధింవగలరు? పాకము ముదిరిన పిమ్మట తమ తప్పిదములనన్నిటిని ప్రభుత్వమువారే తెలిసికొనగలుగుదురు. అంతవరకును యథేచ్ఛముగ వారి నిర్బంధ విధానము కొనసాగనిండు.

నా గ్రంథము 5000 ప్రతులను నా పాదములకడ ప్రోగుపెట్టినపుడు నాకు గర్వమును దుఃఖమును కూడ వెంటనే కలిగెను. ఆ యమరశిశువులు మరణభీతిచె తమ్ము కాపాడుమని నావంక దమదృష్టులనిగుడించెను. కారుమబ్బులతో నలముకొనుచున్న భయానకమగు తుపాను బారినుండి వానిని కాపాడుటకు నేను కేవల మసమర్థుడనుగదా? ఏ దివ్యశక్తియైన వాని నా స్థితిలో కాపాడిన అలసట జెందిన నిరుపేదలకెందరికో మనోల్లాసమును, తీరికగల మగువల కెందరికో సంతోషమును, యువతీ యువకులకెందరికో నూతనోత్సాహమును కలిగియుండును గదా? అవి ఇప్పుడు దయా విహీనులచేత బడెను. దివ్యకుసుమ కోరకములనట్లే ఈ నా పొత్తములను కూడ చీల్చివేసెదరు. వానిని తగులబెట్టుట వలన కలుగు మంటలు ఛందోబద్ధమగు గానమును వాయుమండలమున వ్యాపింపజేయును గాక! వాని నావరించు క్రిమిజాలము వాని యందలి యుత్సాహ భావమును క్రిమి ప్రపంచమున వ్యాప్తిమొనరించును గాక. సముద్ర తరంగ కన్యకలు తీరపరిసరమున నృత్యమొనరించుచున్నంత కాలమును మంద మారుత కిశోరములు ద్యానముల విహరించునెంత కాలమును నా జాతీయ గీత రాగవల్లులు దేశభక్తుల వీనుంగవలకు విందొనరించుచునే యుండునని మాత్రము నేను ప్రభుత్వమునకు స్పష్టపరుపగోరెదను. ఈ గీతములను వ్రాసి, వర్ణించి, పాడి, వ్యాపింపజేసిన ఉత్తములకందరికిని నేను వందనములు నొనరించుచున్నాను. వాని మృదుల సుగంధపరిమళము వాయుమండలనము నందంతట తుములముగనలము కొనువరకు వానిని పీడించి చిత్రవధ చేసిన వారికి నేను మరింత కృతజ్ఞుడను.

ఈ నా గ్రంథమును ప్రభుత్వ భాషాంత రీకరణోద్యోగులును, సి.ఐ.డి. ఇన్‌స్పెక్టరులును భాషాంతరీకరించుట నా ప్రతిష్ఠకు చాల భంగకరము. పద్యరచనయందును గీతములందును గర్భితములగు విశేషములును గ్రహించుటయు వెల్లడించుటయు విస్పష్ట మొనరించుటయును సాధ్యముకాదని సద్విమర్శకులు తెలుపుదురు. కవి గాయక పవిత్ర శబ్దముల ధరింపనర్హులగు మహనీయులకు నేనీడుగాకపోయినను లోకోక్తుల నన్వయించుకొనజాలకయు ఉద్యోగ వాంఛచేతను ఆచ్ఛాదితమగు హ్రస్వదృష్టిగల విదేశ ప్రభుత్వోద్యోగులచే భాషాంతరీకరింపబడుటకు నా గ్రంథమంత నీచమైనది కాదు.

ఈ భాషాంతరీకరణములపై నాధారపడి చేయబడిన కేసుకు ప్రత్యుత్తరమనవసరము. నేను వ్రాసిన విషయములు సత్యములును సహేతుకములు నగుటచే నిట్టి కేసుల వలన ప్రభుత్వము వారు తమ లోపములను మరింత వెల్లడించుకొనుటయే ఫలితము. పంజాబు దురంతములను గూర్చిన నిస్సంశయములగు నా గీతములను గూడ నుదహరించుటకీ చెన్నపురి దొరతనమున కెటుల మొగము చెల్లెనో నేనూహింపజాలకున్నాను. అవమానకరమగు నా హత్యకంటె మలినమగు నసత్యము నెవరును పలుకజాలరు. కన్నటు ప్రభువు కూడ నా హత్య మరుగు పరుపజాలక దానిని మరచిపొండు. క్షమింపుడని మాత్రమే నుడివెను. ఇటీవల ప్రభుత్వము వారు జరుపుచున్న చర్యలనుబట్టి చూడనట్లు మరచిపోయి క్షమింపదగిన లక్షణమే కనబడుట లేదు.

నేడు మరల నాకు విధింపబడు నీక్రొత్త శిక్షను కూడ కారాగృహము నందనుభవించుటకు నా ఆంధ్ర సోదరులనుమతింతురుగాక. ఐహిక లాభ సౌఖ్యాదుల కొరకు పరస్పర వినాశనమును పురికొల్పు స్వార్థపరత్వాది దోషజాలము నడగించి సర్వేశ్వరుడు తన కటాక్షమును ప్రసరింపచేసి వ్యక్తులను, జాతులను కూడ దివ్య ధర్మపథమున మెలంగ జేయుగాక. ఎంత కాలము వరకు ఈ అనంతాకాశమును, విశాల పృథ్విని, చిత్ర విచిత్ర ప్రకృతి శోభను, మానవకోటిని వదలి నాతోడివారితో గూడి శిలా ప్రాకారాంతరాళమున కారాగృహమున గడపవలెనో తెలియదు. అంతవరకును వినియెదను. నిరుద్ధ స్వాతంత్ర్యము కంటె స్వతంత్ర్య నిరోధమే ఉత్తమమని సంతృప్తిజెందెదను.

**(కోర్టు వాంగ్మూలము)**



# సంఘర్షణ, సౌందర్యం...

**చలం**

**(19.05.1894 - 4.05.1979)**

సంప్రదాయ ధిక్కారంతో మహిళా సమస్యను తెరపైకి తెచ్చిన తొలి తరం సంచలన వివాదాస్పద రచయిత.

జీవితమంటేనే **struggle**, ప్రతిపదార్థమూ ఉన్నత దశని పొందాలని పెనుగులాడుతూ వుంటుంది. అణువు దగ్గిర్నించి గడ్డినించి అన్ని జీవులూ క్రమంగా ఇంద్రియాలలో బుద్ధిలో పరిణామాల్ని పొందుతున్నాయి. మానవజాతిలో కూడా మనుషులు అడవి మనిషినుంచి వృద్ధిపొంది బలం బుద్ధి ఆత్మ వికసించుకోడానికని నిరంతరం ప్రయత్నంలో వున్నారు. ఈ **inner propulsion** వల్లనే మానవులు ధనంమీద స్త్రీల మీద, కళలమీద ఆశపడి తృప్తి పొందాలని చూస్తారు. ఎవరిలో యీ బాధ, యీ **struggle** ఆగిపోతుందో వారు నిర్జీవులు. ఈ ప్రయత్నబలం యెక్కువగా కల వారిలో కొందరు తమ అనుభావాల్ని కళారూపాన్ని వెలువరిస్తారు. పాడాలనే ప్రోద్బలం వొక్కటి **analyse** చేసి చూచుకున్నా అర్థమౌతుంది యీ విషయం. కనుక ఉన్నతమైన కళ యెప్పుడూ మానవుడు ఔన్నత్యాన్ని అందుకోవాలని చేసే ప్రయత్నాన్ని ప్రతిఫలిస్తుంది. అందువల్లనే జీవితంతో సంబంధం కలిగివుంటుంది. ఎప్పుడూ మార్పును సూచిస్తుంది.

కవిత్వానికి జీవితానికి యేమిటి సంబంధమని ఎన్నేళ్ళమట్టో తర్కం. ఉన్నదని కొన్నాళ్ళు, లేదని కొన్నాళ్ళూ... నాలో చూసుకుంటే నా జీవితానికీ, నా రాతలకీ ఎంతో కలియక కనబడుతుంది నాకు. నాతో నా వ్రాత మారుతుంది. - నా కలం. ఒకప్పుడు శ్రావ్యంగా, ఒకప్పుడు కఠోరంగా: కాని నా మిత్రులలో గొప్ప కవిత్వం రాసేవారి జీవితాలకీ ఆ కవిత్వం ఆశయాలకీ సంబంధం కనపడదు నాకు. వారికి కనపడుతుందనుకుంటాను, ఎవరికి వారికి ఏమి వ్రాస్తేనేం? వ్రాతలు వెనక్కి చూస్తేనేం, లేక ప్రస్తుతం ప్రతిఫలిస్తే నేం? హృదయంలో నుంచి వొచ్చిందా? వుత్త చమత్కారమా? అనేదే ముఖ్యం. జీవితానికి అనుగుణ్యంగా వుందా? లేకపోతే ఈ వ్రాతలు వుత్త పైమెరుగా? జీవితం అనుగుణ్యంగా వుండనక్కరలేదా? ఒక రన్నట్లు వ్రాతలు- ఒక మూడ్ (mood) లేక Highest moments of inspiration ఇన్‌స్పిరేషనా? తక్కిన జీవితం అధమమేనా, ఏ పూర్వ సంస్కారాన్నించో ఉత్తమకావ్యం కలగవచ్చా! ఏరసికత్వమూ లేనివాడు ప్రేమ కావ్యాలూ, ఏ ధీరత్వమూ లేనివాడు ఆదర్శకీర్తనలూ, అల్పాత్ముడు ఉత్తమ ఉత్సాహాలు కల్పించగలడా? ఏ మంత్రి పెళ్ళి సమయమో వచ్చేటప్పటికి ఒకకవి డోలూ, ఒకకవి బూరా వూది కూడా దేశాన్ని నూతన ప్రపంచాలకి ఉదార ఆశయాలకి స్వేచ్ఛవీధులకీ రక్తస్రావాలకి ఆకాశ విహారాలకి ఆంధ్ర పౌరుషాలకి పురిగొల్పగల శక్తుల్ని కలిగి ఉండగలదా? ఇదీ నా సమస్య!

ఉన్నతమైన కళ యెప్పుడూ మానవుడు ఔన్నత్యాన్ని అందుకోవాలని చేసే ప్రయత్నాన్ని ప్రతిఫలిస్తుంది. అందువల్లనే జీవితంతో సంబంధం కలిగివుంటుంది. ఎప్పుడూ మార్పును సూచిస్తుంది. ఎందుకు జీవితమంటే ప్రవాహం, ఎప్పుడూ మారే స్వభావం కలది గనుక. జీవన శక్తి అదే. సృష్టిశక్తి, యెక్కువగా వున్నవాడు గాని యితరుడు గొప్పకళాశక్తి గలవాడు కాలేడు. అందువల్లనేనేమో స్త్రీ శక్తి యెప్పుడూ ప్రోత్సహించే శక్తిగానే వుంటుంది. **achieve** చేసేది పురుషశక్తి. ఇంతవరకు తమ స్వార్థంగా కాక యితరంగా యేదో ఒక **cause** 'కాజ్' తనదిగా చేసుకొని ప్రయత్నించనివాడు వ్రాయవచ్చు గంపెడు పుస్తకాలు - కాని కళా వాతావరణంలో వాటికి చాలా తక్కువ విలువ వుంటుంది.

ఎందుకంటే మృతకవుల జీవితాలు, నిజమైన కవులవి పరిశీలిస్తే, ఏదో గొప్ప 'స్ట్రగుల్" ఒక తిరుగుబాటు, జీవితంలోనే ఒక ఆదర్శ ప్రయత్నం ఇట్లాంటివి కనబడతాయి. శ్రీనాథుడూ పోతన్న తీసుకోండి, కీట్సు, షెల్లీ, బైరన్, వర్డ్సువర్తు బ్రౌనింగ్, D.H. Laurance, మొదలైన వాళ్ళని వొదిలి. పోతన్న కన్న శ్రీనాథుడు నూరురెట్లు ఎక్కువ చక్కగా వ్రాసాడు. కాని ఆత్మ సంతుష్టికీ, - భక్తి సంగతి మాట్లాడటంలేదు- ఆత్మ ప్రోత్సాహానికి పోతన్న పలకవలసిందే!

కవిత్వానికీ (కవిత్వమంటే వ్రాతలన్నీ) కవికీ దీపానికీ కాంతికీ వున్న సంబంధం అనుకుంటాను. అన్ని తేజస్సులూ, వికారాలూ, మాలిన్యాలూ, దీపంలో వున్నవన్నీ కాంతిలో కనబడతాయి నిర్మలదృష్టి కలవాళ్ళకి, కవిత్వమే కాదు, అద్భుతమైన కంఠమూ, విద్యా కలిగి కూడా ఆత్మలోకి పలకలేని కవులూ గాయకులెందరో యీ ఆంధ్రదేశంలో: పేర్లు చెప్పానా సంగీతం తెలీదనీ, ఆంధ్రాభిమానం లేదని అంటారు. ఆత్మలో మాట్లాడగల శక్తి కావాలంటే వ్రాతలోంచి గాని పటాల్లోంచి గాని సంగీతంలోంచి గాని అసలు "సోర్సు"లో జన్మస్థానంలో ముందు ఆత్మ మాధుర్యం వుండాలి. కళలకైనా ఆత్మ విద్యే ప్రధానమేమో: ఎందుకంటే ఏమి చేసినా, ఏమి వ్రాసినా, ఏమి పాడినా, ఆత్మానుభవం నుంచి ఎట్లా తప్పించుకోగలరు? ఎంత గొప్పగా పాడగలిగినా త్యాగరాజు కీర్తనని నాబోటివాడు యితరులలోకి పలికించగలడా రామభక్తి గలవాడే- పలికించగలడు కాని? ఆ Emotion తెచ్చుకోగలవారు, రంగం మీది నటకుడివలె తెచ్చుకోగలవారున్నారు. ఏ షేక్స్పియరో తప్ప తన అనుభవాన్ని మీరి యితర పాత్రల్ని తాను యెరిగినట్టే చిత్రించగల జీనియసులు అరుదు. నేను ఎక్కడున్నా స్త్రీ పాత్రని స్వభావసిద్ధంగా చిత్రించినా అట్లాంటి స్త్రీని ఎరుగుదును గనక ఆమెతో బాధలు పంచుకున్నాను గనక. కాని ఎవరో అసామాన్య ప్రతిభావంతులు గొప్ప జీనియసులు స్త్రీతో పరిచయం లేకుండానే స్త్రీ హృదయాన్ని గురించి అద్భుతంగా వ్రాయవచ్చు. అది inspiration కావొచ్చు లేక తన ఆత్మతో విశ్వం ఆత్మని అందుకోవడం వల్ల కావొచ్చు. ఏదో అన్నీనో లేక అన్నీ వొకటేనో నాకు తెలియదు. జీనియసుల్ని అట్టావుంచి సామాన్య చిత్రకారులు అనుభవం మీదనే తమ జీవిత నిర్ణయాల మీదనే ఆధారపడాలి, రసజ్ఞానం కోసం. అందువల్లనే జీవితానికి కళకీ సంబంధం తప్పదు. జీవితాన్ని మీరి వ్రాయగలవారు యుగపురుషులు. నా సోదరకవులు తాము యుగకారులమంటే నేను మాత్రం కానని మాత్రమే అనగలను.

జీవితమంటేనే struggle, ప్రతిపదార్థమూ ఉన్నత దశని పొందాలని పెనుగులాడుతూ వుంటుంది. అణువు దగ్గిర్నించి గడ్డినించి అన్ని జీవులూ క్రమంగా ఇంద్రియాలలో బుద్ధిలో పరిణామాల్ని పొందుతున్నాయి. మానవజాతిలో కూడా మనుషులు అడవి మనిషినుంచి వృద్ధిపొంది బలం బుద్ధి ఆత్మ వికసించుకోడానికని నిరంతరం ప్రయత్నంలో వున్నారు. ఈ inner propulsion వల్లనే మానవులు ధనంమీద స్త్రీల మీద, కళలమీద ఆశపడి తృప్తి పొందాలని చూస్తారు. ఎవరిలో యీ బాధ, యీ struggle ఆగిపోతుందో వారు నిర్జీవులు. ఈ ప్రయత్నబలం యెక్కువగా కల వారిలో కొందరు తమ అనుభవాల్ని కళారూపాన్ని వెలువరిస్తారు. పాడాలనే ప్రోద్బలం వొక్కటి analyse చేసి చూచుకున్నా అర్థమౌతుంది యీ విషయం. కనుక ఉన్నతమైన కళ యెప్పుడూ మానవుడు ఔన్నత్యాన్ని అందుకోవాలని చేసే ప్రయత్నాన్ని ప్రతిఫలిస్తుంది. అందువల్లనే జీవితంతో సంబంధం కలిగివుంటుంది. ఎప్పుడూ మార్పును సూచిస్తుంది. ఎందుకు జీవితమంటే ప్రవాహం, ఎప్పుడూ మారే స్వభావం కలది గనుక. జీవన శక్తి అదే. సృష్టిశక్తి, యెక్కువగా వున్నవాడు గాని యితరుడు గొప్పకళాశక్తి గలవాడు కాలేడు. అందువల్లనేనేమో స్త్రీ శక్తి యెప్పుడూ ప్రోత్సహించే శక్తిగానే వుంటుంది. achieve చేసేది పురుషశక్తి. ఇంతవరకు తమ స్వార్థంగా కాక యితరంగా యేదో ఒక cause 'కాజ్' తనదిగా చేసుకొని ప్రయత్నించనివాడు వ్రాయవచ్చు గంపెడు పుస్తకాలు - కాని కళా వాతావరణంలో వాటికి చాలా తక్కువ విలువ వుంటుంది. తమ జీవితాల్ని అంటక, కళకి యేదో విషయం కావాలి కదా అని తెచ్చిపెట్టుకుని వ్రాసేవారు చాలామంది. ఆ కారణంవల్లనే సుఖమైన పెళ్ళి, చక్కని వుద్యోగం, మర్యాదా, అధికారమూ - చాలా మంది ఆంధ్రకళాశీలులకి ఆత్మహత్యా కారణాలవు తున్నాయి.

ఈ సూత్రాల్ని పట్టే యేదో విధంగా వున్న పరిస్థితులకి యెదురీదనివాడు, ఎక్కడో సంఘంతోనో ప్రజలతోనో విరోధం కల్పించుకోనివాడు గొప్ప కళను సృష్టించలేడు. చాలామంది యిదివరకు ప్రచారంలోవున్న అభిప్రాయాల్నే మళ్ళీ యేకరువు పెడుతూ వుంటారు.

> **కవి కల్పనలలో, లోకాన్ని అందాలతో నింపుతాడు. అందాలు దొరక్క కుళ్ళిపోయే జీవితాలకి, విశ్వతేజాన్ని వ్యాఖ్యానం చేసి సుందరమైన పాతాల కిందమార్చి తోవచూపి ఉద్ధరిస్తాడు. పాతశతకాలలో వ్రాసినట్టు, మబ్బులవలె, నదులవలె, చెట్లవలె, కోవెల వలె ప్రతిఫలాపేక్ష లేకుండా. ప్రపంచ కఠోరశబ్దాలను అణిచే ప్రయత్నంలో తనకి తనమీద తన ఆర్టుమీద ఉండే అభిమానాన్నీ, లోకం మీద తనకి వుండే ప్రేమనీ, బాధనీ, తనపాటలో సమన్వయ పరచి సాఫల్యపడతాడు.**

మన ప్రబంధకవులూ ఇంకా యీనాడు మళ్ళీ భారతాలూ, రామాయణాలూ వ్రాసేవారు ఉదాహరణాలు. అసలు లోకంలో మెలుకువ చాలామందికి రాదు. వాళ్ళకి వృద్ధి క్షయాలు లేవు. వాళ్ల కళా అంతే, ఒక సున్నాలో చెప్పిందే చెప్పిందిగా ఒక భావం యిటూ అటూ తిప్పుతూ వుంటారు.

ఉత్సాహం గల వాళ్ళ అభిప్రాయాలు తప్పనడం తప్ప యింకో అభిప్రాయాలుండవు చాలా మంది మనుషులకి. స్వతంత్రంగా యోచించి అనుష్టించాలంటే ఏకాకి ఐ నుంచోవలసి వస్తుంది. ఆ శక్తి యెంత మందికి వుంది? బాగా జ్ఞానం కలవారు కూడా ఆచారాల్ని, సామాన్య అభిప్రాయాల్ని యీనాటి సంఘాల్ని సంకెళ్ళు వేసి బిగదీసే అబద్ధాలని ఎదిరించగలవారెందరున్నారు? ఎదిరించారా లోకానికీ తమకీ మధ్య గోడ కట్టుకుంటున్నారన్న మాటే. ఒకవేపు ఎడారిలో స్వేచ్ఛ, రెండోవైపు మనుష్య జాతి ఏమంటున్నా సంకోచించరు. మనుష్య జాతిలో గుంపుతో చేరిపోతారు. గుంపులో చెడు వాసనలు - కాని వెచ్చగా సురక్షితంగా వుంటుంది ఇట్లా మనుషుల్లో కలిసిపోయి ఏదో గొప్పగా ఆలోచిస్తున్నట్లు సమర్థించుకుంటూ నటిస్తారు. నిజం - అసలు ఆలోచనాశక్తి గాని ధైర్యం గాని లేదు. ఉన్నట్లు నటించడం సునాయాసం. వారికి వారే మాలోచిస్తున్నారో వారికి తెలీదు. "నిన్ను నువ్వు తెలుసుకో": ఎట్లా తెలుసుకుంటారు? తెలుసుకోడానికి వాళ్ళకి ఒక నేను అనేది వుంటేగా: ఏ ఆచారంలోనైనా, మతంలోగాని సాంఘికంగా గాని అసలు విశ్వాసం కలవారు తక్కువ. ఎందుకంటే అసలు మనుషుల తగ్గవారే తక్కువ గనక. విశ్వాసం చాలా తీవ్రమైన శక్తి. దాని అగ్ని చాలా కొద్ది మనుష్య హృదయాల్నే రగిల్చింది.

## 2

గొప్ప కావ్యం వ్రాయలంటే పదాలు కాదు, సమాసాలు కాదు, వ్యాకరణం కాదు కావలసింది ఆత్మ ఔన్నత్యం, - Struggle, rebellion ఈ పండితులకి నవీన ప్రపంచ వాఙ్మయంతో ఓనమాలురావు. పుస్తకాలన్నీ కఠినపదాలలో నింపి కళ్ళు చెదరగొట్టాలని చూస్తారు. పాత తెలుగు వాఙ్మయము మల్లేనే పుస్తకమంతా కలిపితే నాలుగు కొత్త అభిప్రాయాలు ఉపకరించేవి. Thought provoking Ideas కనపడవు' ఊరికే భాషా మర్దనంలో భారంతో మూల్గుతాయి గ్రంథాలు - బ్రతకవు, చలించవు వుద్రేకించవు.

## 3

కవి కల్పనలలో, లోకాన్ని అందాలతో నింపుతాడు. అందాలు దొరక్క కుళ్ళిపోయే జీవితాలకి, విశ్వతేజాన్ని వ్యాఖ్యానం చేసి సుందరమైన పాతాల కిందమార్చి తోవచూపి ఉద్ధరిస్తాడు. పాతశతకాలలో వ్రాసినట్టు, మబ్బులవలె, నదులవలె, చెట్లవలె, కోవెల వలె ప్రతిఫలాపేక్ష లేకుండా. ప్రపంచ కఠోరశబ్దాలను అణిచే ప్రయత్నంలో తనకి తనమీద తన ఆర్టుమీద ఉండే అభిమానాన్నీ, లోకం మీద తనకి వుండే ప్రేమనీ, బాధనీ, తనపాటలో సమన్వయ పరచి సాఫల్యపడతాడు.

A true artist is always a lover.

ఈనాటి మన కవులు, చిత్రకారులు, పాఠకులు తమకి మామూలు జీవనాధారాల్ని నిరాకరించే దేశంలో, తమ కళని వెలిగించుకునే బతుకువీలుకై, వేరే ఉద్యోగాలు చేస్తో, ఏ అవసరమూ ఆదరమూచూపని ప్రజల కళ్ళముందుగుర్తుని వాంచిస్తో, పడే శ్రమ ఎంత విషాదం. కాని తలచుకుంటే నాకు ఎంత గర్వము: ఏం వ్రాస్తున్నాడు? ఏం ఉపయోగం? ఎవరిక్కావాలి? వ్రాసేదాంటో ఎంత రసం వుంది? ఎంత విలువ వుంది? అనే ప్రశ్న గట్టిగా రానక్కర్లేదు. అతని ఆశ, అతని ప్రయత్నం, అతని ఉద్దేశ్యం, అంతే కావల్సింది. ఎంత తాను లోకాన్ని తిట్టనీ, ద్వేషం చూపనీ, తన సృష్టి సమయాల్లో ఆర్టిస్టుకి లోకం ప్రేయసి. అహానికి లోకానికి భేదం లేదని తిరిగి తిరిగి రూఢి చేసుకుంటాడు కళాశాలి. గొప్పగాపాడే సమయాన గాయకుడికి పాడే తనకూ, వినే ప్రజకూ భేదం కనిపించదు. ఎంత పోట్లాటలో స్త్రీ ద్వారా పురుషుడు సృష్టి ప్రయత్నం చెయ్యని ఏమూలో ఆనందమూ ప్రేమా కలక్క తప్పవు ఆ నిమిషానికైనా.

ఎవరికీ కాకపోయినా, కల్పించడమనేది కవికి ఆనందం. ఇతరులు తన కల్పనని అనుభవించడమూ అతనికి ఆనందమే., అనుభవించి, భరించలేక, తనని తిట్టినాసరే అందుకనే నష్టపడి కూడా, పుస్తకాలు అచ్చువెయ్యడమూ, రికార్డులు ఇయ్యడమూ, బారువా వంటివారు ఫిల్ములు తియ్యడమూ, తన కల్పనానందాన్ని ఇతరుల మనసుల్లో ప్రతి ఫలింపచేసుకొని, తన అందం ప్రతిబింబం చూసుకొని, తన గాన ప్రతిధ్వనిని ఎదటి వారి కళ్ళలో విని ఆనందిస్తాడు ఆర్టిస్టు. తన పాలు తాగే బిడ్డ ముఖం చూసి తల్లి పరవశత్వం చెందినట్లు ప్రపంచం తన కల్పనల్ని అంగీకరించక పోయినా భవభూతిమల్లే, భారవిమల్లే యుగాలు ముందుకుచూసి కల్పించగలడు. ఎందుకంటే, కల్పనలలో వుండే ఆనందం అతన్ని ప్రోత్సహించి, ధైర్యమిచ్చి, ఓదారుస్తుంది.

**నిజమైన ఆర్టిస్టుకి తనలో తనకువుండే విశ్వాసం ఇంకెవరికీ దేంట్లోనూ వుండదు. అతని కల్పన అతని మనసులోంచి కాదు పుట్టేది. జనులందరినీ ఏకం చేసే విశ్వ మేధస్సులో కుంచె ముంచి చిత్రిస్తాడు. గనక ఆనాడు జరిగే పద్ధతులూ అభిప్రాయాలు పైపొరలు, వాటిని చీల్చుకుని శాశ్వతంగా నిలిచేమానవత్వంలోంచి పలుకుతాయి అతని పాటలు. అతనికి లోపల తెలుసు. తాను సత్యం వ్రాస్తున్నానని, తనని అర్థం చేసుకునే శక్తిలేకా, అర్థంచేసుకుని వొప్పుకునే ధైర్యం లేకా, మొదటి ఆధికృతని వొప్పుకోడం భరించి ఎదట పడలేక అతను చెప్పే వాస్తవాన్ని తట్టుకోలేక, తాము గొప్పవనినమ్మి బతికే విలువల్ని చీల్చి చూపుతున్నాడనే కోపం వల్ల, తను చెప్పే సత్యం వాళ్ళలో పలుకుతున్నా, మాయపొరలు కప్పుకుని నటిస్తున్నా, అతనికి లెక్కలేదు.**

నిజమైన ఆర్టిస్టుకి తనలో తనకువుండే విశ్వాసం ఇంకెవరికీ దేంట్లోనూ వుండదు. అతని కల్పన అతని మనసులోంచి కాదు పుట్టేది. జనులందరినీ ఏకం చేసే విశ్వ మేధస్సులో కుంచె ముంచి చిత్రిస్తాడు. గనక ఆనాడు జరిగే పద్ధతులూ అభిప్రాయాలు పైపొరలు, వాటిని చీల్చుకుని శాశ్వతంగా నిలిచేమానవత్వంలోంచి పలుకుతాయి అతని పాటలు. అతనికి లోపల తెలుసు. తాను సత్యం వ్రాస్తున్నానని, తనని అర్థం చేసుకునే శక్తిలేకా, అర్థంచేసుకుని వొప్పుకునే ధైర్యం లేకా, మొదటి ఆధికృతని వొప్పుకోడం భరించి ఎదట పడలేక అతను చెప్పే వాస్తవాన్ని తట్టుకోలేక, తాము గొప్పవనినమ్మి బతికే విలువల్ని చీల్చి చూపుతున్నాడనే కోపం వల్ల, తను చెప్పే సత్యం వాళ్ళలో పలుకుతున్నా, మాయపొరలు కప్పుకుని నటిస్తున్నా, అతనికి లెక్కలేదు. కాని ఏనాడో కవిగన్న కలలు వాస్తవం కాకపోవు. ఎందుకంటే ఏమూలో సృష్టికర్త కలల్ని పంచుకుంటున్నాడు అతను.

**4**

కళ వెనక వుండే శక్తి సౌందర్యం. అది మానవులు ఏర్పాటుకి లొంగని శక్తి. గొప్ప Artist ఎంత సౌందర్యాన్ని తాను స్వాధీనం చేసుకుంటున్నా ననుకుంటున్నాడో అంతకన్న గొప్పగా సౌందర్యం అతణ్ణి వశ్యుణ్ణి చేసుకుంటోంది. అందుకనే యితర అధికారాలకి దాస్యం చెయ్య వలసి వచ్చినప్పుడు అతనిలో ఆ బాధ, ఆ తిరుగుబాటు. దాసుడైనాడా అతనిలో పతనం.

'వైణికుడు శాస్త్రి సినిమాలో జీతానికి చేరాట్ట' అన్నారు లీల.

'ఎంతో ఘోరం' అన్నాను నేను.

'ఏం?'

'సినిమా వాతావరణం ఆత్మ వినాశనం చేస్తుంది అన్న నా థియరీని అటుంచి....గొప్ప కళాశాలి, తనకళని దాస్యానికి ఉపయోగించడం, ఒక కట్టుబాటుకి అప్పగించడం తలచుకుంటే నా హృదయం ఎదురు తిరుగుతుంది.'

'మరి ఆర్టిస్టు బతకడం?'

'అదే అనాదిగా వస్తున్న సమస్య: దిగులుపడతాం అంతే'

'పోనీ అంతకన్న ఏం చెయ్యాలి అతను?'

'పాటకచేరీలు, శిష్యుల్ని తయారు చెయ్యడం:'

'ఏం ఆ సినిమా వాళ్ళకి కావలసిందేదో, ఆ జీవితం విలువ వాళ్ళకిచ్చేస్తాడు. తన స్వంత ప్రతిభ ఏమవుతుంది?'

'యింకోళ్ళ ఆజ్ఞల ప్రకారం తన కళని వంకరతిప్పే అలవాటు, కళని ధనానికి దాస్యం చేయించే ఆ బానిసత్వం, క్రమంగా అతని ఆత్మలోకిపాకి, అతని జీనియస్‌ని స్వేచ్ఛని, ధైర్యాన్ని చంపేస్తుంది. అతని కళకి ప్రజాదృష్టి పడుతుంది. యింక జన్మకి తను కలలు కనే అందాన్ని అందు కోలేడు. అందుకనే లోకంలోని గొప్ప ఆర్టిస్టులందరూ స్వతంత్రులు. చాలావరకు దరిద్రులు. తనది కాని పనిచెయ్యడంలో వుత్త వాళ్ళు పడేది పని బరువు మాత్రమే. ఆర్టిస్టు సాధారణమైన పనిని చెయ్యమన్నా నరాల్లో ఏదో ఎవరికీ అర్థంకాని బాధపడతాడు. కాని తన కళని వంకర తిప్పి అవసరాలకి సర్దవలసి వచ్చినప్పటి బాధ, తన శరీరాన్ని నలిపి వొంచి చెక్కి ఓ కుండలో అమర్చ నున్నప్పుడు కూడా పడదు. గొప్ప జీనియస్ సంగతి మాట్లాడు తున్నాను. అందులో అతడు ఇదివరకు పాటలో లేని పద్ధతిని ఎక్కణ్ణించో పలికిస్తున్న creative genius అంటు న్నారు. అంతేకాదు.... కూలికి అందాన్ని పలికించే ఆర్టిస్టుకి – తాను స్వేచ్ఛగా ఎంచుకుని సౌందర్య రహస్యంలోకే వెతుకుతూ వెళ్ళి ఎక్కడెక్కడివో రహస్యాలు పలికించే నేర్పు, విశ్వాసం, దృష్టి తక్కువవుతాయి. అందుకనే గొప్ప ఆర్టిస్టు ఎప్పుడో ఒకప్పుడు ఈ రెండు దోవల మధ్యనుంచుని ఆలోచించవలసిన గతి పడుతుంది. ఐశ్వర్యం సుఖం చవకకీర్తి, రెండోవేపున తన కళారాధననే యత్నం, అన్వేషణ, పేదతనం, అశాంతి, ఎవరికోతప్ప తాము అర్థంకాకపోవటం పోతన్న పద్యాలలో ఒక్క రవ్వ అతిశయోక్తి లేదు. "పోతన్న' సినిమాలో అంత ఘోరంగా పాడించినా వాటి నిజం చెడదు.

కళలో పాతా, కొత్తా, ముందూ వెనకా యివేమీ లేవు. విషయం కాదు ప్రధానం రసాన్నిచ్చిందా కళ, యింక దాన్ని ప్రయోజనమేమిటని అడగడం గుడ్డితనం. అంత ప్రయోజనకారి యింక వుండదు. గంతలు కట్టుకుని నువ్వు వాంఛించే ప్రయోజనాన్ని నెరవేర్చలేదు గనుక, దాని వల్ల ప్రయోజనం లేదనడం చాలా సంకుచితం. సంగీతం బాగా పాడితే మాట లేమిటని వెతకడం రసికుడు చేసే పని కాదు. ఎంత గొప్ప మాటల కన్న కూడా హృదయాన్ని కదిలిస్తుంది. రాగం విషయం లేకుండా అందాల్ని కల్పించగలదు. కనకనే గానం కళల్లో కన్నిటికీ వుత్కృష్టమైనదయింది.

**(యువభారతి ప్రచురించిన "చలం ఆలోచనలు" నుండి)**



# పాక్షిక సత్యము

## దువ్వూరి రామిరెడ్డి

(10.09.1895 - 18.10.1976)

కవి కోకిల. కర్షక కవి.

పోలవరపు రామబ్రహ్మముగారు 'ప్రజామిత్ర'లో ఆధునిక కవిత్వమును విమర్శించిరి. వారి విమర్శలో కొంత సత్యమున్నది. కొంత తొందరపాటు, కొంత పొరపాటు కూడా ఉన్నది. వీరికి సుబ్బారాయుడు గారు మున్నగు పెద్ద కవులతో ఎలాంటి తగాయిదా లేదు. రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు గార్ల కావ్యములతో గూడ వీరికెలాంటి యిబ్బంది లేదు. కాని యితర కవులు రచించిన కావ్యములన్నియు చెత్తలని వీరభిప్రాయపడిరి. సుబ్బారావు, రామకృష్ణారావుగార్ల కావ్యములను మెచ్చుకోగలవారు తదితరులు రాసిన దంతయు చెత్తయని యెట్ల తలంచిరో నాకు బోధపడుట లేదు. వారి కావ్యములలోనున్న గుణములను దోషములను తక్కినవారి క్యావములలో గూడ నున్నవి. పింగళి లక్ష్మీకాంతం, వెంకటేశ్వరరావు గార్ల "సౌందర్యనందనం", విశ్వనాథ సత్యనారాయణ గారి 'ఆంధ్రప్రశస్తి', శివశంకర శాస్త్రి గారి 'హృదయేశ్వరి', కృష్ణశాస్త్రిగారి గీతములు, వేదుల సత్యనారాయణ శాస్త్రిగారి ఖండ కావ్యములు , జాషువా 'ఫిరదౌసి', నాయని సుబ్బారావు గారి 'మాతృగీతములు', కొడాలి సుబ్బారావుగారి 'హంపీక్షేత్రము', బసవరాజు అప్పారావు గారి గేయములు,నండూరి సుబ్బారావు గారి 'ఎంకి పాటలు', కుందుర్తి నరిసింహారావు గారి 'పంపాసరస్సు' (ఇది యొక కావ్యఖండము), బొడ్డు బాపిరాజు గారి 'విపంచి'యే వాఙ్మయమునకైనా అలంకార ప్రాయములుగ నుండగలవు. మచ్చునకుగా కొందరి కవులును, వారి కావ్యములను పేర్కొంటిని. చక్కగా కవిత్వము రాయగల కవులు ఇంకనెందరో నేడు ఆంధ్రదేశముననున్నారు. ఈ రచనలన్నియు చెత్తలని చెప్పుటకు రామబ్రహ్మముగారు సాహసింతురా? అట్లు సాహసింతురేని వారి యభినవ కవితా పరిచయము 1916 వ సంవత్సర పర్యంతమనియే మనమూహింపగలము. అట్లు గానిచో వారి సహృదయత్వమును మనము శంకింపవలసి యుండును.

రామబ్రహ్మముగారు బూతుకథలు విమర్శించిరి. వీరికి బూతు కథలపై గలిగిన ఆగ్రహము అభినవ సాహిత్యమునంతటిపై ప్రసరించి వారి విమర్శనమునకున్న విలువను తగ్గించినది. బూతు కథలు వెలువడుచుండుట యదార్థమే గాని, అభినవ సారస్వతమంతయు ఈ బూతులు తప్ప ఇంకేమి లేదని చెప్పుట ఆ సాహిత్యము తోడి వీరి పరిచయమెంతటి పాటిదో మనకు గోచరిస్తున్నది. మొన్నటివైనను నేటివైనను బూతులు బూతులే. నాగరికాభిరుచిగల వారికి అట్టి కథలు ఏవము పుట్టించును. అట్టి కథకులు ఏ స్త్రీలను సంస్కరించుటకు (గిరీశము వలె) ప్రయత్నించుచున్నారో ఆ స్త్రీల ఆత్మగౌరవమునకే అట్టి కథలు భంగకారులుగనున్నవి. కథలు వ్రాయువారందరు ఇట్టి బూతు కథలే రాయటం లేదు. ఇట్టి కథలు ప్రచురించుటకు రెండు మూడు మాస పత్రికలె కంకణము కట్టుకొన్నవి.

'సుబోధిని' పత్రికయందు 'నవ కవులు - బూతు కవనము' అని రామబ్రహ్మము గారి రచించిన వ్యాసము 'ప్రజామిత్ర'లోని వ్యాసము కన్నా మరింత తీవ్రమై బూతు కథలతో వారికి గల పరిచయమును సార్థకపరచుచున్నది. నవ కవులెవ్వరును బూతు కవనము వ్రాయుట లేదు. వారి కవిత్వములోని శృంగారము సభ్యముగను నాజూకైన యభిరుచి గలదిగ నుండును. కవిత్వము వ్రాయువారిలో కథలు వ్రాయువారి సంఖ్య చాలా తక్కువ. వారి కథలలో కూడ బూతు లేదు. అందులో ఒక్కరు మాత్రము అట్టి కథలు వ్రాయుచుందురు. ఇకమీదనైనను రామబ్రహ్మముగారు విషయ పృథక్కరణము నందు కొంత పరిశ్రమ చేయుదురుగాక యనియు, అభినవ కావ్య సాహిత్య పరిచయము కలిగించుకొందురు గాక యనియు నా మనవి."

**('ఉదయని' సాహిత్య పత్రిక, 1936, మే)**



# గరగరల్ సవరించెద!

## గుర్రం జాషువా

( 28.9.1895 - 24.7.1971 )

'గబ్బిలం' వంటి ఖండ కావ్యాలతో దళితుల హృదయ వేదనను అద్భుతంగా ఆవిష్కరించిన కవి కోకిల.

మొదటన్ నైషధ కావ్యమందు తలబొప్పుల్ గట్టు పద్యంబులన్
పదిపంద్రెండింటిని వల్లెవేసుకొని, నా ప్రాయంపు మిత్రావళుల్
బెదరన్, దప్పులు నొప్పులుం గలిపి, యావేశంబు రోమాంచమై
పొదలంగా, వినిపింప జొచ్చితి కళా మోహాతిరేకంబునన్,

త్రోవంబోయెడు పల్లెవాఙ్ర్పకృతి ముగ్ధుల్, గుంపులై చూచి "వీ
డా వీరయ్య కుమారకుండుగద భేషం" చున్ శిరఃకంపమున్
గావింపన్, విని, యుబ్బుచుంటి నెడదన్, నా ప్రజ్ఞ నా యజ్ఞతా
భావోద్రేకము నేడు జ్ఞప్తికెలయింపన్, గుండెలల్లాడెడిన్

.. .. ..

గణబాధ రవ్వంత గడచి ముందుకుసాగ
'తగ్గవో!' యని యతిస్థాన మురుము
యతిని మచ్చికజేసి యడుగు ముందుకుసాగ
ప్రాసంబు కుత్తుకబట్టి నిలుపు
ప్రాసవేదనదాటి పయనంబు సాగింప
భావంబు పొసగ కిబ్బంది పెట్టు
భావంబు పొసగించి పద్యంబు ముగియింప
రసలక్ష్మి, కినిసి మారాముసేయు

.. .. ..

మానస గోచరంబగుచు, మాటలకందని భావరాశి, ఛం
దో నియమాంతికంబగుచు, దోచుచు, కూరపు చేయబోవ, స్వా
దీనము గాక, దూరము తిప్పలు బెట్ట కవిత్వకర్దము
స్నాన మొనర్చుచుం, గడపినాడ ననంత నిశా పరంపరల్.

.. .. ..

వేగి లేచినదాది, వినుకొండ, కొండసిం
గరకొండ, కంట కాపురముచేయ
చిన్నారి భూగోళ చిత్ర దర్శనమున
మిడిమిడి జ్ఞానంబు మిటకరింప
ఆదివారలయం దాముదంబును బోలు
ముసలిపాటలు కర్ణముల జరింప
వీధిభాగవతాలు పెట్టినభిక్షగా
కల్పనాకథలు, రక్తమున నినుక

.. .. ..

పట్టెడు పట్టెడు మాటలు
గట్టివి సాధించి, పద్యగద్యశతఘ్నుల్
దట్టించి, శ్రోతలెల్లరు
పిట్టలవలె బెదర, నాలపించుచు నుంటిన్

.. .. ..

కంటబడ్డ పద్యకావ్యంబు సాధించి
చదవకుండ నెపుడు వదలలేదు
కవిత చెప్పువాడు గనుపింప నేయంబు
సేయకుండ వెడలనీయలేదు.

.. .. ..

వ్రాసిన వ్రాతలు గని సెహ
బాసను వాడొకడులేక వృథగుందితి సా
వాసంబు సేయు కొండొక
దాసరి భాగవతుడొకడు దక్కపురానన్.

.. .. ..

ఊరం బండితు లొక్కరిద్దరు గలారుర్వీసురల్ దొడ్డయా
చారగ్రస్తులు సంస్కృతాబ్ధి నిరతస్నాతుల్ పురాణప్రియుల్
సారంధ్రోక్తుల నుల్లిపాయలవలెన్ శంకించు వార్కర్మలం
బూరా నమ్మకమున్నవారు పెనునిప్పుల్ నిమ్నజశ్రేణికిన్.

.. .. ..

తేరిపార నన్ను దిలకించి మాటల
నడుమ లలితకళల గొడవదెచ్చి
పృథ్వి విసురులుదక్క నితరజాతులు కైత
లల్లరాదు నేరమండ్రు బుధులు.

.. .. ..

ధరణీసురు నిల్లాలిన్
జెఱబట్టినవాని కైతలల్లినవానిన్
నరికిన పాపములేదని
పురాణయుగధర్మసూత్రములు ఘోషించున్.

.. .. ..

వాదనచేసి కాదనెడిపాటి సమర్థత లేక నేను నా
గాదిలి మిత్రు దప్పరమఘాతుకధర్మము లాలకించి ఆ
మోదముజూపి, క్రుంకినది ప్రొద్దను వంక వచించి, లేచి య
వ్వేదజడుందొలంగి పురవీధుల జొచ్చితి మల్లనల్లనన్.

.. .. ..

పొఱుడసూయచే విసరివైచిన వాక్శరముల్ మనంబునం
దారని నిప్పుబెట్టినటులై యెటుదోచక క్రూరధర్మముల్
వేరులునాటియున్న పృథివిన్ ననుబోలు కళాతపస్వికిన్
బేరుప్రతిష్ఠ రాదనుచు నిస్పృహతంబడి వెచ్చనూరితిన్.

.. .. ..

ఎడనెడ నాలో మ్రొగ్గం
దొడుగు కళాలతకు పండితుని నిరసన పె
ల్లుడుకుంబోతుతనం బ
ప్పుడు జడ్డిగమందు మిడతపోటై కలచెన్.

.. .. ..

ఒప్పుల్ తప్పులు దేల్చి చెప్పగల వాడొక్కండు లేడుండినన్
నిప్పుల్ గ్రక్కెడు వర్ణభేదములు సందేహించు నాంగ్లేయపుం
దప్పిం దూలు స్వజాతి కాంధ్రకవులన్నన్ గిట్ట దానాటి నా
తిప్పల్ నీవు నెఱంగియుందువు శ్రుతాద్రీ! చెప్పగా నేటికిన్.

.. .. ..

కవికిం బద్యము లందజేయుటకు మార్గంబేమియున్ లేక చే
రువ తారాడెడు నన్ను భూమిసుర మిత్రుం డొక్క డీక్షించి ర
మ్మవల న్నిల్చెదవేల! బాలకవిమిత్రా! రేపు నీ జిహ్వయం
దవతారించెడు వాణి యెట్టి నుతికర్హంబై ప్రకాశించునో.

.. .. ..

కులమత విద్వేషంబుల్
తలసూపని తావులే కళారాజ్యంబుల్
కళలాయుష్మంతములై
యలరారెడు నెలవు స్వర్గమగు చెలికాడా!

.. .. ..

ఈ గుమిగూడియున్న ప్రజలెల్ల రసజ్ఞులుగారు కొందరు
ద్యుగులు కొంద రర్థమదితుల్ శ్రుతి మోక్షములేని బద్ధ బై
రాగులు కొంద రుజ్వల సరస్వతి మూర్తులమాట పొంకమీ
లాగని నిర్ణయించెడు తలల్ హుళుళుక్కి తలంకనేటికిన్

.. .. ..

నలుగురు నాల్గు మాటలనినన్ బదులాడక నాయనుంగు నె
చ్చెలి తలవంచి తోకముడిచెన్, పగతో బగబట్టియున్న త్రా
చులకనయై సభాసదుల చూపులు నా వెనువెంటనంటగా
నిలయము జొచ్చితిం గటికినేరము సల్పినవాని కైవడిన్.

.. .. ..

ఆనాదంతయు నిల్లుదాటక కుకూలాగ్నింబలెన్ మానస
గ్లానిం గూర్చు పరాభవంబు సకలాంగవ్యాప్తమై రోమరో
మానన్ వెచ్చని క్రొంబొగల్ గురియ మర్మచ్ఛేదకంబైన దుః
ఖానన్ దూలుచు బ్రొద్దుబుచ్చితిని ముక్తాహారవారుండనై.

.. .. ..

గవ్వకుసాటిరాని పలుగాకులమూక లసూయచేత న
న్నెవ్విధిదూరినన్ ననువరించిన శారదలేచిపోవునే
యివ్వసుధాస్థలింబొడమరే రసలుబ్ధులు ఘంటమూనెదన్
రవ్వలురాల్చెదన్ గరగరల్ సవరించెద నాంధ్రవాణికిన్.

('నా కథ' నుండి)



స్థాపన : ఆగస్టు 6, 1968

# తెలుగు అకాడమీ

(ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర తెలుగు భాషా సంస్థ)

హిమాయత్‌నగర్, హైదరాబాద్-500 029

ఈ మెయిల్ : Info@teluguacademy.net / వెబ్ : www.teluguacademy.net

ఫోన్ నెంబర్లు : 040-23225215, 23226041 ఫ్యాక్స్ : 040-23225359

## తెలుగు అకాడమీ స్థాపన ప్రధాన లక్ష్యాలు

- ఉన్నత విద్యలోని అన్ని స్థాయిల్లోను తెలుగును బోధన భాషగా సుస్థిరం చేయడానికి అవసరమైన పాఠ్య పఠనీయ గ్రంథాలను, అనువాద గ్రంథాలను, జనరంజక గ్రంథాలను, మోనోగ్రాఫ్‌లను, బులెటిన్లను ప్రచురించి విద్యార్థి లోకానికి, అధ్యాపక వర్గానికి అందించడం.
- తెలుగు భాషా వ్యాప్తిని పెంపొందించడానికి భాషను సుసంపన్నం చేయడానికి ఆధునీకరించడానికి కృషి చేయడం.
- పాలన సౌలభ్యం కోసం తెలుగును అధికార భాషగా ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం చేసే కృషిలో సహకరించడం; తెలుగు రాని ప్రభుత్వోద్యోగులు, తదితరులకు శిక్షణ తరగతులు, పరీక్షలు నిర్వహించడం, ఉత్తీర్ణులైన వారికి యోగ్యతాపత్రాలు ఇవ్వడం.
- తెలుగులో శాస్త్రీయ, సాంకేతిక పరిభాషను ప్రమాణీకరించడానికి ఎప్పటికప్పుడు శాస్త్ర సాంకేతిక పరిభాష సంఘం (సిఎస్‌టిటి) వారి మార్గదర్శక సూచనలను అనుసరించి పారిభాషిక పదకోశాలు, నిఘంటువులు తయారుచేసి ప్రచురించడం.
- శాస్త్ర సాంకేతిక విషయాలపైన ఇతర భాషల్లో ఉన్న ప్రామాణిక గ్రంథాలను తెలుగులోకి అనువాదం చేయడానికి ప్రోత్సాహం, అవకాశం కలిగించడం.

## తెలుగు అకాడమీ విద్యా విషయక కార్యక్రమాలు

### ఉన్నత విద్యారంగంలో పాఠ్యపుస్తక ప్రచురణలు

- ఇంటర్మీడియట్ స్థాయి పాఠ్య పుస్తకాలు
- ఎంసెట్ పుస్తకాలు
- డిగ్రీ స్థాయి పాఠ్య పుస్తకాలు
- పి.జి. స్థాయి పాఠ్య పుస్తకాలు

### ఉన్నత విద్యారంగంలో పాఠ్యేతర పుస్తక ప్రచురణలు

- నిఘంటువులు
- పారిభాషిక పదకోశాలు
- సాహిత్య కోశాలు
- జనరంజక గ్రంథాలు
- పోటీ పుస్తకాలు
- బోధన, శిక్షణ గ్రంథాలు
- భాషా శాస్త్రీయ గ్రంథాలు
- విద్యార్థి వ్యక్తిత్వ వికాస గ్రంథాలు
- స్వయం ఉపాధి అవగాహన గ్రంథాలు
- అనువాదాలు
- మోనోగ్రాఫులు - బులెటిన్లు
- 'తెలుగు' వైజ్ఞానిక త్రైమాసిక పత్రిక

అధ్యక్షులు
**మాన్యశ్రీ సి. దామోదర రాజనరసింహ**
ఉన్నత విద్యాశాఖామాత్యులు
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్

ఉపాధ్యక్షులు
**శ్రీ సి.ఆర్. బిస్వాల్, ఐ.ఎ.ఎస్.**
రాష్ట్ర ఉన్నత విద్యాశాఖ ముఖ్య కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్

సంచాలకులు
**ఆచార్య కె. యాదగిరి**
ఎం.ఎ., పి.హెచ్‌డి.



# నేనూ - నా సాహిత్య రచనలు


## విశ్వనాథ సత్యనారాయణ

(10.09.1895 - 18.10.1976)

సనాతన వాద సాహిత్య శిల్పి


'నేను - కడచిన పాతికేళ్లలో నా సాహిత్య రచనలు' అనే విషయాన్ని గురించి మీరు నన్ను రాయమన్నారు. ఇది నావంటివాడి కిచ్చే ప్రశ్న కాదు. ఎవళ్లో అల్ప రచనలు చేసే వాళ్లను అడగవలసిన విషయము. నాకిప్పుడు 77 ఏండ్లు. నేను పుట్టింది 1895లో, 77లో పాతిక తీసిపారేస్తే 52 ఏండ్లు. 1947 ఆ ప్రాంతాలలో నాకు 52 ఏండ్లు వచ్చిఉండవలె.

అప్పటి నుంచి ఇప్పటివరకన్నమాట!

నేను ఈ బెజవాడ కళాశాలకు 1938 లో వచ్చాను. ఈ కళాశాలకు వచ్చిన తరువాత 9 ఏండ్లు గడిస్తేనే కాని మీ తారీఖు అందుకునేటట్లు లేదు. ఎంత లేదన్నా ఆ తొమ్మిదేండ్లలో రామాయణం మొదటి రెండు కాండలే పూర్తి చేసి ఉంటాను. లేదా 3 కాండలు. అంటే కిష్కింధ, సుందర, యుద్ధకాండలు నిస్సందేహంగా ఈ పాతిక ఏళ్లలోవే. అరణ్యకాండ కూడా ఈ కాలంలోదే.

మరి నేను ఎంత సోమరిని అంటే నిజానికి నేను 'వేయి పడగలు', 'మా బాబూ', 'చెలియలి కట్ట', ఏకవీర' వ్రాసి నవలాకారుణ్ణి అయినాను. తత్పూర్యం నేను అచ్చంగా కవిని. ఇప్పుడు చాలామంది 'ఆయన నవలాకారుడే కాని కవి కాదు' అనేవారున్నారు. ఇందులో భిన్నాభిప్రాయా లున్నాయి. తత్పూర్యం నేను రాసిన కవిత్వం వారికి తెలియకపోవచ్చు. నేను రాసిన కవిత్వం కవిత్వం కాదని కూడా అనుకోవచ్చు.

ఏది అయితేనేమి? నేను 1934సం॥ నాటికి దేశము పట్టనంత కవినని కీ.శే. మల్లాది రామకృష్ణశాస్త్రి గారు 'ఆనందవాణి'లో వ్రాశారు. అంటే అప్పటికి నేను ఏకవీర తప్ప మరింకో నవల రాయలేదు. ఇప్పటి సాహిత్యవేత్తలలోచాలామంది అప్పటికి

చాటు కవిత్వము వంటి దానికి ప్రాశస్త్యము వచ్చినది. పూర్వము మన దేశములో నిది వినోదమునకైన కవిత్వము - రససిద్ధికైనా కవిత్వము కాదు. ఏవో నాల్గు పద్యములు రాయుట - అట్టి పద్యము లొక గ్రంథముగా ప్రకటించుట - వాడు కవి. నిర్దుష్టమైన శబ్దమక్కర లేదందురు. వదలిపెట్టుదము. ఔచిత్యమక్కరలేదా? ఉచితమైన యర్థ మక్కరలేదా?

ఈ రీతిగా మనదేశములో నున్న మహాదివ్యకవితాభావనయే రూపుమాసి పోయినది. ఇపుడా పద్యానికి కూడా ముప్పు వచ్చినది.

ఇంకొక్క మాట చెప్పి మానివేసెదను. ప్రపంచకము - సర్వమానవ సౌభ్రాతృత్వము - ఏదో మిల్లి నీకు వచ్చునట! దాని మాట అట్లుంచి, ప్రపంచకమున ఇన్ని దేశములున్నవి, ఇన్ని భాషలున్నవి. ఇన్ని దేశములెందుకు? ఇన్ని భాషలెందుకు? ఎక్కడివాడు అక్కడనే చచ్చుమన్నట్లున్నాడే!

నిజానికి శిల్పముకాని, సాహిత్యము కాని, జాతీయమై యుండ వలయును. విజాతీయమై యుండరాదు. వ్రాసిన వానికి ముక్తి, చదివినవారికి రక్తి, ముక్తి. ఎంత సముద్రము మీద ఎగిరినను, పక్షి రాత్రి గూటికి చేరును. ఇది జాతీయత. ఇది సంప్రదాయము.

**నాకు విరోధులెక్కువమంది. ఎందుకో నాకర్థము కాదు. నన్నెరుగనివాండ్రు నేను దుర్జనుడనందురు. ఎరిగినవారు చాలా మంచి వాడందురు. నేను చాలామందికి నా చేతనైనచో ఉపకారములే చేయుదును తప్ప అపకారములు చేయనే చేయను. నా కిది వ్రతము. అవతలివానికి అపకారము జరిగెడి అబద్ధము చెప్పనే చెప్పను. నేను ఎవరినైనా ఏదైనా అంటే వాళ్ళు నాకు చాలా అపకారము చేస్తే అంటాను. ఒక్కటి మాత్రము ఉంది. నేను అనటం ఘాటుగా ఉంటుంది. ఘాటుగా ఉంటుంది కనకనే తరువాత దానిని గురించి నాకు జ్ఞాపకముండదు. ఎవళ్ళ కర్మను వాళ్ళు పోతారు నాకేమి.**

పుట్టియే వుండరు. కనక భారతి, శారద మొదలైన అనేక సాహిత్య పత్రికలలో నేను శరపరంపరిగా రాసిన పద్యాలను వారెరగరు. 'కవి భృంగము', 'ఆశావాణి', 'శ్రీహర్షుడు' మొదలైనవి అనేకము అప్పటి పద్యాలన్నీ సంకలనం చేశాయి. పుస్తకంగా వేస్తే కనీసం నా రామాయణంలో సగం అవుతాయి. నేను సంకలనం చెయ్యలేదు. సోమరిని. అక్కడక్కడ కొందరు స్నేహితులు చేశారు. ఇవేవో రెండు చిన్న పుస్తకాలవుతాయి. ఈ మధ్య ఒకటి అచ్చువేశాను.

అదంతా పోనిస్తే ప్రధానంగా నా 'రామాయణం' నాలుగు కాండలు ఈ పాతికేండ్లలో వ్రాసినవే కదా! గుణాలు అట్లా ఉంచి, ఒట్టి సంపుటి దృష్టితో చూస్తే పాతికేండ్లలో కలవృక్షాలు నాల్గు సంపుటాలు వ్రాయటం గొప్పయే. మరిన్నీ ఈ రామాయణం 1961 లో పూర్తి చేశాను. అంటే పూర్తయి 10 ఏండ్లయింది. ఈ పదేళ్లు ఏమి వ్రాశావు అని ప్రశ్న. అసలు ఇంతకూ ఈ దేశంలో పూర్వమార్గాన రాసేది పనికి రాకపోతోంది. కాగా ఎంతని రాస్తే ఏమి లాభం? మీరడిగిన ప్రశ్నను బట్టి చూస్తే మీకు ఇంత రాశాడన్నది ప్రధానమల్లే కనిపిస్తున్నది. నీకు కాదా అని మీరు నన్నడిగితే నేను రాసింది నాకూ ప్రధానమే. దీనికి 2,3 కారణాలున్నాయి. మొదటిది నేను ఏమి వ్రాస్తానో నేను తెలిసికొని రాస్తాను గనక, నేను రాసిన దానిని అనంత విషయములు నేను చొప్పించి రాస్తాను కనుక అనాది నుంచీ ఈ దేశంలో ఒకటి జ్ఞానం అనిపించుకొంటూ వస్తున్నది. ఆ జ్ఞానం నా పాఠకులకు కల్పించి నేను సఫలుణ్ణయి వాళ్ళని జ్ఞానవంతులను చేస్తున్నాను. అనేభావం నాకు ఉన్నది కనక. ఈ భావం ఉన్నవాళ్ళు చాలామంది ఉన్నారని నాకు తెలుసును కనుక. పూర్వ సాహిత్యం ఒకటి ఉన్నది. నేను పోతే నాతో పోయేవాళ్లు నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱన, నాచన సోమనాథుడు, శ్రీనాథుడు, పోతన్న, పెద్దన్న, తెనాలి రామకృష్ణుడు మొదలయిన వారు. ఊరికే ఒట్టి పూర్వకవులని కాదు – పద్య రచనా సామ్రాజ్య పట్టభద్రులు, కథాకథన శిల్పనూత్నా చార్యులు, వేదివేదాం గాది మహా గ్రంథస్తులు, మహా విషయనిర్ణేతలు, బహు విషయ వ్యాఖ్యాతలు, కావ్య కథాశిల్ప రహస్యవేత్తలు, అనే దృష్టితో ఆ పూర్వకవులను నిలబెట్టుకొంటే అప్పుడు నేనూ నిలుస్తాను. నేను చేసిన పని అటువంటిది. రోజులు మారిపోయి తెలియటం లేదు.

ఇది అహంకారము కాదు. పొగరు బోతుతనం కాదు. అసలీ దేశంలో అహంకారం ఎట్లా వుంటుందో తెలియదు. స్వశక్తి చెప్పుకుంటే అహంకార మనుకుంటారు. ఒక మహాశిల్పి యొక్క శక్తిని గ్రహించేశక్తి పోయింది. వాని శిష్యులలో చాలామంది వాడు చెబితే తెలుసుకొన్న వాళ్ళే. శిష్యులతో చెబితే చదువు, ఇతరులతో చెబితే అహంకారము. 2 వతరగతిలో అహంకారం ఎందుకయిందో తెలుసునా – వాళ్ళకి అక్కరలేదుకనక. వాళ్ళు తెలుసుకుందామని పుట్టినవాళ్ళు కారు. ఆ మహాకవిని ఎట్లాగో ఒకట్లా తిడదామని పుట్టినవారు.

నేను రాసిన గ్రంథముల పేర్లన్నియు నాకు గుర్తుండవు. ఏవి అచ్చు వేయిదునో అవి మాత్రమే గుర్తు. అన్నట్లుగా 'విశ్వనాథ పంచశతి' యన్న గ్రంథము రాసితిని. నాకు విరోధులెక్కువమంది. ఎందుకో నాకర్థము కాదు. నన్నెరుగనివాండ్రు నేను దుర్జనుడనందురు. ఎరిగినవారు చాలా మంచి వాడందురు. నేను చాలామందికి నా చేతనైనచో ఉపకారములే చేయుదును తప్ప అపకారములు చేయనే చేయను. నా కిది వ్రతము. అవతలివానికి అపకారము జరిగెడి అబద్ధము చెప్పనే చెప్పను. నేను ఎవరినైనా ఏదైనా అంటే వాళ్ళు నాకు చాలా అపకారము చేస్తే అంటాను. ఒక్కటి మాత్రము ఉంది. నేను అనటం ఘాటుగా ఉంటుంది. ఘాటుగా ఉంటుంది కనకనే తరువాత దానిని గురించి నాకు జ్ఞాపకముండదు. ఎవళ్ళ కర్మను వాళ్ళు పోతారు నాకేమి.

---

ఇంక నవలలను గురించి చెప్పవచ్చును. 'తెఱచిరాజు', 'స్వర్గానికి నిచ్చెనలు' ఇవి రెండూ ఈ పాతికేండ్లలో మొదటనే పడతవి. బందరులో మంజులూరి కృష్ణారావని ఒక మహానటుడు

**దయ్యములను గూర్చి 'బాణావతి' యున్న గ్రంథమును వ్రాసితిని. ఈ కథను నేను కల్పింపలేదు. ఒక నా శిష్యుని ఇంటిలో జరిగిన కథ. అతని అన్న గారు దినచర్యగా రాసుకొన్న విషయము. వాళ్ల కుటుంబము అనుభవించిన విషయము. దయ్యాలు లేవనుట ఎంత తేలిక. దయ్యాలు లేవు, దేవతలూ లేరు, రేడియోస్టేషన్‌లో పాడుతూ ఉంటే, మన ఇంట్లో గ్రహణ యంత్రం ఉంటే వినిపిస్తున్నదే. ఇది ఆ యంత్రం కనిపెట్టినవాడి గొప్ప కావచ్చును.**

ఉండెడివాడు. పూర్వపు కూచిపూడి వాళ్లలో పరదేశి మొదలైనవాళ్లు ఎటువంటి అభినేతలో ఆయన అటువంటివాడు. నాకు అభినయం చాలా తెలుసు. అదంతా అతనిని చూచి తెలుసుకొన్నదే. అతడొక విచిత్రమైన పురుషుడు. అతని నాట్య కౌశలమంతా 'తెఱచిరాజు' నిండి వ్రాసినాను. ఆహార్యకము, వాచికము, ఆంగికము, సాత్వికము మనకు పేర్లు తెలుసు. పెద్ద నటకులమనుకునే వాళ్లకు కూడా పేర్లు మాత్రమే తెలుసు. ఈ నాటకాలు వేసే వాళ్లలో ఈ నాలుగూ సర్వంకషంగా తెలిసినవాడతడొక్కడే (పూర్వపు కూచిపూడి భాగవతులను వదిలిపెట్టి). తెఱచి రాజులో అతను ఎంత ఉన్నాడో, అతను కానిది అంత ఉన్నది. ఒక నవల వ్రాస్తూ ఉంటే మనము ఎరిగున్న మనుష్యుణ్ణే తీసుకొంటాము. కథ, భావము, రసము, పాత్రపోషణ మొదలైన వానిని పురస్కరించుకొని రాస్తూ ఉంటే ఆ ఎరిగి ఉన్న పురుషుడు మారిపోతాడు. చాలా మారిపోతాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో డాక్టర్ బి.వి. కుటుంబరావని ఉన్నాడు. అతను తెలుగు నవలను గురించి ఒక పరిశోధక వ్యాసం రాసి డాక్టరేట్ పట్టం పొందాడు. ఆయన రాసినట్లు - ఏక వీరలో నేను ప్రారంభించిన త్వగింద్రియస్పర్శ లక్షణము, తెఱచిరాజులో మరల నెత్తికొని రాశాను.

రెండవది 'స్వర్గానికి నిచ్చెనలు. ఇది ఒక రకమైన చిత్రమైన నవల. మతము పేర కూడాను, దుర్జనులు ఇతరులను వంచింతురు. ఇతరులను వంచించుట ఈ లోకమునం దొక మహావిద్య. అదొక శిల్పము. ఈ శిల్పవేత్తల సంఖ్య అనంతము. దేవుడు లేడని వంచింతురు. ఉన్నాడని వంచింతురు. ఒక మహా విషయమును, అది మహావిషయము కాదని ఇతరులను వంచితురు. ఈ వంచకులలో ప్రధానముగా రెండు రకాలు. మొదటి రకము - అది వంచన అని తెలిసిన దోషం కానిదానిని దోషమని చెప్పును. రెండవ రకము దీని తలలో జేజెమ్మ. ఆరకమునకు అది యథార్థమని తెలియదు. అది యథార్థము కాదని చెప్పుచుండును. మరి వంచన ఏమి యున్నది? మూలవస్తువే వంచన. మనన యొక్క నగము దోషము చేసెడి పద్ధతిలో నుండును. ప్రచారములో నుండును. తన కిష్టము లేని దానిని దుమ్మెత్తిపోయటంలో నుండును. పదిమందిని కూడగట్టుకొని లోకమును ప్రతారించుటలో నుండును. ఈ 'స్వర్గానికి నిచ్చెన'లన్న నవల దైవము అన్న విషయములో ఆస్తికుల మనువారు చేసెడి వంచన సర్వస్వము ఉన్నది.

చిన్న చిన్న నవలలు చాల యున్నవి. వాని నట్లుంచి, మూడు రకములైన నవలలను గురించి చెప్పెదను. ఒకటి, 'పురాణ వైర గ్రంథమాల' పన్నెండు నవలలు, రెండు, 'నేపాళ రాజ చరిత్ర' ఆరు నవలలు. మూడు, 'కాశ్మీర రాజ చరిత్ర' ఆరు నవలలు. ముందు వీనిని గురించి చెప్పెదను.

---

దయ్యములను గూర్చి 'బాణావతి' యున్న గ్రంథమును వ్రాసితిని. ఈ కథను నేను కల్పింపలేదు. ఒక నా శిష్యుని ఇంటిలో జరిగిన కథ. అతని అన్న గారు దినచర్యగా రాసుకొన్న విషయము. వాళ్ల కుటుంబము అనుభవించిన విషయము. దయ్యాలు లేవనుట ఎంత తేలిక. దయ్యాలు లేవు, దేవతలూ లేరు, రేడియోస్టేషన్‌లో పాడుతూ ఉంటే, మన ఇంట్లో గ్రహణ యంత్రం ఉంటే వినిపిస్తున్నదే. ఇది ఆ యంత్రం కనిపెట్టినవాడి గొప్ప కావచ్చును. గాలిలో ప్రసరించు నినాదతరంగములను ఈ యంత్రనిర్మాత సృష్టించినాడా? అక్కడ పాడిన సంగీతము ఇక్కడ వినిపించుచున్నది కదా! సమకాలమునందు వినిపించు చున్నది. అసలు కాలమునందు పూర్వ మెప్పుడో మాట్లాడిన మాటలు ఈనాడు వినిపించకూడదా! తెలిసినదానికి నీవు కర్తవు కావు. తెలియని దానికి నీవు కర్తవు.

---

నేను పూర్వాచారపరాణయణుడను, ఆధునికుడను కాను, ప్రవాహమునకెదురీదుదును - ఈ మాటలు నన్ను గూర్చి అజ్ఞులైనవారు చెప్పుదురు. అచెప్పుట ఇందాక చెప్పిన వంచనా శిల్పములో భాగము. ఆ విద్యలో వారు అందెవేసిన చేతులు. ఈ

**నేను పూర్వాచారపరాణయణుడను, ఆధునికుడను కాను, ప్రవాహమునకెదురీదుదును - ఈ మాటలు నన్ను గూర్చి అజ్ఞులైనవారు చెప్పుదురు. అచెప్పుట ఇందాక చెప్పిన వంచనా శిల్పములో భాగము. ఆ విద్యలో వారు అందెవేసిన చేతులు. ఈ మాట ఎందుకు వ్రాయుచుంటిననగా నేను ఏది చదివిననూ సర్వంకషముగా దానిలోని లోతులన్నియూ నా మనస్సునకు తృప్తి కలుగునట్లు చదివెదను, ఇట్లే ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతము - మూడు భాషలను చదివితిని.**

మాట ఎందుకు వ్రాయుచుంటిననగా నేను ఏది చదివిననూ సర్వంకషముగా దానిలోని లోతులన్నియూ నా మనస్సునకు తృప్తి కలుగునట్లు చదివెదను, ఇట్లే ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతము - మూడు భాషలను చదివితిని. అక్షరమెచ్చట నుండి పుట్టుచున్నది? ఎట్లు పుట్టుచున్నది: ఏ భాష యొక్క వర్ణ సమామ్నాయ మెట్లున్నది? దేనిశక్తి యెంత? ఇక్కడి నుండి అక్కడ వాల్మీకి - వ్యాసులు, ఇక్కడ నన్నయ్య - తిక్కనలు, అక్కడ హోమర్ - వర్జిల్ - షేక్స్‌పియర్ల దాకా పరమేశ్వరుడు నాకిచ్చిన శక్తిని బట్టి (అది అల్పమని నేనను కొనుటలేదు) తరచి తరచి చూచితిని. ఇంగ్లీషు భాష మనకు పనికిరాదు. దీనిని 'విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు'లో వ్రాసితిని.

---

కాని ఒక్కటి చెప్పి వదిలిపెట్టెదను. ఒకటి అనగా రెండు. ఈ రెంటిలో మొదటి దేమనగా నేను రాసిన పద్యముల సంఖ్య, ప్రకటింపబడినవాటి సంఖ్య, సుమారు ఇరు పదివేలుండవచ్చును. నేను చించివేసినవి ఒక ఏబదివే లుండవచ్చును.

లోక మింత మారుతూ ఉంటే వీడెందుకు మారడు? కొండలు, నదులు మారవు.

కవిత్వము ఛందస్సులోనే వ్రాయవలయును. అట్లు రాయనిచో కవిత్వము కాదు. ఈ ఛందస్సన్న శబ్దము రెండు ధాతువుల నుండి పుట్టుచున్నది. 'ఛంద్ - ఆహ్లాదనే'. రెండవ ధాతువు 'ఛది - ఆచ్ఛాదనే'. ఒకటి ఆహ్లాదనము చేయుచున్నది గనుక, రెండవది కప్పుచున్నది గనుక. అందుకని వేదమునకు ఛందస్సని పేరు. వేదము పాడబడినది. జీవుని యొక్క మాయను కప్పుచున్నది. ఆహ్లాదమును కల్పించుచున్నది. అందులో సంగీతమున్నది. లయ యున్నది. లయము, సంగీతమును - అనగా రాగచ్ఛాయయును దానియం దున్నవి. సామవేదమునందే లేదు, ఋగ్వేదమునందు నున్నవి. ఈ రహస్యము తెలిసిన త్యాగ రాజులవారు -

'నాద తను మనిశం శంకరం
నమామి మే శిరసా మనసా!'

అన్నారు. అనగా నాదము శివుని యొక్క శరీరం. సంగీత విద్యలో నున్న రాగములన్నీ శివుని శరీరము. కనుక ఛందస్సు శివుని యొక్క శరీరము. శివుడు లేనిచో దేవుడు లేడు కదా! ఛందస్సక్కరలేదు.

మరి రెండవ విషయము - కవిత్వము నాల్గు విధములు, ప్రబంధ కవిత్వము, ఆశు కవిత్వము, బంధు కవిత్వము, చాటు కవిత్వము. చాటు కవిత్వానికి అనాది నుండి మన దేశంలో తక్కువ వెల, ప్రబంధ కవిత్వానికి ఎక్కువ వెల. ఈ ఇంగ్లీషులో Minor poetry వృద్ధి పొందినది. ఖండికలు వచ్చినవి. అవి కవిత్వం కావటం మొదలుపెట్టింది. కావ్యము, శిల్పము, మహాపద్య రచనా శిల్పము, పాత్ర పోషణము, అనంత విజ్ఞానము ఒక జ్ఞానభాండారముగానగుచున్న మహా కావ్యము, కవి యొక్క అనంత శక్తి - మొదలైనవన్నియు ఉప్పునీళ్లు చల్లుకొని పోయినవి.

చాటు కవిత్వము వంటి దానికి ప్రాశస్త్యము వచ్చినది. పూర్వము మన దేశములో నిది వినోదమునకైన కవిత్వము - రససిద్ధికైనా కవిత్వము కాదు. ఏవో నాల్గు పద్యములు రాయుట - అట్టి పద్యము లొక గ్రంథముగా ప్రకటించుట - వాడు కవి. నిర్దుష్టమైన శబ్దమక్కర లేదందురు. వదలిపెట్టుదము. ఔచిత్యమక్కరలేదా? ఉచితమైన యర్థ మక్కరలేదా?

ఈ రీతిగా మనదేశములో నున్న మహాదివ్యకవితాభావనయే రూపుమాసి పోయినది. ఇపుడా పద్యానికి కూడా ముప్పు వచ్చినది.

ఇంకొక్క మాట చెప్పి మానివేసెదను. ప్రపంచకము - సర్వమానవ సౌభ్రాతృత్వము - ఏదో మిల్లి నీకు వచ్చునట! దాని మాట అట్లుంచి, ప్రపంచకమున ఇన్ని దేశములున్నవి, ఇన్ని భాషలున్నవి. ఇన్ని దేశములెందుకు? ఇన్ని భాషలెందుకు? ఎక్కడివాడు అక్కడనే చచ్చుచున్నట్లున్నాడే!

నిజానికి శిల్పముకాని, సాహిత్యము కాని, జాతీయమై యండ వలయును. విజాతీయమై యుండరాదు. వ్రాసిన వానికి ముక్తి, చదివినవారికి రక్తి, ముక్తి. ఎంత సముద్రము మీద ఎగిరినను, పక్షి రాత్రి గూటికి చేరును. ఇది జాతీయత. ఇది సంప్రదాయము.

**('మహతి' నుంచి)**



# కథ ఎట్లా వుండాలె?

**కనుపర్తి వరలక్ష్మమ్మ**

**(6.10.1896 - 13.10.1978)**

**తొలితరం కవయిత్రి, రచయిత్రి, సంఘసేవకురాలు**

రాజేశ్వరీ! మీ కథలు ఏం బాగుంటాయండీ అని అంటూనే ఉన్నావు. వాటిమీద దిన దినమూ ప్రశంసాపూర్వక విమర్శలు పత్రికల్లో వెలువడుతూనే ఉన్నవి" అంటూ లోపలికి వచ్చాడు రాఘవరావు టౌన్ హాలు నుండి. రాజేశ్వరి అందుకు బదులేమీ చెప్పకుండ నవ్వి వూరుకుంది.

"మధుర భారతి పత్రిక ఇప్పుడే టౌన్‌హాల్లో చూచి వచ్చాను. దానిలో నా కథా సంపుటిపై ఎటువంటి విమర్శక వ్యాసం పడ్డదనుకున్నావు! నా కెరుక లేని శిల్పమూ, సౌందర్యమూ, మధురిమా నా కథల్లో ఉన్నదని సోదాహరణంగా యెత్తి చూపాడా విమర్శకుడు" అన్నాడు రాఘవరావు మురుస్తూ.

" ఆ విమర్శకుడెవరు? మీ స్నేహితుడే గాదూ!" అన్నది రాజేశ్వరి కొంచెం పరిహాసంగా నవ్వుతూ.

"ఎబ్బే! స్నేహితుడు గాడు."

"పోనీ మీ మిత్ర మండలి సభ్యుడా?"

"ఏమో తెలియదు"

"పూర్తిపేరు రాయలేదు. పో.నూ. అని పొడి అక్షరాలున్నాయి."

"మీ స్నేహితుడు కాకుండ ఉండడు. బాగా జ్ఞాపకం చేసికోండి"

"సరి సరి. ఇంకా అంత మతిమరపు రాలేదు., బహుశా అతడు నా స్నేహితుడై ఉండడు."

"కాదండీ. ఒక మహా పండితుడు చేసిన ఉపన్యాసం విని నవ్వేసేదిగా నేనా ఉండవలసింది? జ్ఞాన మధువును కొంచెమో గొప్పో సేకరించు కోవలసిందిగా వుండవద్దా? గులాబి పువ్వు సౌందర్యము సౌరభమూ సౌకుమార్యము ఒక్కనాటితో నశించిపోతుంది. దాని నుండి మధుపము గూర్చిన తేనె యెంత కాలముంటుందో ఎన్నింటికి వినియోగి స్తుందో చూచారా? అట్లాగే ప్రతి రచనలోను ప్రతి ప్రసంగం లోను నైతికమైన లేక వైజ్ఞానికమైన ఒక సత్య వస్తువు కూడా వుండాలె. అట్లా వుంటేనే రచయిత యొక్క శ్రమ స్థారకతమవుతుంది. ఆ విధంగా కాకుండ ఇప్పటి మీ నవీన రచయితల్లాగా తాత్కాలికోల్లాసమే కథ యొక్క ఉద్దేశమయితే, అందు ప్రణయ వ్యవహారాలే కథకు ముఖ్య వస్తువులయితే, అంతకంటే మంచివి మీరు వ్రాయలేకపోతే, అవే తప్ప పాఠకులకు రుచించక పోతే కథలు, కథకులు, కథా పాఠకులు, భ్రష్టమార్గం పట్టినారనే చెప్పవచ్చును." అంటూ రాజేశ్వరి ఏదో జ్ఞాపకం వచ్చి చివాలున లేచి లోపలకు వెళ్ళింది.

రాఘవరావు తింటూ తింటూ వుండగా అయిపోయిన రుచిర పదార్థము కొరకు ఎదురు చూస్తున్న వాడిలాగ కుతూహలంతో రాజేశ్వరి రాకకోసం ఎదురు చూడసాగాడు. రాజేశ్వరి పాలల్లో తోడువేసి ఉట్టిమీద పెట్టి" మాట్లాడుతూ కూర్చుంటే పాలు చప్పగా చల్లారిపోయినాయి. సుమా" అంటూ సావిట్లోకి వచ్చింది.

"మా నవీన రచయితలను నీ వింత నవ్వులాలు పట్టిస్తున్నావు గాని మేము కలం పట్టిన తర్వాతనే వ్యవహార భాషకూ, గేయ కవితకూ, భావ గీతాలకూ, కథా రచనకూ చక్కని బాట యేర్పడ్డది. నేడు కథకూ, గీతానికి చోటివ్వని దినపత్రికగాని, వారపత్రిక గాని, పక్షపత్రిక గాని, మాసపత్రిక గాని, వార్షిక పత్రిక గాని ఒక్కటైనా ఉన్నదేమో చూపగలవా? ఇది మా నవ్య సాహితీపరుల పరిశ్రమా ఫలితమని చెప్పుకొని గర్వింపవలసిన విషయమేనంటావా? కాదంటావా?".

"అదిగో బహుశా అంటున్నారే. ఏదో దూరపు స్నేహితుడై ఉండొచ్చు."

రాఘవరావు ఫక్కున నవ్వి 'బంధువుల్లో దూరపు వాళ్ళనీ, దగ్గర వాళ్ళనీ అనటం యెఱుగుదుం కాని స్నేహితుల్లో ఈ మాట నీ దగ్గరే వింటున్నాను."

"ఒకవేళ మీ క్లాసుమేటేమో ఆలోచించారా?"

"ఎందుకింత తీవ్ర శోధన? ఎవరైతేనేమీ?"

"మీ మీద ప్రశంసాత్మక వ్యాసం వ్రాసేవాళ్ళు తప్పక మీ స్నేహితులై ఉండవలెగదా యని."

"విమర్శకు మిత్రులే కావలెనా?" వస్తువు నాణ్యమైందయితే యెవరైనా బాగున్నదంటారు."

"కానప్పుడు?"

"ఓ ఇదా నీ అనుమానం! మా స్నేహితుల్లో రంధ్రాన్వేషణ పండితులే ఎక్కువ. బాగాలేని దాన్ని బాగా ఉన్నదని వాళ్ళు యెన్నటికీ అనరు."

"అది ఇతరుల నెఱసు లెన్నడంలోనేమో గాని, మీలో మీకు గాదు."

"మాలో మేము విమర్శించుకోమా?"

"మీ మిత్రమండలి వారు మంచి కలిసి కట్టుతనం కలవారు. ఒకరి నొకరు ఆదుకోవడం మీ సఖ్యరీతి!".

"అంటే....!

"మీలోనే ఒకరు గ్రంథం రాయడం, ఇంకొకరు పీఠిక రాయడం, మరొకరు దానిని పత్రికా ముఖాన ప్రశంసించడం – దానినెవరైనా పొరపాటుగా అంటే వేరొకరు వారిని గట్టిగా మందలించడం – ఆ విధంగా జయించుకొస్తున్నారు. యెంతెంత వారనీ మీరు మొత్తం మీద మీ కలిసికట్టుతనానికి ముచ్చట అవుతున్నది."

"అయితే మా రచనలు బాగా ఉండకపోయినా మా ప్రచారం వల్లనే వ్యాప్తికి తెస్తున్నామని నీ అభిప్రాయమా?"

"మీకు బాగానే ఉంటాయిలెండి. మీవి మీకే బాగుండకపోతే ఇంత అట్టహాసం ఎందుకు చేస్తారు? ఇతరుల బాగోగుల పరిశీలనతో మీకు నిమిత్తం లేదు. మీ మిత్రమండలి ప్రచురించే పుస్తకాలు, పీఠికలు, అభిప్రాయాలు, విమర్శలు అన్నీ చూస్తూ ఉంటాము కాదా! ఆ పరిచితమైన పేర్లే తప్ప క్రొత్తవి కన్పడవు. ఇవ్వాళ మీ మధుర కథా సంపుటిపై వారు ప్రశంసా వాక్యాలు కురిపిస్తే, రేపు వారి కన్నీటి కెరటాలపై మీరూ... మొత్తం మీద ఒకరి రచనల కొకరు వంధిమాగదులు కావడం మీ పద్ధతి."

"మా నవీన రచయితలను నీ వింత నవ్వులాలు పట్టిస్తున్నావు గాని మేము కలం పట్టిన తర్వాతనే వ్యవహార భాషకూ, గేయ కవితకూ, భావ గీతాలకూ, కథా రచనకూ చక్కని బాట యేర్పడ్డది. నేడు కథకూ, గీతానికి చోటివ్వని దినపత్రికగాని, వారపత్రిక గాని, పక్షపత్రిక గాని, మాసపత్రిక గాని, వార్షిక పత్రిక గాని ఒక్కటైనా ఉన్నదేమో చూపగలవా? ఇది మా నవ్య సాహితీపరుల పరిశ్రమా ఫలితమని చెప్పుకొని గర్వింపవలసిన విషయమేనంటావా? కాదంటావా?".

ఈ మాత్రానికి గర్వించవలసిన విషయం ఏమీ లేదు. కథా వాఙ్మయం గాని, గేయ వాఙ్మయం గాని ఆంధ్ర భాషా వధూటికి సరిక్రొత్త సొమ్ములు కావు. భట్టి విక్రమార్కుడి కథలు, కాశీ మజిలీ కథలు, పంచతంత్ర కథలు, పన్నిద్దరు రాజుల కథలు అంటూ ఎన్నెన్నో కథలు అనాది నుంచీ మనదేశంలో వాగ్రూపకంగాను, గ్రంథస్తంగాను గూడ వాడుకలో ఉన్నవే. ఇక మా జోల పాటలు, దంపుళ్ళ పాటలు మున్నగు పాటలలో ఉన్న మాధుర్యం ఏ భావ కవితకూ తీసిపోదు గదా! మానవులకు కథా ప్రియత్వం సహజ సిద్ధం. మన చిన్నవాడు చూడండి, కథంటే యెంత చెవి కోసుకుంటాడో! కథ చెపుతానంటే చాలు అదేమి చిత్రమో ఎంత ఏడ్పు మానుతాడో. అభము శుభము ఎరుగని పసిబిడ్డకదా వాడికెందుకు కథంటే అంత ప్రేమ? పిల్లలే గాదు పెద్దవాళ్ళకూ కథంటే ప్రాణమే. మొన్న మా సమాజ భవనంలో బాలికా సమ్మేళనం జరిపి పిల్లలకు చెప్తూ ఉంటే పెద్దవాళ్ళు కూడా

"అయితే నేను చెప్పింది అబద్ధమంటారా? నిజం ఆలోచించండి. మీ శైశవంలో మీకు కథా ప్రీతి కలిగించింది మీ తల్లిగారు. నాకు కల్గించింది మా అమ్మ. నేనూ, మీరూ అనేమిటి? లోకంలో ప్రతి తల్లి, ప్రతి బిడ్డకు కథా బోధ వల్లనే లోక జ్ఞానం కలుగజేస్తున్నది. కనుక మీరెంత నవ్వినా సౌధానికి పునాది మాది. వృక్షానికి బాజావాపన మాది."

చెవులు దోరగిల పెట్టి విన్నారు. ఎంతో శ్రద్ధతో, అందుకనే కథా ప్రియత్వం మానవులకు సహజ సిద్ధమంటున్నాను. కనుక తెలుగు వారికి ప్రీతి మేము  కలుగ చేశామని జెబ్బలు చరచుకుంటే మేము ఒప్పుకోము. అసలు బిడ్డలకు వలెనే కథలకు కూడా మాతృత్వం మాది" అన్నది రాజేశ్వరి సగర్వంగా.

ఆ మాట విని  రాఘవరావు పకపకా నవ్వి "ఇప్పటికి గుట్టు బయట పడింది. ఎన్ని మెలికలు తిప్పినా యే యొక్క గౌరవమూ మీ సంఘానికి చెందించాలని చూస్తావు. పాపం నీ జాత్యభిమానం అసమానం" అన్నాడు.

"అయితే నేను చెప్పింది అబద్ధమంటారా? నిజం ఆలోచించండి. మీ శైశవంలో మీకు కథా ప్రీతి కలిగించింది మీ తల్లిగారు. నాకు కల్గించింది మా అమ్మ. నేనూ, మీరూ అనేమిటి? లోకంలో ప్రతి తల్లి, ప్రతి బిడ్డకు కథా బోధ వల్లనే లోక జ్ఞానం కలుగజేస్తున్నది. కనుక మీరెంత నవ్వినా సౌధానికి పునాది మాది. వృక్షానికి బీజావాసన మాది."

"సరే సరే కాని. నీవు యేదో తిప్పలు పడి మీ స్త్రీ సంఘానికి అధిక్యత కలిగించాలనని ప్రాకులాడుతుంటే నేనెందుకు కాదనాలె. నీవే కాదులే, ఇప్పుడు మతాలవారేమి, కులాలవారేమి, వృత్తులవారేమి అందరూ ఇదే పద్ధతి, ఏ పాత పురాణాల్లో పెళ్ళగించి ఏదో ఒక గౌరవం తమ సంఘానికి చెందించవలెనని పాట్లు పడుతున్నారు. అట్లాగే నీవూ!"

"చెప్పింది సత్యమైనా అంగీకరించకుండ మనుష్యులను డీలా చేయడంలో మీకున్నంత నేర్పు యెవ్వరికీ లేదు."

"నా కథలు బాగున్నవని లోకమంతా పొగడుతూ ఉంటే నీవు బాగున్నాయని ఒప్పుకుంటావా?"

"ఓహో! అందుకు బదులా ఇవి? మీ కథలు బాగున్నాయని అంగీకరించటానికి నాకేమీ అభ్యంతరం లేదు. ఏదో చాకచక్యంగానే రాస్తారు. కాని ఉత్తమ శ్రేణికి చెందటానికి తగిన లక్షణాలు మీ కథలకింకా తక్కువే అని నా అభిప్రాయం. ఉండవలసిన లక్షణాలన్నీ లేనప్పుడు సర్వాంగ సుందరంగా ఉందని ప్రశంసించడం నా చేతగాదు సుమండి. అయినా మీ కథలకు బాగా విమర్శింపజేసి లోపాలు తెలుసుకుంటే మీకు లాభం గాని బలవంత పెట్టి బాగున్నాయనిపించుకుంటే ఏమి ప్రయోజనం చెప్పండి?" అన్నది రాజేశ్వరి.

ఇంతలో వంటమనిషి సుబ్బమ్మ వంట ఇంట్లోంచి వచ్చి మెల్లగా, "అమ్మగారూ!" అన్నది "అవునండోయ్ మరచిపోయినా, మనం త్వరగా భోజనాలు కానివ్వాలి. ఇవ్వాళ సుబ్బమ్మ కనకతార చూడడానికి పోతానని పెందలాడే వచ్చి వంట చేసి మీ కోసం కనిపెట్టుకొని కూర్చున్నది. మనం త్వరగా భోజనాలు చేస్తేనే గాని ఆమె పని అయి రెండో ఆటకు అందుకోలేదు" అన్నది రాజేశ్వరి.

"ఏముందా కనకతారలో? డబ్బిచ్చి యేడ్పుకొని తెచ్చుకోవడమేగా. ఊc. సరే. వడ్డించమను వస్తున్నా" అన్నాడు రాఘవరావు. రాజేశ్వరి దొడ్లోకి పోయి పెనిమిటికి కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళు తెస్తూ "సుబ్బమ్మా! నాకూ వడ్డించు. నీకు పని త్వరగా తెములుతుంది" అన్నది.

సుబ్బమ్మ ఇద్దరికీ వడ్డించడానికి వెండి పళ్ళేలు పెట్టి గ్లాసులు పెట్టింది. రాఘవరావు కాళ్ళు కడుక్కుని ఉతికి ఆరవేసిన చెంగావి పంచె తువ్వాలు బుజాన వేసికొని భోజనాల ఇంట్లోకి వచ్చాడు. అతని వెనుకే రాజేశ్వరి కూడ వచ్చింది.

"పిల్లలు అన్నాలు తిన్నారా యేమిటి?" అన్నాడు రాఘవరావు.

"అవును వాళ్ళకు వంటకాగానే పెట్టేశాను. తిని నిద్రపోయినా"రన్నది రాజేశ్వరి.

భోజనాలు త్వరగా ముగించాలనుకుంటూ ఉండడం చేత భోజనాల వద్ద మాటలు పెట్టుకోకుండా త్వరగా తిని లేచారు. రాఘవరావు రాజేశ్వరి. భోజనానంతరం రాజేశ్వరి కూరలు వగైరాలు సర్దుకుంటూ ఉంటే రాఘవరావు వరండాలో పచార్లు చేస్తున్నాడు. సర్దుబాటు పూర్తి చేసి రాజేశ్వరి తమలపాకుల పొందాను తీసుకుని సావిట్లోకి వచ్చేసరికి రాఘవరావు గూడ పచారు ముగించి సావిట్లోకి వచ్చి పడక్కుర్చీలో విశ్రమించాడు.

"మనోహరమైన ఒక గులాబి పువ్వు యొక్క ఆకృతి, రంగు, మృదుత్వము, పరిమళము, మకరందము మననెట్లా ఆకర్షిస్తూ వుంటాయో అలాగే కథా కుసుమం కూడ కల్పన అనే ఆకృతీ, వర్ణన అనే రంగూ, శైలి అనే మృదుత్వము, రసమనే పరిమళము, నీతి అనే మకరందము గలిగి ఆకర్షవంతమైనదిగా ఉండాలె. ఇందులో ఏది లోపించినా కథా కుసుమం రాణించదు. ఇప్పుడే రాయబడే కథల్లో ఒకటుంటే ఒకటుండదు. చూస్తున్నారో లేదో."

ఇంతలో ఆదరా బాదరా తాను కూడా అన్నం తిని వెండి కంచాలు తెచ్చి రాజేశ్వరికి యెదురుగా గోడకావించి పెట్టి, పాలకుండ తెచ్చి నడవాలో పెట్టి, ఇల్లు కడిగి తలుపులు వేసి వచ్చి. "అమ్మగారూ! నేను వెళ్ళుతున్నాను. పాలు వేడిగా ఉంటే నడవాలో పెట్టాను. కొంచెం తాళితోడు వేసికోండి" అన్నది. "సరే వెళ్ళు, ఇదిగో, ఈ పావలా తీసుకుపోయి టికెట్టు కొనుక్కో వేళైంది త్వరగా వెళ్ళు" అంటూ రాజేశ్వరి సుబ్బమ్మను పంపించింది.

సుబ్బమ్మ వెళ్ళగానే రాఘవరావు రాజేశ్వరి వంక చూచి "రాజేశ్వరీ! ఇందాక నా కథల్లో లోపాలేమిటో వెల్లడిస్తానంటివే, ఏదీ కొంచెం వెల్లడించుదూ..." అన్నాడు.

"ఏదో తమాషా కంటే అదే మాట పట్టుకున్నారేమిటి?"

"తమాషా యేమిటి? నే నొప్పుకోను. విమర్శింపజేసి లోపాలు తెలిసి కోవడం ప్రయోజనమని నీవు చెప్పుతున్నప్పుడు ఆ ప్రయోజనం అర్ధాంగ లక్ష్మివైన నీవే కలుగజేస్తానంటున్నప్పుడు, ఆ అవకాశం నేనెందుకు పోగొట్టుకోవాలి?"

"నేను ఒక్క మీ కథల మాటే చెప్పలేదు సుమండి. మొత్తం మీద ఇప్పుడు వస్తున్న కథల గురించి అన్నాను."

"ఓ మరీ మంచిది. నా మీద ఆరోపణలు లేకుండ వినడమంటే మంచిదేగా. కానీ త్వరగా నాకు మళ్ళీ నిద్ర వస్తుంది."

"నిద్ర వస్తే పొండి. ఈ చర్చలకేమి? ఇవ్వాళ కాకపోతే రేపు."

"అట్లా కాదు. శుభస్య శ్రీఘ్రమన్నారు. ఈసంగతి ఇప్పుడే తేల్చుకోవాలి. లేకపోతే నిద్ర వచ్చినా తేలిపోతుంది. హాయిగా పట్టదు ఊ.... కానీ...."

"ఏదైనా ఒక కథ రాశాము అంటే అది సర్వవిధాకర్షణ కలదిగా ఉండాలె."

"అనగా కొంచెం వివరంగా సెలవివ్వాలె."

"అబ్బా మీతో మాట మాట్లాడితే ఇదే తంటా. మాట మాటకు వెక్కిరిస్తుంటారు."

"కోపపడకు, ఇంకేమి అనను గా..."

"మనోహరమైన ఒక గులాబి పువ్వు యొక్క ఆకృతి, రంగు, మృదుత్వము, పరిమళము, మకరందము మననెట్లా ఆకర్షిస్తూ వుంటాయో అలాగే కథా కుసుమం కూడ కల్పన అనే ఆకృతీ, వర్ణన అనే రంగూ, శైలి అనే మృదుత్వము, రసమనే పరిమళము, నీతి అనే మకరందము గలిగి ఆకర్షవంతమైనదిగా ఉండాలె. ఇందులో ఏది లోపించినా కథా కుసుమం రాణించదు. ఇప్పుడే రాయబడే కథల్లో ఒకటుంటే ఒకటుండదు. చూస్తున్నారో లేదో."

"నీవు పొరపాటు పడుతున్నావు. ఇప్పుడు వ్రాయబడే కథలన్నీ నీవు చెప్పిన లక్షణాలన్నీ కలిగే ఉంటున్నవి.... వింటున్నావా... మా నవీనులు కల్పనలో అసదృశ్యులు గదా?"

"అcఆc. అ సభ్య కల్పనలో ఫస్టు"

"ప్రకృతే మా విహార మందిరం కనుక, మేము ప్రకృతి వుపాసకులం కనుక సహజ వర్ణనా వైదగ్ధ్యంలో మాకెవరూ సాటిరారు."

"సహజమని ఉచితానుచితాలెరుగకుండ అన్నీ వర్ణిస్తే అసభ్యమనిపించుకుంటుంది. ఇప్పటి కథలు వెగటు పుట్టించడానికి ముఖ్య కారణం ఇటువంటి వర్ణన లుండటమే. వర్ణన సహజమయినా ఉచితాన్ని మీరకూడదు."

"మార్దవం మన తెలుగు భాషలోనే సహజంగా చెఱకు ముక్కలో తీపిలాగా ఉన్నది కనుక దానికి ప్రత్యేకంగా ప్రాకులాడవలసిన పని లేదనుకుంటాను."

"సహజంగా వుంటేనేమి, ఉపయోగించే వారి నేర్పును బట్టే మృదువు మృదువుగా కనబడుతుంది. మృదువైన మన తెలుగులోనే కఠోర శబ్దజాలంతో గూడిన గ్రంథాలెన్ని లేవు? వసుచరిత్ర పాండిత్య విశేషం చేత గొప్ప గ్రంథ మైనప్పటికీ మృదుత్వం లేక పోబట్టే గదా మను చరిత్రంత లాలిత్యం గలది గాదనిపించుకొంటున్నది."

"కథలలో ఉత్తమ మధ్య మాధమాలున్నాయి. శైలీ మాధుర్యము, వర్ణనా చాతుర్యము, కల్పనా సౌందర్యము, రసౌచిత్యము, నైతికాదర్శనము గలవే ఉత్తమ శ్రేణికి చెందిన కథలు. ఇటువంటి కథలు వాఙ్మయంలో స్థిరమైన స్థానం సంపాదించుకుంటాయి. ప్రజాదరణ పొందుతాయి. వీటికి పాతగిలిపోవటమంటూ ఉండదు. రవీంద్రుని కథలు ఇటువంటి శ్రేణికి చెందినవే, అతడు ఏ నీతినీ యే ధర్మాన్ని వెల్లడిగా యేకరువు పెట్టడు. అయినా ప్రతి కథా ఏదో ఒక ఉత్తమాదర్శాన్ని వ్యక్తీకరిస్తూనే ఉంటుంది.

"ఇక రసమంటావా? ప్రతి కథలోను యెక్కీ తక్కీ ఇది రసయుగం. ఇప్పటి కవులందరు రస జగద్విహారులు. కనుక రస విషయమై నీవు చెప్పిన ఆక్షేపణ చెల్లనే చెల్లదు."

"రసమెప్పుడూ పూవులో తావివలె వాక్యంలో మిళితమై యుండాలె. అందులో హాస్య రసం విషయంలో అది ఎంత గర్భితంగా వుంటే అంత మనోహరంగా ఉంటుంది. నవ్వించడానికే అని రాసే ఆకటా వికటపు వ్రాతలు చక్కలిగిలిపెట్టి నవ్వించినట్లు మొరటుగా ఉంటాయి. ఏ రసమైనా ప్రయత్నపూర్వకంగా పైకి చిందిస్తే అసహ్యం వేస్తుంది. ఒక కథలోనే కాదు, ఉపన్యాసంలోనైనా హాస్యం అధికంగా కనిపిస్తే వికృతంగా ఉంటుంది. కూరలో ఉప్పు వేయకపోవడం ఎంత అరుచికరమో, అధికంగా వేయడమూ అంత అరుచికరమే. ఆ మధ్య టౌనుహాల్లో యెవరో కవి పండితుడు ఉపన్యాసమిస్తారని పిలుచుకుపోయినారు జ్ఞాపకమున్నదా? మాటమాటకు నవ్వించారాయన. ఉపన్యాసం విన్నంత సేపూ ఆ యికిలించడం బాగానే ఉన్నది. తీరా ఇంటికి వచ్చి ఆలోచిస్తే అంత ఉపన్యాసంలోనూ నిలవ చేసుకోవడానికి యేమీ కన్పడలేదేమా అని ప్రాణం వుస్సురు మనిపించింది."

"అదే నీ తెలివి తక్కువ. నిలవేమి చేసికోవాలె. ఆయన గొప్ప విద్వత్కవి. మంచి చమత్కారి. కమ్మని పద్యాలు చదివినాడు. వినోదకరమైన విషయాలు చెప్పాడు. అందరూ ఉల్లాసంగా ఆనందించారు. ఇంకా ఇంటికేమి తెచ్చుకోవాలె?"

"కాదండీ. ఒక మహా పండితుడు చేసిన ఉపన్యాసం విని నవ్వేసేదిగా నేనా ఉండవలసింది? జ్ఞాన మధువును కొంచెమో గొప్పో సేకరించుకోవలసిందిగా వుండవద్దా? గులాబి పువ్వు సౌందర్యము సౌరభమూ సౌకుమార్యము ఒక్కనాటితో నశించిపోతుంది. దాని నుండి మధుపము గూర్చిన తేనె యెంత కాలముంటుందో ఎన్నింటికి వినియోగిస్తుందో చూచారా? అట్లాగే ప్రతి రచనలోను ప్రతి ప్రసంగంలోను నైతికమైన లేక వైజ్ఞానికమైన ఒక సత్య వస్తువు కూడా వుండాలె. అట్లా వుంటేనే రచయిత యొక్క శ్రమ స్థారకతమవుతుంది. ఆ విధంగా కాకుండ ఇప్పటి మీ నవీన రచయితల్లాగా తాత్కాలికోల్లాసమే కథ యొక్క ఉద్దేశమయితే, అందు ప్రణయ వ్యవహారాలే కథకు ముఖ్య వస్తువులయితే, అంతకంటే మంచివి మీరు వ్రాయలేకపోతే, అవే తప్ప పాఠకులకు రుచించకపోతే కథలు, కథకులు, కథా పాఠకులు, భ్రష్టమార్గం పట్టినారనే చెప్పవచ్చును." అంటూ రాజేశ్వరి ఏదో జ్ఞాపకం వచ్చి చివాలున లేచి లోపలకు వెళ్ళింది.

రాఘవరావు తింటూ తింటూ వుండగా అయిపోయిన రుచిర పదార్థము కొరకు ఎదురు చూస్తున్న వాడిలాగ కుతూహలంతో రాజేశ్వరి రాకకోసం ఎదురు చూడసాగాడు. రాజేశ్వరి పాలల్లో తోడువేసి ఉట్టిమీద పెట్టి" మాట్లాడుతూ కూర్చుంటే పాలు చప్పగా చల్లారిపోయినాయి. సుమా" అంటూ సావిట్లోకి వచ్చింది.

"అవును ఏ పనైనా పదును మీద వుండగానే కానివ్వాలి. ఇప్పటి నీ విమర్శక వాదం గూడ అంతే. చప్పగా చల్లారిపోతే నిస్సారమే అయిపోతుంది. వేడిమీద వుండగానే కానివ్వ" మన్నాడు రాఘవరావు.

"కథలలో ఉత్తమ మధ్య మాధమాలున్నాయి. శైలీ మాధుర్యము, వర్ణనా చాతుర్యము, కల్పనా సౌందర్యము, రసౌచిత్యము, నైతికాదర్శనము గలవే ఉత్తమ శ్రేణికి చెందిన కథలు. ఇటువంటి కథలు వాఙ్మయంలో స్థిరమైన స్థానం సంపాదించుకుంటాయి. ప్రజాదరణ పొందుతాయి. వీటికి పాతగిలిపోవటమంటూ ఉండదు. రవీంద్రుని కథలు ఇటువంటి శ్రేణికి చెందినవే, అతడు ఏ నీతినీ యే ధర్మాన్ని వెల్లడిగా యేకరువు పెట్టడు. అయినా ప్రతి కథా ఏదో ఒక ఉత్తమాదర్శాన్ని వ్యక్తీకరిస్తూనే ఉంటుంది. అన్ని గుణాలు కలిగి నైతికాదర్శం లుప్తమైనవే మధ్యమ తరగతికి చెందిన కథలు. ఈ నడిమి రకం కథలు కూడ జవము జీవము గల భాషలోనే రాయబడుతాయి. వర్ణన గూడ సహజంగానే ఉంటుంది. పాత్ర పోషణాది కల్పనా

"మరేమీ భయం లేదు. ఆ విధంగా నీతి బద్ధమైన కథలు రాసినప్పుడే వాటి విలువ ఎక్కువౌతుంది. ప్రజల ఆదరం విస్తరిస్తుంది. తెలుగువారే కాక ఇతరులు కూడా వారిని తమ తమ భాషలలోకి తర్జుమా చేసికొని మరీ చదువుతారు. టాల్‌స్టాయ్ కథలు, ప్రేమ్‌చంద్ కథలు చూడండి. మన తెలుగులోకి ఎట్లా అనువదింపబడుతున్నాయో! వానికా గౌరవం ఎందువల్ల వచ్చిందీ?

విధానం కూడ బాగానే ఉంటుంది. రస పోషణకూ లోపం ఉండదు. కాని నైతికమైన ఒక ఉత్తమాదర్శం లేనందువల్ల ప్రజా హృదయంలో స్థిరమైన ఉనికి సంపాదించుకోలేవు. పాఠకులకు తాత్కాలికానందం కలిగించడంతో ఈ కథల పని పూర్తవుతుంది. ఏ నేర్పు లేక యేదో చిత్తం వచ్చినట్లు వెకిలిగా యే యవతీ దర్శనం వల్ల కల్గిన భావోద్రేకంతో రాయబడినవే అధమ తరగతికి చెందిన కథలు. ఇప్పుడు కొన్ని తెలుగు పత్రికల్లో ప్రచురింపబడే కథలు చాలావరకు ఈ జాతికి చెందినవే. ఇటువంటి కథలు వ్యాప్తి పొందడం వల్ల ప్రజలకు గాని భాషకు గాని యేలాటి ప్రయోజనం లేదు. బిడ్డల క్షేమం కోరే తల్లిదండ్రులు, వీటిని తమ పిల్లలు చదవడానికి ఒప్పుకోరు. విద్యార్థుల శ్రేయం కోరే ఉపాధ్యాయుడు ఇటువంటి కథలను తన విద్యార్థి చదవడానికి అంగీకరింపడు. ఇక నైతిక శిక్షణ అత్యవసరమగు బాల వితంతువులు వీనిని చదవడం వారి అయోగ్యతకు చిహ్నంగా భావించి వానిని స్పృశించటానికే భయపడిపోతారు. ఇంత ఎందుకు పెద్ద మనుష్యులనబడే వారెవ్వరూ ఇట్టి కథలు గల పుస్తకాన్ని చేతబట్టుకొని బయటకు రావడానికే సంకోచిస్తారంటే నమ్మండి. రాను రాను ప్రజల కత్యంత ప్రీతి పాత్రమైన కథా వాఙ్మయం ఇట్టి హీన మార్గం పట్టి భయోత్పాతం కలిగించేదిగా అయిపోవడం శ్రేయస్కరమనే అంటారా?".

రాఘవరావు, రాజేశ్వరి చెప్పిన మాటలన్నీ శాంతంగా విని "రాజేశ్వరి నీవు కథలను గూర్చి చేసిన పరిశీలనకు చాలా సంతోషం. కాని నీతి లౌభ్యంలో పడి కథ ఎటువంటి వస్తువో తెలుసుకోలేక పోయినందుకు విచారంగా ఉన్నది. కథ "వినరావేమ", "కదరా సుమతీ" వంటి నీతి శతకం గాదు. నీతి నిబద్ధమైన కథలూ ఉండవచ్చును. కాని ప్రతి కథనూ నీతి చక్రములోనే బిగించవలెననడం తెలివి తక్కువ. స్వేచ్ఛగా, ఉల్లాసంగా బుద్ధివైశద్యం కొద్దీ వికసింపవలసిన కథా కుసుమం ఇందువల్ల సంకుచితమై సౌందర్య భ్రష్టమైపోతుంది. అసలు కథా రచన ఒక కళా విశేషం. దానిని ప్రయోజనాలకు వినియోగించుకోవలెనని యత్నించడం ఆ రసికుల పని" అన్నాడు.

"మీ యువ కవుల అభిప్రాయాన్ని అచ్చున దీసినట్లు ఒకటిగానే ఉంటాయి కాబోలు. ఆ మధ్య నెవరో గూడ పత్రికల్లో ఇట్లాగే వ్రాయంగా చూచాను. కళంటే నాకూ ఇష్టమే. వట్టి బంగారపు ముద్దకంటే ఆ బంగారంతో చేయబడిన ఆభరణం యెక్కువ అందమైనదిగా, విలువగలదిగా ఉంటుందని నాకు తెలియక పోలేదు. అసలు కళంటే యథేచ్ఛగా రాయడం గాదు. నేను చెప్పిన లక్షణాలన్నీ కలిగి వుండాలి. కళనే పేరుతో సంభాషణ గా గాని వర్ణన గాని అవినీతిని చొప్పించటం యుక్తం గాదు. బంగారాన్ని యెంత నగిషీ వస్తువుగా నైనా తయారు చేయవచ్చును గాని అందులో ఇత్తడి వగైరాలు కలిపి దాని విశుద్ధత చెరపడం యుక్తం కాదు గదా!" అన్నది రాజేశ్వరి.

"సరి, సరి, ఇంత మడికట్టుకొని నీతిబద్ధమైన కథలు రాస్తే వాటి అందం చెప్పనక్కర్లేదు. చదువకుండానే ప్రజలు సంతోషిస్తారు."

"మరేమీ భయం లేదు. ఆ విధంగా నీతి బద్ధమైన కథలు రాసినప్పుడే వాటి విలువ ఎక్కువౌతుంది. ప్రజల ఆదరం విస్తరిస్తుంది. తెలుగువారే కాక ఇతరులు కూడా వారిని తమ తమ భాషలలోకి తర్జుమా చేసికొని మరీ చదువుతారు. టాల్‌స్టాయ్ కథలు, ప్రేమ్‌చంద్ కథలు చూడండి. మన తెలుగులోకి ఎట్లా అనువదింపబడుతున్నాయో! వానికా గౌరవం ఎందువల్ల వచ్చిందీ? మీరేమైనా చెప్పండి. అది కథ కానీ, కావ్యం కానీ, గేయం గానీ, గీతం గానీ, చిత్రం గానీ, శిల్పం గానీ, మానవ కళ్యాణానికి ఉపయోగించగల ఉత్కృష్టత అంతర్గర్భితమై యుంటేనే దానికి.."

ఇంతలో వుయ్యాల త్రాళ్ళు చల్లగా కదలడం మొదలు పెట్టాయి. నోరు మాటలాడుతున్నా దాని యందు దృష్టి యేమరకుండ ఉన్న రాజేశ్వరి ఆ సవ్వడి కనిపెట్టి "పిల్ల లేచినట్టున్నది" అంటూ చివాలున లేచి పిల్లకు పాలు పట్టే ప్రయత్నం లో నిమగ్నురాలైంది.

రాఘవరావు కూడా గడియారం వంక తల త్రిప్పి చూచి "అబ్బో పదిన్నరైందే." అంటూ వెన్ను విరుస్తూ లేచి వెళ్ళి గదిలో మంచం మీద మేను వాల్చాడు.

●

# శబ్దాల ముచ్చట్లు




## సురవరం ప్రతాపరెడ్డి

**(28.5.1896 - 25.8.1954)**

కవిగా, విమర్శకుడిగా, సంపాదకుడిగా, రచయితగా, సంస్కర్తగా బహుముఖ సేవలందించిన ప్రతిభాశాలి.


మా శ్రీపాద శాస్త్రిగారితో మాటల సందర్భమున నా పుస్తకములో రాసికొనిన కొన్ని శబ్దముల చరిత్రను ముచ్చటించి యుంటిని. కాని వాని నింత త్వరగా ప్రకటించదలచి యుండలేదు. మా శాస్త్రిగారు ఇప్పుడే కావలెనని పట్టుపట్టినారు. సంస్కృత ఫార్సీ భాషలకు పరస్పర సన్నిహిత సంబంధమెట్లు కలదో, ఆ రెంటికినీ కించిద్భేదమెట్లేర్పడెనో, ఎన్నడేర్పడెనో ఇత్యాది విషయముల నొన చిన్న గ్రంథముగా రాయతలపెట్టియుంటిని. అప్పుడు నేను సంగ్రహించి యుంచిన ఫార్సీ శబ్దములను గురించియు రాయదలచియుంటిని. అదెన్నడో యేమోకాని యిప్పుడు మాత్రము నాకు తోచిన కొన్ని శబ్దముల నిందు ప్రకటించుచున్నాను. నేను రాసిన అభిప్రాయములు సరిగాకపోవచ్చును. విమర్శకులకు మార్గదర్శకముగా నైన నుండవచ్చునను ఊహతో ప్రకటించుచున్నాను.

**ద్వారా** - దివ్వ + అర రెండు రెక్కలు కలది. ప్రాచీనమందు ఒంటిరెక్క తలపుల కన్న రెండు రెక్కల తలుపులే విశేషమేమో.

**డప్పు** - ఇది ఉత్తర సర్కారులలో విశేషము వాడుకలో కలదు. ఫార్సీలో దఫ్ అని కలదు. తప్పెట అను నర్థములో నుపయోగింతురు.

**హజారము** - దర్బారు అను నర్థములో వాడుదురు. ఫార్సీ హుజూరీ నుండి వచ్చియుండును.

**హసాదు** - "చిత్తము అట్లే" అను నర్థము హాస్రాబ్ అను దాని నుండి యేమో?

**చొక్కా** - అంగీ. ఫార్సీలోని "చొగా" నుండియే వచ్చినది. నిస్సందేహము.

**కాగితము** - ఫార్సీ - కాగజ్ నుండి.

**పోతి** - బాలిక అని అర్థము. ఇది అల్పార్థమందు తక్కువ వారి పిల్లలను పిలుచుటకై వాడుదురు. కాని పూర్వము గొప్పవారి కూతుండ్ర కీ పదమును వాడిరి. వేంగీ చాళుక్యులలో మంగిరాజు క్రీ.శ. **701 - 725** వరకు వేంగీ రాజ్యమును పాలించెను. అతని కూతురు పేరు "పృథివీ పోతి" అని అతని శాసనములో రాసినారు. పోతి శబ్దము ఇప్పుడు తెలంగాణాలో చాలా ప్రాంతాలలో విరివిగా వాడుకలో కలదు పిల్లవానిని పోఱడు, పోఱగాడు అని యందురు.

**వంద** - నూఱు యని యర్థము. ఈ పదము భారతములో కానరాదని నా నమ్మకం. ఇతర పూర్వ కవులలో, మధ్యకాలపు కవులలోను ఇది కానవచ్చినటుల నాకు తోచదు. మరి యిదెట్లేర్పడెను? ఈ పదము తెలంగాణలో, రాయలసీమలో జన సామాన్యమందు వాడుకలో లేదు. ఉత్తర సర్కారు వారిని జూచి తక్కినవారు వందయనుటయే బాగని ప్రయోగించుటకు నేర్చుకొనుచున్నారు. బహుశ బృంద (సమూహము) అను పదము యొక్క తద్భవముగా ఈ వంద అను పదమేర్పడెనేమో?

**బులాకి** - ముక్కు కొనను అలంకారముగా (?) వాడుకొను ఆభరణ విశేషము. ఫార్సీలో "బులాఖ్" ఈ ఆభరణమును ముసల్మానులే తెచ్చి ఈ దేశ స్త్రీల ముక్కుల కెక్కించినారేమో, ఆలోచించుడు.

**కందిల్** - హైదరాబాద్‌లో ప్రయుక్తము దీపమని యర్థము. ఇంగ్లీషు క్యాండిల్ నుండి వచ్చినదీ వెలుగు.

**గడ్డి నూనె** - ఉత్తర సర్కారులలో నున్నదో లేదో కర్నూలులో, నిజాం రాష్ట్రంలో కొన్ని భాగములలో కిరోసిన్ నూనెకు పర్యాయ పదముగా నున్నది. కిరోసిన్ నుండి గ్యాస్ కూడా వచ్చును. కావున గ్యాసును ముసల్మానులు "ఘాస్ నూనె"నుగా జేసిరి. ఉర్దూలో ఘాస్ (ఘాస శబ్దమే) అనగా గడ్డి కావున కిరోసిన్ గడ్డి నూనె అయినది.

**చీనా గొలుసు** - ఇంగ్లీష్ చైన్ అనగా గొలుసు. ఆక్స్ ఎద్దు అన్న చదువు పరిణామమే చైన్ గొలుసు తుదకు చైనా గొలుసు, చీనా గొలుసు అయినది. (చీనా దేశమున కిప్పుడిప్పుడే గొలుసు సంబంధము కలుగు చున్నది).

**తంబలి** - ఒక శైవజాతి - తాంబూల శబ్ద భావమని తలతును. పూర్వము ఒక్కొక్క జాతి ఒక్కొక్క వృత్తి. నంబులకు పూజయే కాక పూలను వర్తనగా తెచ్చి యిచ్చుట ("నంబి వాడిచ్చిన గన్నేరు పూవులు" అని శుకసప్తతి కారుడు) అటులే తంబల వారికి గ్రామములో తమలపాకుల నిచ్చుట.

**యోజన** - ఈ శబ్దము ఒక యూర పొడవగును. ఒక చోట చిన్నదగును. కొందరు పది మైళ్ళుందురు. కొందరు ఎనిమిది, మరికొందరు ఆరు మైళ్ళు యుజ్యతేతి యోజన. ఎద్దులను బండికి కట్టుట యని యర్థము. అనగా ఎద్దులబండి ఒక దినములో ఎంత దూరము పోవునో అంత దూరము. అది ఐదు మైళ్ళ నుండి పది మైళ్ళు కావచ్చును. బాటలను బట్టి యది నిర్ణయింపదగినది.

**సెమ్మె** - దీపము పెట్టు స్తంభము అని యర్థము. ఫార్సీలో "షమ" అనగా దీపము (దీప స్తంభము కాదు). దాని నుండియే మన సెమ్మె ఏర్పడినది.

**కాక పక్షము** - గిర్జాలు, జుంపాలు. కాకి రెక్కల వలె ఉభయ పార్శ్వములం దుండునవి. శ్రీరాములకు కాక పక్షముండెనని వాల్మీకి అభిప్రాయము.

**కవాట** -పాణిని కాలములో మన దేశమందు తలుపులు చిన్నవిగా నుండె నేమో. క = తలను, పాల యతీతి = పగులగొట్టునది కనుక - కవాట మయ్యెను.

**కీసర** = కీస అని కూడా యందురు. జేబు అని యర్థము. ఈ జేబు కూడా అన్యదేశ్యమే. (మన పూర్వులకు జేబులు లేకుండె నన్నమాట. మన మెప్పుడును పరులకై జీవించువారము కాన మనకు జేబులెందుకు?) కీసర్ అని ఫార్సీ రూపము నుండి వచ్చినది.

**దుహిత** - బిడ్డ అని యందరకు తెలిసినదే. ఈ శబ్దార్థము రెండు విధములు. ఈ అర్థములో ప్రాచీనుల ఇంటి బిడ్డ యొక్క స్థానము విశదమగును. దుహ్ ధాతువు. పితుకుట అను దాని నుండి వచ్చినదీ పదము. పూర్వము ఇంటి యాడపడుచు దినము ఆవులను, బర్రెలను చూసుకొనుచుండెనని యూహ్యము. ద్వేహితా - రెండు కుటుంబములకు - పుట్టిన యింటికి, మెట్టిన యింటికి హితురాలు అగుట కావచ్చును.

**పునాస** - వర్షకాలారంభమున విత్తునట్టి పంటకు అర్థము. పునర్వసు కార్తిలో సజ్జలు, కొర్రలు మున్నగునవి వేయుదురు. ఈ పునర్వసు నుండియే పునాస పదముద్భవించినదని నా యూహ.

**అక్ష (మాల)** -

శ్లో॥ ఆదిక్షాంతార్ణ యోగిత్వా దక్షమాలేతి కీర్తితా
భిర్ణ సంఖ్యైర్మణి తద్వ ర్ణపమాలాం ప్రకల్పయేత్

- శారదా తిలకము -

**ఏడుగడ** - క. గురుడును (1) తల్లియు (2) దండ్రియు (3) బురుషుడు (4) విద్యయును (5) దైవమును (6) దాతయు (7) నాబోరి నేడు గడయు దానై - హరినను రక్షించుగాతన ననవరతంబున్.

- వాసిష్టము -

**హెగ్గడి** - ద్వారపాలకుడు. బహు భార్యాయుక్తులగు రాజులు నాటికి నేటికి తమ దేవిడీల వద్ద పురుషుల పహిరాను అంతగా పసందు చేయరు. నపుంసకులను అంతఃపురము వద్ద కావలి పెట్టుచుందురు. ఉర్దూలో హిజ్‌డా అను పదము యొక్క అపభ్రంశమీ హెగ్గడియై యుండును.

**చిలువ** - చీలిన - వ - నోరు కలది - పాము.

**నలువ** - నాల్గు - వ - మోములవాడు. ఇట్లే గట్టివ మున్నగునవి.

**కింపచ** - దరిద్రుడు - ఈ దినమేమి వండుకుందునా అని చేతులు పిసికికొనువాడు.

**ముత్తైదువ** - అయిదు వన్నెలు కలది - మంగళ సూత్రము. పసుపు, కుంకుమ, గాజులు, చెవ్వాకు - కడపటిది అరవల సొమ్ము. తెలుగు స్త్రీలకు మట్టియలు - (మెట్టెలు).

**హురుమంజి** – హురుమంజి ముత్యములు. పర్ష్యాదేశపు సంధిని హురుముజ్ సంధి యందురు (Gulf of Hurmuz). పూర్వము మన దేశానికీ సముద్ర భాగమ నుండి తీసిన ముత్తెములు విశేషముగా నెగుమతి యగుచుండెను.

**నంగనాచి** – ఈ పేరు గలది ఏలేశ్వరోపాధ్యాయుల కూతురనియు నామెనొక కంసాలి తన కులము దాచి వివాహమాడె ననియు తదనంతర మోసమెరిగి యామె యాత్మహత్య చేసుకొనెననియు అప్పటి నుండియు "ఎంతటి నంగనాచివే" అనిన "ఎంతటి సాహసురాలవు" అను సామెత యయ్యెననియు కొందరందురు. హిందీలో నగ్నము (నంగా)గా ఆడునట్టి (నాచ్) స్త్రీల నృత్యమునకు నంగా నాచ్ అందురు. ఈ నృత్యము చేయు స్త్రీ సాహసికురాలు కాదా! అంతటి సిగ్గు విడిచినదను నర్థము ప్రయుక్తమే కాని ఏలేశ్వరోపాధ్యాయుని కూతురునకు మంచి పేరు దొరకక యంతటి సుందర నామము పెట్టి యుండరు.

**మోజాలు** – బాగ్దాదు పాదరక్షలకే యీ పేరుండెను. ఆ దేశము నుండి దిగుమతి యగుచుండెను.

**దేవర** – ద్వితీయో వరః మరది వితంతువైన వదినెకు నియోగ న్యాయముచే ద్వితీయ వరుడై యుండెను. ఉర్దూ, హిందీ భాషలలో నీ పదమే (దేవర్) అని నేటికిని మరదికి వాడుచున్నారు.

**దరుబేసి** – యోగి. ఫార్సీలో దర్వేష్. ఒక తెనుగు కవి (శృంగార అహల్యా సంక్రందన మేమో?) యీ పదమును ప్రయోగించినాడు.

**వర్గ** – అధ్యాయము, భాగము, ప్రకరణమును నర్థము. ప్రాచీన కాలములో గ్రంథములు ఆకులపై రాయుచుండిరి. ఫార్సీలో బర్గ్ అను ఆకు (బవయోరభేదః – వర్గ్)

**సూక్త** – (హోమము చేయునప్పు డుచ్చరించు) మంత్రము. ఫార్సీలో సోఖ్త్ అన కాల్చుట,వ్రేల్చుట అని యర్థము.

**పుస్తకము** – ఫార్సీలో పొస్తక్ అన చర్మము. బహుశః ప్రాచీనమందు గ్రంథములకు జింక చర్మములు మున్నగునవి అట్టలుగా నుంచుచుండిరో లేక చర్మపు సంచులలో గ్రంథముల భద్రపరచుచుండిరో యని దీనివలన గ్రహింపవచ్చును.

**ద్విబిస్తా** – బిస్తా 80 రతుల తూకపు బంగారు నాణెము. (సూ. ఆ పరిమాణ బిస్తా చితకం బల్వేభ్యోనతద్ధితలుకి) రెండు బిస్తలకు కొన్న బానిస స్త్రీ.

**పంచాశ్వా** – అయిదురు గుర్రములిచ్చి కొన్నట్టి బానిస స్త్రీ. ఈ రెండు పదములను బట్టి ప్రాచీనార్యులలో బానిసలను కొనుటయు, వ్యాపారమందు బానిసల విలువలయు వెల్లడి యగుచున్నది.

**చండాల** – సుప్రసిద్ధుడే! ఫార్సీలో నీచుని జందాల్ అనిరి.

**దేవ అసుర** – ఈ పదముల కర్థము ఫార్సీలో అపసవ్యముగా నున్నది. దేవ్ అన భూతము లేక రాక్షసి అని, అహుర్ (ఫార్సీలో సకారమునకు హకార ముంచుదురు. ఉ॥ సప్త = హప్త. సింధు = హిందు) అనగా ఫార్సీ మతమున మంచి దేవత. ఫార్సీలు, ఆర్యులును మొదట ఏకస్థులుగా నుండి సురాసుర పూజాదులందు భేదాభిప్రాయులై వేరైన నాట నుండి యా పరస్పర విరుద్ధార్థములు ప్రారంభమై యుండును.

...

**టక్కు** – టక్కులాడు, టక్కరి అను పదాలు టక్కు నుండి వచ్చినవి. నాకు తెలిసినంతవరకు ఈ పదాన్ని ఒకరిద్దరు కవులే పూర్వములో వాడినారు. నాచన సోమన "తిరిపెపు కూడు దెచ్చి" అను పద్యములో "టక్కరి బలుమోపు మోచు నయగాకి తనంబడియుట్టిగట్టిన్" అని ప్రయోగించెను. క్రీ.శ. 17వ శతాబ్ది తర్వాతి కవులీ పదాన్ని ఎక్కువగా వాడిరి. ఠగ్ అను హిందీ పదము కలదు. ఠగ్గులు ప్రసిద్ధులే. మన డక్కు నుండి ఠగు అనునది వచ్చెనా? లేక ఈ రెంటికినీ మూల సంస్కృత పదము కలదా?

**మ్లేచ్ఛ** : ఈ పదము బలూచ్ పదము నుండి ఏర్పడినదని మాక్స్ మూలర్ అభిప్రాయము. బెలూచిస్తాన్‌లోని వారు ఆర్యావర్తము సరిహద్దులలోని వారు వారనార్యులుగా ఉండి అపభ్రంశమును మాట్లాడిన వారని మహర్షి పతంజలి అభిప్రాయము.

**బఠ్రెంక పూలు** – బఠ్రెంక అను విష వృక్షమొకటి మహబూబ్‌నగర్‌లో కలదు. కాని ఆదిలాబాద్ జిల్లాలో పారిజాత పుష్పాలను బఠ్రెంక పూలని అందురు.

**శరభము** – మన సంస్కృత కవులు "సింహ శరభ శార్దూలములు" అని చాలా వర్ణించేవారు. శరభం ఎట్టి మృగమో ఎవ్వరున్నూ చూడలేదు. ఈ పదము అసీరియా నుండి వచ్చినట్లు కానవచ్చును. అసీరియాలో Cherub అను ఊహ మృగాన్ని భయంకరముగా చిత్రించేవారు. దేవతలు దానిపై స్వారీ చేసినట్లు చిత్రించుచుండిరి చెరుబిం (Cherubmim) అను పదము లాటిన్ లోనికినీ ఎక్కెను ఆ చెరుబింపదమే మన శరభం అయినదేమో?

**ఖుదా** – దేవుడు అను ఫార్సీలో అర్థము. ఇది సంస్కృతంలోని స్వధా అను పదము నుండి యేర్పడి యుండును. సకారము ఫార్సీలో ఖకారముగా మారును. స్వసుర ఖుసర్ అయినది.

**జగడము** - హిందీలో ఝగడా ఏది మొదటిది? భారతములో యుద్ధ వర్ణనలు నిండుగా ఉండినను జగడము అను పదము కానరాలేదు. హిందీ నుండియే తెలుగులోనికి వచ్చెనేమో?

**కుల్లాయి** - పొడువైన బట్ట టోపీ కర్థము. విజయనగర చక్రవర్తుల కాలములో పలువురు హిందూ ముసల్మానులు మూరెడు పొడవు గలిగి తలక్రిందులుగా ఉంచిన కాగితము పొట్లము వంటి టోపీని ధరించేవారు.

"కుల్లాపెట్టితి కోక జుట్టితి మహాకూర్పాసమున్ దొడిగితిన్" అని శ్రీనాథుడనెను. ఫార్శీలో కులా : అనగా టోపి. ఇది ఫార్శీవారి నుండి మనవారు తీసుకొన్న ఆచారము.

**పంతులు :** ఈ పదమును ఇప్పుడు నియోగులు తమ బిరుదు పదముగా వాడుకొనుచున్నారు. తెనుగు దేశములో చదువు చెప్పే ఉపాధ్యాయుని పంతులు అని అంటారు. ఈ పదము తెనుగు వాఙ్మయములో కానరాదు. ఇది మరాటీ పదమని తోస్తున్నది. పంథ్ అనునది మరాటీ పదము. మరాటీ బ్రాహ్మణోద్యోగులు ఆ పదాన్ని తమ పేరుల తుదిలో నుంచుచునుండిరి. మోరో పంథ్ వంటి విట్టివే. పంథ్ బహువచనము మన పంతులు అయియుండును. ఇది గోలకొండ నవాబుల కాలములోను పీష్వాల కాలములోను తెలుగు దేశములోనికి వచ్చినట్లున్నది.

**ఫిరంగి** - ఇంగ్లీషులో క్యానన్ అందురు. ఈ పదము ఫ్రెంచివారి నుండి ఏర్పడినది. ఫ్రెంచివారే ఫిరంగీలు. వారు తెచ్చిన మారణయంత్రమే ఫిరంగి. ఈ పదాన్ని క్రీ.శ. 1600 తర్వాత కవులెక్కువగా వాడినారు. అంతకు పూర్వమీ పదము మన వాఙ్మయములో లేదు.

**గేరి** - వాడ, వీధి అని యర్థము. రాయలసీమలో, మహబూబ్‌నగర్ జిల్లాలో వాడుదురు. మాదిగగేరి, బాపనిగేరి, కాపగేరి అని కన్నడములోని కేరి అను పదమే గేరి అయినది.

**కురువ** - గొల్లజాతిలోని ఒక జాతి. కన్నడములో కురి అనగా గొర్రె. కురికి సంబంధించిన జాతి కురువగా ఏర్పడియుండును.

**అడకొత్తు** - కన్నడములో అడకె అనగా వక్క. దానిని ఒత్తునది అడకొత్తు.

**క్రమేలక** - ఒంటె ఇంగ్లీషులోని క్యామెల్ అనునది దీనికి దగ్గరి పదము. ఇది సెమిటిక్ భాష నుండి సంస్కృతములోని కెక్కిన పదమని భాషాతత్త్వ శాస్త్రవేత్తల అభిప్రాయము.

**మేలా** - సంస్కృతములో మసి - సిరా - అను దానికి వాడుదురుట. మేలాంధుక అనగా మసిబుడ్డి ఇంక్ పాట్ అట. ఇది గ్రీకు భాష నుండి సంస్కృతములోనికి వచ్చినదట.

**లిపి** - ఇది పురాతన ఫార్సీ నుండి సంస్కృతములోని కెక్కెనని భాషా శాస్త్రవాదుల వాదము. పాణిని నాటికిది మన సంస్కృతములో నుండినట్టిది.

**శేరక** - వ్యాఘ్రము - అను నర్థములో సంస్కృతములోని కెక్కెనట. ఫార్సీ షేర్ పదాన్ని సంస్కృతములో శేరక అన్నారట.

**శిరోబంధనము** - రుమాల. ఫార్సీలో సర్‌బంద్ అందురు. అదే ఇంగ్లీషు టరుబన్ అయ్యెను.

**సమరె హింద్** - చింతచెట్టు ఈరాన్‌లో లేనిది - ఫార్సీలు దీనికి హిందూ దేశపు (సమర్) పండ్ల చెట్లు అనిరి - అదే ఇంగ్లీషులో టామరండ్ అయ్యెను.

**సిస్తు** - శిష్టము (పరిశిష్టము) నుండి వచ్చియుండును. సేద్యము ఖర్చు కూలి ఇంటి బత్తెము పోగా మిగిలినది. (శిష్టము) రాజుకు చెల్లించుట అను నర్థములో వాడియుందురు.

**వరహా** - మూడున్నర రూపాయి- విలువ గల బంగారు నాణెము. విజయనగర రాజుల కాలములో ఆ నాణెములపై వరాహ చిహ్నముండెను వరాహమే వరహా అయ్యెను. ఆ నాణెమునకు రెండవ ప్రక్కన దేవాలయ చిహ్నముండినందున ఇంగ్లీషువారు దానిని పగోడా అనిరి.

**తత్తెరేని** - మట్టితో చేసిన గుండ్రని కూజా. దీనిని ఉత్తర సర్కారు వారు తాబేటి బుర్ర అని యందురు. తత్తెరేని పదము కర్నూలు మండలము రాయచూరు పాలమూరు జిల్లాలో వాడుటకు ఎరుగుదును. శబ్ద రత్నాకరములో తత్తెర అను పదమిచ్చి దానికి సారాబుడ్డి అని అర్థము రాసినారు. వ్యవసాయకులు పొలాలకు వెళ్ళునప్పుడు తాబేటి చిప్ప వంటి యాకారము కల మట్టికూజాలో నీరు తీసుకొనిపోదురు. దానిని తత్తెరేని యందురు.

**మేజువాణి** - ఉత్తర సర్కారులలో భోగము సానుల ఆటకు మేజువాణి యందురు. ఇది ఉర్దూలోని మేజ్‌బానీ అను పదము యొక్క అపభ్రంశరూపము. మేజ్‌బాన్ అనగా విందునిచ్చువాడు. మేజుబానీ అనగా విందు. సాహెబులలో విందులలో పూర్వము నాచ్ ప్రధానముగా నుండెను. అందుచేత మనవారు సానుల ఆటకు వారి పాట కచ్చేరీకి మేజువాణి అని పేరు పెట్టినారు.

**పోతి** - బాలిక అని అర్థము. ఇది అల్పార్థమందు తక్కువ వారి పిల్లలను పిలుచుటకై వాడుదురు. కాని పూర్వము

అరబీలో తావీజ్ అను పదము కలదు. అరబీ నిఘంటువులలో దాని కర్థము చేతులకు కట్టుకొనే ఖురాను మంత్ర విషయక రక్ష అని వ్రాసినారు. తెనుగు దేశముపై గోలకొండ సుల్తానుల పరిపాలనము క్రీ.శ. 1512 నుండి స్థిరపడెను. వారి పరిపాలనములో ఫకీరుల ద్వారా హిందువులు తావీజులనుపొంది అవి తమకు సకల పీడా నివారక రక్షలుగా నుండునని భ్రమించిరి. తావీజు శబ్దమే తెనుగు నోళ్ళలో నలిగి తుదకు తాయెతు రూపము దాల్చెను. దీని పుట్టుకను సరిగా గుర్తించక తానేమో సరిగా నుచ్చరించినట్లు తలచి మల్లనను ఆధారము చేసుకొని ముద్దరాజు రామన్నను తప్పు పట్టిన అప్పకవి శాసనమును ఎవ్వరును అవుగాదనినవారు కారు.

గొప్పవారి కూతుండ్ర కీ పదమును వాడిరి. వేంగీ చాళుక్యులలో మంగిరాజు క్రీ.శ. 701 - 725 వరకు వేంగీ రాజ్యమును పాలించెను. అతని కూతురు పేరు "పృథివీ పోటి" అని అతని శాసనములో రాసినారు. పోటి శబ్దము ఇప్పుడు తెలంగాణాలో చాలా ప్రాంతాలలో విరివిగా వాడుకలో కలదు పిల్లవానిని పోఱడు, పోఱగాడు అని యందురు.

**వంద** - నూఱు యని యర్థము. ఈ పదము భారతములో కానరాదని నా నమ్మకం. ఇతర పూర్వ కవులలో, మధ్యకాలపు కవులలోను ఇది కానవచ్చినటుల నాకు తోచదు. మరి యిదెట్లేర్పడెను? ఈ పదము తెలంగాణలో, రాయలసీమలో జన సామాన్యమందు వాడుకలో లేదు. ఉత్తర సర్కారు వారిని జూచి తక్కినవారు వందయనుటయే బాగని ప్రయోగించుటకు నేర్చుకొనుచున్నారు. బహుశ బృంద (సమూహము) అను పదము యొక్క తద్భవముగా ఈ వంద అను పదమేర్పడెనేమో?

**కరడా** - ఇప్పుడు బళ్ళలో కాపీలు వ్రాయింతురు. అందుచేత కాపీ వ్రాయుట అని మనము వ్యవహరించుతున్నాము. కాని మనకు కాపీ శబ్దమునకు సరియగు పదము కలదు. అదే కరడా అను పదము. ఈ శబ్దము నిఘంటులలో లేదు. తెలంగాణాలో ఇది విరివిగా ప్రయోగింపబడుతున్నది. అక్షరాలు బాగా కుదురుటకై మంచి అక్షరాలను ఒరవడిగా నుంచుకొని వ్రాయుటకు కరడాలు వ్రాయుట అని యందురు.

**అరి కంఠము** - తల చెవులు మూసుకొను నటుల వస్త్రమును చలి నాపుటకు చుట్టుకొనుట కందురు. ఇది నిఘంటులలో లేదు.

**మాంగో** -- మామిడి పండు అను నర్థము కల ఇంగ్లీషు పదము. ఇంగ్లండ్‌లో మామిడి చెట్లు, పండ్లు లేవు. ఈ పదాన్ని మన దేశము నుండే తీసుకొనిపోయి యుందురు. మచిలీ బందరులో మొదట ఇంగ్లీషువారు మొఖాము వేసినవాడు తెనుగువారి నుండి మావికాయ మాగాయ అని దాని పేరు తెలుసుకొని దానినే మాంగో అని మార్చుకొని యుందురు.

**తాయెతు** - దీన్ని గూర్చి అప్పకవి ఒక వ్యుత్పత్తిని చెప్ప సాహసించెను. "ఎత్తులనగా దక్షిణ దేశీయమున దండలకు పేరు. దాని జడ్డన తెలబలికిన ఎతు లాయెను. తాయి అనగా తల్లి. ఆ తాయి శిశువులకు శరీర రక్షగా కట్టునవి యెత్తులు కనుక "తాయెతులు" అని వ్రాసెను. అప్పకవి తనకు పూర్వము ముద్దరాజు రామన తాయెత్తును తాయతు అని వ్రాసి యుండెనని యాక్షేపించెను. మరియు తనకు పూర్వుడైన కవి తన చంద్రభాను చరిత్రయం దిట్లు వ్రాసెనని యుదాహరించెను.

"ఒక యింతి యొరగిన సికమీద ముడి పువ్వు
టెత్తులు దొరయు తాయెతులు చుట్టి"

చంద్రభాను చరిత్రమును వ్రాసిన తరిగొప్పుల మల్లన కవి క్రీ.శ. 1600 ప్రాంతము వాడని ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారు పీఠికలో వ్రాసినారు. తరిగొప్పుల మల్లన ముద్దరాజు రామన కంటే పూర్వ కవులెవ్వరును తాయెతు శబ్దమును ప్రయోగించినటుల కానరాదు. అనగా క్రీ.శ. 1500 తర్వాతనే యీ శబ్దము తెనుగులోనికి ప్రవేశించిన దనవలెను. ప్రవేశించినదగుట చేత ఇది విదేశీ శబ్దమై యుండవలెను. అప్పకవి భ్రమించినట్లుగా ఇది దక్షిణ దేశీ పదము కాదు. ఎత్తు లేక ఎతు అను పదాలకు దండ (హస్తముపై భాగము) అను నర్థమెందుకను కానరాదు. నిఘంటువులలో గాని, ప్రయోగాలలో గాని ఈ యర్థము కానరాదు.

ఇక ఈ పద మెక్కడిదనగా ఇది అరబీ పద మనవలెను. అరబీలో తావీజ్ అను పదము కలదు. అరబీ నిఘంటువులలో దాని కర్థము చేతులకు కట్టుకొనే ఖురాను మంత్ర విషయక రక్ష అని వ్రాసినారు. తెనుగు దేశముపై గోలకొండ సుల్తానుల పరిపాలనము క్రీ.శ. 1512 నుండి స్థిరపడెను. వారి పరిపాలనములో ఫకీరుల ద్వారా హిందువులు తావీజులనుపొంది అవి తమకు సకల పీడా నివారక రక్షలుగా నుండునని భ్రమించిరి. తావీజు శబ్దమే తెనుగు నోళ్ళలో నలిగి తుదకు తాయెతు రూపము దాల్చెను. దీని పుట్టుకను సరిగా గుర్తించక తానేమో సరిగా నుచ్చరించినట్లు తలచి మల్లనను ఆధారము చేసుకొని ముద్దరాజు రామన్నను తప్పు పట్టిన అప్పకవి శాసనమును ఎవ్వరును అవుగాదనినవారు కారు.

•



# అరుణారుణ తార తరుణ కాంతి ధార

## దేవులపల్లి కృష్ణశాస్త్రి

**(1.11.1897 - 24.02.1980)**

భావ కవిత్వ పితామహుడు. మధుర గీత రచయిత.

"సంకెళ్ళ లాంటి శాసనాలు మృతులైన వాళ్లే చేస్తారు. వాటికి మనం లోబడిపోతాం. నేను కూడా అలాంటి శాసనాలు చేసి చచ్చిపోతానేమో? అలా కాకుండా ఉంటే ఎంత బాగుండును!" అని ఒక ఆంగ్లకవి పద్యం చదివాను. దీనివల్ల కొన్ని శాసనాలూ, నియమాలూ అసలే వద్దని కాదు, సాగనివ్వకుండా ఘనీభవింపచేసి, చంపేస్తాయి కదూ సంకెళ్ళు? - అవి వద్దని.

సంకెల చీకటీ, ముసలితనమూ, మరణమూను! తేజస్సు పురాణమయినదీ, తరుణమూ, సందె చీకట్లు ఒక గడియే ఉంటాయి. పుట్టడమే ముదిసి పుడతాయి. కవి వెలుగు వైపు నడుస్తూ ఉండాలి- నిజానికి. Iam of an age with each: what matter if my hair turns gray? నేను యువకుణ్ణి కాకపోతే ప్రతి అనుభవానికీ నా గుండె ఎలాగ కొట్టుకుంటుందీ? నా మనస్సెలా రెక్కలు తొడుగుకుని భాసిస్తుంది?

స్థిరపడడం, స్థిమితపడడం అని లోకం అంటుందే- అదంటే నాకు చాలా భయమూ, వెగటూనూ!

కాని మనలో ఒక కాన్యూట్ (Canute) తనం ఉంది. అనగా అనగా కాన్యూట్ అనే ఒక రాజు ఉండేవాడు. అతనొకసారి సముద్రపు ఒడ్డునే నీటిని తగిలేటట్టుగా తన సింహాసనము వేయించుకుని, మంత్రి సామంతాదులతో కొలువు తీర్చి, పొంగిపోతూ ఎగిరెగిరి గుర్రపు దళాల్లాగ వస్తూ ఉన్న కెరటాల కేసి - మహారాజు కాదూ - చెయ్యెత్తి ఒకగీటు దాటి రావద్దని ఆ కెరటాలను శాసిస్తూ గర్జించాడు. మంత్రి సామంతాదులు అవునన్నట్లు తలలూపి వంచుకున్నారు. కెరటాలు వినలేదు. సింహాసనమూ, రాజూ, పరివారమూ కొట్టుకుపోయారు.

నిజానికి, ఒక కావ్యంలో వాస్తవికత **(realism)** వల్ల వచ్చే ఆప్తతా, చైతన్యమూ, కాల్పనికత **(romanticism)** లో ఉండే ఆవేశమూ, భావనా, సాంస్కృతికత **(calsscism)** లో ఉండే సమగ్ర సౌందర్యమూ, సందేశమూ ఉండాలి.

ఇంతకూ నే చెప్పేదేమంటే- సాహిత్య రంగంలో కృషి చేసే వాళ్ళకి చుట్టూ ఉన్న మానవ జీవితంతో ఎంత సంబంధం ఉంటే అంత మంచిదనిన్నీ, అలా ఉంటే కావ్యానికి వస్తువుగా అనుభవమున్నూ, కల్పనకు పురికొల్పే కరుణయున్నూ, సృష్టింప చేసే చైతన్యమున్నూ లభిస్తాయనిన్నీ...

ఇక- ద్వేషంతో, రోషంతో, మోసంతో, నాశంతో, అశాంతితో, అంధకారంతో యావత్తూ ప్రపంచమూ, మన దేశమూ భయంకరంగా ఉన్నాయి. 'గాత్రం భయంచేత విహ్వాల మవుతున్నది; ముఖం ఎండిపోతూంది; శరీరం వణుకుతూంది; గగుర్పొడుస్తూంది' అని నరల లోకం అంతా అంటూంది. ఎంతో ఆశా బలమూ, దృష్టీ ఉంటేనే గాని అంతా అయోమయం గానూ, అసత్యంగానూ ఉన్నట్టుంది. ద్రష్ట, విశ్వాసి అయిన కవీ ఊరుకుంటే ఎలాగ? నవ్య సాహిత్య పరిషత్తే ఊరుకుంటే ఎలాగ?

నవ యుగోదయం అప్పుడే పొడిచినప్పుడు, ఆ రోజులలో కొత్తగా తలుపులు తెరచుకున్నప్పుడు, తెర్లి పొర్లి వచ్చే మానవ సమాజమూ, లోకమూ ప్రకృతీ మనకు ఎదురయాయి. మనమూ వాటిలో కలిసిపోయాం. తీవ్రమైన అనుభవాలు కొన్ని వచ్చాయి. మన దృష్టులు మెరిసేయి. మన మనస్సులు ఎగిరేయి. మన గొంతు ముళ్లు విడ్డాయి. మనం ఏవేవో కావ్యాలు ఆలపించాం. కథలు చెప్పేం. నాటికలు వినిపించేం. వాటిలో జీవం ఉంది.

మనం అందరమూ కొంతకాలం దాకా పందెపు గుర్రంలాంటి కెరటం లాగ ఉంటాం. తరువాత మంత్రి సామంతా దుల్లాగ మన్నో, మసనమో అయిపోతాం. అలాగ అయిపోతే అభ్యుదయం ఎలాగ? ఎప్పటికప్పుడు యువకుడిగా ఉండవలసిన కవే అలా అయిపోతే ఎలా? ఎప్పటికప్పుడు నవ్య సుందర లోకం నిర్మిస్తూ ఉండవలసిన కవే అలాగైపోతే ఎలా? ఆహా! అసలు ముసలితనం ఏమాత్రమూ రానీయని అనంత తారుణ్యం కల్పించిన అద్భుత కావ్యాలు అనేక యుగాల అవధులు దాటి వచ్చి ఇంకా మనల్ని ఎలాగ పలకరిస్తున్నాయి, నడిపిస్తున్నాయి!...

నవ యుగోదయం అప్పుడే పొడిచినప్పుడు, ఆ రోజులలో కొత్తగా తలుపులు తెరచుకున్నప్పుడు, తెర్లి పొర్లి వచ్చే మానవ సమాజమూ, లోకమూ ప్రకృతీ మనకు ఎదురయాయి. మనమూ వాటిలో కలిసిపోయాం. తీవ్రమైన అనుభవాలు కొన్ని వచ్చాయి. మన దృష్టులు మెరిసేయి. మన మనస్సులు ఎగిరేయి. మన గొంతు ముళ్లు విడ్డాయి. మనం ఏవేవో కావ్యాలు ఆలపించాం. కథలు చెప్పేం. నాటికలు వినిపించేం. వాటిలో జీవం ఉంది. వాస్తవికానుభూతి పునాదిగా సుందర నిర్మాణాలు కల్పించాం. అలాంటివి ఎప్పుడూ ఉండేవే! అలాంటి కావ్యాలూ ఎప్పుడూ ఉండేవే!

కాని ఒక చిక్కు వచ్చింది. ఆ అనుభవాన్నే తరవాత తరవాత గట్టిగా కౌగలించుకుని కూర్చుంటే అది మన చేతిలో నలిగి ఊపిరాడక సొమ్మసిల్లి చచ్చిపోతుంది. దానిచుట్టూ, మనచుట్టూ నాలుగు గోడలూ, పైకప్పూ కట్టుకుని, మనం దాన్ని గూర్చే తిరగేసి, మరగేసి చెబుదామంటే ఇబ్బంది వస్తుంది. అటువంటి అనుభవాలు ఉన్నంతకాలం ఆ కావ్యాలు అవసరమే. జీవించి ఉన్న మానవ సంఘంలో అటువంటివి ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి కూడా. కాని, వాటిలో కొత్త మెరుపులూ, కొత్త నడకలూ, కొత్త పలుకుబడులూ రావడానికి కానీ, ఇంకా కొత్త కొత్త అనుభవాలు వివిధ విధాలవి రావడానికి కానీ నాడు జీవంతో, తారుణ్యంతో నిండిపోయిన ఏ మానవ సమాజమూ, లోకమూ మనల్ని పలుకరించాయో, వాటికి మళ్లీ మనం ఎదురవాలి; వాటిలో మళ్లీ మనం పడాలి. అలా చెయ్యడం వల్ల మనం బ్రతికి ఉండడం, యువకులుగా ఉండడం, సాహిత్య జగత్తును సమాజం అంత విశాలంగా చెయ్యడం తటస్థిస్తుంది. ఏమో, మన తరువాత అంత విశాలమైన జగత్తు సృష్టించి, కళ్యాణం తీసుకు వచ్చే ఒక మహాకవికి దారి పరుస్తున్నామేమో!...

మతానికీ జీవితానికీ ఎంత సంబంధం ఉందో, కళకీ జీవితానికీ అంత సంబంధమే ఉంది. అంత ప్రస్తుతం కానట్టు కనబడినా ఇక్కడ నాదో అనుభవాన్ని గూర్చి చెప్తాను– ఆంధ్ర బ్రాహ్మ సమాజంతో. ముప్ఫై నలభై ఏళ్ళ క్రితం ఆ ఉద్యమం కొత్తగా మన తెలుగు నాటిలో చొరబడినపుడు ఉత్సాహవంతులైన కొందరు యువకులు దానిలో పడ్డారు. ఆ కొత్త మతావేశంతో సంఘంలోకి కలయచూస్తే వారికి కొన్ని గొప్ప చెడుగులేవో కనబడ్డాయి. అప్పుడు విధవా వివాహ మన్నారు; జాతి భేద నిర్మూలన మన్నారు; మరేవో అన్నారు. సంఘం బాధపెట్టింది. ఆ కారణం వల్లనున్నూ, ఒక విధమైన మతాహంకారం చేత చుట్టూ ఉన్న మానవులకన్నా తాము గొప్ప వాళ్ళం అనుకోవడం చేతనున్నూ నెమ్మదిగా చుట్టూ బడాయిగా గోడలు కట్టుకుని కూర్చున్నారు. ఇంతలో మానవ సంఘం – గొప్ప జీవనది కాదూ – ప్రవహించుకునిపోతూ ఉంది. నవ్యమత సంస్కర్తలు నలభై ఏళ్ళక్రితం దగ్గిర ఉండిపోయారు. గడ్డాలూ, మీసాలూ నెరిసి హేమంతం లాగ గడ్డ కట్టుకుపోయారు. కాల పరిస్థితుల్ని బట్టి వారన్న సంస్కరణాల కన్నా పదిరెట్లు ఎక్కువ సంస్కరణాలు కావిస్తూ సంఘం మాత్రం అంతా ముందు ముందుకు సాగుతూనే ఉంది.

అలాగే సాహిత్యరంగంలో కృషి చేసే వాళ్ళ విషయంలో కూడా...

ఇక – గోడ స్వార్థానికి కూడా కారణమవుతుంది. కాని సుఖదుఃఖాలతో, పతనాభ్యుదయాలతో చలించిపోయే ఈ మానవ లోకంలో పడితే ఒక గొప్ప కరుణ మనలో పుడుతుంది... ఈ కరుణ ఈ అసమగ్రమయిన లోకంమీద. ఇంతకంటె చక్కని లోకం నిర్మించేటట్లు చేస్తుంది. కవి అదే చెయ్యాలి కాదూ!

కనుక వాస్తవిక జగత్తుతో మన కెప్పుడూ సంబంధం ఉండాలి. ఎంత సంబంధం ఉంటే అంత మంచిది. కవిత్వానికి కూడా పక్షికి లాగే ఆకాశమూ అవసరమే. గూడూ అవసరమే! మన దేశంలో కొంతమంది ఈ గూడు లేకుండానే కేవలం రెక్కలమీదనే ఆధారపడి అవధిలేని ఆకాశంలో ఎగరడానికి ప్రారంభించారు. తుఫానులు వచ్చి పడ్డాయి. ఇంక మిగిలింది – గాలిలో తేలిపోయి పడిపోవడం గాని, గూటిలోనే కూచుంటే కుళ్ళిపోయి కుళ్ళిపోయి కొయ్య అయి పోవడం గాని...



# తుది విన్నపం

## - గిడుగు వేంకట రామమూర్తి

"నేడు సుదినం.

మీ వంటి వారి దర్శనం కలిగింది. 'ప్రజామిత్ర' పత్రికా సంపాదకులయిన శ్రీరామబ్రహ్మంగారు నా యెడల దయగలవారు గనుక నేటి సాయంకాలం ఈ సభ ఏర్పరిచారు. తెలుగు సారస్వతమందూ, తెలుగు వారి విద్యాభివృద్ధి యందూ అభిమానముగ పండితులకున్ను కవులకున్ను పత్రికా సంపాదకులకున్ను నా కట్టకడపటి విన్నపము తెలియజేయడానికి అవకాశం కలుగజేశారు. నా ఆరోగ్యం చెడిపోయినది. కాలేయంలో గుల్మ పుట్టినది. చికిత్స కోసం చెన్నపట్నం వచ్చాను. అట్టేకాలం జీవించగలనని తోచదు. జీవించి ఉన్నా చాలా కృశించి పోయి ఉన్నాను. గనుక మునుపటిలాగున మరి ఉపన్యాసాలు చేయలేను. అందుచేత ఇదే నా కట్టకడపటి విన్నపమంటున్నాను. ఇంకా జరుగవలసిన పని మీకే అప్పగిస్తున్నాను. మీరే సాగించవలెను.

గ్రాంధిక భాష యెడల నాకు ఆదరము లేకపోలేదు. ప్రాచీన కావ్యాలు చదువవద్దని విద్యార్థులకు నేర్పవద్దనీ నేననుగాని, ఆ భాషలో నేడు రచన సాగించడానికి పూనుకోవడం వృథా అంటున్నాను. నిర్దుష్టంగా ఎవరున్ను రాయలేరు. వ్రాయగలిగినా వ్రాసేవారికీ కష్టమే, వినేవారికీ కష్టమే. వ్రాసేవాండ్లేమి చేస్తున్నారు? భావం తమ సొంత (వాడుక) భాషలో రచించుకొని గ్రాంధికీకరణం చేస్తున్నారు. అది చదివేవాండ్లు వినేవాండ్లు తమ సొంత వాడుక మాటలలోకి మార్చుకొని అర్థం చేసుకుంటున్నారు. ఎందుకీ వృథా ప్రయాస?

స్వరాజ్యం కావలెనంటున్నాము. ప్రత్యేకాంధ్ర రాష్ట్రము కోసం చిక్కుపడుతున్నాము. ప్రజాస్వామిక పరిపాలనం కోరుచున్నాము. ఇటువంటి పరిస్థితులలో మన ప్రజలకు, సామాన్య జనులకు ఏ భాష ద్వారా జ్ఞానం కలుగజేయవలసి ఉంటుందో, ఏ భాషలో గ్రంథ రచన సాగించవలసి ఉంటుందో ఆలోచించండి. మీ చేతులలో పత్రికలున్నవి. పత్రికల ద్వారా మీరు ఎంతైనా చేయగలరు"

**(15-1-1940 ప్రజామిత్ర కార్యాలయములో చేసిన ఉపన్యాసం నుండి)**

---

నిజానికి, ఒక కావ్యంలో వాస్తవికత (realism) వల్ల వచ్చే ఆప్తతా, చైతన్యమూ, కాల్పనికత (romanticism) లో ఉండే ఆవేశమూ, భావనా, సాంస్కృతికత (calsscism) లో ఉండే సమగ్ర సౌందర్యమూ, సందేశమూ ఉండాలి.

ఇంతకూ నే చెప్పేదేమంటే– సాహిత్య రంగంలో కృషి చేసే వాళ్ళకి చుట్టూ ఉన్న మానవ జీవితంతో ఎంత సంబంధం ఉంటే అంత మంచిదనిన్నీ, అలా ఉంటే కావ్యానికి వస్తువుగా అనుభవమున్నూ, కల్పనకు పురికొల్పే కరుణయున్నూ, సృష్టింప చేసే చైతన్యమున్నూ లభిస్తాయనిన్నీ...

ఇక– ద్వేషంతో, రోషంతో, మోసంతో, నాశంతో, అశాంతితో, అంధకారంతో యావత్తూ ప్రపంచమూ, మన దేశమూ భయంకరంగా ఉన్నాయి. 'గాత్రం భయంచేత విహ్వల మవుతున్నది; ముఖం ఎండిపోతూంది; శరీరం వణుకుతూంది; గగుర్పొడుస్తూంది' అని నరలోకం అంతా అంటూంది. ఎంతో ఆశాబలమూ, దృష్టీ ఉంటేనే గాని అంతా అయోమయంగానూ, అసత్యంగానూ ఉన్నట్టుంది. ద్రష్ట, విశ్వాసి అయిన కవీ ఊరుకుంటే ఎలాగ? నవ్య సాహిత్య పరిషత్తే ఊరుకుంటే ఎలాగ?

ఆకాశము నొసట పొడుచు అరు ణారుణతార!
ఏకాకి నిశీథి నొడుచు తరుణ కాంతిధార!
జయపతాక! యువ పతాక!
వియ దాపగ వెడలు నౌక!
యుగయుగాల పీడకలలు సొగయ చేయు సంకెలలు
తెగనివి కావోయి, మ్రోల ధగధగా స్వతంత్ర విభా
తాకాశము నొసట...
అంతులేని ద్వేషము, విష రోషము, స్వార్థము, మోసము
పంతగించి నిలువవు అవంతయేని, శాంత విభా
తాకాశము నొసట...
ముందు గలదు మన జాతికి ముక్తి, అమర జీవ రక్తి
క్రింద వెనుక గనక నడుపు డందురు. అభ్యుదయ విభా
తాకాశము నొసట...

**(1942లో ఏలూరులో జరిగిన నవ్యసాహిత్య పరిషత్తు అధ్యక్షోపన్యాసం నుంచి)**



# సాహిత్యం వజ్రమైతే సానపట్టేది విమర్శ

## పురిపండా అప్పలస్వామి

(13.11.1904 - 18.11.1982)

కవి, విమర్శకుడు, బహుభాషావేత్త

మార్క్సు వాస్తవికవాదం సాహిత్యంలో విస్తృతం చేసిన విమర్శకుడు కాడ్‌వెల్. ఆయా యుగాలలో ఆయా అవకాశాల ననుసరించి కావ్య సృష్టి జరుగుతుందని నిరూపించాడతడు. పూర్వ ప్రస్తరయుగం, ఉత్తర ప్రస్తరయుగం, సామ్రాట్టుల యుగం, సామంతులయుగం, ధనికుల యుగం, సామ్యవాదయుగం అని సాహిత్య యుగాలు విభజించి విమర్శించాడు.

ఇలియట్, రిచర్డ్సుల విమర్శలతో విమర్శనా సాహిత్య చరిత్రలో కొత్త పుట తెరవబడింది. ఇలియట్ ఎంత ఆధునిక కవో అంత ఆధునిక విమర్శకుడు. అతడి **Sacred wood** రిచర్డ్సు రాసిన 'ఫౌండేషన్ ఆఫ్ క్రిటిసిజమ్', 'మీనింగ్ ఆఫ్ మీనింగ్', 'ప్రిన్సిపల్స్ ఆఫ్ లిటరరీ క్రిటిసిజమ్', 'పొయిటికల్ క్రిటిసిజమ్' విమర్శలో విప్లవం సృష్టించాయి. ఇలియట్‌తో పాటు డి. హెచ్. లారెన్స్ కూడా చెప్పదగినవాడు. ఈ ఇద్దరి రచనల ప్రభావం ప్రపంచమంతటా ఆధునిక రచయితల మీద కనిపిస్తుంది.

విమర్శ, సమీక్ష, మీమాంస, సమాలోచన, అనుశీలన, పరిశీలన, క్రిటిసిజమ్ - ఇవన్నీ ఇంచుమించుగా సమానార్థకాలు.

విమర్శ అంటే Examination, Scrutiny, Trial, విచారణ అని బ్రౌణ్యం.

విమర్శించు అంటే - ఆలోచించు, చర్చించు, పరామర్శించు, పరిశీలించు, పరిశోధించు, పర్యాలోచించు, విచారించు, వివేకించు, వివేచించు, శీలించు, శోధించు అని ఆంధ్రవాచస్పత్యం.

Critism అంటే to decide. To give an authoritative opinion. The art of judging the qualities and rules of an aesthetic object, whether in literature or the fine arts. "Encyclopaedia Britanica."

"In the strict sence the word critism means judgement" అని W.H. Hudson.

ఒక గ్రంథంలోని, లేదా ఒక సాహిత్య ప్రక్రియలోని బాగోగులు కూలంకషంగా విచారించి, విశ్లేషించి వివరించడమే విమర్శ. అది ఎంత ప్రజ్ఞావంతంగా పక్షపాతరహితంగా, పవిత్రవంతంగా, సహృదయపూర్వకంగా, సానుభూతిసహితంగా వుంటే సాహిత్యానికీ, సంఘానికీ అంత ఉపకార కారణమవుతుంది.

"మంచి విమర్శ మంచి భావాలు నెలకొల్పుతుంది. ఒక మహాకావ్యం అవతరించడానికి అవకాశం కల్పిస్తుంది" అన్నాడు సుప్రసిద్ధ విమర్శకుడు అర్నాల్డు.

విమర్శ అనడంతోనే సాధారణంగా కేవలం దుయ్యబట్టడమే అని కొందరి అభిప్రాయం. ఆ దుయ్యబట్టే ఆవేశంలో అసహ్యంగా అవహేళన

సుప్రసిద్ధ ఆంగ్ల సాహిత్యవేత్త జాన్సను బహుముఖ ప్రజ్ఞావంతుడైన గొప్ప విమర్శకుడు. అయితే పక్షపాత దోషానికి లోనయినప్పుడు అతడి విమర్శ మంచి విమర్శ కాలేకపోయింది. పోపు, అడిసను మొదలైనవారి గ్రంథాలు విమర్శించినప్పుడు అతడి విమర్శలో కనపడిన ప్రతిభ మిల్టను, గ్రేల రచనలు విమర్శించి నప్పుడు కనపడలేదు. మిల్టనుతో రాజకీయంగానూ, గ్రేతో వ్యక్తిగతంగానూ వుండిన విభేదాలు అతడిలోని నిష్పక్షపాతబుద్ధిని కుంటుపరిచాయి.

చేయడానికిన్నీ, సంకోచించరు వారు. అదిగో అలా బయటపడినవే సంస్కృతంలో 'దుర్జన ముఖ పేటిక', 'దురజనముఖ పద్మపాదుక' వంటి గ్రంథాలు, తెలుగులో 'విమర్శాదర్శ విమర్శాదర్శము', 'కొత్త తెలుగు తమాషా', 'నేటి కాలపు కవిత్వము', 'చెళ్ళపిళ్ళవారి చర్లాటము' మొదలైనవి.

ఒకప్పుడు ఈ రకం విమర్శకుల ఆవేశాలు కోర్టులకు లాగాయి. నడివీధిలో లడాయికి నడుము కట్టించాయి.

భాషకి ముందు సారస్వత ముండదు. అలాగే సారస్వతానికి పూర్వం విమర్శ లేదు. సారస్వతం, మొదట పుడుతుంది. సారస్వతాన్ని వెన్నంటి విమర్శ వస్తుంది. ఇంకా చెప్పాలంటే సారస్వతంలో కావ్యమూ, విమర్శా జమిలి సంతానమేమో, కృత్యాద్యవస్థలో కవి కొంతవరకు విమర్శకుడే అవుతాడు. తన కృతికి తాను వేసుకున్న పథకం పర్యాలోకిస్తూ.

ప్రాచీనకాలంలో విమర్శ లక్షణ గ్రంథాలుగా దర్శనమిచ్చింది. ఆ లక్షణ గ్రంథాలే అనంతరం నిబంధన గ్రంథాలుగా, అనుశాసనాలుగా అధికారం చేజిక్కించుకున్నాయి. అప్పుడవి 'కవి కంఠపాశాలూ', 'కవి గజాంకుశాలూ', 'కవ సర్పగారుడాలూ' అయ్యాయి. సాహిత్యానికి సంకెళ్ళు తగిలించాయి. కవిత్వానికి గట్లు పోశాయి. వాటిని ఉల్లంఘించిన కృతులను - అవి ఎంత గొప్పవైనా సరే - ఆంక్షవేశాయి. పోతనగారి భాగవతమంత మహా కావ్యానికి తప్పలేదు ఈ ఆంక్ష. దాని అపరాధమంతా బండిరాతో రకారానికి నేస్తం కల్పించడం.

"బమ్మెర పోతరాజ కృత
భాగవతమ్ము జగద్ధితమ్ముగా
కిమ్మహి నేమిటం గొదువ,
ఎంతయు నారసి చూడగామ రే
ఇమ్ములు బాలుసుం గలసి
ప్రాసములైన కతంబునం గదా
ఐమ్ముగ నాదిలాక్షణికు
లెల్లరు మాని రుదాహరింపగన్"

అన్నారు కాకనూరి అప్పకవి. జంకూ గొంకూ లేకుండా: ఈ సారస్వత ఆంక్షలు తమ పరిధులు అతిక్రమించి కులాల మీదికి కూడా తమ కబంధ హస్తాలు చూపాయి. ఈ అప్పకవే ఏమంటున్నాడో వినండి :

"ఉపమ గలిగిన శయ్యల నొప్పియున్న
అంఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబు గాదు."

విమర్శ చేసేవాడు విమర్శకుడు. A critic is one who exercises the art of criticism 'Encyclopeadia Britanica.'

అన్ని పక్షాలు విచారించి, సరైన న్యాయం వ్యక్తీకరించే న్యాయాధిపతి వంటి వాడు కావాలి విమర్శకుడు. తన కేసు ఎలా అయినా గెలవాలని వాదించే న్యాయవాదివంటివాడు కాకూడదు. రసజ్ఞుడు కావాలి. కేవలం దోషజ్ఞుడు కాకూడదు. ప్రజ్ఞావంతుడు కావాలి. పక్షపాతం కలవాడు కాకూడదు. గుణగ్రాహి కావాలి. మచ్చరగొట్టు కాకూడదు.

ఎన్ని మంచి గుణాలుండినా పక్షపాతం వొదలని విమర్శకుడి విమర్శ కువిమర్శ అవుతుంది.

సుప్రసిద్ధ ఆంగ్ల సాహిత్యవేత్త జాన్సను బహుముఖ ప్రజ్ఞావంతుడైన గొప్ప విమర్శకుడు. అయితే పక్షపాత దోషానికి లోనయినప్పుడు అతడి విమర్శ మంచి విమర్శ కాలేకపోయింది. పోపు, అడిసను మొదలైనవారి గ్రంథాలు విమర్శించినప్పుడు అతడి విమర్శలో కనపడిన ప్రతిభ మిల్టను, గ్రేల రచనలు విమర్శించి నప్పుడు కనపడలేదు. మిల్టనుతో రాజకీయంగానూ, గ్రేతో వ్యక్తిగతంగానూ వుండిన విభేదాలు అతడిలోని నిష్పక్షపాతబుద్ధిని కుంటుపరిచాయి.

ఉన్నవీ లేనివీ దోషాలు ఎత్తిచూపడమే విమర్శ అని కొందరి ఊహ. దోషాలు మాత్రం పట్టేవాడు దోషజ్ఞుడైన పండితుడు కావచ్చునేమో కాని, విమర్శకుడు కాదు.

"సుకవుల సూక్తులందు సర
సుల్ నెరసుల్ వెదుకంగబోరు మ
క్షిక వితతుల్ వ్రణంబు cబరి
కించు గతి గొదవల్ గణించుటల్
కుకవుల నైజబుద్ధి"

అంటాడు కనుపర్తి అబ్బయామాత్యుడు. ఇక్కడ కుకవులంటే కువిమర్శకులు అని అనుకోవాలి.

ఎంత మంచి కృతి అయినా ఆరోచకుడికి రుచించదు. మంచివీ, చెడ్డవీ అన్నీ దాగున్నాయంటాడు. సతృణాభ్యవహారి. ఈసుపట్టి ఎంత మంచికావ్యంలో అయినా తప్పులు వెదుకుతాడు మత్సరి. పక్షపాతం లేకుండా, పాలూ నీళ్ళూ వేరు చేసే రాజహంసలాగ, కావ్య విమర్శ చేస్తాడు తత్వాభినివేశి.

కువిమర్శ వొక్కక్కప్పుడు దారుణ పరిణామాలకు దారితీస్తుంది.

"రచయిత గుణాలు మనస్సుకి పట్టించుకుని, వాటి వివరాలు పాఠకుడి ముందు పెట్టేవాడే విమర్శకుడు" అన్నాడు వాల్టర్ పేటరు.

యయావరీయుడు విమర్శకులను ఆరోచకి, సతృణాభ్యవహారి, మత్సరి, తత్వాభినివేశి అని నాలుగు రకాలుగా విభజించాడు.

ఎంత మంచి కృతి అయినా ఆరోచకుడికి రుచించదు. మంచివీ, చెడ్డవీ అన్నీ దాగున్నాయంటాడు. సతృణాభ్యవహారి. ఈసుపట్టి ఎంత మంచికావ్యంలో అయినా తప్పులు వెదుకుతాడు మత్సరి. పక్షపాతం లేకుండా, పాలూ నీళ్ళూ వేరు చేసే రాజహంసలాగ, కావ్య విమర్శ చేస్తాడు తత్వాభినివేశి.

ఈ నలుగురిలో చివరివాడే ఉత్తమ విమర్శకుడు. అతడే కావ్య శ్రమ గుర్తించగలుగుతాడు. సహజంగా అలాంటి విమర్శకుడు లభించడం దుర్లభమన్నారు విజ్ఞులు.

శ్లో॥ శబ్దానాం వివినక్తి గుంఫనవిధీ నామోదతే సూక్తిభి,
స్సాంద్రం వేఢి రసామృతం విచియుతే తాత్పర్యముద్రాంచయః
పుణ్యై స్సంఘటితే వివేక్తృవిరహా దంతిర్ముఖం తామ్యతాం,
కేషామేవ కదాచిదేవ సుధియాం కావ్యశ్రమజ్ఞో జనః

తమ కావ్యాలు చక్కగా విమర్శ చేయగల సరసుడు లేడే అని విచారించే కవులలో ఎవరికో కొందరికే, ఎప్పుడో ఒకప్పుడే కావ్యపరిశ్రమ తెలిసిన విమర్శకుడు లభిస్తాడు. అలాటి విమర్శకుడే శబ్దార్థాలు చక్కగా వివేచించగలుగుతాడు. శబ్దాల కూర్పును ప్రశంసిస్తాడు. రసామృతం జుర్రగలుగుతాడు. తాత్పర్యం వివరిస్తాడు. (కావ్య మీమాంస. పం.ఆ)

మంచి విమర్శకుడికి ముఖ్యమైన గుణాలు మూడు వుండాలంటాడు రిచర్డ్సు.

The Qualifications of a good critic are three, he must be an adept at experiencing, without eccentricities, the states of mind revelant to the work of art he is judging. Secondly, he mustbe able to distinguish experiences from one another as regards their less superficial features. Thirdly, he must be a sound judge of values.

- Principles of Literary Criticism.

"విమర్శకుడు కృతి విలువను ఖరీదు కట్టే షరాబు" అంటాడతడు.

"సాహత్య స్రష్ట అడివి శుభ్రపరిచి బాటవేస్తాడు; దానిని పరిరక్షించే నిరీక్షకుడు విమర్శకుడు" అంటాడు స్కాటు జేమ్సు.

సాహిత్యం సముద్రమయితే, మునిగి ముత్యాలు తీసే జాలరి విమర్శకుడు.

"విమర్శ వల్ల సాహిత్యంలో అభిరుచులు సువ్యక్తమవుతాయి" అన్నాడు T.S. Eliot.

సాహిత్యం వజ్రమైతే సానపట్టి పలకలు తీర్చేది విమర్శ.

విమర్శ సాధారణంగా Speculative, Inductive, Judicial, Subjective అని నాలుగు రకాలుగా విభజన చేశారు కొందరు.

ఆధునిక విమర్శ మాత్రం అనంతమైన సిద్ధాంతాలను ఆకళించుకుంటున్నది.

అప్పుడప్పుడు ఒక కవి కృతులు ఒక విమర్శకుడు ఉత్కృష్టమైనవని విమర్శిస్తే వాటినే మరో విమర్శకుడు నికృష్టమైనవని నిరూపించడమూ కద్దు. వెనుక ఇంగ్లండ్ విమర్శకులు షేక్స్పియర్ నాటకాలు ఉత్కృష్టమైనవంటే, ఫ్రాంసులోని విమర్శకులు అవే నాటకాలు అధమమైనవనీ - అసభ్యమైనవనీ, నికృష్టమైనవనీ విమర్శించారు. మిల్టను రాసిన 'పారడైజ్ లాస్ట్' సర్వోత్కృష్ట కావ్యమనీ, ఒకరంటే అంత నికృష్టకావ్యం మరొకటి లేదని మరొకరన్నారు. దిఙ్నాగాచార్యుడు కాళిదాసు కావ్యాలు కాదంటే మల్లినాథుడు 'సంజీవని' స్పర్శతో బ్రతికించాడు. ఎంకిపాటలు ఎంతో గొప్ప కవిత్వమని పంచాగ్నుల ప్రభృతులంటే, "అబ్బే, అది కవిత్వమే కాదు పొమ్మన్నాడు బసవరాజు. బూతులతో వెక్కిరించాడు దుగ్గిరాల.

పాశ్చాత్య సాహిత్యంలో సంసర్గం కలుగకముందు, బహు పురాతనకాలం నుంచీ మన దేశంలో కావ్య శాస్త్రాలకు కొదువలేదు. కావ్య విమర్శకు అవే కొలకర్రలప్పుడు.

ప్లేటో కొంత సాహిత్య విమర్శ చేశాడు. సాహిత్యం బుద్ధికి సంబంధించింది కాదన్నాడతడు. అది భావావేశానికి సంబంధించిందన్నారు. బుద్ధి ప్రేరణ వల్ల కాక భావావేశం వల్ల కవులు కావ్య రచన చేస్తారనీ, కనుక కావ్యానందం బౌద్ధికం కాదని ప్లేటో సిద్ధాంతం, కాగా, సాహిత్యం సత్యదూరమైందనీ, నైతిక దూరమైందనీ - అంచేత ఆదర్శ రాజ్యానికి అది పనికి రాదనీ అతడి వాదన.

సంస్కృత వ్యాకరణ శాస్త్రం పురాతనమైనది. నిరుక్తం, ప్రాతిశాఖ్యం, నిఘంటువులూ కూడా ఈ సందర్భంలో విస్మరింపరానివి. యాస్కుడు అయిదారు రకాల ఉపమాలంకారాలు వివరించాడు. పాణిని వాటినే పర్యాలోచించాడు. కావ్యాయనుడు పాణిని ననుసరించాడు. పతంజలి తన మహాభాష్యంలో పాణిని సూత్రాలు కొన్ని పరామర్శించాడు. తరువాతి వారు వాటినే ఆధారం చేసుకున్నారు.

భరతుడి నాట్యశాస్త్రానికి ముందు కావ్యశాస్త్రమెంతయినా వుండేదని పండితులంగీకరించిన సత్యం. భరతుడి రస సిద్ధాంతం పురస్కరించుకుని లోల్లటుడు, శంకుకుడు, భట్టనాయకుడు, అభినవగుప్తుడు తమ తమ వాదాలు వ్యాఖ్యానించారు. క్రమంగా రస సంప్రదాయం, అలంకార సంప్రదాయం, వక్రోక్తి సంప్రదాయం, రీతి సంప్రదాయం, ధ్వని సంప్రదాయం మొదలైనవి శాస్త్ర రూపంలోనే ఆవిర్భవించాయి.

భారతీయ సాహిత్య శాస్త్ర సిద్ధాంతం ప్రకారం శబ్దం, అర్థం, రసం - ఈ మూడింటితోనే కావ్యం పరిశీలించాలి.

భామహుడి కావ్యాలంకారం. దండి కావ్యాదర్శం, మమ్మటుడి కావ్యప్రకాశం, ఆనందవర్ధనుడి ధ్వన్యాలోకం, విశ్వనాథుడి సాహిత్య దర్పణం, రాజశేఖరుడి కావ్య మీమాంస, క్షేమేంద్రుడి ఔచిత్య విచారం, ఉద్భటుడి అలంకార సంగ్రహం, రుద్రటుడి కావ్యాలంకారం సుప్రసిద్ధమైనవి.

తెలుగులో వీటినే అనుకరించడమో, అనువదించడమో, అనుసరించడమో జరిగింది. పాశ్చాత్య సిద్ధాంతాలతో పరిచయం లభించే వరకు.

పాశ్చాత్య సాహిత్యంలో క్రీస్తుకు పూర్వమే సాహిత్య విమర్శ అవుపిస్తుంది.

అరిస్టోఫెన్సు, సోక్రటీస్, ప్లేటో - ఈ ముగ్గురి అవతరణతో గ్రీకు సాహిత్యంలో విమర్శకు అంకురార్పణ జరిగింది.

ప్లేటో కొంత సాహిత్య విమర్శ చేశాడు. సాహిత్యం బుద్ధికి సంబంధించింది కాదన్నాడతడు. అది భావావేశానికి సంబంధించిందన్నారు. బుద్ధి ప్రేరణ వల్ల కాక భావావేశం వల్ల కవులు కావ్య రచన చేస్తారనీ, కనుక కావ్యానందం బౌద్ధికం కాదని ప్లేటో సిద్ధాంతం, కాగా, సాహిత్యం సత్యదూరమైందనీ, నైతిక దూరమైందనీ - అంచేత ఆదర్శ రాజ్యానికి అది పనికి రాదనీ అతడి వాదన.

అంతకుముందే - హోమరు నించి ప్లేటో వరకు - ఆ మధ్యకాలంలో హేషియడ్, సోలోన్, సిమోనయిడ్, పిండార్ మొదలైనవారు రకరకాల కావ్య సిద్ధాంతాలు ప్రతిపాదించారు. అయినా విమర్శకుడిగా మొదటివాడు ప్లేటో మాత్రమే గణింపదగినవాడు.

ప్లేటో నాటికి గ్రీకు సాహిత్యంలో స్వర్ణయుగం గడిచిపోయింది.

ప్లేటో తరువాత అతడి శిష్యుడు అరిస్టాటిల్ అప్పటికుండిన సాహిత్యం అవలోకనం చేసి, సుప్రసిద్ధ కవుల కావ్యాలు పురస్కరించుకుని 'పొయెటిక్సు' (Poetics) రాశాడు. ప్లేటో సిద్ధాంతాలు చర్చించాడు. తనకి తోచిన వాటిని సరసంగా సవరించాడు. అరిస్టాటిల్‌ను విమర్శ కపిత అన్నారు. తరువాత వారికి అతడి 'పొయెటిక్స్' ఆదర్శమయింది. తుదకి నిబంధన గ్రంథంగా తయారయింది. దాని ప్రభావం వల్ల రాను రాను సాహిత్యంలో అంతఃసౌందర్యానికి కాక, బాహ్య స్వరూపానికే ప్రాధాన్యం హెచ్చింది.

అలంకారాది శాస్త్రాలకు మన మధ్యకాలపు కవుల మల్లెనే వెనక పాశ్చాత్య కవులు బానిసలయ్యారు. విమర్శకులున్నూ అదే దారిని నడిచారు. నిబంధనలతోనే సాహిత్యాన్ని కొలిచారు. కట్టుబాట్ల పట్టాలు తప్పిన వాటిని త్రోసిరాజన్నారు.

క్రీస్తు తొలి శతాబ్ది ప్రాంతాన పడమటి సాహిత్యం విమర్శల ఇరుకుల్లో పడి నడిచింది. అదే సమయంలో గ్రీకు దేశం రోమనుల క్రింద పరాధీనమయింది. ప్రాచీన గ్రీకు సాహిత్యం అనాదృతమున్నూ అయింది.

అప్పుడే డయోనిఅస్. హెలీ కాన్సిస్, ప్లూటార్క్ లుసియన్, లాంగినస్ వంటి విమర్శకులు బయలుదేరారు. లాంగినస్ వీరిలో సుప్రసిద్ధుడు. సదా సాహిత్యాభ్యాసం చేసే సహృదయుడే సరైన విమర్శకుడు' అన్నాడు లాంగినస్. అతడి సిద్ధాంతాలు ప్లేటో, అరిస్టాటిల్‌ల సిద్ధాంతలకు కేవలం విరుద్ధమైనవి కావు. స్వతంత్ర పద్ధతిలో అవి పూర్వ సంప్రదాయాలకు నిర్వచన ప్రాయాలని చెప్పవచ్చు.

అనంతరం క్రీ.శ. 13 శతాబ్ది దాకా పాశ్చాత్య సాహిత్య విమర్శలో చెప్పుకోదగ్గ గొప్ప విషయం ఏదీ లేదు. డాంటే వరకు కావ్యాలకు నియమాలు గుదిబండలయి దిగలాగాయి. విమర్శకులకూ అదే అవస్థ అనివార్యమైంది.

కాల్పనిక యుగంలో తొలకరిగా చెప్పదగినవాడు విలియం బ్లేకు. 'బుద్ధితో పుట్టేది కావ్యం కాదనీ, కావ్యానికి అలౌకికమైన ప్రేరణం కావాలనీ, కట్టుబాట్లలో కవిత్వం కనబడదనీ' బ్లేకు వాదం. సనాతనంగా వస్తూన్న సిద్ధాంతాలకు బ్లేకు సిద్ధాంతం గొడ్డలి పెట్టయింది. దాంతో అభ్యాసం వల్ల కాక కళాసృష్టి రహస్యానుభూతి మూలంగా కలుగుతుందన్న భావం బలపడింది.

కట్టుబాట్లలో కవిత్వం నిర్వీర్యమవుతుంది, నిర్జీవమవుతుంది.

16-18 శతాబ్దాల మధ్య ఈ నిబంధనబంధనాల్లోంచి బయటపడటానికే పాశ్చాత్య సాహిత్యం పెనుగులాడింది.

పదహారో శతాబ్ది తుది వరకు ఆంగ్ల సాహిత్యంలో విమర్శ తలెత్తలేదు. ఆ కాలంలో పుట్టినవి ఇంచుమించు అనుకరణాలు.

1553లో థామస్ విల్సన్ 'ఆర్ట్ ఆఫ& రెహ్టోరిక్' రాశాడు. అందులో కవుల గురించీ, పాఠకుల గురించీ కొంత చర్చించాడు.

1570లో రోజర్ ఏశ్చమ్ తన 'స్కూల్ మాస్టర్'లో కొంత విమర్శ రాశాడు.

1579లో స్టివ్‌గాసన్ 'ది స్కూల్ ఆఫ్ అబ్యూజ్' అని వొక విమర్శ గ్రంథం రాశాడు. 'కవిత్వం అబద్దాల పుట్ట' అన్నాడతడు. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి కూడా వొక సందర్భంలో 'కవిత యవ మృష...' అన్నారు.

16వ శతాబ్ది తుదిని ఇంగ్లండ్‌లో ఫిలిప్పు సిడ్నీ జన్మించాడు. సంఘంలో కవిత్వానికి గౌరవస్థానం లేని దినాలవి అక్కడ.

"ఏన్ అపాలజీ ఫర్ పొయెట్రీ" అని విమర్శ గ్రంథం ప్రకటించాడు సిడ్నీ. ఇటలీ విమర్శకుల ప్రభావం ఇతడి మీద బాగా పడింది.

'కవిని రోమనుల 'ద్రష్ట' అంటారనీ, గ్రీకులు 'స్రష్ట' అంటారనీ రాశాడు. సిడ్నీ, కవిత్వం నిరసింపరానిదని' అతడు నిరూపించాడు. 'కావ్యం జ్ఞానానికి తల్లి' అన్నాడు. 'సభ్య జగత్తుకి ప్రథమ జ్ఞానకిరణం కవిత వల్లనే లభ్యమయిందని' అతడు వాదించాడు. వివిధ కోణాల్లోంచి విమర్శించి తన సిద్ధాంతం ప్రతిపాదించాడు. అరిస్టాటిల్ సిద్ధాంతాలకు సిడ్నీ సిద్దాంతాలు నూతనోజ్జీవనం కలిగించాయి. అలంకారశాస్త్రాలూ, ఛంద్రశ్శాస్త్రాలూ మాత్రమే కవిత్వం కల్పించలేవన్నాడతడు. 'పొడవాటి గౌను వేసుకున్నంత మాత్రాన ప్రతివాడూ న్యాయవాది కాదు; అలాగే కేవలం ఛందస్సు తెలిసినంత మాత్రాన ఎవరూ కవి అయిపోడు' అన్నాడు.

సిడ్నీ విమర్శ తన 'ఆర్కేడియా' గ్రంథానికే వ్యతిరేకంగా వుండటం గమనించదగిన విషయం. రేఫ ద్విరేఫల నిబంధన చేసిన అప్ప కవి తన నియమం తానే ఉల్లంఘించాడు మరి :

మన యక్షగానాలూ, వీధి నాటకాలూ, తోలుబొమ్మలాటలూ మొదలైన వాటిల్లో లాగ, ఆనాడు పాశ్చాత్య నాటకాల్లో అసభ్య హాస్యం ప్రదర్శించేవారు. దానిని సిడ్నీ తీవ్రంగా విమర్శించాడు.

సిడ్నీతో చెప్పదగినవాడు బెన్ జాన్సన్. గ్రీకు, లాటిన్ భాషలలో గొప్ప పండితుడు. 'ఆంగ్ల విమర్శకులలో బెన్‌జాన్సన్ ప్రథమాచార్యుడు" అన్నాడు జార్జి సెంట్సుబరీ.

అప్పటికే సాహిత్యంలో పాత సిద్దాంతాలంటే అసహ్యం వ్యాపించింది రసిక లోకంలో. సాహిత్యానికి ప్రతిభ ప్రధానమని, ప్రతిభ లేకపోవడం కంటే ప్రతిభను ప్రతిఘటించడం ప్రమాదకరమనీ వాదించాడు బెన్ జాన్సన్. ప్రయత్నంలో ప్రతిభ ప్రతిష్ఠించవచ్చని అతడి సిద్ధాంతం.

బెన్ జాన్సన్ క్లాసిక్ వాదాన్ని అతిక్రమించి ముందడుగు వేసిన విమర్శకుడు డ్రయిడెన్. ఇతడు 'ఎస్సే ఆన్ డ్రమెటిక్ పోయెసీ'లో నలుగురు వక్తల చేత సంభాషణ సాగించాడు. పానుగంటి 'విమర్శాదర్శ విమర్శాదర్శము', విశ్వనాథ హేతువాద యుగము' ఇలా సంభాషణ రూపక విమర్శ రచనలే.

డ్రయడను "కల్పించిన నలుగురు వక్తలలో 'క్రిస్టో ప్రాచీన కవుల్ని సమర్థిస్తాడు. 'యూజీన్' ఎలిజబెత్ రాణి కాలం కావ్యాల్ని - ముఖ్యంగా నాటకాల్ని సమర్థిస్తాడు. 'లెసిడియస్' ఫ్రెంచి నాటకాలు మంచివంటాడు. 'నియందరు' ఇంగ్లీషు నాటకాలు గొప్పవని వాదిస్తాడు. స్వయంగా డ్రయిడను నియందరు పాత్ర ధరిస్తాడు. సాహిత్యంలోని వివిధ మతాలు విపులంగా విమర్శించాడు డ్రయిడన్. నియమాలూ, నిబంధనలూ నిరసించాడు. సంఘం మారినట్టే సాహిత్యమూ మారుతుందన్న సత్యం ప్రతిపాదించాడు.

డ్రయిడన్ సిద్ధాంతాలు మరింత ముందుకి తీసుకుపోయాడు ఫ్రెంచి విమర్శకుడు టేన్.

కాల్పనిక యుగంలో తొలకరిగా చెప్పదగినవాడు విలియం బ్లేకు. 'బుద్ధితో పుట్టేది కావ్యం కాదనీ, కావ్యానికి అలౌకికమైన ప్రేరణం కావాలనీ, కట్టుబాట్లలో కవిత్వం

ఈనాడు మన భారతీయ సాహిత్యాలన్నిటిలోనూ విమర్శకు పాశ్చాత్య పద్ధతులే ప్రమాణంగా వున్నాయి. అందుకనే స్థాలీపులాక న్యాయంగా, బహు క్లుప్తంగా దానిని ఈ మాత్రం తడపడం జరిగిందిక్కడ.

తెలుగులో సాహిత్య విమర్శ లేదన్న వారికి లేదు, ఉందన్న వారికుంది. ఉన్నదయినా ఉండవలసినంత లేదు. వుండవలసినట్టున్నూ లేదేమో అంతగా.

'విమర్శించదగిన సాహిత్యం కూడా అంతగా లేదేమో?' అన్నారొకరు ఈ మధ్య. ఇది సాహసం.

కనబడదనీ' బ్లేకు వాదం. సనాతనంగా వస్తున్న సిద్ధాంతాలకు బ్లేకు సిద్ధాంతం గొడ్డలి పెట్టయింది. దాంతో అభ్యాసం వల్ల కాక కళాసృష్టి రహస్యానుభూతి మూలంగా కలుగుతుందన్న భావం బలపడింది.

"కావ్యానికి ఆధారం దివ్యశక్తి" అని బ్లేకు అంటే దానినే భావావేశం అన్నాడు వర్డ్సువర్తు. సుభోధకమైన భాషా, సరళమైన శైలీ కావ్యానికి కావాలన్నాడతడు. నిరలంకారమైన శైలి మంచిదన్నాడు. వాడుక భాషే సహజమైందనీ వాదించాడు.

కావ్యానికి కల్పనాశక్తి కావాలన్నాడు షెల్లీ. కష్టపడి కట్టింది కవిత కాదన్నాడు. సహం మనస్సులోంచి దూసుకువచ్చిన కవిత వల్లనే హృదయం స్పందిస్తుందని అతడి సిద్ధాంతం.

తన విమర్శలతో కాల్పనిక సాహిత్యానికి పటిష్టం కల్పించినవాడు కోల్రిడ్జి. అనుభూతి, సరళత్వమూ, నిజాయితీ లేనివాడు కవే కాదన్నాడతడు. హృదయమూ, మస్తిష్కమూ రెండూ సాహిత్యానికి అవసరమన్నాడు. కేవలం భావావేశం కవిత్వానికి చాలదనీ, అలాగే వొట్టి పాండిత్యము మాత్రమే పనికిరాదనీ అతడి సిద్ధాంతం. అంచేత ఆ రెంటి సమ్మేళనం కృతి కర్తకి అవసరమన్నాడు.

విక్టోరియా రాణి యుగం ఆరంభంలో ఆంగ్ల సారస్వత విమర్శ మందకొడిగా వుండేది. అయితే మాత్యూ ఆర్నాల్డు, జాన్ రస్కిన్ వంటి విమర్శకులు ఆవిర్భవించడంతో విమర్శ ఉత్తమ స్థాయినందుకుంది. అర్నాల్డు స్వయంగా గ్రంథ విమర్శ చేయడమే కాదు, ఎలా విమర్శ చేయాలో ఇతరులకున్నూ నేర్పేవాడు. పాత సిద్ధాంతాల పునాదుల మీదే కొత్త సిద్ధాంతాలు ప్రతిష్టించాడు ఆర్నాల్డు.

ఇరవయ్యో శతాబ్ది నడిమిని జార్జి సెంట్సుబరీ, అలివర్ ఎల్టన్, వాల్టర్ రేలే, టి.ఇ. హుల్మ్ మొదలైన విమర్శకులు గోచరిస్తారు. హుల్మ్ మంచి వ్యుత్పన్నుడు. వెనకటి కావ్య సిద్ధాంతాలను గట్టిగా ఎదిరించాడితడు. కావ్యానికి కట్టుబాట్లు కూడదన్నాడు, ఫ్రీవెర్సు ప్రోత్సహించాడు.

హుల్మ్ సిద్ధాంతాలు టి.ఎస్. ఇలియట్, ఎజ్రాపౌండు మొదలైన నవ్యులను ఆకర్షించాయి.

ఈ కాలంలో Symbolism, Imagism మొదలైన వాటితో పాటు సిగ్మండ్ ఫ్రాయిడ్ మనోవైజ్ఞానిక సిద్ధాంతాలు సాహిత్య రంగంలోనూ కల్లోలం కలిగించాయి. కావ్య కళ కల వంటిదని నిరూపించాడు ఫ్రాయిడ్. అతడి ప్రభావం వల్ల కామవాసన గురించీ, అజ్ఞాత మనస్తత్వం గురించీ పెర్వర్షను గురించీ బోలెడంత సారస్వతం బయలుదేరింది. దానివల్ల మంచికంటే చెడ్డ అధికమయిందన్నారు విమర్శకులు కొందరు.

మహాయుద్ధం కారణంగా ప్రబలిన అశాంతి ఫలితంగా ఫ్రాన్సులో పుట్టిన డాడాయిజమ్ విధ్వంసకవాదం లోంచి అధివాస్తవిక వాదం (Sur-realism) సాహిత్యంలో ప్రవేశించింది. ఇతర కళలలోనూ చోటుచేసుకుంది – 1930లో వెలువడిన రెండు ప్రకటన పత్రాలలోనూ, 1936లో లండన్‌లో జరిగిన ప్రదర్శనలోనూ దీని పరిపూర్ణ స్వరూపం దర్శనమిచ్చింది. అంద్రేబ్రెతా, పాల్ ఎల్‌వార్డులు దీని ప్రవర్తలు. అంద్రేబ్రెతాం విమర్శకులు ఈ ఉద్యమానికి వెన్నెముకగా పనిచేశాయి.

మార్క్సు వాస్తవికవాదం సాహిత్యంలో విస్తృతం చేసిన విమర్శకుడు కాడ్‌వెల్. ఆయా యుగాలలో ఆయా అవకాశాల ననుసరించి కావ్య సృష్టి జరుగుతుందని నిరూపించాడతడు. పూర్వ ప్రస్తరయుగం, ఉత్తర ప్రస్తరయుగం, సామ్రాట్టుల యుగం, సామంతులయుగం, ధనికుల యుగం, సామ్యవాదయుగం అని సాహిత్య యుగాలు విభజించి విమర్శించాడు.

ఇలియట్, రిచర్డ్సుల విమర్శలతో విమర్శనా సాహిత్య చరిత్రలో కొత్త పుట తెరవబడింది. ఇలియట్ ఎంత ఆధునిక కవో అంత ఆధునిక విమర్శకుడు. అతడి Sacred wood రిచర్డ్సు రాసిన 'ఫౌండేషన్ ఆఫ్ క్రిటిసిజమ్', 'మీనింగ్ ఆఫ్ మీనింగ్', 'ప్రిన్సిపల్స్ ఆఫ్ లిటరరీ క్రిటిసిజమ్', 'పొయిటికల్ క్రిటిసిజమ్' విమర్శలో విప్లవం సృష్టించాయి. ఇలియట్‌తో పాటు డి.హెచ్. లారెన్స్ కూడా చెప్పదగినవాడు. ఈ ఇద్దరి రచనల ప్రభావం ప్రపంచమంతటా ఆధునిక రచయితల మీద కనిపిస్తుంది.

పాశ్చాత్య సాహిత్యాలతో గాని, తుదకు హిందీ వంటి ఇరుగు పొరుగు సాహిత్యాలతో గాని సరిపోల్చి చూసినప్పుడు విమర్శ విషయంలో మనము తలవంచుకోవలసే వస్తున్నది. సాహిత్యం గురించి ఎంతో కొంత విమర్శ వుండినా విమర్శ గురించిన విమర్శ బొత్తిగా మనకు లేదు. వందేళ్ళ పురాతన పత్రికలను గాలించినప్పుడు ఈ లోపం నిజంగా దిగ్భ్రాంతపరిచింది.

ఈ సందర్భంలోనే ముర్రే, స్పిన్‌గార్న్, గ్రేవ్, రైడింగ్, ఏంప్సన్, రష్యాలో ఏంటోకోలస్కీ, చుకోవస్కీ, పాస్టర్‌నాక్ మొదలైనవారినీ విస్మరింపరాదు.

ఈనాడు మన భారతీయ సాహిత్యాలన్నిటిలోనూ విమర్శకు పాశ్చాత్య పద్ధతులే ప్రమాణంగా వున్నాయి. అందుకనే స్థాలీపులాక న్యాయంగా, బహు క్లుప్తంగా దానిని ఈ మాత్రం తడపడం జరిగిందిక్కడ.

తెలుగులో సాహిత్య విమర్శ లేదన్న వారికి లేదు, ఉందన్న వారికుంది. ఉన్నదయినా ఉండవలసినంత లేదు. వుండవలసినట్టున్నూ లేదేమో అంతగా.

'విమర్శించదగిన సాహిత్యం కూడా అంతగా లేదేమో?' అన్నారొకరు ఈ మధ్య. ఇది సాహసం.

నన్నయ్య నాటికే దేశంలో 'విద్యా విలాస గోష్ఠులు' జరుగుతూ వుండేవి కదా, అయినప్పుడు ఈ గోష్ఠులలో జరిగేది సాహిత్య విమర్శ కాక మరేమిటి? అయితే అవి సంస్కృతంలో లాక్షణిక గ్రంథాలుననుసరించి జరిగి వుంటాయి అనడంలో సందేహం లేదు. అంతకు ముందుండిన దేశి సాహిత్యం వెన్నెల పాటలు, గొబ్బి పాటలు, తుమ్మెద పదాలు మొదలైనవి అంతరించడానికి అదే కారణం కావచ్చు. తెలుగుకి ప్రత్యేకమైన లక్షణ గ్రంథాలు అప్పటికి లేవు, లేవేమో. అందుకని సంస్కృత నిబంధన గ్రంథాలే అధారమయ్యాయి. మార్గ సాహిత్యం వెల్లువలా వచ్చి దేశి సాహిత్యాన్ని ముంచుకుపోయింది. కనుక సంస్కృత లక్షణ గ్రంథాలే అనుకరించడమూ, క్రమంగా అనువదించడమూ, అనుసరించడమూ జరిగింది.

తెలుగుకి లక్షణం మొదట సంస్కృతంలో చెప్పడం జరిగింది. చిత్రమే అయినా అది తెలుగు వారికోసమో, తెలుగు రాని సంస్కృత పండితుల కోసమో అన్నది వివేచించదగిన విషయం.

నన్నయ్య నుంచీ మనవారి అవతారికలలోనూ, 'కందం చెప్పినవాడే కవి', 'వింటే భారతమే వినాలి', 'అల్లసాని పెద్దన్న అల్లిక జిగిబిగి', 'ముక్కు తిమ్మనార్యు ముద్దు పలుకు', 'కవికీ కంసాలికీ సీసం తేలిక' వంటి పలుకుబళ్ళలోనూ, పెద్దన ఉత్పలమాలిక వంటి పద్యాలలోనూ, వ్యాఖ్యానాలలోనూ, తుదకి నిబంధన గ్రంథాలలోనూ, కుకవినిందల్లోనూ విమర్శ సూత్రప్రాయంగా తొంగిచూసినా – పడమటిగాలి సోకిన తరువాత గాని, ఈనాడు మనమనుకుంటూన్న పద్ధతిలో విమర్శ తెలుగులో లేదనే అంగీకరించాలి.

ఒక శతాబ్దం నుంచీ పత్రికలు మన సాహిత్యంలో విమర్శకు దోహదం కల్పించాయి. ఉద్దండులైన సాహిత్యవేత్తలు విమర్శకు నడుము కట్టారు. కడుతున్నారు. విమర్శనాత్మకమైన వ్యాసాలే కాదు గ్రంథాలు కూడా లేవనకుండా కొన్ని ప్రకటించారు, ప్రకటిస్తున్నారు.

వఝ్ఝల చినసీతారామశాస్త్రిగారి 'వసుచరిత్ర విమర్శ', కట్టమంచి రామలింగారెడ్డిగారి 'కవిత్వ తత్త్వ విచారము', పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారి 'మహాభారత చరిత్రము', కోరాడ రామకృష్ణయ్యగారి 'ఆంధ్ర భారత కవితా విమర్శనము', గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారి 'నన్నయ్య భట్టారక విజ్ఞాన నిరతి', దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి 'సాహిత్య సమీక్ష', గిడుగు వెంకట రామమూర్తిగారి 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజము', పింగళి లక్ష్మీకాంతముగారి 'సాహిత్య శిల్ప సమీక్ష మొదలైనవి వెలువడ్డాయి, వెలువడుతున్నాయి.

ఉత్తమ విమర్శ గ్రంథాలకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమానాలు ప్రధానం చేస్తున్నది.

అయినా పాశ్చాత్య సాహిత్యాలతో గాని, తుదకు హిందీ వంటి ఇరుగు పొరుగు సాహిత్యాలతో గాని సరిపోల్చి చూసినప్పుడు విమర్శ విషయంలో మనము తలవంచుకోవలసే వస్తున్నది. సాహిత్యం గురించి ఎంతో కొంత విమర్శ వుండినా విమర్శ గురించిన విమర్శ బొత్తిగా మనకు లేదు. వందేళ్ళ పురాతన పత్రికలను గాలించినప్పుడు ఈ లోపం నిజంగా దిగ్భ్రాంతపరిచింది.

ప్లేటో... 'రిపబ్లిక్', అరిస్టాటిల్ 'పొయెటిక్సు' తెలుగులోకి వచ్చాయి. ప్రాంతీయ భాషల నుంచి 'కాళిదాస భవభూతులు' వంటివి ఏ వొకటో రెండో అనువాదమయ్యాయి. ఇలా అయినా ఉత్తమ విమర్శ గ్రంథాలు పాశ్చాత్య భాషల నుంచీ, ప్రాంతీయ భాషల నుంచీ తెలుగులో అనువాదం జరగడం అవసరం. ఈ పని సాహిత్య అకాడమీ వంటి ప్రామాణిక సంస్థ నిర్వహించడమున్నూ అవసరం. •

సాహితీ స్రవంతి 'ప్రస్థానం' ప్రత్యేక సంచికకు శుభాకాంక్షలతో...

# గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు లిమిటెడ్, తెనాలి




పరిపాలనా కార్యాలయము, గుంటూరు

సెంట్రల్ ఆఫీస్
బోస్ రోడ్, తెనాలి
ఫోన్ : 229402, 229403
ఫ్యాక్స్ : 08644 - 229403

అడ్మినిస్ట్రేటివ్ ఆఫీస్
2/12 బ్రాడీపేట, గుంటూరు
ఫోన్ : 2355460, 2325834
ఫ్యాక్స్ : 0863 - 2232408

## మా విశిష్టతలు

- డిపాజిట్లపై అన్ని ఇతర బ్యాంకుల కన్నా అధిక వడ్డీ పూర్తి భద్రత, నామినేషన్ సదుపాయం
- దేశంలోని ఏ పట్టణానికైనా డి.డి. సౌకర్యం
- బంగారు నగల హామీపై అతి తక్కువ వడ్డీకే గరిష్ట ఋణ సౌకర్యం
- రైతుల అభ్యున్నతిపై అనేక రకాల ఋణ సదుపాయాలు
- వ్యాపారులకు, ఔత్సాహిక పారిశ్రామికవేత్తలకు ఋణ సౌకర్యం

**నేడే మీ సమీప బ్రాంచిని సందర్శించండి**

నల్లపాటి శివరామ చంద్రశేఖరరావు, ఛైర్మన్

బి. విశ్వనాథం, సి.ఇ.ఓ.

సాహితీ స్రవంతి 'ప్రస్థానం' ప్రత్యేక సంచికకు శుభాకాంక్షలతో...




# THE GUNTUR CO-OPERATIVE URBAN BANK LTD

*(Regd. Under A.P. Mutually Aided Co-op, Societies Act. 1995)*
*Head Office : 3/2, Brodipet, Guntur-2. Ph : 2230737, 2354847*

*RBI Licence No : 431 UBD*

అన్ని రకముల డిపాజిట్లు *DICGC Mumbai (RBI)* వారిచే *Insurance* చేయబడును

## మేము అందించే సౌకర్యములు

- బంగారు నగల హామీపై తక్కువ వడ్డీకి రుణ సౌకర్యం మరియు ఓవర్‌డ్రాఫ్ట్ సౌకర్యము కలదు.
- ఇంటి రిపేర్లు మరియు ఆర్థిక అవసరాల నిమిత్తం ఇంటి తనఖాపై ఋణ సౌకర్యము కలదు.
- వ్యాపారస్తులకు వ్యాపార అభివృద్ధి నిమిత్తం స్థిరాస్తి తనఖాపై ఓవర్‌డ్రాఫ్ట్ సౌకర్యము కలదు.
- తక్కువ కమిషన్‌పై డి.డి. మరియు పే ఆర్డర్ సౌకర్యము కలదు.
- ద్విచక్ర వాహనము కొనుగోలుపై తక్కువ వడ్డీకే ఋణసౌకర్యం కలదు.
- తక్కువ అద్దెకే 'లాకరు సౌకర్యము' కలదు.
- కొద్దిపాటి మొత్తంతోనే ఎస్‌బి / కరెంట్ అకౌంట్ ఓపెనింగ్ సౌకర్యము కలదు.
- ప్రతి నెల / 3 నెలలకి ఒకసారి డిపాజిట్లపై వడ్డీ సౌకర్యం కలదు.
- రికరింగ్ డిపాజిట్ సౌకర్యం కలదు.

టి. లక్ష్మీనారాయణ, చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్

కొత్తమాసు శ్రీనివాసరావు, ఛైర్మన్



# కథల వెంటే మనం...?

మల్లాది రామకృష్ణశాస్త్రి

(16.06.1905 - 12.09.1965)

ప్రఖ్యాత కథకుడు, కవి, సినీ రచయిత.

నా చిన్నప్పుడంటే పక్కింటి కళ్ళుపోయిన మామ్మ, పొగడపూలు, వాళ్ళమ్మ తల్లో పెట్టుకున్న మల్లెపూలు, అందరిళ్ళ మీద చందమామ ఉన్నాయి. కథలు చెప్పాయి.

ఇప్పుడంటే పక్కింటి, పక్కింట్లో మామ్మ ఉంది. కాని కళ్ళు బోలెడుగా పోతాయట ఎప్పుడో. అందుకోసమని కళ్ళజోడు కొనిపెట్టాడుట డాక్టరు. కళ్ళ జోడెట్టుకుంటే కళ్ళే చక్కగా పోతాయట పోతే కథలొస్తాయా? తెలీదు -

తెలీదు అని అనడం ఇన్నేళ్ళకు తెలిసింది - ఓనమాలొచ్చినాయి. ఎందుకు? నాకు తెలీదు అని రాసేందుకు - కాని కతకు ఒత్తు జేరడంతో ఆ మెత్తదనం పోయింది. కాని, వేదాంతం సోములోరు మాయ అంటే వేంకటప్ప దాన్నే పట్టుకుని జాయ అన్నాడు కనుక ఇది కథే.

సరే, అలాగే అనుకుందాం గాని నీవు శెనగలు తింటూ మాకు అనుములు చేతులో బెడతావా? ఇదే పెద్దమనిషి తరహా అంటారా? నాకు ఆ మాత్రం తెలియదుటండీ. పుణ్యం కొద్దీ పురుషుడు, అన్నారు. అనగనగా చిన్నప్పుడు ఓ రాజుకు ఇద్దరు భార్యలని ఇద్దరికీ రెండు మూళ్ళారు కొడుకులనీ, ఆ కొడుకులకి ఆరుమూళ్ళ పద్దెనిమిది చెల్లెళ్ళనీ, ఆ చెల్లెళ్ళకి రెండు పెట్టి భాగారిస్తే ఒక తొమ్మి తొమ్మిదీ, రెండు తొమ్మిదులా పజ్జెనిమిది, తొమ్మిది రథాలున్నాయని - ఇలా లెక్క ప్రకారం బోలెడు కథలు విన్నానని నీవే చెబుతావే మాకు. అలాటివి చెప్పవేం.

అనగనగా -

ఒక ఊళ్ళో మా యిల్లు ఉండేది. లంకంత యిల్లు -

ఆ ఇంట్లో రాచ్చేసులు, ఏరీ -

వాళ్ళు యింట్లో ఉండరు. ఎప్పుడూ దొడ్డినపడి, కాకుల్లా అల్లరి చేస్తుంటామని అమ్మ తిడుతుందా -

అమ్మకు బోలెడు పని. చెంబులూ తప్పాలాలూ, అమ్మకు అందకుండా పరుగెత్తుకుంటాయి. కొడితే సొట్ట పోతాయని అమ్మ వాళ్ళను కొట్టదు.

నన్నూ కొట్టదు. కొడితే, పటిక బెల్లం పెట్టాలిగా!

ఉహు, ఉహుఁ - అంటే పిప్పరమెంట్లూ బిసకోతులూ -

అన్నీ తింటే, అన్నం ఎందుకూ?

తినకపోతే, మామ్మ కత చెప్పదుగా -

మామ్మంటే, వాళ్ళ సుబ్బులు లేదూ, వాళ్ళ నాన్నే అమ్మా అని కేకలేస్తూంటాడే, ఆయన అమ్మ!

సుబ్బులూ వాళ్ళ మామ్మనే నాక్కూడా తాయిలం పెట్టింది.

వాళ్ళ దొడ్లోనే పొగడ చెట్టుంది. నూద్దగ్గిరే మల్లె చెట్టుంది. కనకాంబరాలు బోలెడు -

వాళ్ళు బీదవాళ్ళుట. అందుకనే వాళ్ళ దొడ్లో చెట్లుంటాయిట. మేం గొప్పవాళ్ళంగా మా దొడ్లో బోలెడు నాపరాళ్ళు. ఎండాకాలంలోనే అందరూ మా దొడ్లోనే వడియాలెట్టుకుంటారు.

అమ్మకి పాటలొచ్చు. కథలు రావు.

నీకు పాటలొచ్చా. రావేం? పాడతావా - ఓ - నాన్న కోప్పడదూ, నవ్వుతాడుగా, మరే, రాగి బిందెకే బంతిపూలు కట్టి, నెత్తి మీద పెట్టుకుని ఆ అబ్బి వస్తాడు చూడు! పాటలు పాడతాడు. నాన్న వాడికి కాం డబ్బిచ్చేస్తాడు. నేనే, బుల్లి చెంబే నెత్తి మీద పెట్టుకున్నా. అలాగే ఎగిరేశా. చెంబే ఛుంగ్‌మంది. నాన్న కానీవ్వలా - వేతవా అని కొట్టాడు. ఎందుకేమిటి? నాకు తెలీదు.

ఎందుకని? చిన్నప్పుడే - మరీ బుల్లప్పుడు - బళ్ళో కెళ్ళిందట. అక్కడ కథలు చెప్పరట. గచ్చకాయలు ఆడుకోమంటారుట. అలా - గదా అని, ఊఁ అరవాల్ట. అంచాత అమ్మకే కథలు రావు పాపం.

పాటలొచ్చున్నావుగా, వచ్చుగాని, నాక్కూడా వచ్చు గాని, నాన్నవింటే కోప్పడతాడు. మరే, నాన్నకే, పాటలు పాడితే కోపం. వాళ్ళ నాన్నక్కూడా కోపమే. మా యింటికి అందరూ పేరంటానికి వస్తే, మా నాన్నే బజారు వెళ్ళిపోతాడు.

ఎందుకూ, నాక్కారప్పూస తెచ్చి పెట్టేందుకా?

నాన్నకే కోపం, వాళ్ళు పాటలు పాడతారుగా - అందుకని.

నీకు పాటలొచ్చా. రావేం? పాడతావా - ఓ - నాన్న కోప్పడదూ, నవ్వుతాడుగా, మరే, రాగి బిందెకే బంతిపూలు కట్టి, నెత్తి మీద పెట్టుకుని ఆ అబ్బి వస్తాడు చూడు! పాటలు పాడతాడు. నాన్న వాడికి కాం డబ్బిచ్చేస్తాడు. నేనే, బుల్లి చెంబే నెత్తి మీద పెట్టుకున్నా. అలాగే ఎగిరేశా. చెంబే ఛుంగ్‌మంది. నాన్న కానీవ్వలా - వేతవా అని కొట్టాడు. ఎందుకేమిటి? నాకు తెలీదు.

వాళ్ళ మామ్మే- బుల్లి నులకమంచం - మెత్తహా ఉంటుంది. ఉయ్యాలూగుతుంది. నాన్నా, నానా, మరే. నాకు అలాటిదే - అంటే, ఆరి దరిద్రపు వెతవా అన్నాడు. అంటే ఏమిటి?

సుబ్బులు గాని మామ్మకే కళ్ళు లేవు. అంటే, మనం కనపడంట! వినిపిస్తాంటా! ఎన్ని కథలు చెప్పింది. ఏమో నాకు లెక్కలొచ్చా యేమిటి - ఒకట్లొచ్చు అంతే. మామ్మ చెప్పినవన్నీ గ్యాపకం ఉన్నాయా? గ్యాపకం వుంటే, మళ్ళీ చెబుతావా? నేనేం మామ్మనా, కళ్ళు మూసుకుని నిద్దరోతుంటే కతలన్నీ వచ్చేస్తాయి. నాతో మాట్లాడవు. వాళ్ళలో వాళ్ళు ఆడుకుంటారు.

ఇదీ, కథ! అంటే నా కథ!

నా చిన్నప్పుడంటే పక్కింటి కళ్ళుపోయిన మామ్మ, పొగడపూలు, వాళ్ళమ్మ తల్లో పెట్టుకున్న మల్లెపూలు, అందరిళ్ళ మీద చందమామ ఉన్నాయి. కథలు చెప్పాయి.

ఇప్పుడంటే పక్కింటి, పక్కింట్లో మామ్మ ఉంది. కాని కళ్ళు బోలెడుగా పోతాయట ఎప్పుడో. అందుకోసమని కళ్ళజోడు కొనిపెట్టాడుట డాక్టరు.

కళ్ళ జోడెట్టుకుంటే కళ్ళే చక్కగా పోతాయట పోతే కథలొస్తాయా? తెలీదు -

తెలీదు అని అనడం ఇన్నేళ్ళకు తెలిసింది - ఓనమాలొచ్చినాయి. ఎందుకు? నాకు తెలీదు అని రాసేందుకు - కాని కతకు ఒత్తు జేరడంతో ఆ మెత్తదనం పోయింది. కాని, వేదాంతం సోములోరు మాయ అంటే వేంకటప్ప దాన్నే పట్టుకుని జాయ అన్నాడు కనుక ఇది కథే.

సరే, అలాగే అనుకుందాం గాని నీవు శెనగలు తింటూ మాకు అనుములు చేతులో బెడతావా? ఇదే పెద్దమనిషి తరహా అంటారా? నాకు ఆ మాత్రం తెలియదుటండీ. పుణ్యం కొద్దీ పురుషుడు, అన్నారు. అనగనగా చిన్నప్పుడు ఓ రాజుకు ఇద్దరు భార్యలని ఇద్దరికీ రెండు మూళ్ళారు కొడుకులనీ, ఆ కొడుకులకి ఆరుమూళ్ళ పద్దెనిమిది చెల్లెళ్ళనీ, ఆ చెల్లెళ్ళకి రెండు పెట్టి భాగారిస్తే ఒక తొమ్మి తొమ్మిదీ, రెండు తొమ్మిదులా పజ్జెనిమిది, తొమ్మిది రథాలున్నాయని - ఇలా లెక్క ప్రకారం బోలెడు కథలు విన్నానని నీవే చెబుతావే మాకు. అలాటివి చెప్పవేం.

చేతకాదు.

విన్నానంటున్నావుగా

ఆహా! అంతవరకూ జ్ఞాపకం ఉంది.

పోనీ అందులో ఒక్క బుల్లి కథ -

రాదు!

అదేం? మా నాన్న బళ్ళో పడేశాడు. దాంతో ఉన్న మతి పోయింది. పోయి పోయి పుస్తకాల్లో పడ్డదా, ఎబ్బే, బళ్ళో మాస్టర్లు అందరూ పట్టుకొని దాన్ని అక్కడ పడేశారు! పడేసి చేతులు దులిపేసుకుని వాళ్ళ దారిని వాళ్ళు వెళ్ళిపోయారు. కాని అది మటుకు ఎగిరిగంతేసి ఇవతల పడే ఓపికలేక ఇంకా అక్కడే పడుంది. అదే దానికి బాగుంది కామోలు! పోన్లే ఎన్నటికన్న మొహం మొత్తుకపోతుందా అనుకుందామంటే అబ్బే దాని పద్ధతి అట్లా లేదు. మంచి ఘాడుపు వేస్తున్నప్పుడు గంగ ఒడ్డున కూర్చుని ఉద్ధరిణెతో దాహం పుచ్చుకోవడం మొదలెడితే గంగ ఎండా ఎండదు. దాహం తీరా తీరదు. అలా వుంది వరుస, కనుక దాని రంధితో మనకు నిమిత్తం లేదు, నా మట్టుకు నాకు చెప్పే వాళ్ళుంటూ ఉండాలి కాని ఎల్లకాలం వినాలనే ఉంటుంది. అది సాగకనే ఈ బాధ.

బాధంటే? రాయడం, అనగా రచనలు చెయ్యడం అనేది బాధతో కూడిన విషయమా? తప్పకుండాను! బాజాలు వింటూన్న పెళ్ళి వారిపని బాగానే ఉంటుంది. కాని ఎటొచ్చీ భజంత్రీవాడే

అసలు యీ ఇతివృత్తమనేటటువంటి భామ వేషానికీ, మనకూ అనుకూల దాంపత్యమంతటి బద్ధ వైరం అవిచ్ఛిన్నంగా సాగుతూనే వుంది. ఈ భామ సర్వసాధారణంగా తెరచాటునే ఉండి, ఆకారం గోపనం చేసుకుంటూ, లీలగా నాయకుడి భరతం పడుతుంది. రభస నుంచి రసకందాయానికి రప్పించేందుకు జడ మట్టుకు ఇవతలికి విసురుతుంది. ఇది తెరచాటు కాదు.

ఆపసోపాలు పడేది! అంతమాత్రమే అయితే ఇందులో ఏమిటి ఆనందం. "నిజం చెప్పవలసి వస్తే ఏ మాత్రమో కద్దు. లేకపోతే ఒకరినొకరు పట్టుకు ఇలా ప్రాకులాడటం అంటూ ఉంటుందా?.."

సరే బాగానే ఉంది. కలం చేతబట్టిన ప్రతి ఒక్కడూ రచయితేనందామా? దస్తావేజులు రాసేవాడి మాటేమిటి? అద్దం ముందు నుంచున్నప్పుడైనా అంతరాత్మ అనేది నిలవేసి ప్రశ్నించడ మంటూ జరిగితే అందుకు నీకు నీవేమని సంజాయిషీ యిస్తావు?

ఏం జేస్తానూ, తప్పనిసరిగా కొంత నిజం మరికొంత అదనపు నిజం చెప్పేస్తాను. ఏమని? దస్తావేజులకు నా కథలతో సామ్యం ఏమిటి? వాటికి ఓ తలా, ఓ తోకా అంటూ ఉండక తప్పదు - వాటికి అలా ఉండటం ఒప్పదు! ఉంటే ఒకటికి పది తలలుండవచ్చును. కాని ఏ సందర్భములోనూ తోక అనేది లేకపోవచ్చును. ఈ తోక లేకపోవడం అనేది అక్షరాలతో ముగ్గులెట్టే అతగాడికి కాని. ఆ పట్టులోనే చెమ్మచెక్కలాడే ఇతగాడికి కానీ కొట్టొచ్చేంత - పట్టిచ్చేంతలోపం కాదు అనిపిస్తుంది. అలాగైతే నీకు ముక్కుకు సూటిగా చెప్పడం చేతగాక మొదలూ తుదీ వదిలేశావనుకో. అవి ఏమౌతాయి? ఏమౌతాయ్, నాకు తెలియకుండా, మాట మాత్రం నాతో అనకుండా, సందు చేసుకుని మధ్యలో ఇరికి ఊరుకుంటాయ్!

వాటి ధోరణి బావుందా?

ఇది కూడా, అంటే యీ పద్ధతి కూడా ఓ పద్ధతిగా బాగానే ఉంది - అని చదవకముందే, సదభిప్రాయానికి సన్నద్ధులయేవారు కొందరున్నారు. వారికి భూతదయ మెండుగా ఉండటం చేత, తెగించి అలా అనగలుగుతున్నారేమో కాని, అది మట్టుకు స్వారస్యానికి సతమతమవడం కాదు. అసలు యీ ఇతివృత్తమనేటటువంటి భామ వేషానికీ, మనకూ అనుకూల దాంపత్యమంతటి బద్ధ వైరం అవిచ్ఛిన్నంగా సాగుతూనే వుంది. ఈ భామ సర్వసాధారణంగా తెరచాటునే ఉండి, ఆకారం గోపనం చేసుకుంటూ, లీలగా నాయకుడి భరతం పడుతుంది. రభస నుంచి రసకందాయానికి రప్పించేందుకు జడ మట్టుకు ఇవతలికి విసురుతుంది. ఇది తెరచాటు కాదు. అందరూ మెచ్చే అరచాటూ కాదు. అది ఒక కళ శ్రీ కృష్ణస్వామి వారు, ఒక్కుమ్మడి యధాశక్తిని మన్నన చేసే పదార్వేల కన్నెలతో బాటే ఈ భామ కూడా - కాకుండా చిరునామా వగైరా మనకి తెలియడానికి కారణం ఏమిటి? నాయకుడి చేతలకు నానార్థాలు చెబుతూ తాను వేదన చెందుతూన్నట్లు అభినయిస్తూ చెలికత్తెలను వేధించుకు తినడంలో బిరుదందినది కనుక! యీ సంగీత సాహిత్య సమరమే గమక యమకాల కదన కుతూహలమే స్వారస్యం! మనమూ అనగా కథకులమూ ఇంతే. జీవితాన్ని అంటే ఎదుటివాడి జీవితాన్ని వలసినంత తలక్రిందులుగా అర్థం చేసుకుంటూ వాడు ఇరుకునపడే ఘట్టాలు కలిపిస్తూ అలాటి స్థితిలో అనవసరంగా మనం కలుగజేసుకుని, ఎవరిమీదనో పెట్టి, అనవలసినవి అంటూ, వాడన్న ముక్కకి నానార్థాలు కలిపిస్తూ, మునగనీయకుండా, తేలనీయకుండా ముప్పతిప్పలు పెట్టడమే శిల్పం. పర్యవసానం ఒక కళాఖండం అని కాచి వడబోసినవారు అంటారు. అది ఎంతవరకూ నిజం అంటే, నా మట్టుకు నిజం!

వెనుకటికి "సర్వమంగళ" అనే "కథ" ఉంది. అది కథో, కథానికో, వాక్చిత్రమో, వచన పద్యమో, సిసలుగా రాయవలసినటువంటి అసలు దానికి మూజువాణీ ముసాయిదావో తెలియదు! అందులో భోగట్టా ఏమిటి? ఇద్దరు అక్కాచెల్లెళ్ళు అంటే ఒక అక్క ఇద్దరు చెల్లెళ్ళు కాదు; నికరంగా ఒకటీ ఒకటే; వానిలో (వయసులో) అక్క పెద్దది, చెల్లెలు చిన్నది - (వనరులో) తద్వతే! అంతవరకూ బాగానే వుంది? సదరు అక్కయ్యకు వయసూ, వైధవ్యం ఒక్కసారే సంక్రమించినాయి. అదే బాగానే వుంది. ఈ ఫలానా చెల్లెలున్నదే, ఒక వయసు మళ్ళుతూన్న వాడికి ద్వితీయ విభక్తి కావడం సంభవించింది. తదనంతరం పిల్లకాపురానికి వెళ్ళేప్పుడు ఈ ఉపసర్గ కూడ అక్కడ చేరుకుంది, తదుపరి గిరీశం గారు సాయించినట్లు - "ఆడ లేడి కన్నులున్న..." ఈ పద్ధతిలో రెండు అచ్చులు ఒకచోట చేరినప్పుడు వ్యాకరణ కావ్యం తప్పనట్లు గాంధార్వ కళ ఒప్పడం నెల తప్పడం, యింతవరకూ మామూలే! ఆపై ఫలితం బయటపడేటంతవరకూ మరో గ్రామంలో నివాసం చేసి, బంధువుల పరువు పదిలంగా ఉంచవలెననే బాధ్యత, ఈ పైదలి నావహించడంతో తాను ఒక్కత్తే వచ్చి, మళ్ళా ప్రజలలో పడటం - ప్రజలనగా ఎవరు? ఆ మరదే! కాలక్రమాన మళ్ళీ మళ్ళీ అతగాడు వెనుకటి తప్పున పడేసేందుకు చీకటి కోసం వెదకడం, ఈ ఆడకూతురు మంచిగా మొండికేసి, వేసిన కొద్దీ మరింత ఇరుకునపడి, చివరకు తాను అక్కడ నుంచి బయట పడితేనే కాని తోడబుట్టిన దాని కాపురం కుదుటపడదు అని రూఢి చేసుకుని, గంగలో కలసిపోవడానికి సిద్ధమై తన గోడంతా, గంగాభవానితో ఏకరువు పెట్టుకుంటుంది.

ఇందులో ఇతివృత్తం అనే పదార్థం ఇది. ఈ రచన చేసినవాని యోగక్షేమములు ఎల్లవేళలా కోరుతూ ఉండేటటువంటి

> మన కథల్లో కనపడే మనుషులూ, వాళ్ళ పలుకు వాళ్ళు పలికి, వారి కథ వారు నడుపుకు పోతారు! సాటివారూ, తోటివారు, ఎలా సతమతమవుతారో మనకు ఎరుకలేదు గానీ, మన విషయంలో మట్టుకు యింతే! మనం హాయిగా కలం చేతపట్టి కూర్చుంటే పిల్లలు యిల్లు నడుపుకుపోతారు అనేది పునరుక్తి అయినప్పటికి మన తాలూకు యావత్తు చిదంబర రహస్యము యిది!

ఒక గృహస్తు దీనిని తీరుబడిగా చదివి, ఏమని హితోపదేశం చేశాడంటేను – "ఒరే అబ్బాయి, రాత పొంకంగానే ఉంది, కాని సందర్భశుద్ధి అనేది మట్టుకు పూజ్యం, లోకంలో పరిపాటి ఏమిటి? ఓ ముసలివాడున్నాడనుకో. వాడు వయోధర్మం ప్రకారం అన్నీ ఉడిగినవాడు కాకుండా, పోనీ నీ మతం ప్రకారం ఇంకా బందోబస్తుగానే ఉన్నాడే అనుకున్నా ఈ వయసులో పసిపాపను వ్యయప్రయాసల కోర్చి కట్టుకున్నందుకు గాను దాన్ని వెయ్యి కళ్ళతో కనిపెట్టుకుని ఉండేందుకు తాపత్రయపడతాడు. ఆ పిల్లది కూడా బుద్ధి తెలిసినప్పటి నుంచీ అమాయకురాలైతే తన ఖర్మానికి అఘోరించడం గాని, బుద్ధి కుదురులేనిదైతే వన్నెచిన్నెలకు పోయి, కానిపోని జంజాటంలో పడటం కాని, అక్కడా అక్కడా మనకు కంటికి తగులుతున్నదే – వీళ్ళ స్థితి చూడబోతే అల్లా లేదు. అంతా ఏటికి ఎదురీదేవారే ఏమిటిది?"

"జీవితం!"

"సహజంగా ఉందా?"

"కథెందుకౌతుంది?"

"ఉంటే అసహజంగా ఉంటేనా కథ!"

"సహజం అనిపించే అసహజం– "

"అనిపించేదెవరు?"

అదే? యిల్లూ వాకిలి యింటివారిదైతే యిల్లాలు మందే కదా అనుకున్నవాడు వెర్రివాడా, మంచివాడా? వాడి మీద ఏం కథ నడుస్తుంది? ఇల్లూ వాకిలితో బాటు సంక్రమించిన యిల్లాలిని కూడా కొంత తడవు "మమ" అనుకుని మల్లగుల్లాలు పడిన ఆ ఘట్టమే కథ అవుతుంది కదా! కథానాయకుడు అని, మంచికిగాని, చెడుకి గాని మనం ఎలాటివాడిని గురించి అనుకుంటాం? మామూలు పద్ధతులలో కాకుండా కొంత గ్రంథం నడపడానికి కాని, కారణభూతుడయ్యేటటు వంటి వాడినే కదా?

అయితే "తన్మంత్రం బ్రాహ్మణాధీనం" అన్నట్లు కథ నీ చెప్పుచేతల్లో నడవదా అంటావా? ఉహుఁ కథలో ఆడా మగ పశు పక్ష్యాదులు సైతం మన చెప్పుచేతల్లో ఉండకపోవడమే కాకుండా, మనల్ని ఎప్పటికి వదలిపెడతారో మనకే తెలియదు.

వారివెంట మనమూ అలా పడిపోతూండవలసిందే. అదీ ఒకందుకు మంచిదే. మనలో సాధారణంగా చక్కెర వింటి వాని నెకసక్కెములాడేటటువంటి అందగాళ్ళు. హౌసుగాళ్ళు సర్వసాధారణంగా ఉండటం అరుదు కదా? ఆయనప్పటికిన్నీ పిల్లలు నవమన్మధులు కావాలని పుట్టుకొస్తే కొండటున్నామా కోరుకోవడానికి వెనకాడుతున్నామా? అలాగే వాళ్ళ మానాన వాళ్ళు ప్రయోజకులై, నలుగురిలో పేరు దెచ్చుకుంటే – వీడు మా వాడు! అని భుజాలెగరేయడం లేదా? ఈ కథలనేవి రచనలు చేసేవాడి పరిస్థితీ, మనస్తత్వమూ అట్టిదేనయ్యా! మన ఊఁహాపోహలతో పగ్గాలేసి వాళ్ళను పట్టకుండా ఉంటే, మన కథల్లో కనపడే మనుషులూ, వాళ్ళ పలుకు వాళ్ళు పలికి, వారి కథ వారు నడుపుకు పోతారు! సాటివారూ, తోటివారు, ఎలా సతమతమవుతారో మనకు ఎరుకలేదు గానీ, మన విషయంలో మట్టుకు యింతే! మనం హాయిగా కలం చేతపట్టి కూర్చుంటే పిల్లలు యిల్లు నడుపుకుపోతారు అనేది పునరుక్తి అయినప్పటికి మన తాలూకు యావత్తు చిదంబర రహస్యము యిది!

పనసకాయ దొరికినప్పుడే... అనే పంథాలోనే, కొబ్బరి మీగడ లాంటి కాగితం, సుతారంగా నడిచే కలం కనబడటం తరువాయి, – శ్రీకారం చుట్టవలసిందే. ఆలోచనల కోసం వాటి జన్మ స్థానములైన శిరస్సునూ, కపోలములనూ, ఎడనెడ చుబుకమునూ తడుముకోవడం, అవి పైకి రావడం కోసం ఒళ్ళు విరుచుకోవడం – వగైరాలతో మనకు నిమిత్తం లేదు! చెక్కిళ్ళు ప్రాంతాలలో ఊహలు మొలకెత్తుతవి అనేది యీనాటికి అనుభవంలోకి రాలేదు. "స్వకపోల కల్పితము" అని ధీమాగా చెప్పుకునే హక్కు, అర్హత మనకు సంక్రమిస్తుందని తోచదు. అయితే విష్ణోర్జిహ్వా సరస్వతీ – అన్న ఫక్కీలో – కవికుల వదనాంబురుహ బద్ధనివేశా – అని అనుకోవడం సంప్రదాయం కదా అంటారా? కవనం చెప్పేవాళ్ళ నోళ్ళ, కథలు రాసేవారి మునివేళ్ళ – ఆ యిల్లాలు కాపురం ఉంటుందని నమ్మేవారు ఎందుకు ఉండరాదు? దానికేం లెస్తురూ –

ఇప్పుడెందాక వచ్చాం?

మనదాకా!

మరి, మన సంగతి ఏమిటి?

నీవు కథలు రాస్తున్నావు కదా!

ఒప్పించనక్కర్లేదు – ఒప్పుకున్నాను!

ఎలా రాస్తున్నావు?

చెప్పానుగా!

ఎందుకు రాస్తున్నావు? ఇలాటి ప్రశ్న అడిగే అభిజ్ఞులు ఉండగలరని మనకు నమ్మకం లేదు కనుక, అందుకు వలసిన సమాధానం జాగ్రత్త పెట్టుకోలేదు.

నీ కథకు నీతి ఏమిటి?

దానికి ఉన్నదల్లా జాతి!

**(కథలు రాయటం ఎలా? నుంచి)**



# నా బాల్యపు లంచ్!

## మగ్దూమ్ మొహిద్దీన్

(4.02.1908-15.01.1969)

చాచా (చిన్నాన్న) చెప్పిన మాటలు నా మనసులో ప్రతిధ్వనిస్తూ వుండేవి. "ఆంగ్లేయులు మనకి శత్రువులు!" "నాన్న చనిపోయిన తర్వాత చాచాయే నన్నుదగ్గరికి చేరదీసి పోషించసాగారు. మంచి మనసు గలవాడు. మా కుటుంబ పోషణంతా తనే చూసుకునే వాడు, సంప్రదాయవాది. బ్రిటిష్ వాళ్ళంటే తీవ్ర వ్యతిరేకతనూ, దేశ ప్రేమనూ నాకు బాగా నూరిపోసేవాడు. నేను చాచా ముఖత మొట్టమొదటిసారిగా రష్యాలోజరిగిన విప్లవం గురించి మాకందరికీ ఎలా కూలదోసిందీ, అక్కడ అందరికీ సమానత్వం ఎలా సాధించిందీ, అందరూ జాకీదస్తర్‌ఖాన్ (ముస్లింలు భోంచేయడానికి పరచే వస్త్రం) ముందు కూచొని భోంచేస్తారని చెప్పాడు. అక్కడ ధనికుడు, పేదవాడు అనే భేదభావం లేదు. అందరూ సమానమేనట. ఆనాడు చాచా చెప్పిన విప్లవం అంటే ఏమిటో నాకు అర్థం కాలేదు. అయినా నా మనసులో వింత వింత ఆలోచనలు చెలరేగాయి. రష్యాలో అందరూ ఒకేసారి కూచొని ఒకే దస్తర్‌ఖాన్‌లో భోంచేస్తే ఆ దస్తర్‌ఖాన్ ఎంత పెద్దదో కదా? అనిపించేది నాకు.

---

నా జీవితంలో బాల్యం అంటూ ఒకటి లేదు - చెహోవ్

నా బాల్యం నాటి స్కూలు పేరు ధర్మంవంత్ హైస్కూలు. దాని హెడ్మాష్టరు ముజిదాదే ప్రసాద్? కొన్నాళ్ళ క్రితం స్కూలు పత్రిక కోసం నా అభిప్రాయం రాసి పంపమన్నారు. అప్పుడు నేను ఆ పని చేయలేకపోయాను. ఆ పనిని ఇప్పుడు మరొక రూపంలో చేస్తున్నాను.

1918లో మొదటి ప్రపంచ యుద్ధం ముగిశాక, యుద్ధవిజయోత్సవాలను పెద్దఎత్తున ఆంగ్లేయులు జరుపుకున్నారు. దేశ ప్రజలు సయితం బ్రిటిష్ ప్రభుత్వం చిరంజీవిగా వుండాలని ప్రార్థనలు చేశారు. ధర్మంవంత్ హైస్కూలులోని రెండు పెద్ద హాళ్ళ ముందు స్కూలు పిల్లలంతా బారులు తీరి నిలబడ్డారు. చిన్నపిల్లలు ముందు వరుసల్లోనూ, పెద్ద పిల్లలు వెనుక వరుసల్లోనూ నిలబడ్డారు. కిషన్, గులాబ్, నేనూ ముగ్గురం తొలి వరుసలో వున్నాం. అప్పుడు నేను ఒకటో తరగతి విద్యార్థిని. స్కూలులో మాకు స్వీట్లు పంచారు. వారితో పాటుగా రేజర్ బ్లేడు సైజులో వున్న కాగితం యూనియన్ జాక్ (బ్రిటిష్) జెండాలను కూడా పంచి పెట్టారు. మా హెడ్మాష్టరు జోషిగారు, క్లాసు టీచరు మౌల్వీ జఫర్ ఆలీ పని వత్తిడిలో వున్నారు. ఆ ఇద్దరూ అంటే పిల్లలమైన మాకు దడ పట్టుకుంటుంది. చేసింది చిన్న తప్పే అయినా బెత్తం దెబ్బలు తప్పేవి కావు.

కిషన్‌లాల్ ఎర్రగా, బుర్రగా ఆరోగ్యంగా దుక్కగా వుంటాడు ఓ డబ్బున్న అయ్యకొడుకు. మధ్యాహ్నం విశ్రాంతి సమయంలో మిత్రులకి శెనగలూ, నారింజ, కందులు పంచి పెడ్తూ వుండేవాడు. నా సహాధ్యాయి పేరుకి గులాబ్ అయినా ఆకారానికి కర్రి మొద్దు. గోలీల ఆటలోనూ, కత్తితో చెరుకు ముక్కలు నరకడంలో దిట్ట. ఏ పనికయినా వీధి పిల్లలందరి కన్నా ముందున వుండేవాడు. అందుకే అతనంటే నాకు అభిమానం, యిష్టం. అతని తల్లి ఓ వేశ్య. ఘసీమియా బజారులో మస్కీంషా

దబ్బున్న వాళ్ళ పిల్లలు గుర్రపు బగ్గీల మీద స్కూలుకి వస్తూ వుండేవారు. ఒకమోస్తరు దబ్బుండేవాళ్ళు. ఒంటి గుర్రపు బగ్గీ మీద, ఇంకా బాగా దబ్బుండేవాళ్ళు. జోదుగుర్రాల బగ్గీని వుపయోగిస్తూ వుండేవాళ్ళు. బగ్గీ నడిపే వానితో పాటుగా ఒక నౌకరు కూడా దానితో వస్తూ వుండేవాడు. బగ్గీకి వెనుక తట్టున యూనిఫాంల్లో ఇద్దరు జవానులు నిలబడి, తప్పుకోండి పిల్లలు! అంటూ తోవని నడిచే పిల్లల్ని హెచ్చరిస్తూ వుండేవారు.

యింటికి దగ్గర్లో వుంటుండేది. గులాబ్ నేనూ కలిసి ఆడుకుంటూ వుండేవాళ్ళం స్కూలు పిల్లల కమీజులకి యూనియన్ జాక్ జెండాలు తగిలించి వుండేవి. నేను కూడా స్కూల్‌లో జెండాని తీసుకున్నాను. అయితే చాచా (చిన్నాన్న) చెప్పిన మాటలు నా మనసులో ప్రతిధ్వనిస్తూ వుండేవి. "ఆంగ్లేయులు మనకి శత్రువులు!" "నాన్న చనిపోయిన తర్వాత చాచాయే నన్నుదగ్గరికి చేరదీసి పోషించసాగారు. మంచి మనసు గలవాడు. మా కుటుంబ పోషణంతా తనే చూసుకునే వాడు, సంప్రదాయవాది. బ్రిటిష్ వాళ్ళంటే తీవ్ర వ్యతిరేకతనూ, దేశ ప్రేమనూ నాకు బాగా నూరిపోసేవాడు. నేను చాచా ముఖత మొట్టమొదటిసారిగా రష్యాలోజరిగిన విప్లవం గురించి మాకందరికీ ఎలా కూలదోసిందీ, అక్కడ అందరికీ సమానత్వం ఎలా సాధించిందీ, అందరూ జాకీదస్తర్‌ఖాన్ (ముస్లింలు భోంచేయడానికి పరచే వస్త్రం) ముందు కూచొని భోంచేస్తారని చెప్పాడు. అక్కడ ధనికుడు, పేదవాడు అనే భేదభావం లేదు. అందరూ సమానమేనట. ఆనాడు చాచా చెప్పిన విప్లవం అంటే ఏమిటో నాకు అర్థం కాలేదు. అయినా నా మనసులో వింత వింత ఆలోచనలు చెలరేగాయి. రష్యాలో అందరూ ఒకేసారి కూచొని ఒకే దస్తర్‌ఖాన్‌లో భోంచేస్తే ఆ దస్తర్‌ఖాన్ ఎంత పెద్దదో కదా? అనిపించేది నాకు.

ఇవన్నీ ఆలోచించిన మీదట బ్రిటిష్ జెండాని నా కమీజుకి తగిలించుకోవడం ఎంత తప్పో నాకు బోధపడింది. అటు ఇటూ చూసి ఎవ్వరు నన్ను గమనించడం లేదని నిర్ధారణ చేసుకొని, నెమ్మదిగా కమీజుకి తగిలించిన బ్రిటిష్ కాగితం జెండాని తీసి, నెమ్మదిగా నేల మీద వదిలివేశాను. అలా చేస్తున్నప్పుడు నా గుండెలు దడదడ కొట్టుకోసాగాయి. అయితే మౌల్వీ జఫర్ ఆలీగానీ, హెడ్మాష్టరు జోషిగారు గాని చూస్తే మాత్రం కొంపలు అంటుకునేవి. చేసింది మంచి పనే గనుక భయపడాల్సిన పనిలేదని నాకు ధైర్యం చెప్పుకున్నాను. నన్ను చూసి కిషన్, గులాబీలు కూడా నేను చేసినట్టే చేసేరు. మేం జెండాని తీసిపారవేసిన సంగతి ఎవరితోనూ చెప్పలేదు. ఇప్పుడు కిషన్, గులాబ్‌లు, ఎక్కడ వున్నదీ తెలీదు. కాని అది రాజకీయ పోరాటానికి మేం చేసిన తొలి అడుగని చెప్పుకోవాలి.

హైదరాబాద్ నగరానికి ఎన్నో ద్వారాలు వున్నాయి. నగరంలో ఎవరైనా అడుగు పెట్టాలంటే, ఆ ద్వారాల గుండానే లోపలికి అడుగుపెట్టాలి.

చంపాద్వారం నించి యాకూబ్‌పురా ద్వారం దాటి ధర్మంవంత్ హైస్కూల్ దాకా నేను రోజూ నడుచుకుంటూ వెళ్ళేవాణ్ణి. ఆ రోజుల్లో రిక్షాలు గానీ, సైకిళ్ళు గానీ, బస్సులు గానీ చాలా తక్కువగా కనిపిస్తూ వుండేవి. రోడ్ల మీద ఏనుగులూ, ఒంటెలూ, ఎద్దుల రథాలు వుండేవి. షకరాలూ, జట్కాలూ, టాంగాలూ, గుర్రపు బగ్గీలూ దర్శనమిస్తూ వుండేవి.

దబ్బున్న వాళ్ళ పిల్లలు గుర్రపు బగ్గీల మీద స్కూలుకి వస్తూ వుండేవారు. ఒకమోస్తరు దబ్బుండేవాళ్ళు. ఒంటి గుర్రపు బగ్గీ మీద, ఇంకా బాగా దబ్బుండేవాళ్ళు. జోదుగుర్రాల బగ్గీని వుపయోగిస్తూ వుండేవాళ్ళు. బగ్గీ నడిపే వానితో పాటుగా ఒక నౌకరు కూడా దానితో వస్తూ వుండేవాడు. బగ్గీకి వెనుక తట్టున యూనిఫాంల్లో ఇద్దరు జవానులు నిలబడి, తప్పుకోండి పిల్లలు! అంటూ తోవని నడిచే పిల్లల్ని హెచ్చరిస్తూ వుండేవారు. ఆ పిల్లలు తప్పుకుంటూ ధనికుల పిల్లల్ని గౌరవిస్తూ వుండేవాళ్ళు అంతకన్నా తక్కువ స్థాయి పిల్లలు జట్కా బళ్ళ మీద స్కూలుకి వస్తూ పోతూ వుండేవారు. కాలి నడక పిల్లలు బగ్గీ బండ్ల వెనుక వేళ్ళాడే అవకాశం కోసం తహతహలాడేవాళ్ళు. అయితే ఆ గుర్రపు బగ్గీల వెనుక జవాన్లు లేని బగ్గీలనే వెదకేవారు నిరుపేద స్కూలు పిల్లలు. బగ్గీల వెనకవేపు వున్న మెట్టు బల్లమీద చేతులు ఆనించి వేళ్ళాడుతూ ఉండేవారు. కొందరు రోడ్డు మీద నడిచి వెళ్ళే స్కూలు పిల్లలు గుర్రపు బగ్గీ తోలేవాడికి ఆ విషయం ఫిర్యాదు చేసేవాడు. అగ్గి మీద గుగ్గిలమైన బగ్గీ తోలేవాడు తన చేతిలో వున్న చెర్నకోలని వేళ్ళాడే పిల్లగాడికి తగిలేలా వెనక్కి విసిరేవాడు. పాపం! వెనుక వేళ్ళాడుతున్న పిల్లాడి వీపు చురుక్కుమనేది. ఇహ లాభం లేదని చెప్పి ఆ పిల్లాడు దిగిపోయి కాలికి బుద్ధి చెప్పేవాడు. తరచూ గుర్రపు బగ్గీ వెనుక బల్లకి వ్రేళ్ళాడే వాళ్ళలో నేను ఒక్కణ్ణి. నేను బగ్గీ తోలేవాడి చెర్నకోల దెబ్బలు రుచిచూసినవాణ్ణేను. నేను రోజూ కాలినడకని స్కూలుకి వెళ్ళి వస్తూ వుండటం ఆరోగ్యసూత్రం పాటించడానికి కాదు. ఆర్థిక స్థితి లోపం వల్ల మాత్రమే కాలినడకని స్కూలుకి వెళ్తూ వుండటం వల్ల బీద విద్యార్థులకి అలసట కలగటం మాట నిజమే అయినా, అతనిలో ఆత్మవిశ్వాసం కలగడంతో పాటుగా మానవ ప్రయోజనం కూడా వుంటుంది. దబ్బున్న వాళ్ళ పిల్లలకి మాలాగు జీవితాన్ని చాలా దగ్గర నుంచి చూసే అవకాశం లభించేది కాదు.

సింహం గుండె లాంటి కమాన్ (ఆర్చి) కింద నించి నడిచివెళ్ళి మిఠాయి అంగడి దగ్గర నిలబడే బీదపిల్లలు మాత్రమే మట్టి కప్పుల్లో వేడి వేడి పాలు తాగగలరు. గుర్రపు బగ్గీలో స్కూలుకి వెళ్ళే పిల్లలకి యిలాంటి సదవకాశం ఎలా లభిస్తుంది? మేం

వేటగాళ్ళు పిట్టల్ని పట్టుకోవడానికి పొడుగుపాటి కఱ్ఱ చివర చిక్కం లాంటిది కట్టేవారు. పిట్టలను పట్టడం చూడ్డానికి చాలా ఆసక్తిదాయకంగా వుండేది. రకరకాల పిట్టలు, పక్షులు - గోరింకలూ, రామచిలుకలూ, దేగలూ, తీతువు పిట్ట, పావురాలూ వగైరాలను పట్టుకొనే దృశ్యాలు చూస్తూ ఆనందిస్తూ వుండేవాళ్ళం. తోవలో కోతులూ, ఎలుగుబంట్లూ, పాములు నృత్యం చేస్తూ వుంటే అవి చూస్తూ కాలాన్ని మర్చిపోయేవాళ్ళం.

సుఖేహాస్ దగ్గర మూల నున్న రంగు రంగుల గాలిపటాల్ని చూస్తూ వుండేవాళ్ళం. అలా గంటల తరబడి చూస్తూ వున్నా తనివి తీరేది కాదు. బగ్గీలో వెళ్తున్న పిల్లలు కూడా ఆ గాలిపటాన్ని చూస్తూ వుండేవారు. వాళ్ళ మనసులు ఉవ్విళ్ళూరుతూ వుండేవి. అయినా వాళ్ళు ఏమీ చేయలేక ముందుకి సాగిపోయేవారు.

ఆ రోజుల్లో వీధి వీధినా వ్యాయామశాలలూ, కుస్తీ పట్లు నేర్పించే తాలింఖానాలు వుంటూ వుండేవి. తమ తమ వీధుల గౌరవ మర్యాదల్ని కాపాడుకోవాలనే ఆత్రం వీధి వాళ్ళలో వుండేది. ఎవరైనా కొత్త పిల్లగాడు మా వీధిలోకి అడుగుపెడ్తే వాడిచేత "చిక్కటి మట్టి" అని అనిపించి (ఓడించి) గాని వాణ్ణి వదిలేవాళ్ళం కాదు. అదే ఓ బలవంతుడయితే మాకు నాలుగు తగిలించి మరీ పోయేవాడు. లేదా మేము ఓటమి అంగీకరించాల్సి వచ్చేది. అదే పరిస్థితి ఇతర వీధుల్లోకి వెళ్ళినపుడు మాకు సయితం జరుగుతూ వుండేది. వీధుల వెంట నడుస్తూ యిలాంటి పరిస్థితుల్ని మేం కూడా ఎదుర్కోవలసి వచ్చేది. గుఱ్ఱపు బగ్గీలలో స్కూలుకి వెళ్ళే పిల్లలకి యిటువంటి పరిస్థితి ఎదురయ్యేది కాదు.

వేటగాళ్ళు పిట్టల్ని పట్టుకోవడానికి పొడుగుపాటి కఱ్ఱ చివర చిక్కం లాంటిది కట్టేవారు. పిట్టలను పట్టడం చూడ్డానికి చాలా ఆసక్తిదాయకంగా వుండేది. రకరకాల పిట్టలు, పక్షులు - గోరింకలూ, రామచిలుకలూ, దేగలూ, తీతువు పిట్ట, పావురాలూ వగైరాలను పట్టుకొనే దృశ్యాలు చూస్తూ ఆనందిస్తూ వుండేవాళ్ళం. తోవలో కోతులూ, ఎలుగుబంట్లూ, పాములు నృత్యం చేస్తూ వుంటే అవి చూస్తూ కాలాన్ని మర్చిపోయేవాళ్ళం. తీరా స్కూలుకి వెళ్ళడం ఆలస్యం అయిపోయేది. ఫలితంగా దండనకి గురయ్యే వాళ్ళం. మిగతా క్లాసు పిల్లల ముందు సిగ్గుతో తలవంచుకొనేవాళ్ళం.

చేపల కమాన్, సుఖేహాస్‌కీ మధ్యలో ఓ మాంత్రికుడు డబ్బాతో చనిపోయిన వారి ఆత్మలను దర్శింపచేస్తాననేవాడు. అక్కడ చాలా రద్దీగా వుండేది.

నా చిన్నతనం నుంచీ నా మనసులో చనిపోయిన నాన్నని చూడాలని అనిపిస్తూ వుండేది. ఆయన మొహం ఎలా వుంటుందో నాకు తెలీదు. ఆ పని మాంత్రికుడు చేస్తాడు. అయితే వానికి డబ్బులు కావాలి. ఇంట్లో అడిగి చూశాను. డబ్బులు ఇవ్వలేదు. ఇచ్చి వుంటే నేను కూడా ఆ తమాషాని చూసి వుండేవాణ్ణి గదా! అనుకునేవాణ్ణి.

ఇవాళ నేను వెనుకకి తిరిగి చూసుకుంటే, చంపా ద్వారం నుంచీ నక్కాలు వున్న ద్వారం దాకా ఏమీ మారలేదనిపించింది. అయితే ఇప్పుడు అక్కడ చంపాద్వారం లేదు. దాన్ని తొలగించేశారు. హైకోర్టు కాంపౌండులో నది వున్న వేపు దగ్గర్లోనే ఓ దేవాలయం ఉంది. అక్కడి ఘంటారావం ఉదయం సాయంత్రం వేళల్లో నేటికీ నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే వుంది. దానికి దగ్గర్లోనే ఓ పెద్దాయన దర్గా వుంది. ఆయనని అభిమానించేవాళ్ళు ఆ దర్గా దగ్గరికి వెళ్ళి, సలాము చేసి, దండాలు పెట్టుకొని, డబ్బులు వేసి వెళ్తుండేవారు. అప్పుడప్పుడు నేను అక్కడ ఊదుబత్తీ బూడిద తీసి సందర్శకులకు బొట్టులు పెట్టి, ప్రసాదం యిస్తూ వుండేవాణ్ణి. అక్కడికి కొద్దిపాటి దూరంలోనే చంపాద్వారం వుంది. రాతి ద్వారంలో ఓ చిన్న తలుపు దానికి వెలుపల ఓ కల్లు దుకాణం, మేక గుండెకాయతో తయారు చేసే 'చాకనా' మంచి రుచిగా వుంటుంది. దానికి మంచి పేరు. దాన్ని తినడానికి ఎక్కడెక్కడి నుంచో మనుషులు వస్తూ వుంటారు. నది లోతుగా వుంటుంది. ఫీల్‌ఖానా (గజశాల)లోని ఏనుగులు నదిలోకి వచ్చి గంటల తరబడి స్నానం చేస్తూ వుండేవి. వాటి మెడలకి గంటలు కట్టేవారు. అవి స్నానం చేస్తూ వుంటే, గంటలు చేసే శబ్దం వినసొంపుగా వుండేది. తొండాలతో నీళ్ళు చిలకరించే దృశ్యం పిల్లలకి ఎంతో ఆహ్లాదకరంగా వుండేది. రాత్రివేళల్లో హఠాత్తుగా పోలీసు విజిల్స్ వినిపిస్తూ వుండేవి. ఆ శబ్దాలు వింటూ వుంటే గుండెలు దడదడ కొట్టుకునేవి. నాకు పోలీసు విజిల్స్ అంటే అసహ్యం వేసేది. నిద్ర వస్తున్నప్పుడో లేక ఏ మదమెక్కిన ఏనుగు మనుష్యుల్ని తొక్కేస్తున్నప్పుడో వినిపించేవి ఆ విజిల్స్, భయంగొల్పే వాతావరణం అది. ఇంతలో ఎక్కణ్ణించో ఒకరు ఒంటెను తీసుకువస్తారు. ఆ ఒంటె మదమెక్కిన ఏనుగు చెవిని లటుక్కున నోటకరచి పట్టుకుంటుంది. దానితో ఏనుగు మదం కాస్తా దిగిపోతుంది. అది ఒక్కసారిగా పిల్లిలా అయిపోతుంది. దాన్ని ఏనుగుశాలకి తీసుకుపోతారు. అదే నవాబుగారి ఏనుగు అయితే వైద్యం వుండేది కాదు.

హైకోర్టుని కొత్తగా కడుతున్నారు. ఉదయమూ, సాయంత్రమూ హైకోర్టు నిర్మాణంలో పనిచేసే కూలీలతో నేనూ వుంటూ వుండేవాణ్ణి. రాళ్ళు కొట్టే కూలీలు, పెద్ద పెద్ద రాళ్ళని మోసే కూలీలు, వేల సంఖ్య మా యింటి చుట్టుపక్కల నివసిస్తూ వుండేవారు. తెల్లరాళ్ళు, ఎర్రరాళ్ళు, గోడలకి జాలీలు తయారు చేసేవాళ్ళు. ఆర్చీలు చేసే రాళ్ళు చెక్కుతున్నప్పుడు వేలాది శబ్దాలు ఒక్కసారిగా వినిపించేవి. కూలీలు సుత్తెలతో ఉలుల మీద వేసే దెబ్బలు చిత్రమైన వాతావరణాన్ని సృష్టించేవి. ఎండకాలం, వర్షాకాలం, చలికాలం అవుగాక - ఏ కాలంలో అయినా రాళ్ళు చెక్కే పని ఆపడానికి వీల్లేదు. కూలీలు వులుల మీద సుత్తులతో కొడ్తూ రాళ్ళని బద్దలు కొడుతూ వుండేవారు. వాళ్లు అలా శక్తినంతటిని వుపయోగించి పని చేస్తూంటే కండలు ఉప్పొంగేవి. నేను గంటల తరబడి ఆ దృశ్యాలను చూస్తూ వుండేవాణ్ణి. నా కూలీ మిత్రుని రెండో భార్య పనిచేస్తున్నతణ్ణి గొంతు పెద్దది చేసి అరుస్తూన్నట్లుగా పిలుస్తూ వుంటుంది. "ఇదిగో నిన్నే! కిరాణా కొట్టుకి ఎల్లి సామానులు వట్రావాలి. వంపు నించి నీళ్ళుమొయ్యాలి."

ఆ రోజుల్లో ఒక పైసా యిస్తే నాస్తా అయిపోయేది. 'నయాపూల్ (కొత్త వంతెన)' దగ్గర మొఘల్ హోటలు వుండేది. ఆ హోటలు కరెంటు దీపాల వెలుగులో ఎంతో అందంగా కనిపిస్తూ వుండేది. హోటలు గోడలకి పెద్ద పెద్ద అద్దాలూ, ఫ్రేముల్లో బిగించి రంగు రంగుల్లో విదేశీ స్త్రీల బొమ్మలు వేళ్ళాడదీసేవారు. అవి మనసుని యిట్టే ఆకర్షిస్తూ వుండేవి. ఒక్క పైసా యిస్తే తందూరీ రోటీ, రెండు పైసలకి నాహిరీ (షేర్వా) యిచ్చేవారు. దాంతో ఒక పిల్లాడి కడుపు నిండిపోయేది. రెండు పూటలూ నాకు భోజనం వుండేది కాదు. అందువల్ల స్కూలులో లంచ్‌కి యిబ్బందికరంగా వుండేది. చాలామంది పిల్లలు స్కూలు తోటలోని నారింజ, సోల్, ఖర్జూరం చెట్ల కింద టిఫిన్ క్యారేజీలు తెరచుకొని భోజనాలు చేస్తూ వుండేవారు. ఒక పిల్లాడు - అతని పేరు నాకు గుర్తు లేదు - అప్పుడప్పుడు నాకు తిండి పెడ్తూ వుండేవాడు. కాని సెలవు దినాల్లో అతను బయట వూరుకి వెళ్ళిపోతూ వుండేవాడు.

యాకూబ్‌పురా ద్వారానికి వెలుపల ఓ కల్లు దుకాణం వుండేది. అది ఇరవై నాలుగు గంటలూ తెరిచే వుండేది. తాగేవాళ్ళు తాగటం, వెళ్ళే వాళ్ళు వెళ్ళడం - ఇలా సాగుతూ వుండేది. అక్కడ మాంసం, కబాబ్, కలేజాలు వేయిస్తున్నప్పుడు వెలువడే సువాసన గుప్పుమని తోవంతా వ్యాపించేది. శెలవుల్లో నేను తరచూ ఆ తోవలో తిరుగుతూ వుండేవాణ్ణి. ఎన్నోసార్లు అక్కడే తచ్చాడుతూ, పచార్లు చేస్తూ ఆ సువాసనని పీలుస్తూ గడిపేస్తూ వుండేవాణ్ణి.

అదే నా బాల్యపు లంచ్ !

**(డి.ఆర్. అభినందన సంచిక 'అక్షర' సౌజన్యంతో)**


*With Best Compliment form..*



**THE HYDERABAD AGRICULTURAL CO - OPERATIVE ASSOCIATION LTD.,**

**# 5-10-193, 2nd Floor, HACA BHAVAN**
**(opp. Public Garden), Hyderabad - 500 004.A.P**
**Ph. No. 23240552, 23235020**

**నాణ్యతకు మారుపేరు హాకా**

- హాకా రైతులకు కావలసిన ఎరువులు, క్రిమి సంహారిక మందులు, విత్తనములు, సహకార క్రెడిట్ సొసైటీ మరియు మార్కెటింగ్ సంఘాల ద్వారా పంపిణీ చేస్తుంది
- బియ్యం, గోధుమలు, పప్పుదినుసులు మరియు అన్ని రకాల నిత్యావసర వినియోగ వస్తువులు ఎం.ఆర్.పి. ధరలకన్నా చౌకగా అమ్మకం జరుపుతుంది.
- సాంఘిక సంక్షేమశాఖ, గిరిజన సంక్షేమశాఖ, వెనుకబడిన తరగతుల సంక్షేమశాఖ, ఐ.టి.డి.ఎ మొదలైన ప్రభుత్వ సంస్థలకు తక్కువ రేట్లలో సరుకులు సరఫరా చేస్తుంది.
- దీపావళి సందర్భంగా కావలసిన టపాకాయలు, స్టాండర్డ్ ఫైర్‌వర్క్ లాంటి పేరొందిన కంపెనీల వద్ద సరుకులు కొని చౌక ధరలతో అమ్ముతుంది.
- విద్యార్థులకు హాకా బ్రాండ్ నోటు పుస్తకాలు అతి తక్కువ ధరలకు అమ్మకం చేస్తుంది. వివిధ రైతు బజారులలో కౌంటరులు నెలకొలిపి బియ్యం, పప్పు దినుసులు మొదలైనవి నిత్యావసర వస్తువులను విక్రయించుచున్నది. వివిధ సహకార సంఘముల ద్వారా వ్యాపారము చేయుచున్నది. (గడచిన 2009 -10 సంవత్సరము సుమారు 18393.89 రూపాయల వ్యాపారము చేసినది). 2010 - 2011 సంవత్సరము ఇప్పటి వరకు అనగా నవంబరు 2011 వరకు 17334.39 లక్షల రూపాయల వ్యాపారము చేసినది)

**మేనేజింగ్ డైరెక్టర్, హాకా**



# ప్రజలు, పోరాటం ఇచ్చిన జ్ఞానమే


## సుంకర సత్యనారాయణ

**(23.09.1909 - 5.09.1975)**

ప్రజా రచయిత. సంచలనం సృష్టించిన మా భూమి సహ నాటకకర్త. అనేక బుర్ర కథలు రాశారు.


సత్యాగ్రహ సందేశం, దేశం నలుమూలలా మారుమ్రోగుతున్న రోజులవి. మహాత్మాగాంధీ నాయకత్వాన స్వరాజ్య పోరాటం నిరాఘాటంగా ఉరవళ్ళు,పరవళ్ళు దొక్కుతూ ముందుకు సాగిపోతోంది. మెల్లమెల్లగా స్వతంత్ర వాయువులు మేలు కొలుపు పాడాయి. తరతరాలనుండీ బానిసత్వమనే కారు చీకటిలో మగ్గిపోయినద భారతజాతి కండ్లు దెరిచింది. తన జన్మహక్కు అయిన స్వరాజ్యాన్ని సాధించడానికి, కార్యదీక్షతో కటిబద్ధయై కర్మక్షేత్రములోకి వురికింది. స్వతంత్ర శంఖారావం బస్తీ సరిహద్దుల్ని దాటి మారుమూల పల్లెలవరకూ ప్రతిధ్వనించింది.

వెంటనే బెజవాడలో కూడా ఢంకా బజాయించారు. ఉప్పు కొఠారుల మీదికి దండయాత్ర సాగింది. ప్రథమ సత్యాగ్రహ దళం బందరుకు బయలుదేరింది. మార్గమధ్యంలో వున్న మా ఈడ్పుగల్లు గ్రామంలో ఒక మీటింగు ఏర్పాటు చేశారు. "స్వతంత్రమైనా సాధించాలి, లేక నా శవం సముద్రంలోనైనా తేలాలంటున్నాడు మహాత్ముడు. కాబట్టి సత్యాగ్రహ సమరంలో చావో!బ్రతుకో తేల్చుకోవాలి రండ"ని పిల్చిందాదళం. నా ఒళ్ళు జలదరించింది. మహాత్ముడావిధంగా శపథం పట్టిన తరువాత మన ప్రాణాలు దాచుకోవడం సిగ్గుచేటనుకుని, దళంలో కలిశాను, వెంటనే మా తండ్రి గారు "నాయనా నీవు యువకుడువు. యువకుల ఉద్రేకాలు చితుకులమంటలు. వెంటనే చల్లారి పోతాయి. మడమ ద్రిప్పకుండా ముందడుగు వేయదలచుకుంటేనే వెళ్ళు. లేకపోతే ఇంటిదగ్గర వుండు, నీ బదులు సత్యాగ్రహ సమరంలోకి నేను వెళతాను" అంటూ ముందుకొచ్చారు. అలా వీల్లేదు నేనే వెళతానంటూ మా తండ్రిగారితో పోటీపడ్డాను.

నాయకులు విడుదలయ్యారు.సిమ్లా సమావేశం ఏర్పాటు చేయబడింది. కాంగ్రెసు నాయకులూ - లీగు నాయకులూ కలసి, జాతీయ ప్రభుత్వాన్నేర్పరచి కరువుకాటకాల నరికట్టి, ప్రజలను రక్షించగలుగుతారని ఆశించాను. కాని నాయకుల మధ్య జరిగిన కొట్లాటలలో, వేవెలుధర్మపన్నాలు మాత్రం వినవలసివచ్చింది. నా నడుం విరిగిపోయింది. "తిరిగి వచ్చారా? బాబూ? తిరిగి వచ్చారా? పరువు మర్యాదలను సిమ్లా పాలు జేసియు రిత్తచేతుల తిరిగివచ్చారా? అనే గీతంలో నా హృదయావేదనను వెళ్ళబోసుకున్నా.

ఈ మధ్య కాలంలోనే ప్రజా నాట్యమండలివారి ప్రోత్సాహంతో "ముందడుగు" నాటకాన్ని కామ్రేడ్ వాసిరెడ్డి భాస్కరరావుగారితో కలిసి వ్రాశాను. ఇంకా నాటకాలూ, కథలూ వ్రాస్తున్నాను. అనేకమంది పెద్దలు 'ప్రజాకవి'వనీ, గొప్పవాడివనీ ఈనాడు నన్ను పొగుడుతున్నారు. కాని వారందరికీ నేనొక విషయాన్ని విన్నవించుకోదలచుకున్నాను. అదేమంటే "నేనేమీ పెద్ద పండితుణ్ణికాదు. నేనొక రైతుబిడ్డను మాత్రమే. ఇరువది సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ, నాగలి బట్టడం తప్ప నాకింకేమీ చేతనయ్యేదికాదు. పిమ్మట స్వతంత్ర పోరాటంలో ప్రజలమధ్య పనిచేస్తూ ప్రజల జీవిత సమస్యలను అర్థం చేసుకోగలిగాను. తరువాత నా పార్టీ కమ్యూనిస్టు పార్టీ - నా కిచ్చిన విజ్ఞానం వల్ల మాత్రమే, నేనిలాంటి కథలూ, నాటకాలు వ్రాయగలుగుతున్నాను. అంతే. అంతకంటే నాలో గొప్పదనమేమీలేదు" అని.

నేను బయటికి వచ్చేటప్పటికి సత్యాగ్రహ సమరం నాటి ఆవేశం ప్రజల్లో ఎక్కడా కూడా కనుపించలేదు. తీవ్రమయిన ఆర్థికమాంద్యంతో అవస్థల పాలయ్యారు ప్రజలు. ఎన్నికలవైపు దృష్టి సారించారు కాంగ్రెస్ నాయకులు. అన్నివైపులా ఆవరించిన ఆర్థికమాంద్యంతో మా కుటుంబ పరిస్థితులు కూడా తారుమారయ్యాయి. మా భూముల్ని చాలావరకు అప్పులవాళ్ళు కాజేశారు. ఏమి చేయడానికి పాలుపోలా. చివరకు ఎలాగయినా కష్టపడి విద్య సాధించాలనే పట్టుదలతో అలహాబాదు వెళ్ళాను.

"సరే వెళ్ళు. కుటుంబానికి మాత్రం అప్రతిష్ట తేవద్దు. పోలీసు కాల్పులకు భయపడి పారిపోయి ఇంటికొచ్చావా? నేనే కాల్చివేస్తాను. జాగ్రత్త జ్ఞాపకముంచుకో" అన్నాడు మా తండ్రి. గాంధీగారి పిలుపునూ తండ్రిగారి హెచ్చరికనూ అందుకుని సత్యాగ్రహ సమరానికై కందంత్రొక్కే దళంలో కలిసిపోయా.

ఇంటి దగ్గర మా తండ్రిగారు వూరికే కూర్చోలా, మా కుటుంబాన్నంతా దేశభక్త కుటుంబంగా తయారు చేశారు. ఇంతలో ప్రభుత్వ శాసనాలను ఉల్లంఘించి నేరం చేశావంటూ, నాకు మూడు సంవత్సరాలు కఠినశిక్ష విధించింది ప్రభుత్వం. నన్ను ప్రభుత్వం జైలుకు పంపించగానే నా తమ్ముళ్ళిద్దరు ముందుకువచ్చి నా స్థానాన్ని ఆక్రమించారు. పెద తమ్ముడు వీరభద్రరావు నాలుగు సార్లు తీవ్రమైన లాఠీఛార్జీలకు గురై, తరువాత నైజాంలో తొమ్మిదిమాసాలు జైలుబాధ ననుభవించి వచ్చాడు. రెండో తమ్ముడు సుబ్బారావు కూడా జైలుకు వెళ్ళాడు. ఈ విధంగా కుటుంబ భారాన్ని తాను వహిస్తూ మమ్మల్ని దేశసేవ కర్పించగలిగారు మా తండ్రిగారు.

గాంధీ- ఇర్విన్ ఒడంబడికతో బయటికి వచ్చాను. ఒడంబడిక భగ్నమై తిరిగి పోరాటం ప్రారంభమైంది. శక్తివంచన లేకుండా పోరాడసాగాను. ఈ మారు ప్రభుత్వం విచ్చలవిడిగా లాఠీఛార్జి చేస్తోంది. రెండు మార్లు తీవ్రమయిన లాఠీఛార్జీలకు గురిచేసి, తరువాత 1932 లో అరెస్టు చేసి సంవత్సరం కఠినశిక్ష విధించింది ప్రభుత్వం. జైల్లో హిందీ నేర్చుకుంటూ సంవత్సరకాలం గడిపి బయటికి వచ్చాను.

నేను బయటికి వచ్చేటప్పటికి సత్యాగ్రహసమరంనాటి ఆవేశం ప్రజల్లో ఎక్కడా కూడా కనుపించలేదు. తీవ్రమయిన ఆర్థికమాంద్యంతో అవస్థల పాలయ్యారు ప్రజలు. ఎన్నికలవైపు దృష్టి సారించారు కాంగ్రెస్ నాయకులు. అన్నివైపులా ఆవరించిన ఆర్థికమాంద్యంతో మా కుటుంబ పరిస్థితులు కూడా తారుమారయ్యాయి. మా భూముల్ని చాలావరకు అప్పులవాళ్ళు కాజేశారు. ఏమి చేయడానికి పాలుపోలా. చివరకు ఎలాగయినా కష్టపడి విద్య సాధించాలనే పట్టుదలతో అలహాబాదు వెళ్ళాను. ఆర్థికంగా అనేక కష్టాలకు గురయ్యాను. తరుచు ఉపవాసాలు చేయవలసి వచ్చినప్పటికి విడిచిపెట్టకుండా హిందీలో విజ్ఞానాన్ని సాధించి మరీ వచ్చా. రాష్ట్ర శాసనసభకు ఎన్నికలొచ్చాయి. కాంగ్రెసు విజయానికై శక్తివంచనలేకుండా కృషి చేశాను. మంత్రివర్గాలు స్థాపించింది కాంగ్రెసు. జమీందారీ బాధలనుండి, జమీన్ రైతులు రక్షింపబడతారనీ, రైతుల, కూలీల కష్టాలు కడతేరుతాయనీ ఆశించాను. కాని కాంగ్రెస్ మంత్రివర్గం రుణబాధా నివారణ చట్టాన్ని మసిబూసిన మారేడుకాయవలె చేయడంతో కండ్లు తెరిచాను. అధికారంలో వున్నది కాంగ్రెసు మంత్రివర్గమే అయినప్పటికీ, మనం వూరికే గూర్చుంటే లాభం లేదనుకున్నా జమీందారీ చట్టం కొరకు తీవ్రంగా కృషిచేయాలనిపించింది. కాని కష్టాలపాలైవుంది మా కుటుంబం. నేను కూడా కుటుంబ బాధ్యతల్ని కొంతవరకూ పంచుకోవలసి వచ్చింది. అంచేత నూజివీడు తాలూకా వెళ్ళి కొన్నాళ్ళు వ్యవసాయంజేసీ, మరి కొన్నాళ్ళు బాడుగబండ్లు తోలుకునీ, చివరకు రమణక్కపేటలో హిందీపాఠాలు జెప్పుకునీ, కుటుంబాన్ని పోషించుకుంటూ, సాధ్యమయినంతవరకూ జమీందారీరైతుల హక్కుల కోసం పనిజేస్తూ వచ్చాను. ఇంతలో ఎన్నికల ప్రణాళికకు వ్యతిరేకంగా కాళీపట్నం, మునగాల రైతులపై లాఠీచార్జీ చేసింది కాంగ్రెసు మంత్రివర్గం. కాంగ్రెసు నాయకత్వం మీద నాకున్న నమ్మకం కాస్తా పోయింది.

కోట్లకొలది మానవుల్ని బలిగొనే ప్రపంచ సంగ్రామాన్ని తెచ్చి పెట్టింది సామ్రాజ్యవాదం. ప్రకాశం కమిటీ రిపోర్టు ముఖలోనే మాడిపోయింది. అదును జూచుకుని రైతుల మీదకి వేటకుక్కల్లా విజృంభించారు జమీందార్లు. కమ్యూనిస్టులూ, ఇతర అతివాదులూ జమీందారీ రైతుల హక్కుల కోసం పోరాడసాగారు. ఇంతలోనే గాంధీగారి వ్యక్తి సత్యాగ్రహ కార్యక్రమం వచ్చింది. ప్రజలంతా విపరీతమైన కష్టాలను అనుభవిస్తూంటే ప్రజలమధ్య నిలబడి వారి హక్కుల కోసం పోరాడకుండా, మనంతట మనమే స్వచ్ఛందంగా - బ్రిటిష్ ప్రభుత్వానికేమి యిబ్బంది కలిగించకుండా - జైలుకు వెళ్ళి కూర్చునే కార్యక్రమం నాకు నచ్చలా. సమిష్టి పోరాటం ద్వారా తక్షణం స్వాతంత్ర్యం సాధించాలనే కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమం నన్నాకర్షించింది. కమ్యూనిస్టులతో కలసి పనిచేస్తూ చివరకు 1941 సంవత్సరంలో కమ్యూనిస్టు పార్టీలో చేరాను. కొణతమాత్మకూరులో హిందీ టీచర్‌గా వుంటూనే, రైతుల్లోనూ కూలీలలోనూ పనిచేసేవాణ్ణి.

జమీందారీ ప్రజల కష్టసుఖాలలో చాలా కాలం నుండీ పాల్గొంటున్న వాడినవడంచేత, ఆ అనుభవంతో 'కష్టజీవి' యనే బుర్రకథను వ్రాశా. ప్రజానాట్యమండలివారి వైజ్ఞానిక దళాలన్నీ ఈ కథను ప్రజల్లో విరివిగా చెప్పసాగాయి. ఆంధ్ర రైతాంగం తలలూపింది. అందుచేతనే ఇంతవరకూ 'కష్టజీవి' ముప్పదివేల కాపీలు అచ్చువేయవలసివచ్చింది.

ఇంతలో ఫాసిస్టు జర్మనీ, కూలీరైతుల రాజ్యమైన సోవియట్ రష్యాపై పోటు పొడిచింది. ప్రపంచాధిపత్యానికై కలలుగంటున్న ఫాసిస్టు జర్మనీని ప్రాణాలొడ్డి ప్రతిఘటించసాగారు. సోవియట్ ప్రజలు. రష్యా భవిష్యత్తు – ప్రపంచ ప్రజల సంగతి ఏమవుతాయో? ననే ఆందోళన నన్ను కలచివేసింది. స్టాలిన్‌గ్రాడ్ వద్ద రెడార్మీ వీరోచితంగా పోరాడి, ఫాసిస్టు దుండగీడులను నాశనం చేయడంతో, ప్రపంచ ప్రజలకు ఆశాజ్యోతులు కనిపించాయి. యుద్ధగతి ఫాసిస్టు బందిపోటు దొంగలకు వ్యతిరేకంగా మారింది. ఇక నా సంతోషానికి మేరలేదు. వెంటనే "స్టాలినోగ్రాడ్ దాకా సాగిరానిచ్చి నిన్ను, ఎర్రసేన చుట్టుముట్టి, గొర్రె కోత కోయుచుండ హిట్లరు!అబ్బ! నా కళ్ళు చల్లబడ్డవోయి హిట్లరూ!" అనే గీతాన్ని "ఓ ...మిట్టిపడే హిట్లరయ్యా? ఏటికే ఎదురీదుచుంటివా?" అనే మరో గీతాన్ని వ్రాశాను. ఆ రెండు గీతాలు అనేకమంది రైతులూ, కూలీలు కూడా పాడసాగారు. ఫరవాలేదు నేనుకూడా కాస్త కవిత్వం రాయగలననుకున్నాను. వెంటనే జమీందారీ ప్రజల కష్టసుఖాలలో చాలా కాలం నుండీ పాల్గొంటున్న వాడినవడంచేత, ఆ అనుభవంతో 'కష్టజీవి' యనే బుర్రకథను వ్రాశా. ప్రజానాట్యమండలివారి వైజ్ఞానిక దళాలన్నీ ఈ కథను ప్రజల్లో విరివిగా చెప్పసాగాయి. ఆంధ్ర రైతాంగం తలలూపింది. అందుచేతనే ఇంతవరకూ 'కష్టజీవి' ముప్పదివేల కాపీలు అచ్చువేయవలసివచ్చింది.

ఇది జరిగిన తరువాత కవి తన రచనలద్వారా ప్రజానీకాన్ని ఎలా చైతన్యవంతులుగా చేయగలుగుతాడో తెలిసింది. నవ్యయుగ నిర్మాతయైన వీరేశలింగం పంతులుగారి జీవితాన్నీ, ఆశయాలనూ , ప్రజాసామాన్యాని కందజేయాలని, పంతులుగారి జీవిత ఘటనల్ని, బుర్రకథగా వ్రాశాను. ప్రజావైజ్ఞానిక దళాలీకథను, చెపుతూంటే, పండితులనుండి పామరుల వరకూ, పంతులుగారి ఆశయాలను విని ఆనందాతిశయంతో పొంగిపోతున్నారు.

ఇంతలో దేశమంతటా కరువులు, కాటకాలు చెలరేగాయి. సోదర రైతుకూలీలను హలముబట్టి అధిక పంటలు పండించి, ప్రజలకందజేయాలని ప్రబోధించడానికై నేను కలంబట్టాను. "పచ్చ పచ్చగ బెరిగి పండి ఒరిగున్నాను. ప్రజలకు నన్నందించరావా! నా రైతా ప్రళయమౌ కరువాపలేవా?" అంటూ గీతాలనూ, 'ఆహుతి' అనే హరికథనూ వ్రాశాను. కరువు కాటకాల నరికట్టడానికీ, దేశాన్ని రక్షించుకోవడానికీ కాంగ్రెసు నాయకుల విడుదల కావాలంటూ గీతాలు వ్రాశాను.

నాయకులు విడుదలయ్యారు.సిమ్లా సమావేశం ఏర్పాటు చేయబడింది. కాంగ్రెసు నాయకులూ – లీగు నాయకులూ కలసి, జాతీయ ప్రభుత్వాన్నేర్పరచి కరువుకాటకాల నరికట్టి, ప్రజలను రక్షించగలుగుతారని ఆశించాను. కాని నాయకుల మధ్య జరిగిన కొట్లాటలలో, వేవెలుధర్మపన్నాలు మాత్రం వినవలసివచ్చింది. నా నడుం విరిగిపోయింది. "తిరిగి వచ్చారా? బాబూ? తిరిగి వచ్చారా? పరువు మర్యాదలను సిమ్లా పాలు జేసియు రిత్తచేతుల తిరిగివచ్చారా? అనే గీతంలో నా హృదయావేదనను వెళ్ళబోసుకున్నా.

ఈ మధ్య కాలంలోనే ప్రజా నాట్యమండలివారి ప్రోత్సాహంతో "ముందడుగు" నాటకాన్ని కామ్రేడ్ వాసిరెడ్డి భాస్కరరావుగారితో కలిసి వ్రాశాను. ఇంకా నాటకాలూ, కథలూ వ్రాస్తున్నాను. అనేకమంది పెద్దలు 'ప్రజాకవి'వనీ, గొప్పవాడివనీ ఈనాడు నన్ను పొగుడుతున్నారు. కాని వారందరికీ నేనొక విషయాన్ని విన్నవించుకోదలచుకున్నాను. అదేమంటే "నేనేమీ పెద్ద పండితుణ్ణికాదు. నేనొక రైతుబిడ్డను మాత్రమే. ఇరువది సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ, నాగలి బట్టడం తప్ప నాకింకేమీ చేతనయ్యేదికాదు. పిమ్మట స్వతంత్ర పోరాటంలో ప్రజలమధ్య పనిచేస్తూ ప్రజల జీవిత సమస్యలను అర్థం చేసుకోగలిగాను. తరువాత నా పార్టీ కమ్యూనిస్టు పార్టీ – నా కిచ్చిన విజ్ఞానం వల్ల మాత్రమే, నేనిలాంటి కథలూ, నాటకాలు వ్రాయగలుగుతున్నాను. అంతే. అంతకంటే నాలో గొప్పదనమేమీలేదు" అని–

నేనీ విధంగా పార్టీలో చేరి పనిచేస్తోంటే, మా తండ్రిగారుగాని – మా కుటుంబములోని ఇతరులుగానీ వెనుకబడలా. ఈనాడు నా తమ్ములు ముగ్గురూ, చెల్లెలూ, తండ్రీ కూడా పార్టీసభ్యులుగా పనిచేస్తున్నారు. 1930వ సంవత్సరంనాటి కాంగ్రెసు కుటుంబమే – ఈనాడు కమ్యూనిస్టు పార్టీ కుటుంబం.

('నేను కమ్యూనిస్టును ఎలా అయ్యాను' గ్రంథ సౌజన్యంతో)



# చిన్న నవల స్వరూపం, స్వభావం


## కొడవటిగంటి కుటుంబరావు

**(28.10.1909 - 17.8.1980)**

వందల కొలదీ కథలు, గల్పికలు, పది పన్నెండు నవలలు, నాటికలు, వేల కొలదీ వ్యాసాలు రాసి, మార్గదర్శిగా నిలిచిన మహా రచయిత.


కథా సాహిత్య విభాగాలలో చిన్న నవలకు (లేక నవలికకు) ఉండే ప్రాముఖ్యాన్ని రచయితలు గాని, పాఠకులు గాని తగినంతగా గుర్తించుతున్నట్టు కనబడదు. విమర్శకులైనా నవలలకు నవలికలకు పెద్ద తేడా పాటిస్తున్నట్టు కనపడదు. కాని అలాటి తేడా లేకపోలేదు.

చిన్న కథకూ, నవలకూ కల తేడా సర్వత్రా గుర్తించబడుతూనే ఉంది. చిన్న కథలో ఒకే ఒక జీవిత ఘటన చిత్రించబడుతోంది. పాత్ర చిత్రణ ఉంటుంది. గాని అదికూడా ఒక్క ఘటనకే పరిమితమై ఉంటుంది. చిన్న కథనూ శ్నాప్‌షాట్ ఫొటోతో పోల్చారు. అందులో జీవితం తాలూకు కదలికలు కనపడవు. పాత్రల మనస్తత్వాలలో పరిణామాలుండవు. ఒకటి, రెండు సన్నివేశాలూ, పాత్రల మనస్సులలో కలిగేచైతన్యమూ ఉన్నప్పటికీ అవి పైన చెప్పినట్టు ప్రధాన ఘటనను ఆశ్రయించే ఉంటాయి. ఆ ఘటన యొక్క ప్రభావం పాత్రల చిత్తవృత్తిపై ఏ విధంగా ఉండేదీ చిత్రితమవుతుంది. ప్రధానపాత్ర ఆశ్చర్యంతో అలానే చూస్తూ ఉండిపోవటంతోనో, ప్రియురాలు ప్రియుడి ఒడిలోకి ఒరిగి పోవటంతోనో కథ అంతమైపోతుంది.

నవలలో కదిలే జీవితం ప్రతిబింబమవుతుంది. దీన్ని సినిమా చిత్రంతో పోల్చుతారు. నవలలో అనేక సన్నివేశాలూ, అనేక సంఘటనలూ ఉంటాయి. పాత్రల చిత్త ప్రవృత్తులే గాక వాటిలో కలిగే మార్పులూ, పాత్రలపై సంఘటనల ప్రభావంతో బాటు సంఘటనలకు పాత్రలు వహించే బాధ్యత కూడా స్పష్టంగా చిత్రితమవుతాయి. జీవితం తాలూకు "వాతావరణం" కూడా నవలలో ఉంటుంది. మానవుల ఆశయాలూ, ఆశయ సిద్ధికి వారు చేసే కృషి, ఆ కృషిలో ఏర్పడే అవాంతరాలూ, జీవిత సంఘర్షణా నవలలో విపులంగా చిత్రించటానికి వీలున్నది.

ఆ కారణం చేతనే ఎన్నో కథలు చదివినప్పటికీ తెలియని జీవిత విశేషాలు ఒక్క నవలలో తెలుస్తాయి. ఒక కాలానికి చెందిన నవలలన్నీ చదివేస్తే ఆ కాలపు సాంఘిక చరిత్ర చాలా వరకు తెలిసి పోతుంది. ఈ చరిత్ర ఏ ఒక్క నవలలోనూ సమగ్రంగా ఉండటానికి వీల్లేదు. ఎందుచేత నంటే, నవలాకారుడు తనకు పరిచయం అయిన వాతావరణాన్నీ, జీవితాన్ని పాత్రలనూ మాత్రమే సృష్టించగలడు. ఉదాహరణకు నా"చదువు" అన్న నవలలో డిప్రెషన్‌కు ముందు నడిచిన ఇరవై సంవత్సరాల సాంఘిక వాతావరణాన్ని చిత్రించ యత్నించాను. అదే కాలాన్ని తీసుకుని మరి ఇరవై మంది నవలలు రాయవచ్చు. అదే విధంగా నా "గడ్డు రోజులు" డిప్రెషన్ కాలానికి సంబంధించిన నవల. ఆ గడ్డు రోజులను గురించి ఎన్ని నవలలైనా రాయవచ్చు.

సాంఘిక నవలల్లాగే చారిత్రక నవలలూనూ, చారిత్రక నవలల్లో గత కాలపు వాతావరణమూ, జీవితమూ, ఆచార్య వ్యవహారాలు, వ్యక్తులై, పునరుజ్జీవనం పొందుతాయి. చరిత్రకే ప్రాణం వస్తుంది. ఇటీవలి కాలంలో అడవి బాపిరాజు గారూ, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారూ, ఇప్పుడు నోరి నరసింహ శాస్త్రిగారూ చారిత్రక నవలలు రాయటం జరిగింది, జరుగుతున్నది.

ఒక కాలానికి చెందిన నవలలన్నీ చదివేస్తే ఆ కాలపు సాంఘిక చరిత్ర చాలా వరకు తెలిసి పోతుంది. ఈ చరిత్ర ఏ ఒక్క నవలలోనూ సమగ్రంగా ఉండటానికి వీల్లేదు. ఎందుచేత నంటే, నవలాకారుడు తనకు పరిచయం అయిన వాతావరణాన్నీ, జీవితాన్ని పాత్రలనూ మాత్రమే సృష్టించగలడు. ఉదాహరణకు నా"చదువు" అన్న నవలలో డిప్రెషన్‌కు ముందు నడిచిన ఇరవై సంవత్సరాల సాంఘిక వాతావరణాన్ని చిత్రించ యత్నించాను. అదే కాలాన్ని తీసుకుని మరి ఇరవై మంది నవలలు రాయవచ్చు.

ఆ కారణం చేతనే ఎన్నో కథలు చదివినప్పటికీ తెలియని జీవిత విశేషాలు ఒక్క నవలలో తెలుస్తాయి. ఒక కాలానికి చెందిన నవలలన్నీ చదివేస్తే ఆ కాలపు సాంఘిక చరిత్ర చాలా వరకు తెలిసి పోతుంది. ఈ చరిత్ర ఏ ఒక్క నవలలోనూ సమగ్రంగా ఉండటానికి వీల్లేదు. ఎందుచేత నంటే, నవలాకారుడు తనకు పరిచయం అయిన వాతావరణాన్నీ, జీవితాన్ని పాత్రలనూ మాత్రమే సృష్టించగలడు. ఉదాహరణకు నా"చదువు" అన్న నవలలో డిప్రెషన్‌కు ముందు నడిచిన ఇరవై సంవత్సరాల సాంఘిక వాతావరణాన్ని చిత్రించ యత్నించాను. అదే కాలాన్ని తీసుకుని మరి ఇరవై మంది నవలలు రాయవచ్చు. అదే విధంగా నా "గడ్డు రోజులు" డిప్రెషన్ కాలానికి సంబంధించిన నవల. ఆ గడ్డు రోజులను గురించి ఎన్ని నవలలైనా రాయవచ్చు.

సాంఘిక నవలల్లాగే చారిత్రక నవలలూనూ, చారిత్రక నవలల్లో గత కాలపు వాతావరణమూ, జీవితమూ, ఆచార్య వ్యవహారాలు, వ్యక్తులై, పునరుజ్జీవనం పొందుతాయి. చరిత్రకే ప్రాణం వస్తుంది. ఇటీవలి కాలంలో అడవి బాపిరాజు గారూ, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారూ, ఇప్పుడు నోరి నరసింహ శాస్త్రిగారూ చారిత్రక నవలలు రాయటం జరిగింది, జరుగుతున్నది.

చిన్న కథకూ, నవలకూ గల ఈ తేడాలు మనసులో ఉంచుకుని మనం చిన్న నవలలను పరిశీలించవలసి ఉంటుంది. చిన్న కథను పెంచినా నవలను కుంచించినా చిన్న నవల అవుతుందన్న భావం ఎవరికైనా ఉంటే అది సరి అయిన భావం కాదు. ఇలాంటి అపోహ కలగటానికి కొన్ని కారణాలు లేకపోలేదు. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి "వడ్లగింజలు" మొదట చిన్న కథగా రాసి తరువాత అదే కథను చిన్న నవల రూపంలో మళ్ళీ రచించారు. కాని రెండింటి స్వభావమూ ఒకటి కాదు. చిన్న నవలలోకి జమీందారీ సంస్కృతి, ఆనాటి వాతావరణమూ, ఆచార వ్యవహారాలు చక్కగా దిగి వచ్చాయి. వారి చిన్న కథ మనని తీసుకుపోలేని వాతావరణం లోకి చిన్న నవల తీసుకు పోగలిగింది. ఇదే కథ పెద్ద నవల అయి ఉందునా అంటే అది సాధ్యం కాదు. ఎందుచేతనంటే ఈ చిన్న నవలలో కూడా ప్రధాన ఘటన ఒకటే.

ఇదే నవలకూ, చిన్న నవలకూ ఉండే ముఖ్యమైన తేడా అని నా అభిప్రాయం. చిన్న నవలలో ప్రధాన సంఘటన ఒకటే ఉన్నప్పటికీ, ఆ సంఘటనకు కారణభూతాలైన పాత్రల చిత్తవృత్తులకూ, వాటి చుట్టూ ఉండిన వాతావరణానికి తగినంత ప్రాముఖ్యం ఉంటుందని పించినప్పుడు చిన్న కథ రాయడం కంటే చిన్న నవల రాయడం మంచిది. పాత్రలపైన సంఘటనల ప్రభావం కన్న సంఘటనలపై పాత్రల ప్రభావం హెచ్చుగా ఉన్నట్టు చిత్రించటానికైనా చిన్న నవల బాగా ఉపకరిస్తుంది.

పైన చెప్పిన "వడ్ల గింజలు" కథే తీసుకుందాం. ఒక రాజుగారు ఒక చదరంగపు ఆటగాడితో పందెం వేసి ఆడి ఓడిపోతాడు. పందెం ప్రకారం చదరంగపు బల్లమీద గళ్ళన్నింటికీ రెట్టింపు వడ్లగింజలు ఇస్తూ రావలసి వచ్చేసరికి రాజుగారికి తన ఓటమి ఎలాటిదో అర్థమవుతుంది. ఈ కథ చిన్న కథగా రాస్తే రాజు ప్రధాన పాత్ర అవుతాడు. ఓటమి యొక్క ప్రభావం అతన్ని ఏం చేసిందో మనకు తెలుస్తుంది. కాని చిన్న నవలలో శంకరప్ప ప్రధాన పాత్ర అతను పని బెట్టుకుని ఈ సంఘటనకు బీజం వేస్తాడు.

మనిషి శరీరతత్వంపైన అనుక్షణమూ వాతావరణం లోని మార్పుల ప్రభావం ఉంటున్న విధంగా, మనిషి యొక్క మనస్తత్వం మీద సాంఘిక వాతావరణం ప్రభావం ఉంటూనే ఉంటుంది. ఇది బహు సున్నితమైనది. కాలప్రవాహం ఈ వాతావరణాన్ని మార్చేస్తూ ఉంటుంది. మనుష్యుల జీవితాలలో వాతావరణం నిర్వహించే పాత్రకు ఎంతైనా ప్రాముఖ్యం ఉన్నది.

అయితే ఈ వాతావరణం చిన్న కథలలో దాదాపు ప్రతిబింబించదు. అందుచేత రెండు మూడు దశాబ్దాల క్రితం రచించిన కథలు ఈనాడు చదువుతూంటే అవి మనస్సును 'స్పృశించలేవు'. అంతకన్న పాత నవలలే అయినప్పటికీ అవి చదువుతూంటే మనం ఆ వాతావరణంలోకి వెళ్ళిపోయి ఆయా పాత్రల చిత్తవృత్తులనూ, వారికి కలిగే ప్రేరణలనూ సానుభూతితో చదివి ఆనందించగలుగుతాం. ఇలాంటి సౌకర్యం చిన్న నవలలో కూడా ఉంటుంది.

"రీడర్స్ డైజెస్ట్" లాంటి పత్రికలలో నవలలను సంగ్రహ పరచి ప్రచురిస్తారు. అంత మాత్రం చేత అవి చిన్న నవలలైపోవు.. నవలకు గాని, చిన్న నవలకు గాని ప్రమాణం ప్రధానం కాదు– విషయ విశ్లేషణా, రచనా విధానమూ ముఖ్యం. అంతమాత్రాన రెండు పేజీలలో నవల రాయవచ్చుననీ, నూరు సంవత్సరాల కథను చిన్న నవలగా రాయవచ్చుననీ కాదు.

చిన్న కథల్లోలాగే చిన్న నవలలో కాల ప్రమాణం పరిమితంగా ఉండటం మంచిదని నా విశ్వాసం. జీవితాన్ని వివరంగా చిత్రించే అవకాశం చిన్న నవలలో అట్టే ఉండదు. కాని సాంఘిక వాతావరణాన్ని చిత్రించే అవకాశం బాగా

ఒక సందర్భంలో నేను చిన్న నవలగా రాయదలచుకున్న కథలో అనేక సంవత్సరాల మీద జరిగిన సంఘటనను చిత్రించవలసి వచ్చింది. ఆ సంఘటనలను మొదటి నుంచి చివరి దాకా జరిగిన క్రమంలో చెప్పుకుపోతే నవలేరాయాలి. అలా రాసి రచనకు పటుత్వం చేకూర్చే దక్షత నాలో లేదని స్పష్టమయింది. అందుచేత రచనను దాదాపు చివరలోనే ఎత్తుకొని గడచిన సంఘటనలను సినిమా పరిభాషలో ఫ్లాష్‌బాక్ అంటారే ఆ పద్ధతిలో, పరస్పర సంబంధం అట్టే వాటి మధ్య ఉంచకుండా చిన్న నవల రాశాను. ఇందువల్ల పాఠకులకు ఆ రచన బాగా నచ్చిందని చెప్పలేనుగాని, నాకు మాత్రం తృప్తి గలిగింది.

ఉంటుంది. పాత్రలను ఈ వాతావరణం ఎంతకాలమైనా సజీవంగా ఉంచుతుంది. చిన్న కథల్లాగా చిన్న నవలలు పాత బడిపోవు. కథలోని సంఘటనలకు పాత్రల బాధ్యత ఏపాటి ఉన్నదీ, పాత్రల చిత్తవృత్తులకు ప్రేరకాలేవైనదీ, ఆయా పరిస్థితులలో ఆయా పాత్రలుచేసిన తప్పులేవో ఒప్పులేవో పాఠకుడికి స్పష్టంగా తెలుస్తూ ఉంటుంది. చిన్న నవలల్లోని సాంఘిక చరిత్ర చెప్పుకోతగినంతగా ప్రతిబింబితం కాకపోవచ్చుగాక. కాని అవి జీవితం తాలూకు డాక్యుమెంటరీ చిత్రాల్లాగా ఉండిపోతాయి. వాటికి గల ఈ ప్రాముఖ్యాన్ని రచయితలూ, పాఠకులూ, విమర్శకులు గ్రహించాలి.

మోపాసా ఒక అతి చిన్న నవల రాసినట్టు జ్ఞాపకం. అందులో ఒక మనిషి జీవితమంతా చిత్రించాడు. చిన్నదే అయినప్పటికీ అది నవలే. టాల్‌స్టాయి మొదలైన రష్యన్ రచయితలు అనేక చిన్న నవలలు రచించారు. ఇటీవల ఒక తెలుగు పత్రికలో ఒక కథ చదివాను, అది తల్లి పుట్టుకతో ప్రారంభమై కూతురు చావుతో అంతమవుతుంది. న్యాయంగా ఇది నవలగా రచించి ఉండవలసింది. ఒక పాత్ర యొక్క జీవితంలో అనేక దశలూ, ఆ పాత్ర యొక్క మనస్థితిలో ఎన్నో పరిణామాలూ చిత్రించదలచినప్పుడు దాన్ని నవలగానే రాయడం మంచిది. నేను రచించిన "ఆడజన్మ" అట్టే పెద్దది కాదు. నేను రచించిన ఇతర చిన్న నవలల ప్రమాణంలోనే ఉన్నది. అయినా అది నవల. "సవతి తల్లి" నవల కాదు- పెద్ద కథ మాత్రమే.

పెద్ద కథకూ, చిన్న నవలకూ తేడా చెప్పడం కొంచెం కష్టం. నేను రచించిన "లేచిపోయిన మనిషి" పెద్ద కథకాదు. చిన్న నవల. నేను ముందే చెప్పినట్టు, ఈ తేడాలు కథాంశాన్ని బట్టీ రచనా విధానాన్ని బట్టీ నిర్ణయించాలి.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి ప్రశస్తమైన కథలు చదివినవారు. ఒక్క విషయం గమనించి ఉంటారు. వాటిలో చాలా భాగం చిన్న నవలలుగా రాయడానికి అనువైనవి. చిన్న కథలుగా చూస్తే వాటిలో శిల్ప సౌష్టవం తక్కువ. కాని కుదించిన చిన్న కథలుగా చూస్తే పాత్రల వాతావరణం చిత్రించటంలో ఆయనకు గల అసమాన ప్రజ్ఞ స్పష్టమవుతుంది. ఆయన వాటిని చిన్న నవలలుగా రాసి ఉండవలసిందని నాకు అనిపిస్తుంది.

చిన్న నవలలు రాయడంలో నా అనుభవాన్ని పాఠకుల అనుమతితో కొద్దిగా చెప్పదలిచాను. అనేక పర్యాయాలు నేను నవలగా రాయదలచుకున్న కథను చిన్న నవలగా రాయటం జరిగింది. దానికి కారణం నా కథలో సామాజిక జీవితాన్ని విపులంగా ప్రతిబింబించే అవకాశం లేదని తోచటమే.

ఒక సందర్భంలో నేను చిన్న నవలగా రాయదలచుకున్న కథలో అనేక సంవత్సరాల మీద జరిగిన సంఘటనను చిత్రించవలసి వచ్చింది. ఆ సంఘటనలను మొదటి నుంచి చివరి దాకా జరిగిన క్రమంలో చెప్పుకుపోతే నవలేరాయాలి. అలా రాసి రచనకు పటుత్వం చేకూర్చే దక్షత నాలో లేదని స్పష్టమయింది. అందుచేత రచనను దాదాపు చివరలోనే ఎత్తుకొని గడచిన సంఘటనలను సినిమా పరిభాషలో ఫ్లాష్‌బాక్ అంటారే ఆ పద్ధతిలో, పరస్పర సంబంధం అట్టే వాటి మధ్య ఉంచకుండా చిన్న నవల రాశాను. ఇందువల్ల పాఠకులకు ఆ రచన బాగా నచ్చిందని చెప్పలేనుగాని, నాకు మాత్రం తృప్తి గలిగింది. నవలగా రాసి ఉంటే అది పాఠకులను తప్పక మరింతగా విసిగించి ఉండును. ఆ విషయంలో నాకెలాంటి సందేహమూ లేదు.

తెలుగు కథలు పుష్కలంగానే ఉంటున్నాయి. గాని అవి క్షణికమైన తాత్కాలికమైన ఆనందాన్ని చేకూర్చేవి. తెలుగు సాహిత్యం పుష్టి పొందాలంటే నవలలూ, చిన్న నవలలూ రావాలి. చిన్న కథలు రాసేవారు. తాము తీసుకునే ఇతి వృత్తాన్ని కొన్ని ఘట్టాల కింద విభజించి దేనికదిగా వివరించుకుంటూ పోతారు. చిన్న నవల రాయదలచినవాడు తాను రాయదలచుకున్నదంతా ఒకేసారి సమగ్రంగా ఆలోచిస్తాడు. కాని దాన్ని లోతుగా పరిశీలించి, ఎక్కువగా శ్రద్ధతో ఆలోచించి, శిల్పాన్ని నిర్లక్ష్యం చెయ్యకుండా చక్కగా అమర్చుతాడు. చిన్న నవలలో చిన్న కథలో ఉండే శిల్పమూ, నవలలో ఉండే విస్తృతీ కలిసి వస్తాయి. అదే ఈ సాహిత్య ప్రక్రియలలోని విశిష్టత.

చిన్న నవలలు ధారావాహికంగా పత్రికలలో ప్రచురించినప్పటికీ కొద్ది సంచికలలో ముగుస్తాయి. కొసరి వచ్చేసరికి మొదలు మరచిపోయే ప్రమాదం పాఠకుడికి ఉండదు. ఇటీవల సాహిత్య స్వరూపంపైన పత్రికల ప్రభావం విశేషంగా ఉంటున్నది. కనుక మన రచయితలు చిన్న నవలలను విరివిగా రచించి, సాహిత్యంలో చిరస్థాయిగా ఉండదగిన రచనలను సృష్టిస్తారని ఆశించవచ్చు. పత్రికలు కూడా చిన్న నవలలను ప్రోత్సహించడం ఎంతైనా అవసరం.

**(కొ.కు. "సాహిత్య వ్యాసాలు" నుంచి)**



# జీవితంలోంచి కొత్త కవుల ప్రభవం



శ్రీశ్రీ
(30.04.1910 - 15.06.1983)

విద్వాన్ విశ్వం
(21.10.1915-19.10.1987)

**శ్రీశ్రీ :** చూడండి, విశ్వంగారూ! ఇప్పుడు మనం చర్చించబోయే విషయం సామాజిక కవిత. సమాజంతో సంబంధం లేనటువంటి కవిత్వం అంటూ ఏ కాలంలోనయినా ఉంటుందా? ప్రత్యేకించి ఈ విశేషణం చేర్చుకోవడం అవసరమంటారా?

**విద్వాన్ విశ్వం :** అవసరమే అనుకుంటాను శ్రీశ్రీ గారూ. ముఖ్యంగా నేటి పరిస్థితులలో. ఒక్కొక్క కాలంలోనూ కవిత్వం ఏదో ఒక విశిష్టతను వెలువరిస్తూనే ఉంటుంది. ఆ సంగతి స్పష్టంగా తెలియడం కోసమే పురాణ కవిత్వమనీ, ప్రబంధ కవిత్వమనీ, భావ కవిత్వమనీ, అభ్యుదయ కవిత్వమనీ అనుకొంటూనే ఉన్నాం కదా.

**శ్రీశ్రీ :** ఆహా... నేనన్నదేమిటంటే- కవితా వ్యాసంగం అంతా సంఘ పరమే అయివుండగా, వేరే సామాజిక కవిత్వం అంటూ ప్రత్యేకించడమెందుకా అని...

**విద్వాన్ విశ్వం :** అదీ నిజమే గాని- ఇది వరకు భావకవిత్వం అన్నప్పుడు భావం లేక కవిత్వమంటూ వుంటుందా? అన్న ఆక్షేపణ రానే వచ్చింది. కాని, దాని అవసరం లేదంటారా? బాహ్య సత్యాన్ని గూర్చిన వ్యక్తిగతమైన భావ సమన్వయమే భావగీతమని చెప్పుకోవడం తేలిక కాదా? అట్లాగే సంఘ ప్రయోజనాన్ని ప్రత్యేకించి ఆకాంక్షించి రచించే కవిత్వమే, సామాజిక కవిత్వమని అనిపించుకుంటుంది. మరి నేటి సమస్యలు వేరు గనుక, వాటిని పరిష్కరించే మార్గాలను కవి కూడా కొత్త రీతుల్లో అన్వేషిస్తాడు కదా... ఈ మాట మీరు కాదంటారా?

**శ్రీశ్రీ:** అనను గాని- ఒకటి చెప్పండి. సామాజిక సమస్యలనేవి ఈనాటి ప్రత్యేక లక్షణాలేనంటారా? సమాజం పుట్టినప్పటి నుంచి కవిత్వం పుట్టినప్పటికి నుంచి వస్తున్నవే కదా.

**విద్వాన్ విశ్వం :** వస్తున్నవే. వేదకాలం నుంచీ కూడా మనిషి ఈ సమస్యలను గూర్చి కవిత్వం రాస్తూనే ఉన్నాడు. ఆ కాలపు సమస్యలు- చీకటి, అడవి, మృగాలూ అయితే ఈనాటి సమస్యలు- ఆకలి, నిరుద్యోగం, ఆర్థిక వ్యత్యాసాలూను, ఉషస్సును చూచి పరవశుడై, వెలుతురు వస్తుంది చీకటి పోతుంది. అని వైదిక కవిగానం చేశాడు. నేటికవేమో మరో ప్రపంచం వస్తోంది. అన్యాయాలూ తొలగిపోతాయి. అందుకోసం మీరంతా పదండి ముందుకు అని ఉద్బోధిస్తున్నారు.

**శ్రీశ్రీ:** అయితే ఒక సంగతి మాత్రం ఉందండీ- వేదకాలం విషయంలో మీరు చెప్పిన మాట నిజమేగాని మధ్యయుగాల్లో కవిత్వం ఒక భోగవస్తువుగా మారలేదంటారా? అందులో ఉన్న శిల్ప నైపుణ్యాన్ని నేనెప్పుడూ మెచ్చుకుంటూనే ఉంటాను. కాని సామాజికంగా అది ఎంతవరకు ఉపయోగించిందంటారు?

**విద్వాన్ విశ్వం :** సంఘం మొత్తం మీద ఆ మాట చెప్పలేం గాని, ఒక వర్గానికి బాగానే ఉపయోగించింది. ఆ వర్గమే సంఘమనుకొనేవారు ఆనాడు. మనుషులందరూ సాముదాయకంగా పనిచేసి, ఆ ఫలితాన్ని సాముదాయకంగానే అనుభవించే

వేదకాలం నుంచీ కూడా మనిషి ఈ సమస్యలను గూర్చి కవిత్వం రాస్తూనే ఉన్నాడు. ఆ కాలపు సమస్యలు- చీకటి, అడవి, మృగాలూ అయితే ఈనాటి సమస్యలు- ఆకలి, నిరుద్యోగం, ఆర్థిక వ్యత్యాసాలూను, ఉషస్సును చూచి పరవశుడై, వెలుతురు వస్తుంది చీకటి పోతుంది. అని వైదిక కవిగానం చేశాడు. నేటికవేమో మరో ప్రపంచం వస్తోంది. అన్యాయాలూ తొలగిపోతాయి. అందుకోసం మీరంతా పదండి ముందుకు అని ఉద్బోధిస్తున్నారు.

పరిస్థితులు మారి చేసేవారొకరు, అనుభవించేవారు వేరొకరు. సంఘం రెండుగా విడిపోయింది. అన్ని కళల్లాగే కవిత్వాన్ని కూడా ఆదరించేవారు పై వర్గం వారే అయికూర్చున్నారు. కవులు స్వయంగా ఆ వర్గానికి చెందినవారు కాకపోయినా వారి కోసం కవిత్వం రాశారు. మనకి ఆదికవి అయిన నన్నయభట్టుగారు కూడా రాజరాజనరేంద్రుని కోరిక మీదనే భారతామ్నాయాన్ని తెనిగించడానికి పూనుకున్నారు.

**శ్రీశ్రీ:** కాని, ఇంకో విశేషం కూడా ఉందండి, విశ్వంగారూ! పై వర్గాల వారి కోసం ఒక తరం కవిత్వం విజృంభిస్తున్నా క్రింది వర్గాల వారు కూడా జనపదరీతుల్లో ఇంకో వైపునుంచీ ఒక సాహిత్యాన్ని సృష్టిస్తూనే వచ్చారు. ఆనాటి పాటలూ, పదాలూ అవన్నీ ఇప్పుడు యథాతథంగా దొరక్కపోయినా, ఆ సంప్రదాయం ఇప్పటికి సజీవంగానే ఉంది. నేటి సామాజిక కవిత్వాన్ని యెక్కువగా ప్రేరేపిస్తున్న సంప్రదాయం ఇదే. ఒకప్పుడు అనాదరణకు పాల్పడినప్పటికీ, నేటికీ ఇవి నిలిచి ఉన్నాయంటే అందుకు కారణం: వీటిలో స్వయం సిద్ధంగా ఉన్న కవిత్వపటుత్వమే.

**విద్వాన్ విశ్వం :** అవునండి శ్రీశ్రీ. కాని ఒక్కమాట జానపదకవిత్వమెంత సజీవంగా ఉందో అదే విధంగానే పురాణ కవిత్వం కూడా నేటికీ నిలచేవున్నది. దానికి కారణం రెండింటిలోనూ ఉన్నటువంటి రసస్ఫోరకత్వమే. రస జనకతే కవిత్వ సామాన్య లక్షణం కాబట్టే భారతం ఈనాటికీ సర్వజన సమాదరణ పొందుతున్నది. సార్వజనీనత, సార్వకాలికత నిజమైన కళారూపాలన్నిటిలోనూ ఉండనే ఉంటుంది.

**శ్రీశ్రీ:** మీరు చెప్పిన సార్వజనీనత, సార్వకాలికల కృష్ణదేవరాయల కాలం వరకూ వచ్చిన ప్రబంధాల్లోనూ, కావ్యాల్లోనూ కనబడతాయి. కాని, తరువాత తరువాత, సంఘ వ్యవస్థ విచ్ఛిన్నమైపోయి, రసప్రాచుర్యం లేని క్షుద్రకావ్యాలే ఎక్కువై క్షీణయుగానికి దారితీశాయనుకుంటాను. ఈ మధ్యలో కూడా వసుచరిత్ర, విజయవిలాసం, పాపరాజు గారి ఉత్తర రామాయణం వంటి మణిపూసలు వెలువడుతూనే ఉన్నాయి. ఇటువంటి ఏ కొద్దిపాటి వెలుతురు కిరణాలో మినహాయిస్తే మిగిలినదంతా చీకటే. మళ్లీ మనకి ఉషఃకాలం గురజాడ అప్పారావుగారితో ప్రారంభమైందంటాను.

**విద్వాన్ విశ్వం :** అవును: అది నిజమే. ఆయనే మన సామాజిక కవితా యుగానికి వైతాళికుడు. ముఖ్యంగా ఆయన దేశభక్తి గీతం నవ్యసాహిత్యానికి నాందీ వాచకం. ఆయన దేశాన్ని ఒక మాతగా, దేవిగా, మనుష్య సంఘంగా చూచాడు. "దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్ అన్నాడు. అంతే కాక, "పొరుగువారికి తోడుపడ" మన్నాడు. "ఆకులందున అణిగి మణగి కవిత కోయిల పలుకవలెనోయ్, పలుకులను విని దేశమందభిమానములు మొలకెత్తవలెనోయ్"- అంటూ సాంఘిక కవిత్వానికి ఒక నిర్వచనం ఇచ్చాడు.

**శ్రీశ్రీ:** ఆ విధంగా నిర్వచించడమే కాదు. ఆయన స్వీకరించిన కావ్య వస్తువు సమస్తం సంఘపరమైనదే. పుత్తడిబొమ్మా పూర్ణమ్మా అనే గేయం చూడండి. సహపంక్తి భోజనాల మీద వారు రాసిన ముత్యాలసరాలు చూడండి. మంచి అన్నది మాల అయితే మాలనే అవుదున్ అన్న వారి మనస్తత్వాన్ని పరిశీలించండి. ఇందాక మీరు చెప్పిన సార్వకాలికత, సార్వజనీనత ఆయన కవిత్వంలో సాధించాలంటే ఆశ్చర్యమేమున్నది? ఆయన తరువాత వచ్చిన కొంతమంది కవుల రచనల్లో ఈ సామాజిక దృష్టి లోపించిందంటాను. మరి మీరు ఒప్పుకుంటారో లేదో?

**విద్వాన్ విశ్వం :** చిక్కైన ప్రశ్న వేశారు. దీనిని ఔనని, కాదని ఒక్కమాటలో సమాధానం చెప్పటం కష్టం. మీరు చెప్పిన కవుల మీద కూడా ఆనాటి సాంఘిక సమస్యల ప్రభావం కనబడుతూనే ఉంది. వారు కూడా ఆనాటి క్షీణ ప్రబంధయుగపు పచ్చి శృంగార ధోరణులను ఎదిరించినవారే. స్త్రీని కేవలం విలాస వస్తువుగా కాక, మాతృమూర్తిగా, ప్రేమమూర్తిగా చిత్రించారు. స్త్రీ పురుష సంబంధమే లక్ష్యంగా గల కామాన్ని కాక, పూలను, చుక్కలను మొదలుకొని తోటివారి వరకూ ప్రసరించే పవిత్ర ప్రేమను

శ్రీశ్రీ: మీ వివరణ బాగానే ఉంది కాని, ఒకటి మాత్రం కనిపిస్తోందండీ విశ్వంగారూ. ఆ కవులు మరీ వ్యక్తిగతంగా పోయి కొత్త కొత్త సామాజిక సమస్యలు ఉత్పన్నమవుతున్న కొద్దీ ప్రజా బాహుళ్యానికి దూరమైపోయారనీ, మంచి కవులనుకున్నవాళ్ళు సహా అయిపు లేకుండా అంతర్ధానమయి పోయారనీ తోస్తోంది.

అభివర్ణించారు. ఇంతవరకూ వీరు ఆనాటి సమస్యలతో సంబంధమున్నవారే. అందుచేతనే దేశభక్తి, స్వాతంత్ర్య పిపాస కూడా వారి కవిత్వంలో స్థానం సంపాదించుకోగలిగాయి. ఏమంటారు?

**శ్రీశ్రీ:** మీ వివరణ బాగానే ఉంది కాని, ఒకటి మాత్రం కనిపిస్తోందండీ విశ్వంగారూ. ఆ కవులు మరీ వ్యక్తిగతంగా పోయి కొత్త కొత్త సామాజిక సమస్యలు ఉత్పన్నమవుతున్న కొద్దీ ప్రజా బాహుళ్యానికి దూరమైపోయారనీ, మంచి కవులనుకున్నవాళ్ళు సహా అయిపు లేకుండా అంతర్ధానమయి పోయారనీ తోస్తోంది. పైగా వీరిలో ప్రతిభావంతులైన మరికొందరు కవులు అభివృద్ధి నిరోధకులుగా తయారవడం కూడా సంభవించింది.

**విద్వాన్ విశ్వం :** నిజమే, కాబట్టి అంతకంటే సునిశితమైన సాంఘిక చైతన్యంలో విశాల దృక్పథంతో మరొక కవిత్వ శాఖ చిగురించింది. దీనికి ప్రారంభం మీరు మరో ప్రపంచం చూచినప్పుడేనేమో? ఆ ప్రపంచాన్ని చూడ్డంతో మీరు ఆగిపోకుండా జనాన్నందర్నీ ఆవేపు నడవమని ఉద్బోధించారు. కేవలం ప్రకృతిని, తత్సౌందర్యాన్నే కాక, ఊరవతల నీరింకిన చెరువు ప్రక్క చెట్టునీడ ఉన్న అభాగ్యులను కూడా చూశారు. ఈ దృష్టితోనే కవిత్వం వెల్లువలై పారి, సాంఘిక కవిత్వమున్న ప్రత్యేకతను స్థాపించుకోగలిగింది.

**శ్రీశ్రీ:** కాని, ఇటీవల వచ్చిన కవిత్వంలో శిల్పానికి సంబంధించినంత మట్టుకి చాలా లోట్లు కన్పిస్తున్నాయనే విమర్శ ఒకటి వినిపిస్తుంది. దానికేమంటారు?

**విద్వాన్ విశ్వం :** నా దృష్టిలో శిల్పాన్నీ, కావ్యాత్మనీ వేరు చేయడం సాధ్యం కాదు. వస్తువే విధంగా మారిపోయిందో దాని శిల్పం కూడా మారితీరవలసి వచ్చింది. కేవలం వ్యక్తిగత భావనకు రూపమిచ్చే శిల్పానికి కావలసిన స్వరసమ్మేళనం వేరు; కోటి గొంతుకలను పలికి, పలికించే ఉద్బోధనకు కావలసిన శ్రుతివేరు. అతి ప్రాచీన కాలంలో లాగే తిరిగి సాంఘిక కవిత రెక్కలల్లార్చుకుంటూ వేదసూక్తాల రీతులతో విహరించసాగింది.

**శ్రీశ్రీ:** ఛందస్సుల విషయంలో మీరన్నది స్పష్టంగా కనిపిస్తోందండీ. నేటి కవి వృత్త ఛందస్సుల కంటే మాత్రాచ్ఛందస్సులనే ఎక్కువగా అనుసరిస్తున్నాడు. పదిమంది కలిసి పాడుకోగలిగిన సౌలభ్యం మాత్రాచ్ఛందస్సులోనే ఉంటుంది.

**విద్వాన్ విశ్వం :** అసలు ఛందః పరిణామమే ఇలా జరిగిందేమో పదిమంది కలిసి పని చేసుకుంటూ పాడుకునే రోజుల్లో వచ్చిన ఛందస్సులు వేరు. పదిమంది వింటూండగా ఒకరు చదివి వినిపించే రోజులలో వృత్తాల ప్రాబల్యం హెచ్చింది. మరి ఇవి రెండూ కాక జీవితం మరీ వైయుక్తికంగా మారి ఎవరి గదిలో వారు కూర్చొని తమలో తాము చదువుకొనే రోజులలో వచన పద్యాలూ, పద్యవచనాలూ రూపొందసాగాయి.

**శ్రీశ్రీ:** చందోబంధంగా మీరు చెప్పినటువంటి అనుభూతితో వారి రచనలను సమీక్షించి ప్రోత్సాహిస్తే కావలసినంత వైవిధ్యం యువకవుల నుండి ఆశించవచ్చు. క్షణక్షణం మారిపోతూన్న నేటి సామాజిక జీవితం నుంచి ఎప్పటికప్పుడు కొత్త కవులు పుట్టుకొస్తూనే ఉంటారు. వారి కవితాంకురాలకు దోహదమిచ్చి పెంచడమే విమర్శకుల విధి. అప్పుడు మన సాహిత్యం సర్వతోముఖంగా వికసించగలదు.

**విద్వాన్ విశ్వం :** తథాస్తు...

ఆకాశం తెరచీల్చి ఉషః కన్యక దువాళించి
శ్రీకారం చుట్టుతోంది నీకూ నాకు మనకూ
వేకువ కాబోతున్నది తేకువ తెంపూ సొంపూ
చేకూర్చగ గొంతుకెత్తి కేకవేయి! స్వస్తి సమస్తా
ఖిల బాధిత జనతా సఖ్యానికి సౌఖ్యానికి!
స్వస్తి శ్రీరస్తు చిరంజీవులైన మానవులకు!

**శ్రీశ్రీ:** తథాస్తు.

(ఆకాశవాణి సౌజన్యం)



# నా 'గొడవే' కవిత్వం


## కాళోజి నారాయణరావు

(9.09.1914 - 13.11.2002)

ప్రజా కవి. ప్రజల మనిషి.


భాష రెండు విధాలు-ఒకటి బడిపలుకుల భాష, మరొకటి పలుకుబళ్లభాష. బడి పలుకుల భాష అంటే గ్రాంధిక భాషే. కావ్యాల్లో, గ్రంథాల్లో వాడిన మాటలు తీసుకోవడం, ఆ విధంగానే మాట్లాడ్డం, అట్నే రాయడం. అయితే పాత పుస్తకాల్లో పలుకుబళ్ల భాషలేదా? అంటే తక్కువే ననిపిస్తుంది. ఎందుకంటే ఈ మహానుభావులు సంస్కృత కావ్యాలు, తెలుగు కావ్యాలు చదువుకుని, అట్నే రాసినవాండ్లు. వీరి కవిత్వాన్ని చూస్తే వీండ్లు పలుకుబళ్ల విషయంలో అంత పట్టింపుతోని ఉన్నట్టు లేదు.

మా గురువుగారు బతికి ఉండగా నేను రాసిన వాటికీ, ఆయన చనిపోయినంక రాసిన వాటికీ భేదం ఉన్నది. ఇప్పుడు వచనకవిత బాగా వస్తున్నది గదా. ఆయన పెట్టిన ఒరవడి ప్రకారంగ యతో, ప్రాసో, అంత్యప్రాసో ఏదో ఒకటి తప్పకుండా ఆ కవితలో ఒస్తది. ఒకవేళ ఒక మాట తప్పు పడినా దానిని మార్చుకునేటిది లేదు.

ఆ చెప్పే మహానుభావుడు లేడాయె. దానికి ఉదాహరణగా, 'పరాభవవసంతం' (నాగొడవ) ముచ్చట చూద్దాం. అచ్చుకిపోయే ముందు దాన్ని చాలామందికి చదివి వినిపించిన. ఆనృతం అంటే అబద్ధం, అసత్యం. నృత్యం అంటే సత్యమనీ 'అ' చేర్చి అనృతం అంటే అసత్యమయితందని నామెదళ్ల వుండె. 'వాడు అనృతము ఆడతాండు' అని వాడుకలో వున్నదాయె. అసలు నిజానికి సత్యానికి ఏ మాట వున్నదో నాకు తెలవది. కాబట్టి 'అ' తీసేస్తే నృతము సత్యమైతదని చెప్పి 'సాక్షాత్తూ నృతహరి అని రాసిన.

హన్మకొండలో మాకు 3, 4 వందల గజాల దూరంలో సచ్చిదానంద ఆశ్రమం ఉండేటిది. దాని గురుపీఠం అనంతలక్ష్మిగారిది.

ఏ సందర్భంలోనో రాగన్న పరిచయం అయింది. నేనాయన్ని ఆశ్రమంలో కలుస్తుండేటిది. ఆయన ప్రవర్తన అలవాట్లు చాలా బాగుండేవి. కలుపుగోలు మనిషి. జగన్మిత్రుడనవచ్చు ఆయన్ని. రాఘవరెడ్డి గారనో, రాగన్న అనోగాక 'అయ్యగారు' అని పిలిచేటోడిని. నా వల్ల పరిచయమైన వాండ్లందరూ అయ్యగారు అనేటోళ్లు. పాములపర్తి నరసింహారావు, సదాశివరావు మాత్రం 'గురూజీ' అని పిలిచేటోళ్ళు. నాకు ఆయన గురుస్థానం. నేనప్పుడు కథలు రాసేటోన్ని. అయ్యగారు నన్ను కవిత్వం రాయమంటే 'ఆ ఛందస్సులూ అవీ నాకు తలనొప్పి. నేను చదివింది రెండో వాచకమేనాయె. నాకు కవిత్వమేడొస్తది" అంటే 'అదేమంత గొప్ప?' అని సిగరెట్ డబ్బా మూతలో వుండే అంత కాయితం తీసుకుని దానిమీద అ, ఆ, ఐ, ఔ, అం, అః, హ- అట్టనాలుగు పంక్తుల్ల యతి, మైత్రి అక్షరాలు రాసిచ్చి 'ఇదిగో యతి' అని నేర్పిండు. దాని ప్రకారమే రాస్తే, సరిచేసేటోడు మంచి కథకుడిని కావల్ననీ, మంచి వ్యాసకర్తని కావల్ననీ, లేకపోతే మంచి కవిని కావల్నని నేను ఈ సాహిత్య రంగంల ప్రవేశించ లేదు. ప్రజా ఉద్యమాల్లో పాల్గొనేటప్పుడు 10, 12 ఉపన్యాసాలు ఇచ్చేదానికంటె చిన్నపాటి కథ మోస్తరు రాస్తే దాని ప్రభావం ఎక్కువుంటుందనే ఉద్దేశ్యంతో సాహిత్యరంగ ప్రవేశం చేసిన్నేకాని, అందరికన్నా గొప్ప కథకుడిని అనో, కవిని అనో అనిపించుకోవలెనని కాదు. అందుకని నా కథలుగానీ, కవిత్వం గాని చూసి నవ్వుకుంటూ

తెలంగాణా రచయితల సంఘం వార్షికోత్సవానికి ఓసారి ఆరుద్ర వచ్చిన్రు. ఆ మీటింగు రాత్రి తొమ్మిదిన్నరకి అయిపోయింది. ఆరుద్ర చుట్టూ యువత చేరి మాట్లాడుతున్నారు. హోటల్ మూసేసే టైమ్ అవుతున్నది. వాళ్లు ఎంతకీ విడిచిపెట్టరు. నేను ఆరుద్రని బలవంతంగానే పోదాం పా, హోటల్‌లో భోజనం వుంటుందో లేదో... మీరు కావలిస్తే హోటల్‌కి రండయా' అని చెప్తుంటే ఓ కుర్రవాడు 'ఇక్కడా మీ గొడవేనాండి?' అన్నాడు. అనేసరికి వాడ్ని దగ్గరకు తీసుకుని పేరు అడిగిన చలపతి అనో ఏదో అన్నడు. ఇంజనీరింగ్ స్టూడెంటట. తర్వాత ఉత్తరాలు కూడా రాసిండు.

అన్యాయాన్నెదిరిస్తే
నా గొడవకు సంతృప్తి
అన్యాయం అంతరిస్తే
నా గొడవకు ముక్తి ప్రాప్తి
అన్యాయాన్నెదిరించిన వాడు
నాకు ఆరాధ్యుడు
అనేటటువంటి ఉద్దేశం నాది.

. . .

"నలుగురితో విందులో కూర్చున్నా, వినోదంలో కూర్చున్నా నువ్ పబ్లిక్ విషయాలె మాట్లాడుతవ్. అదంతా ఎందుకు?" అని కొందరు మిత్రులంటరు. "సమాజంతో సంబంధం లేదనే బతుకు మీరెట్ల బతుకుతరు? సమాజానికి సంబంధించిన ప్రతిదీ మనకి కావలసిందే" అని వాళ్ళతో అంటుంటను. తెలంగాణా రచయితల సంఘం వార్షికోత్సవానికి ఓసారి ఆరుద్ర వచ్చిన్రు. ఆ మీటింగు రాత్రి తొమ్మిదిన్నరకి అయిపోయింది. ఆరుద్ర చుట్టూ యువత చేరి మాట్లాడుతున్నారు. హోటల్ మూసేసే టైమ్ అవుతున్నది. వాళ్లు ఎంతకీ విడిచిపెట్టరు. నేను ఆరుద్రని బలవంతంగానే పోదాం పా, హోటల్‌లో భోజనం వుంటుందో లేదో... మీరు కావలిస్తే హోటల్‌కి రండయా' అని చెప్తుంటే ఓ కుర్రవాడు 'ఇక్కడా మీ గొడవేనాండి?' అన్నాడు. అనేసరికి వాడ్ని దగ్గరకు తీసుకుని పేరు అడిగిన చలపతి అనో ఏదో అన్నడు. ఇంజనీరింగ్ స్టూడెంటట. తర్వాత ఉత్తరాలు కూడా రాసిండు.

శ్రీశ్రీ, ఆరుద్ర వాళ్లక్కడి కొచ్చిండ్రు. వరంగల్లు నుంచీ వెళ్లిన నేనూ వాళ్లతోపాటు హోటల్‌లోనే వున్న. అంతకు ముందెప్పుడూ వాళ్లతో కలిసి వున్న జ్ఞాపకం లేదు. ఇది 1953 డిసెంబర్ అనుకుంట.

'53 జనవరిలో 'నా గొడవ' మొదటిభాగం ఆళ్వారు స్వామి వేసిండు (దేశోద్ధారక గ్రంథమాల). అంతకు ముందు ఎచ్.ఎన్. బ్రేల్స్‌ఫర్డ్ రాసిన 'రెబెల్ ఇండియా'కి నా అనువాదం వేసిండు– 'నా భారతదేశ యాత్ర'. 1930లో అనువదించిన' 40లో అచ్చయింది. మళ్లా 13 ఏండ్లకి 'నా గొడవ' అచ్చు వేసిండన్నమాట.

ఆంధ్రమహాసభ స్థాయీసంఘ సమావేశం వరంగల్లులో ఒద్దిరాజు వారింట జరిగింది. ఆంధ్రమహిళాసభ అధ్యక్షురాలు ఓబుల రంగమ్మరెడ్డిగారు, స్థాయీసంఘ సభ్యులు వెంకట్రామారెడ్డిగారు, కొండా వెంకటరెడ్డిగారు, మందుముల నర్సింగరావుగారు, బూర్గుల రామకిషన్‌రావుగారు, ప్రతాపరెడ్డిగారు, మాడపాటివారు, మందుముల రామచంద్రరావుగారు– వాండ్లంతా ఒచ్చినరు. నేను 'స్వాగతం' అని గేయం రాసి అయ్యగారికి చూపిన.

నిత్యమేమొ మనకీ దుర్దశ యని భయము చెందు వేళ
ఆంధ్రపితామహులాంధ్రోద్యమము నంకురింపజేసి
అది ఆంధ్రమహాసభ పేర అందరికి అమర తరువాయె...

యతి గురించి తెలిసినవాడినీ కాదు, పట్టింపు వున్నవాడినీ కాదాయె. కాని ఆయనేమో 'భయము చెందువేళ' కాదు 'నెవ్వనుగనువేళ' అని దిద్దిండు. నెవ్వ అంటే భయమనీ, అది అచ్చ తెలుగు పదమని చెప్పిండు. దయ అనే పదం తెలుసుగాని ఇది తెల్వది. ఏ పల్లెటూరికి పోయినా, ఎక్కడికి పోయినా భయం, యుద్ధం అనే మాటలు, అందరికీ తెలుసు. జర్మనీకున్నూ ఇంగ్లండుకున్నూ లడాయవుతున్నదట, ఆ యుద్ధమట ఈ యుద్ధమట అని. అట్నే భయం అనే మాట వాడుకలోనిది. యతి కోసమే ఆయన 'నెవ్వ' వాడమన్నడు. మా ఇద్దరి గురు శిష్య సంబంధం విచిత్రమైన సంగతి– గురువు– విరాగి– రాగన్న

లఘువు - రాగి - కాళన్న
అక్షరజగత్తు సొంతం
గురు లఘువుల సొత్తు

భాష రెండు విధాలు–ఒకటి బడిపలుకుల భాష, మరొకటి పలుకుబళ్లభాష. బడి పలుకుల భాష అంటే గ్రాంథిక భాషే. కావ్యాల్లో, గ్రంథాల్లో వాడిన మాటలు తీసుకోవడం, ఆ విధంగానే మాట్లాడ్డం, అట్నే రాయడం. అయితే పాత పుస్తకాల్లో పలుకుబళ్ల భాషలేదా? అంటే తక్కువేననిపిస్తంది. ఎందుకంటే

భాష రెండు విధాలు-ఒకటి బడిపలుకుల భాష, మరొకటి పలుకుబళ్లభాష. బడి పలుకుల భాష అంటే గ్రాంధిక భాషే. కావ్యాల్లో, గ్రంథాల్లో వాడిన మాటలు తీసుకోవడం, ఆ విధంగానే మాట్లాడ్డం, అట్నే రాయడం. అయితే పాత పుస్తకాల్లో పలుకుబళ్ల భాషలేదా? అంటే తక్కువేననిపిస్తంది. ఎందుకంటే ఈ మహానుభావులు సంస్కృత కావ్యాలు, తెలుగు కావ్యాలు చదువుకుని, అట్నే రాసినవాండ్లు. వీరి కవిత్వాన్ని చూస్తే వీండ్లు పలుకుబళ్ల విషయంలో అంత పట్టింపుతోని ఉన్నట్టు లేదు. ఎంత పెద్దవాళ్లయిన గానీ 'ఎంత గొట్టుపదం వేసినం? ఎంత క్లిష్ట సంస్కృత సమాసం వాడిన?' అనే చూసిన్రు. నాది పలుకుబళ్ల భాష, బడి పలుకుల భాష కాదు, ఎట్టంటే అది నేను చదువుకోలేదు. నేను పంతుళ్ల దగ్గర ఆ భాషయినా, దానికి సంబంధించిన వ్యాకరణమైనా చదువుకోలేదు. అందువలన నాది పలుకుబళ్ళ భాష.

ఈ మహానుభావులు సంస్కృత కావ్యాలు, తెలుగు కావ్యాలు చదువుకుని, అట్నే రాసినవాండ్లు. వీరి కవిత్వాన్ని చూస్తే వీండ్లు పలుకుబళ్ల విషయంలో అంత పట్టింపుతోని ఉన్నట్టు లేదు.

మా గురువుగారు బతికి ఉండగా నేను రాసిన వాటికీ, ఆయన చనిపోయినంక రాసిన వాటికీ భేదం ఉన్నది. ఇప్పుడు వచనకవిత బాగా వస్తున్నది గదా. ఆయన పెట్టిన ఒరవడి ప్రకారంగ యతో, ప్రాసో, అంత్యప్రాసో ఏదో ఒకటి తప్పకుండా ఆ కవితలో ఒస్తది. ఒకవేళ ఒక మాట తప్పు పడినా దానిని మార్చుకునేటిది లేదు. ఆ చెప్పే మహానుభావుడు లేడాయె. దానికి ఉదాహరణగా, 'పరాభవవసంతం' (నాగొడవ) ముచ్చట చూద్దాం. అచ్చుకిపోయే ముందు దాన్ని చాలామందికి చదివి వినిపించిన. అనృతం అంటే అబద్ధం, అసత్యం. నృత్యం అంటే సత్యమనీ 'అ' చేర్చి అనృతం అంటే అసత్యమయితందని నామెదళ్ల వుండె. 'వాడు అనృతము ఆడతాండు' అని వాడుకలో వున్నదాయె. అసలు నిజానికి సత్యానికి ఏ మాట వున్నదో నాకు తెలవది. కాబట్టి 'అ' తీసేస్తే నృతము సత్యమైతదని చెప్పి 'సాక్షాత్తూ నృతహరి అని రాసిన. హరి అంటే చంపెటోడు, నృతహరి అంటే సత్యాన్ని చంపెటోడు అనుకుని 'సాక్షాత్తూ నృతహరి' అని రాసిన. రాసి, మాదిరాజు రంగారావుకి వినిపించిన. ఆయన సంస్కృతం, తెలుగు బాగా చదువుకున్న పండితుడాయె (కాకతీయ యూనివర్శిటీల తెలుగు ప్రొఫెసర్). ఆ మహానుభావుడికీ 'నృతం' అని నేను చదువుతూంటే 'ఋతం'గా వినిపించిందట! తర్వాత అది అచ్చయింది. పుస్తకాన్ని రంగారావు ఆంధ్రప్రభలో సమీక్షిస్తూ 'ఈయనకి సంస్కృతం రాదు. నృతమే సత్యమనుకుంటన్నడు. కాని ఆ శబ్దం 'ఋతం' అని రాసిండు.

పరాభవగ్రీష్మంలో
కాంతి తిమిని చిమ్ముతుంటె
శాంతి ఉచ్చులల్లుతుంటె
రక్షణ భక్షిస్తుంటె
రాజ్యాంగం చూస్తుంటె
బతుకు చితికిపోతుంటె
శాంతి, శాంతట! శాంతి!!

అని రాసిన. తిమికాదు తిమిరం అనాలెనట. ఆ పదానికి ఆ అర్థం లేకపోతే కాళోజి ఈ మాట పుట్టించిండు అనుకున్నాగాని నాకేం బాధలేదు.

పాతివ్రత్యం మోస్తరుగ 'పార్టీవ్రత్యం' అని కాయిన్ చేసిన. ఇటువంటి పదాలు 'నాగొడవ'లో 10, 15 ఒస్తయ్.

మా ఓట్లకె పుట్టి మమ్మె కాదంటె
ఎట్లకొడకా ! అను చోట

'ఓట్లకు పుట్టడం' అనేది కొత్త ప్రయోగం. వ్యక్తిగతంగా ఇందిరాగాంధీ లాంటి వాండ్లకి తల్లిదండ్రులు వేరే వుంటరు. కాని ప్రధానిగా ఆమె, రాష్ట్రపతిగా మరొకరు, ఎంపిగా ఎల్లయ్య, ఎమ్మెల్యేగా పుల్లయ్య, గ్రామ సర్పంచిగా ఇంకొకరు- ఇట్ల వీళ్లంతా ఓట్లకు పుట్టినవాళ్లు. ఓటరు పై విధంగా వాళ్లని ప్రశ్నించాలె.

విశ్వనాథ సత్యనారాయణగారు ఒకసారి మా ఇంట వున్నప్పటి సంగతి. ఆయన మంచం మీద పడుకుని ఉన్నరు. ముందటి సోఫాలో నేను కూచుని మాట్లాడుతున్న. ఇంతలో రాఘవరెడ్డిగారు వచ్చిన్రు. నేను పరిచయం చేసిన- మా గురువుగారు, సంస్కృతం వచ్చును. తెలుగులో కవిత్వం రాస్తరు అని. విశ్వనాథ అట్నే పడుకుని "రెడ్డిగారూ, ఏవన్నా రెండు పద్యాలు వినిపించండి" అన్నడు. ఆయన నోటికి వేనవేల పద్యాలు వచ్చేటివి- తనవీ వేరేవాళ్లవి కూడా. మంచి పద్యం లక్షణం- అది వినగానే జ్ఞాపకం వుండిపోవాలె- అదే మంచి పద్యానికి గీటురాయి అనెటోడాయన. తన వేణుగోపాల శతకం లోంచి ఒక పద్యం వినిపిచ్చిండు. వింటున్న విశ్వనాథ లేచి కూచున్నడు. రెండో పద్యం విని మంచం దిగిండు. సోఫాలో ఉన్న మా దగ్గరికి వచ్చి రాఘవరెడ్డి గారి పక్కన కూచుని రెండు చేతులూ పట్టుకున్నడు- సంతోషంతో కన్నీళ్ళు! విశ్వనాథ ఎంతో ఆనందపడ్డడు.

విశ్వనాథ వానమామలై వరదాచార్యులవారి 'మణిమాల' కావ్యానికి పీఠిక రాస్తూ 'ఈసారి వరంగల్ పోయి వచ్చినప్పుడు

విశ్వనాథ సత్యనారాయణగారు ఒకసారి మా ఇంట వున్నప్పటి సంగతి. ఆయన మంచం మీద పడుకుని ఉన్నరు. ముందటి సోఫాలో నేను కూచుని మాట్లాడుతున్న. ఇంతలో రాఘవరెడ్డిగారు వచ్చిన్రు. నేను పరిచయం చేసిన- మా గురువుగారు, సంస్కృతం వచ్చును. తెలుగులో కవిత్వం రాస్తరు అని. విశ్వనాథ అట్నే పడుకుని "రెడ్డిగారూ, ఏవన్నా రెండు పద్యాలు వినిపించండి" అన్నడు. ఆయన నోటికి వేనవేల పద్యాలు వచ్చేటివి- తనవీ వేరేవాళ్లవి కూడా. మంచి పద్యం లక్షణం- అది వినగానే జ్ఞాపకం వుండిపోవాలె- అదే మంచి పద్యానికి గీటురాయి అనెటోడాయన. తన వేణుగోపాల శతకంలోంచి ఒక పద్యం వినిపిచ్చిండు. వింటున్న విశ్వనాథ లేచి కూచున్నడు. రెండో పద్యం విని మంచం దిగిండు. సోఫాలో ఉన్న మా దగ్గరికి వచ్చి రాఘవరెడ్డి గారి పక్కన కూచుని రెండు చేతులూ పట్టుకున్నడు- సంతోషంతో కన్నీళ్ళు! విశ్వనాథ ఎంతో ఆనందపడ్డడు.

రాఘవరెడ్డిగారనే మంచి కవి పరిచయం కావడం, కాళోజీగారి ఆతిథ్యం మర్చిపోలేని విషయాలు' అన్నాడు.

విశ్వనాథ విచిత్రమైన వ్యక్తి. ప్రైవేటుగా మాట్లాడు తున్నప్పుడు ఎవరి కవిత్వమైనా బాగుంటే మెచ్చుకునెటోడు. ప్రభావితుడయ్యేటోడు. మంచి రసికుడనిపించేటిది. మరి వేదిక ఎక్కినప్పుడు ఏమయ్యేదో ఏమిటో, తానే తప్ప ప్రపంచంలో కవిలేడన్నట్టు విచిత్రంగా మాట్లాడెటోడు. ఈ భేదం అంచనాకి అందదు.

చిలకమర్తి రామానుజాచార్యులనే టీచర్‌ది వరంగల్లు. మంచి కవి. సీతాకళ్యాణం, శబరి ఘట్టాలు తీసుకుని చిన్న చిన్న కావ్యాలు రాసిండు. వంద పద్యాలతో ఓ కావ్యం. ఓ సారి విశ్వనాథ వరంగల్ వచ్చినప్పుడు, సీతాకల్యాణం ఆవిష్కరణకే కావచ్చు, పిలిచిన్రు. కవి తన పద్యాలు వినిపిస్తున్నడు. 3, 4 పద్యాలయినంక 'ఆగండి, ఇక ఆపండి' అన్నడు విశ్వనాథ. "ఈ మహానుభావుడు రామాయణ కల్పవృక్షం రాయగూడదా? నా పుస్తకం తీసి పారెయ్యాలె' అన్నడు గద్గదికంగా. 35 ఏండ్ల క్రితం ఘట్టం నాకింకా యాదుంది.

. . .

తెలుగువాండ్లు అదివరకు చెట్టుకొకరు పుట్టకొకరు అయి పోయిన్రు. మద్రాసు ప్రెసిడెన్సీలో కొందరూ, నైజాం రాజ్యంలో మరికొందరు. రాజకీయమైన ఒడిదుడుకుల వల్ల అట్ల జరిగె. అయినా భాష, సాహిత్యం, సంస్కృతి మనల్ని ఒకటిగనే వుంచెగద. నన్నయ్య మహాభారతం, పోతన భాగవతం, పెద్దన మనుచరిత్ర- అవన్నీ తెలుగు పుస్తకాలే. అట్నే విశ్వనాథ 'ఆంధ్రప్రశస్తి', రాయప్రోలు 'ఆంధ్రావళి', అడవి బాపిరాజు 'గోన గన్నారెడ్డి'- ఇవన్నీ తెలుగు పుస్తకాలే. అవీ ఇవీ కూడా మనవే అని అప్పుడూ అనుకున్నం. ఇప్పుడూ అనుకుంటం. వాండ్లు వేరు, మనం వేరు అనే భావం తెలంగాణా వాళ్ళకి ఎన్నడూ లేదు. కాని వీళ్ళూ మనవాండ్లే వీళ్ళదీ మన భాషే, వీండ్లదీ మన జీవిత విధానమే అనేటి భావాలు మా గురించి పై నుంచీ వచ్చినోళ్ళకి వుండేటివి కాదు. కాని తెలంగాణ లోపటి పరిస్థితి వేరు.

హైద్రాబాదు (1901)లో స్థాపించబడ్డ తొలి తెలుగు గ్రంథాలయం శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయమే కద. 'రాయలు మావాడే. పెద్దన మహానుభావుడు మావాడే. అష్టదిగ్గజాలూ మావే' అనే అభిప్రాయం మాకే లేకపోతే ఇక్కడి లైబ్రరీకి ఆపేరెందుకు పెట్టుకుంటం? రాజ్యపాలన చేస్తూ కూడ రాయలవారు కవుల్ని పోషించిండు. స్వయంగా కవిత్వం చెప్పిండు. తెలుగు సంస్కృతికి ఆయనెంతో చేసిండు. ఆయన్ని స్మరించుకునెటందుకే ఆయన పేరుమీద గ్రంథాలయం పెట్టినం. అట్నే మేం స్థాపించిన రెండో గ్రంథాలయం (హన్మకొండ) రాజరాజనరేంద్రభాషా నిలయం గద. రాజరాజనరేంద్రుడెక్కడి వాడు. భారతం మాదీ అని మేం అనుకోకపోతే ఆ పేరు పెట్టేటోళ్లమా? భారతం అనేటి గ్రంథాన్ని వరంగల్లులో శబ్దానుశాసన ఆంధ్రభాషానిలయం. శబ్దానుశాసనుడు నన్నయేగద? ఈ మూడిటి పేర్లలోనూ ఆంధ్ర అనేమాటే వుండె. తెలంగాణా పేరే లేదు. అటు తర్వాత మడికొండ లైబ్రరీకి మాత్రం ప్రతాపరుద్ర ఆంధ్రభాషానిలయం (1920) అని పేరు పెట్టినం. కృష్ణ దేవరాయలు, రాజరాజ నరేంద్రుడు, నన్నయ్యభట్టులాగా ప్రతాపరుద్రుడు కూడా మన తెలుగు వాడేనని మేమను కునేటోళ్లం. అందుకే ఆ పేరు పెట్టినం. నన్నయ తెలుగు వాడు, తిక్కన తెలుగువాడు, ఎల్లయ్య తెలుగువాడు, పుల్లయ్య తెలుగువాడు అని మా అభిప్రాయం. సాహిత్యంతో పరిచయం ఉన్న పదిమందికే ఇది పరిమితం.

మేం తెలుగువాండ్లం, మాది తెలుగుభాష, మాది తెలుగు సాహిత్యం అని మాకు చాలా గొప్పగా వుండేటిది. తెలంగాణా, రాయలసీమ- రెండూ కూడా కలిసి వుంటేనే అది మొత్తం తెలుగు

తెలుగువాండ్లు అదివరకు చెట్టుకొకరు పుట్టకొకరు అయి పోయిన్రు. మద్రాసు ప్రెసిడెన్సీలో కొందరూ, నైజాం రాజ్యంలో మరికొందరు. రాజకీయమైన ఒడిదుడుకుల వల్ల అట్ల జరిగె. అయినా భాష, సాహిత్యం, సంస్కృతి మనల్ని ఒకటిగనే వుంచెగద. నన్నయ్య మహాభారతం, పోతన భాగవతం, పెద్దన మనుచరిత్ర– అవన్నీ తెలుగు పుస్తకాలే. అట్నే విశ్వనాథ 'ఆంధ్రప్రశస్తి', రాయప్రోలు 'ఆంధ్రావళి', అడవి బాపిరాజు 'గోన గన్నారెడ్డి'– ఇవన్నీ తెలుగు పుస్తకాలే. అవీ ఇవీ కూడా మనవే అని అప్పుడూ అనుకున్నం. ఇప్పుడూ అనుకుంటం. వాండ్లు వేరు, మనం వేరు అనే భావం తెలంగాణా వాళ్ళకి ఎన్నడూ లేదు. కాని వీళ్ళూ మనవాండ్లే వీళ్ళదీ మన భాషే, వీండ్లదీ మన జీవిత విధానమే అనేటి భావాలు మా గురించి పై నుంచీ వచ్చినోళ్ళకి వుండేటివి కాదు.

రాష్ట్రమవుతది. మొదటినుంచీ తెలుగుభాషకీ, సంస్కృతికీ, సాహిత్యానికీ ఈ మూడు ప్రాంతాల వాళ్లూ కలిసికట్టుగనే తోడ్పడిన్రు. కాని ఆంధ్రప్రదేశ్ ఏర్పడినంక మాత్రమే మనం రాజకీయంగ ఒకటైనం. ఈ మాట మర్చిపోయి, ఆంధ్రప్రదేశ్ ఏర్పడక ముందు తెలంగాణా వాళ్లు తెలుగువాళ్లేకాదన్నట్టు ఒక వ్యవహారముండేటిది కద! ఎవరి దాకానో ఎందుకు? ముఖ్యమంత్రి అంజయ్య (తెలంగాణా) తెలుగు మీద ఎంత గల్లంతు లేచిందీ? ఎన్ని కార్టూను వచ్చినై, అంజయ్య తెలుగు ఎంత చదువుకున్నడు అనేటిది. అతని ఇంట్లో భార్యాబిడ్డలతో గానీ, బయట ఇరుగు పొరుగు వారితోగాని తెలుగులోనే మాట్లాడిండు గద. అతని మాతృభాష (తెలుగు)లో ఆరణాలకూలీగా కొన్నివేల కూలీసభల్లో మాట్లాడిండు. ఆ తర్వాత ముఖ్యమంత్రి అయిండు. ఆరణాలకూలీగా పనిచేసినోడు ముఖ్యమంత్రి కాగూడదనా? కూలీల మాటలు తెలుగు భాషకాదనా? అందరిదీ తెలుగే. అందరం తెలుగోళ్లమే. ప్రజాస్వామ్య సూత్రాల ప్రకారం రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఏ ప్రాంతంవాడైనా, ఎవరైనా వుండొచ్చు. ఎవనికైనా వాని ప్రాంతం యాస వానికుంటది. నెల్లూరు వాడు ముఖ్యమంత్రి అయిండనుకో. వాడే యాసలో మాట్లాడతడు? అట్నే విశాఖపట్నం వాడైన, రాయలసీమవాడైనా కూడా. వీళ్లందరి మాతృభాష తెలుగే. వీళ్లందరు మాట్లాడేటిదీ తెలుగే. అయినప్పుడు "అంజయ్యగారికి, తెలుగురాదు. కాని తెలుగులో మాట్లాడ్డం ఆయనకిష్టం. అందుకోసం ఆయన తెలుగులోనే మాట్లాడతడు" అని ఒక సభలో అధ్యక్షుడు సెలవిచ్చిండు. అప్పుడు "అదేమిటట్టంటరు? అంజయ్యగారు మాట్లాడేటిది తెలుగే" అని దాశరథి లేచి తప్పు పట్టేసరికి అందరూ ఆయన మీద విరుచుకుపడిండ్రు. ఇది సరైందికాదు అని నేను భావిస్త. అయితే రావిశాస్త్రి విశాఖ భాషని తెలుగు కాదని, మేమూ, నల్గొండ వాళ్లది వేరే యాస కాబట్టి అది తెలుగు కాదని వరంగలోడు; వరంగల్ వానిది తెలుగు కాదని బెజవాడ వాడు; బెజవాడు వానిది తెలుగు కాదని రాయలసీమ వాడు– ఇట్లనుకుంటపోతే మన మధ్య సహృద్భావం ఎట్లొస్తది? మనమందరం తెలుగు వాండ్లం అని చెప్పే ఎమోషనల్ ఇంటిగ్రేషన్– ఆత్మీయత ఏముంటది? ఒకని భాష విషయంలో, యాస విషయంలో, తిండి విషయంలో ఎగతాళి చేస్తే అతని ఆత్మాభిమానం దెబ్బతింటది. దానికి వెలకట్టలేం.

• • •

ఏ వేషం వేస్తేనేం? ఏ భాష మాట్లాడితేనేం? వాటిల్లో గొప్ప, ఘనత ఏమున్నయ్? సూటు బూటు వేస్తే గొప్పా? ఇంగ్లీషు మాట్లాడితె ఘనతా? అవసరమైన చోట ఇంగ్లీషు మాట్లాడుకో. ఆ అవసరం తీర్చుకో. అంతవరకే. అంతేగాని Though my mother-tongue is Telugu, I can't express myself in Telugu really. Therefore I want to address you in English. అనేటోళ్ళతోటె నా బాధంతా. ధోతీ కట్టుకుంటే చిన్నతనం అని లాగు, షేర్వాని, పంట్లాం వేసుకునెటోళ్ళు. మా కుటుంబంలో కూడా షేర్వానీలు, లాగులు, పంట్లాలు తొడుక్కునెటోళ్ళున్నరు. అయితె దానికి కారణం ఉన్నది. దర్బార్ డ్రస్ అది. మా పెద్దలు సర్కారీ నౌకరి చేసేటోళ్లు. అంతేగానీ అవి తొడుక్కుంటేనే గొప్ప, ధోతి కట్టుకుంటే చిన్నతనం అనే నియమం మా కుటుంబంలో లేదు. ఉర్దూలోనే మాట్లాడాలె, తెలుగు మాట్లాడితె చిన్నతనం అనేది లేదు.

అన్య భాషలు నేర్చి ఆంధ్రంబు రాదంచు
సకిలింపు ఆంధ్రుడా! చావవెందుకురా?

అన్నను. అయితే రాదని చెప్పి సకిలించడం వల్ల అనవసరంగా తెలుగుని ఎగతాళి చేయడమే. అన్ని భాషలూ నేర్చుకో, కాని నీ మాతృభాషని మాత్రం తప్పకుండా నేర్చుకోవాలె.

**("ఇదీ నా గొడవ" నుంచి)**



# మా ప్రారంభాలు

## చాసో

**(10.01.1915 - 2.01.1994)**

ప్రథమ శ్రేణి కథకుడు.

"విద్యార్థులుగా ఉన్నప్పటి నుంచీ నేనూ రోణంకి అప్పలస్వామి మంచి స్నేహితులం. అతనో పండితుడు. బహు భాషా కోవిదుడు అయ్యాడు. 1930లో సాహిత్య సంబంధం ఉంది ఇద్దరికీ. అందులో మేం ఇద్దరం వామపక్షానికి చెందిన వాళ్లం 18 ఏళ్ల వయస్సు నుంచి. విజయనగరంలో అప్పుడో భావకవి ఉండేవాడు. శ్రీరంగం నారాయణబాబు. ఆ భావకవులు ఏమిటీ అంటే పెద్ద గిరిజాల జుత్తు అదీను. భావ కవుల వేషాలని ప్రత్యేకంగా ఉన్నాయి. పెద్దవి మెళ్లో ఏదో ఒహటి బంగారపుది వేసుకోవడం సుర్మాపెట్టుకోడం, ఛడావులు తొడుక్కోడం ఇవన్నీ ఉండేవి. విచిత్రంగా ఉండిది భావకవి వేషం. ఆ భావకవుల వేషాల్ని మీరెవరూ ఎరుగరు. ఇక్కడ చాలామంది దేవులపల్లి కృష్ణశాస్త్రిని ఎరుగుదురనుకుంటాను. కృష్ణశాస్త్రిని కూడా కుర్రవాళ్ళు ఎరుగరేమో. ఆయనదేమో పెద్ద జుత్తు ఉండేది- అది భావకవి జుత్తు. అంచేత ఆ కృష్ణశాస్త్రి గారొక్కడే ఉండేవారు భావకవి వేషంలో. నారాయణబాబు బ్రతికున్నంత కాలం భావకవి వేషంతోనే ఉండేవాడు. మాంచిగెహరా ఉండేది అతనికి. ఈయనే గాక వేదుల సత్యనారాయణ శాస్త్రి లాంటి వాళ్లు కూడా పెట్టుకున్నారు గెహరా. అది ఆయనకి బావుండేది కాదు. కానీ భావకవులకి ఉండాలి కాబట్టి పెట్టుకున్నాడాయన. నారాయణబాబు భయంకర స్వరూపంతో ఉండేవాడు. పెద్ద మొహం, పెద్ద గెహరా, కొంచెం పొడగరి. దానికి తగిన శరీరం అవీ ఉండేవి. తర్వాత ఉపన్యాసం ఇస్తే అందర్నీ హడలెత్తించే వాడు. పెద్ద వక్తృత్వం ఉండేది. చాలా మంచి వక్త. ఆవేశంతో మాట్లాడేవాడు. కంట్రోల్ చేసుకునే మాట్లాడేవాడు. అతనా భయంకరంగా ఉండేవాడు. మేం చూస్తే చిన్నవాళ్లం. విద్యార్థులం. మాకన్నా ఏడేళ్లు పెద్దవాడు. ఆయనతో పరిచయం పెంచుకున్నాం. కవి కదా పరిచయం ఉండాలి. ఆయన కవిత్వం ఓలా ఉంది.

అప్పుడు శ్రీశ్రీ మహాప్రస్థానం, నారాయణబాబు 'రుధిర జ్యోతి' ఆ రోజుల్లో రాసేవారు. ఆయన్దో పద్ధతి. ఈయన్దో పద్ధతి. శ్రీశ్రీ మాత్రా ఛందస్సు పట్టుకున్నాడు. నారాయణబాబు వదిలేశాడు. పాడుకోవడానికి వీలైన పద్ధతిలో రాశేడు. లయ తప్పకుండా చాలా చక్కగా పాడేవాడు. ఆయన పాడితే ఆడియన్స్‌కి కళ్ళమ్మట నీళ్లు వచ్చేవి. అంత భావయుక్తంగా పద్యం చదివేవాడు. కవితలు చదివిన వాడు ఆంధ్రదేశంలో ఆనాడు మరొకడు లేడు. ఈనాడు అంతకన్నా లేడు. ఇప్పుడన్నలు చదవడం లేదు. మరోలా చదువుతున్నారు.

ఆ విధంగా అరసం ప్రారంభించాం. స్థాపించినప్పుడు చెప్పవల్సిన విషయం ఏమిటంటే- మాకు సహకరించని వాళ్ళు ఇద్దరు. మొదటివాడు శ్రీరంగం శ్రీనివాసరావు, రెండోవాడు కొడవటిగంటి కుటుంబరావు. 'ఈ రచయితలకి ఆర్గనైజేషన్స్ ఎందుకు ఎవడి మానాన వాడు రాసుకోక' అన్నాడు కుటుంబరావు నాతో. భావ సంచలనానికి ఉంటే మంచిదికదా అంటే అలా పనికి రాదన్నాడు. మాకు సపోర్టు చేసినవాడు- బుర్రా సుబ్రహ్మణ్యం- ఆయనేదో అడ్వకేట్ జనరల్ అయ్యాడు ఆఖరికి. ఆయన మంచి కథకుడు, కానీ మరుసటి సంవత్సరం కుటుంబరావు వచ్చేశాడు. ఆ తర్వాత సంవత్సరం శ్రీశ్రీ వచ్చేశాడు. రాజమండ్రి సభకి సిద్ధమయ్యేడు. అక్కణ్ణించి కొసదాకా ఉన్నారిద్దరూ కూడా.

టైమ్ లిటరరీ సంప్లిమెంట్ వచ్చేది. దాంట్లో ఎన్నో రివ్యూలుండేవి. 'బుక్‌మన్' అని ఓ పుస్తకం వచ్చేది. దాన్లో విమర్శలు, వ్యాఖ్యానాలు ఉండేవి. టి.స్.ఇలియట్, ఎడిటర్‌గా 'క్రైటీరియా' అని ఓ పేపరు- జె.సి. స్క్వేర్ ఎడిటర్‌గా 'మెర్క్యురీ' బ్రహ్మాండమైన వ్యాసాలుండేవి. 'ఫోర్ట్ నైట్లీ' అని మరొకటి- ఇదీ సాహిత్య సంబంధమైందే. 'పంచ్' అని హ్యూమరస్ జర్నల్- తర్వాత 'స్ట్రాండ్' అని ఓ మంచి బూర్జువా పత్రిక- అని మేం అనేవాళ్లం. 'నైంటీంత్ సెంచరీ' అని 'సాటర్‌డే రివ్యూ' అని మరికొన్ని.

నా ఆలోచనలు అప్పటికే మరో విధంగా ఉన్నాయి. ఆయనతో పరిచయం అయిన మర్నాడు కవితా సమితితో పరిచయం అయింది. అందులో శ్రీశ్రీ ఒహాడు, పురిపండా ప్రధానమైన వాళ్లు మాకు. అక్కణ్ణించి శ్రీశ్రీతో మొదలు, అతనూ ఏదో గ్రాడ్యుయేట్ అయ్యాడు. అవకతవగ్గా ఆ ఉద్యోగం మానేశాడు. అతనూ భావకవే. వీరి ఉభయులకీ కృష్ణశాస్త్రి గురువు. ఆ సమయంలో వీళ్ళిద్దరూ విజయనగరం వస్తూండేవారు. మాకక్కడ విజయనగరం మహారాజావారి కళాశాలలో ఆనంద గజపతి వారి కాలం నుండి ఇంగ్లండ్‌లో ఉన్నటువంటి సమస్త జర్నల్స్ తెప్పించేవారు. ఇదీ అదీ అని కాదు లెఫ్ట్ వింగ్ రైట్ వింగ్- అన్ని పుస్తకాలు వచ్చేవి.

టైమ్ లిటరరీ సంప్లిమెంట్ వచ్చేది. దాంట్లో ఎన్నో రివ్యూలుండేవి. 'బుక్‌మన్' అని ఓ పుస్తకం వచ్చేది. దాన్లో విమర్శలు, వ్యాఖ్యానాలు ఉండేవి. టి.స్.ఇలియట్, ఎడిటర్‌గా 'క్రైటీరియా' అని ఓ పేపరు- జె.సి. స్క్వేర్ ఎడిటర్‌గా 'మెర్క్యురీ' బ్రహ్మాండమైన వ్యాసాలుండేవి. 'ఫోర్ట్ నైట్లీ' అని మరొకటి- ఇదీ సాహిత్య సంబంధమైందే. 'పంచ్' అని హ్యూమరస్ జర్నల్- తర్వాత 'స్ట్రాండ్' అని ఓ మంచి బూర్జువా పత్రిక- అని మేం అనే వాళ్లం. 'నైంటీంత్ సెంచరీ' అని 'సాటర్‌డే రివ్యూ' అని మరికొన్ని.

ఇందులో వున్నదేంటంటే ఆధునికంగా మా వయసు కుర్రాళ్లకు ఆ కవులు ఫలానా ఫలానా వాళ్లు రాసిన తోకలు దొరికేవి. టి.స్.ఇలియట్, ఎజరాపౌండ్ పేర్లు తెల్సుకున్నాం. వాళ్ల మీద వ్యాసాలు చదివేం. వాళ్లేం రాశారో కొటేషన్స్ దొరుకుతుండేవి. కొటేషన్స్ బావుండేవి, తమాషాగా ఉండేవి. వీటివల్ల వాళ్ల ఫిలాసఫీ ఏమిటో బోధపడుతుండేది. ఇలా చదువుతున్నప్పుడు మా సమ వయస్కులు కొంతమంది డబ్ల్యు.హెచ్.ఆడెన్, స్టీఫెన్ స్పెండర్, లూయీ మేక్నీస్, సిసిల్ డేవిస్ వీళ్లు మా వయసు వాళ్లు- నేను- శ్రీరంగం నారాయణబాబు, శ్రీశ్రీ, రోణంకి పుట్టిన సంవత్సరానికి అటు ఇటుగా పుట్టిన వాళ్లు వీళ్లంతా. వీళ్లేం చెప్పేవారు, మా పొలిటికల్ ఫిలాసఫీ కమ్యూనిజమ్ అని చెప్పేవారు. సిసిల్-డే కమ్యూనిస్ట్ పార్టీ మెంబర్- వీళ్ల కవిత్వం చదివి మా కుర్రాళ్లంతా లెఫ్ట్ వింగర్స్ అయ్యాం. 'అక్టోబర్ విప్లవం' కూడా చదివాం. నారాయణబాబు, శ్రీశ్రీలు భావకవులు కదా అంచేత మాకు వ్యతిరేకంగా ఉన్నట్టు లెక్క. రోజూ అయ్యే చర్చల్లో వాళ్లూ మా వామపక్షానికి వచ్చేశారు.

ఈ పత్రికలన్నీ చదవడానికి శ్రీశ్రీ నెలనాడు వచ్చేవాడు. ఎలా వచ్చేవాడు టిక్కెట్టు కొనకుండా వచ్చేవాడు. ఏ టిటిసినో పట్టుకుని విజయనగరంలో దిగిపోయేవాడు. తిన్నగా మా ఇంటికి నడుచుకొచ్చేవాడు.

మూడ్రోజులో నాల్రోజులో ఉండేవాడు. ఆ నెల పత్రికలన్నీ చదువుకోవడం, ఏదో ఇష్టం వచ్చినట్టు రాత్రి ఒంటిగంట రెండు దాకా నిద్ర మానుకుని ఉండడం, అల్లరి చెయ్యడం- అల్లరి కూడా చేసేవాళ్లం. వయసు చేత రోణంకి, నారాయణబాబు పెద్దవాళ్లైనా మా వయసు వాళ్లైపోయారు. ఆలోచనా క్రమంలో ఒకే ఆలోచనకి చెందిన వాళ్లం కావడం చేత సమ వయస్కులమై పోయాం. ఒరేయ్ ఒరేయ్ అనుకునేవాళ్ళం. నారాయణబాబు శ్రీశ్రీ మాత్రం ఏవండీ అంటే ఏవండీ అనుకునేవారు. ఒరేయ్ అన్న కన్న అధ్వాన్నం అది. ఏవండీ అంటూండం నోటికొచ్చినట్టు అంటుండం త్వంశుంం త్వంతుంట అనుకోడం. ఇదంతా 30లో, 1940 వరకూ ఇలాగే జరిగింది.

దీనికంతటికీ రోణంకి అప్పలస్వామి గురుతుల్యుడు క్రింద లెక్క. ఎందుచేతనంటే జ్ఞానం చేత గొప్పవాడు. అతను బి.ఎ. చదువుతున్న కాలంలో మాకు పాఠం చెప్పే మేష్టర్లకి అతనితో సమానమైన ఇంగ్లీషు భాషా జ్ఞానం లేదు. కొంతమంది మాట్లాడుతుంటే లెక్చరర్స్- గబుక్కున లేచి 'తప్పది' ఇలా అనాలి ఇంగ్లీషు వాక్యం, ఇలా ఉండాలి తప్పు చెప్పేరనేవాడు. ఇదికాకపోతే ఖర్మం చాలక రొమాంటిక్ పోయట్రీ చెప్తుంటే ఆ మేష్టర్లని అడ్డగించి అది కాదు ఇది అని చెప్పి ఇలాగేదో వాళ్లని కొట్టుకుతినేవాడు.

నారాయణ భట్టు నన్నయ్యకి సాయం చేసొట్ట భారతంలో. అలా చాలా మందికీ ఆయన వెనకనున్నాడు. శ్రీశ్రీ ఛందస్సులో పరిణతి చెందడానికి రోణంకి అప్పలస్వామి కారణం. ఫ్రెంచ్ పద్యాలు చదివి దాని ఛందస్సు ఎలా వస్తుందో చెప్పేవాడు. శ్రీశ్రీ గట్టివాడు కదా పద్యాలు రాయడంలో. ఎన్నో ప్రబంధాల్లో పద్యాలు కంఠతా శ్రీశ్రీకి. అవన్నీ రోణంకి బాగా చెప్పేవాడు. శ్రీశ్రీకి గురువు రోణంకి. శ్రీశ్రీ తన జీవిత చరిత్రలో రోణంకి పేరు మెన్షన్ చేయలేదు. అదీ విశేషం. కోపం వచ్చింది విజయనగరం మీద, నారాయణబాబు మీద, అప్పలస్వామి మీద. నా మీదేకోపం లేదు.

**అప్పుడు శ్రీశ్రీ మహాప్రస్థానం, నారాయణబాబు 'రుధిర జ్యోతి' ఆ రోజుల్లో రాసేవారు. ఆయన్దో పద్ధతి. ఈయన్దో పద్ధతి. శ్రీశ్రీ మాత్రా ఛందస్సు పట్టుకున్నాడు. నారాయణబాబు వదిలేశాడు. పాడుకోవడానికి వీలైన పద్ధతిలో రాశేడు. లయ తప్పకుండా చాలా చక్కగా పాడేవాడు. ఆయన పాడితే ఆడియన్స్‌కి కళ్ళమ్మట నీళ్లు వచ్చేవి. అంత భావయుక్తంగా పద్యం చదివేవాడు. కవితలు చదివిన వాడు ఆంధ్రదేశంలో ఆనాడు మరొకడు లేడు. ఈనాడు అంతకన్నా లేడు. ఇప్పుడస్సలు చదవడం లేదు. మరోలా చదువుతున్నారు.**

నేను న్యూట్రల్‌గా ఉండిపోయేను. అందుకే నన్నేమీ అనలేదు ఎప్పుడూను.

40 దాటిం తర్వాత శెట్టి ఈశ్వరరావు నేను పెద్దగ్రూపు తయారయ్యేం. పాతికముప్పై మంది గ్రూపు. అందులో కవులు కొంతమంది-కథకులు కొంతమంది కొత్త అగ్రహారం నుంచి దాసన్నపేట- విజయనగరం తూర్పు పడమరలు సరిపోయే వరకూ ఉండేవారు. వాళ్లంతా కస్సాకి వచ్చేవారు. మా ఇంట్లో ఒక మాటు లేకపోతే అక్కడో క్లబ్బు ఉండేది. అక్కడ పగలల్లా ఒంటిగంటదాకా చేసేవాళ్లం. ఒంటిగంటకి వాడు బజ్జీలు వేస్తే తిని లేసిపోయేవాళ్లం. ఆ క్లబ్బుకి ఆర్.డి. క్లబ్బు అనే పేరు పెట్టాం. రాడికల్ డెమోక్రాట్స్ అక్కడ ఉండేవారు. మేమూ ఉండేవాళ్ళం. పేరు వాళ్లకి పోయింది. తర్వాత పార్కుల్లో సాయంకాలం చేరేవాళ్లం. సభ్యులు కాకుండా ఎవరెవరో కూడా చేరిపోయారు. దాంట్లో రోణంకి, ఎస్.ఎస్.మేస్త్రు, అనశర్మ, అంగర వెంకట కృష్ణారావు, ఓ కథకుడు బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు. తోలేటి అని ఓ కవిగారు. అర్జంటు కవి అని పేరు పెట్టాం. సినిమాల్లో సక్సెస్ అయి చచ్చిపోయాడు. ఏవియం వారి 'జీవితం'కి మాటలు, పాటలు రాసినవాడు. వృద్ధిలోకి రావల్సినవాడు అకస్మాత్తుగా చచ్చిపోయేడు. తర్వాత పూసపాటి కృష్ణంరాజు, పి.జె.రావు- వీడు అంబాసిడర్ అయ్యేడు. జి.ఎస్.భార్గవ మా గ్రూపువాడే. అన్నట్టు ఆరుద్ర ఉండేవాడు. అసలు వాడు, అవసరాల సూర్యారావు అని మేమంతా కల్సి అరసం పెట్టాలని అనుకున్నాం. శెట్టి ఈశ్వరరావు, తాపీ మోహన్రావు అందరం కల్సి తెనాలిలో ప్రారంభించాం.

అప్పుడు శ్రీశ్రీ మహాప్రస్థానం, నారాయణబాబు 'రుధిర జ్యోతి' ఆ రోజుల్లో రాసేవారు. ఆయన్దో పద్ధతి. ఈయన్దో పద్ధతి. శ్రీశ్రీ మాత్రా ఛందస్సు పట్టుకున్నాడు. నారాయణబాబు వదిలేశాడు. పాడుకోవడానికి వీలైన పద్ధతిలో రాశేడు. లయ తప్పకుండా చాలా చక్కగా పాడేవాడు. ఆయన పాడితే ఆడియన్స్‌కి కళ్ళమ్మట నీళ్లు వచ్చేవి. అంత భావయుక్తంగా పద్యం చదివేవాడు. కవితలు చదివిన వాడు ఆంధ్రదేశంలో ఆనాడు మరొకడు లేడు. ఈనాడు అంతకన్నా లేడు. ఇప్పుడస్సలు చదవడం లేదు. మరోలా చదువుతున్నారు.

ఆ విధంగా అరసం ప్రారంభించాం. స్థాపించినప్పుడు చెప్పవల్సిన విషయం ఏమిటంటే- మాకు సహకరించని వాళ్ళు ఇద్దరు. మొదటివాడు శ్రీరంగం శ్రీనివాసరావు, రెండోవాడు కొడవటిగంటి కుటుంబరావు. 'ఈ రచయితలకి ఆర్గనైజేషన్స్ ఎందుకు ఎవడి మానాన వాడు రాసుకోక' అన్నాడు కుటుంబరావు నాతో. భావ సంచలనానికి ఉంటే మంచిదికదా అంటే అలా పనికి రాదన్నాడు. మాకు సపోర్టు చేసినవాడు- బుర్రా సుబ్రహ్మణ్యం- ఆయనేదో అడ్వకేట్ జనరల్ అయ్యాడు ఆఖరికి. ఆయన మంచి కథకుడు, కానీ మరుసటి సంవత్సరం కుటుంబరావు వచ్చేశాడు. ఆ తర్వాత సంవత్సరం శ్రీశ్రీ వచ్చేశాడు. రాజమండ్రి సభకి సిద్ధమయ్యేడు. అక్కణ్ణించి కొసదాకా ఉన్నారిద్దరూ కూడా.

శ్రీశ్రీ మహాప్రస్థానం అచ్చేస్తామని తీర్మానం పెట్టాం తెనాలి సభలో. మాకావకాశం ఇవ్వలేదాయన. అన్నీ బూర్జువా కండిషన్స్ పెట్టేడు. వామపక్షానికి చెందిన మహాప్రస్థానానికి బూర్జువా కండిషన్స్ పెట్టేడు. ఇంత పొడుగుండాలి, ఆర్ట్ పేపరుండాలి. పావలా అంటే దొరకని రోజుల్లో పాతిక రూపాయలు ఖరీదు పెట్టాలి. ఇలాంటి వేవో విడ్డూరమైన కండీషన్స్ పెట్టేడు. కొంతకాలం తర్వాత నళినీ కుమార్- అసలు పేరు ఉండవల్లి సూర్యనారాయణ మా కాలేజీ కుర్రాడు. అప్పుడు మా మధ్యనే తిరిగేడు. శ్రీశ్రీకి కొంచెం కావల్సినట్టు వేసేడు. శ్రీశ్రీ రూల్స్ ప్రకారం వెయ్యలేదు. ఈ సూర్యనారాయణ అన్నవాడు 'ఫణ విఫణి' అనే దీర్ఘ కావ్యం రాసేడు చాలా అందమైన పుస్తకం- దాని ఫిలాసఫీతో మనం ఏకీభవించకపోవచ్చు. కానీ చాలా మంచి కవిత, దీర్ఘ కావ్యాల్లో మంచిది. ఎవ్వరూ ఎక్కడా 'ఫణ విఫణి' పేరు కూడా మెన్షన్ చెయ్యరు. మోస్ట్ ఒరిజనల్ పోయం. ఇందులో భాష గ్రాంథికం. ఛందస్సు కొత్తది. అతని పేరు చెప్తే శ్రీశ్రీకి చెడ్డ కోపం. దాని మీద ఏదైనా రాయ్ అంటే రాయలేదు. ఆ పుస్తకం నా దగ్గరుండేది- పోయింది. నాకు శ్రద్ధ లేదు. అలాగే ఇదీ లేదు, ఎక్కడైనా దొరికితే తిరిగి అచ్చేస్తే మంచిది. మేం ఇలా అభ్యుదయ రచయితల సంఘంగా ఏర్పడ్డానికి మిత్రులు సహకరించిన వాళ్లు విజయనగరంలో ఎంతో మంది ఉన్నారు.

**(1992 సెప్టెంబరు మద్రాసులో 'అరసం' సభలో ప్రసంగం)**



# జైలు గోడల్లో ప్రవహించిన 'అగ్నిధార'


## దాశరథి కృష్ణమాచార్య

(22.07.1915 - 5.11.1987)


నిజాం నిరంకుశత్వంపై 'అగ్నిధారలు' కురిపించి, 'రుద్రవీణలు' పలికించి 19వ ఏటనే జైలు కెళ్ళిన ప్రజా కవి. ప్రముఖ సినీ కవి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థాన కవి.

నా అచ్చైన పుస్తకాలలో మొట్టమొదటిది 'అగ్నిధార'. సాహితీ మేఖల పక్షాన 1949లో అచ్చైంది. మిత్రులు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు శ్రీ పులిజాల హనుమంతరావు గారు ఈ పుస్తకం తొలిముద్రణ చేయించారు. నా సాహిత్య జీవితంలో తొలుదొలుత ప్రోత్సాహమిచ్చిన వారిలో ముఖ్యులు శ్రీ రామానుజరావు గారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు వార్షికోత్సవాలకు పిలిచి కవిసమ్మేళనాలలో పాల్గొనే అవకాశం కలిగించి కవితా పరిమళాలు దశదిశల వ్యాపించేట్టు చేసిన మిత్రులకు నా కృతజ్ఞతలు.

అగ్నిధార అనేపేరును కొందరు ఆక్షేపించారు. అగ్నిధారలా ప్రవహిస్తుందా? అన్నారు కొందరు. విద్యుత్తు అగ్ని కాదా? అది ప్రవహించదా? సముద్రంలోని బడబ అగ్ని కాదా? అది నీటిలో అన్నివైపులా సాగిపోదా? అయినా అగ్ని అన్న పదం దేనికి సంకేతమో ఆలోచించండి. అగ్ని అనేది చైతన్యానికి సంకేతం. ఆ చైతన్యం ఒక మానవుని హృదయంలో నుండి ఇంకొకనిలోకి ప్రవహించి ఇలా జాతినంతటినీ ఏకసూత్రాన బంధిస్తుంది. ఇలా వాదిస్తుండేవాణ్ని. తరువాత కొన్నాళ్లకు ఒక హిందీ పత్రికలో సుమిత్రానందన్ పంత్ గారి కవిత ఒకటి ప్రచురితమైంది. అందులోని ఒక పంక్తిలో 'పావక్ కే ప్రవాహ్ సీ' అన్న ప్రయోగం కనపడింది. అగ్నిధార అన్న మాటకు కడు దగ్గరగా ఉన్న ఆ ప్రయోగం చూచి నేను మరీ ధైర్యంగా వాదించేవాణ్ణి.

ఈ 'అగ్నిధార' లోని ఖండికలు చాలావరకు నా జైలు జీవితంలోను, జైలులోనించి వెలువడిన కొత్తలోనూ రాసినవి. నిజాం రాష్ట్రంలో ప్రభుత్వ నిరంకుశత్వం, ప్రజల అగచాట్లు, భారత స్వాతంత్ర్యం, భారత సైన్యాల ప్రవేశం, నైజాం ప్రభుత్వ పతనం- ఇవన్నీ నా ఈ రచనకు పునాదులు.

నేనూ, నాతోపాటు మరో ముప్పై మంది రాజకీయ ఖైదీలు వరంగల్లు జైలునుంచి నిజామాబాదు జైలుకు మార్చబడినప్పుడు అక్కడ అడుగు పెట్టగానే మొట్టమొదట కనిపించిన మిత్రుడు శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి. ఆజానుబాహు విగ్రహం. పచ్చని దేహచ్ఛాయ. చిన్న చడ్డీ. చాలీచాలని గీట్ల అంగీ. నెత్తిన చిన్నటోపీతో, నీటి వంపు వద్దకు వెళుతున్నాడాయన. హత్యలుచేసి శిక్షలు పొందినవారికిచ్చే దుస్తులు ఆయనకిచ్చారు. అవే తొడుక్కుని ఆయన కాలక్షేపం చేస్తున్నాడు. నేనంటే- ముఖ్యంగా కవులంటే- ఆయనకు ఎక్కడలేని అభిమానం. స్వయంగా కవిత రాయకపోయినా, కవిత వినాలని, చదవాలనీ ఎంతో కుతూహలం ఆయనకు. విప్లవాత్మకమైన రచన వింటే ఉప్పొంగిపోయేవాడు. జైలు గోడమీద బొగ్గుతో ఈ పద్యం రాశాను ఒకనాడు.

ఓ నిజాము పిశాచమా! కానరాడు  
నిన్నుబోలిన రాజు మా కెన్నడేని  
తీగెలను తెంపి అగ్నిలో దింపినావు  
నా తెలంగాణ కోటి రత్నాల వీణ

ఈ పద్యం కంఠస్తం చేసి తరచు చదువుతూ వుండేవాడు. జైలు అధికార్లు చెరిపినప్పుడల్లా మరో గోడమీద ఆ పద్యం ప్రత్యక్షమయ్యేది. అది నేను రాస్తున్నానని వాళ్ల దురభిప్రాయం.

నెల్లికుదురు (మానుకోట తాలూకా) గ్రామంలో పోలీసు స్టేషన్ నుంచి తప్పించుకుని అడవిలోపడి పరిగెత్తినప్పుడు, గుఱ్ఱాల మీద నలభైమంది సైనికులు నన్ను వెదుకుతూ వెంటాడి నప్పుడు, క్షణం ఆగకుండా అరణ్యంలో పరుగెత్తుతుంటే ఎక్కడో పది గుడిసెలు, చిన్నపల్లె. అక్కడ కాస్త సేపు ఆగి మంచినీళ్లు అడిగితే ఆప్యాయంగా గళాసులో నీళ్లు అందించిన రైతు పిల్ల ఒయ్యారం, ఆమె కళ్లలోని అమాయికత నన్ను మైమరపించాయి. జైల్లో కిటికీలోంచి చూస్తే బయట మామిడికొమ్మ చిగిర్చి, పూలుపూస్తే లక్ష ఉగాదులు ఒక్కసారి హృదయంలో చూసినట్లుండేది.

అయితే వీటితోపాటు అంతర్వాహినిగా కొంత శృంగారం వెలువడకపోలేదు. 'అంగారం, శృంగారం నీ రచనలో కలగలిపి వుంటాయిరా' అంటాడు నా బాల్యమిత్రుడూ, ప్రముఖ రచయిత, విమర్శకుడు శ్రీ డి. రామలింగం. ఇది నాలోని ప్రత్యేకత అని అతని అభిప్రాయం. ఈ రెండు భిన్నవిషయాలు కలగలిసి సాగడం సాధ్యమా? అని కొందరు అనవచ్చు. దానికి ఉదాహరణలు చాలా కవుల్లో చూపుతాను. ముఖ్యంగా నా ఉర్దూకవి మిత్రులలో మఖ్దూం మొహియుద్దీన్ ఎంత విప్లవ కవియో అంత శృంగార కవి. అతని 'సురభ్ సవేరా' చూడండి. అలాగే కైఫీ ఆజ్మీ, ఆలీ సర్దార్ జాఫ్రీ మున్నగువారు. సైనికుడు యుద్ధరంగంలో పోరాడుతూ కూడా అప్పుడప్పుడూ తన ప్రియురాలి అందమైన కళ్ళను తలచుకోవడం అస్వాభావికమా? కానేకాదు. క్రాంతిని ప్రబోధించే ఎందరో కవులు కమ్మని శృంగారం రాశారు. దానికి ఉదాహరణగా నేను 'సాహిర్', శ్రీశ్రీ, ఆరుద్ర కవితలను చూపగలను. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే, కరకు నైజాం సిపాయిలను ఎదురిస్తూ అరణ్యాలలో తిరుగుతున్నప్పుడున్నూ, జైల్లోనూ- మా వూళ్ళో నదికి మంచినీళ్ళు తీసుకుపోవడానికి వచ్చే పచ్చని అమ్మాయి తలపులో మెదులుతుండేది. నేను జైల్లో ప్రవేశించినప్పుడు నా వయస్సు సుమారుగా ఇరవై. ఆకాశంలోకి తలెత్తి చూస్తే మేఘాలు అందమైన అమ్మాయిల ఆకారాలు ధరించి, పొంగిన వక్షస్తలాలతో నన్ను కవ్వించడానికి వచ్చేవి. తల దించి జైలు బ్యారకు వైపు చూస్తే నగ్నఖడ్గం తళతళా మెరుస్తుండగా తుపాకీకి చెక్కి కవాతుచేసే భటుడు కనిపించేవాడు. వాణ్ణి నరికేసి, లేదా వానిచే నరకబడి, ఆ ఆకాశంలో కనిపించే మేఘభామిని వైపు వెళ్లాలనిపించేది.

నెల్లికుదురు (మానుకోట తాలూకా) గ్రామంలో పోలీసు స్టేషన్ నుంచి తప్పించుకుని అడవిలోపడి పరిగెత్తినప్పుడు, గుఱ్ఱాల మీద నలభైమంది సైనికులు నన్ను వెదుకుతూ వెంటాడి నప్పుడు, క్షణం ఆగకుండా అరణ్యంలో పరుగెత్తుతుంటే ఎక్కడో పది గుడిసెలు, చిన్నపల్లె. అక్కడ కాస్త సేపు ఆగి మంచినీళ్లు అడిగితే ఆప్యాయంగా గళాసులో నీళ్లు అందించిన రైతు పిల్ల ఒయ్యారం, ఆమె కళ్లలోని అమాయికత నన్ను మైమరపించాయి. జైల్లో కిటికీలోంచి చూస్తే బయట మామిడికొమ్మ చిగిర్చి, పూలుపూస్తే లక్ష ఉగాదులు ఒక్కసారి హృదయంలో చూసినట్లుండేది.

మహాకవి 'ఇక్బాల్' రాసిన ఒక విప్లవగీతంలో 'జిస్ ఖేత్‌సే దహ్ఖా కు మయస్సర్ నహీ రో జీ

ఉస్ ఖేత్ కె హర్ ఖూష్‌యె గందుం కు జలాదో-

- ఏ పొలమున నిరుపేదకు దొరకదో తిండి

ఆ పొలమునగల పంటను కాల్చేయండి' అనే పద్యపాదం ఒకటుంది. అది చదువుతున్నప్పుడల్లా హృదయం ఉద్రేకంతో పొంగిపోయేది. కాస్త చల్లబడ్డాక ఆలోచిస్తే- ఆ పొలాన్ని కాపలా కాసే అందమైన అమ్మాయికి ఏ అపకారం జరక్కుండా ఆ పంట తగలబెట్టాలి సుమా! అనేది హృదయం.

ఇలా శృంగార వీరరసాలు కలగలిసి నాలో పెల్లుబికేవి. వాటికే తార్కాణం అగ్నిధార. ప్రముఖ దేశభక్తులు, అమృత హృదయులు కీ.శే. వట్టికోట ఆళ్వారుస్వామిగారు నాకు నిజామాబాదు జైల్లో కనిపించారు 1948లో. నేనూ, నాతోపాటు మరో ముప్పై మంది రాజకీయ ఖైదీలు వరంగల్లు జైలునుంచి నిజామాబాదు జైలుకు మార్చబడినప్పుడు అక్కడ అడుగు పెట్టగానే మొట్టమొదట కనిపించిన మిత్రుడు శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి. ఆజానుబాహు విగ్రహం. పచ్చని దేహచ్ఛాయ. చిన్న చడ్డీ. చాలీచాలని గీట్ల అంగీ. నెత్తిన చిన్నటోపీతో, నీటి పంపు వద్దకు వెళుతున్నాడాయన. హత్యలుచేసి శిక్షలు పొందినవారికిచ్చే దుస్తులు ఆయనకిచ్చారు. అవే తొడుక్కుని ఆయన కాలక్షేపం చేస్తున్నాడు. నేనంటే- ముఖ్యంగా కవులంటే- ఆయనకు ఎక్కడలేని అభిమానం. స్వయంగా కవిత రాయకపోయినా, కవిత వినాలని, చదవాలనీ ఎంతో కుతూహలం ఆయనకు. విప్లవాత్మకమైన రచన వింటే ఉప్పొంగిపోయేవాడు. జైలు గోడమీద బొగ్గుతో ఈ పద్యం రాశాను ఒకనాడు.

ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్నుబోలిన రాజు మా కెన్నడేని
తీగెలను తెంపి అగ్నిలో దింపినావు
నా తెలంగాణ కోటి రత్నాల వీణ

ఈ పద్యం కంఠస్తం చేసి తరచు చదువుతూ వుండేవాడు. జైలు అధికార్లు చెరిపినప్పుడల్లా మరో గోడమీద ఆ పద్యం ప్రత్యక్షమయ్యేది. అది నేను రాస్తున్నానని వాళ్ల



# వివేకవర్ధని

**- కందుకూరి వీరేశలింగం**

**(15.04.1848 - 17.05.1919)**

ఈ పత్రికా ప్రకటనమునందు నా యుద్దేశములు భాషాభివృద్ధియు దేశాభివృద్ధియు ముఖ్యముగా రెండు. నే నేర్పరుచుకొన్న భాషాభివృద్ధి మార్గము తెలుగు భాషలో మృదువైన సులభశైలిని సలక్షణమైన వచన రచన చేయుట, దేశాభివృద్ధి మార్గము జనులలో గల దురాచార దుర్వర్తనములఁబాపియు వృద్ధి పద్ధతులను జూపియు వారి నధిక నీతిమంతులనుగా జేసి దేశము నున్న తస్థితికిఁదెచ్చుటకయి శక్తివంచన లేక పాటు పడుట. దేశాభివృద్ధి కలుగుటకయి విద్యా విషయమునను, వ్యవహార విషయమునను, కులాచార విషయమునను, నీతి విషయమునను, మత విషయమునను, నానా ముఖముల గృషి చేయవలయుననియే కాని యొక్క రాజ్యాంగ విషయములయందే పనిచేయుట నా యుద్దేశము కాదు. మానవ దేహములోని కరచరణాది సమస్తావయవములును యథా ప్రమాణముగా పెరుగుటయే వృద్ధికాని యొక్క తలయో కాలో యత్యధికముగా పెరుగుట వృద్ధికాక రోగమయినట్లే దేశ విషయంలో గూడ జనులు నీతి మత కులాచారాదులైన సమస్తాంగములయందును సమానముగా నొందుటయే వృద్ధిగాని యితరాంగములకు భంగం కలుగునట్లుగా నొక్క రాజ్యాంగముల యందే గాని యొక్క బుద్ధి ప్రచారము నందేగాని యత్కర్షము నొందుట క్షేమకరమైన దేశాభివృద్ధి కాదని నా యభిప్రాయము. రాజ్యాంగ విషయమున నెక్కడనో దూరమున నున్న పరిపాలకులను వారి శాసనములను వెల్లడి చేయుట యధిక ప్రయోజనకరమని నా నమ్మకము. దొరతనము వారికిఁజెల్లింపవలసిన నేల పన్నుల మొత్తము కంటే వీరిచ్చెడు రాజపురుషుల కియ్యవలసిన లంచముల మొత్త మొక్కవయినప్పుడు నేల పన్ను కొంచెము తగ్గింపబడిన మాత్రముననే కాపుల కేమి మేలిమి కలుగబోవును? వ్యాజ్యపు మొత్తం కంటె న్యాయాధిపతికి సమర్పింపవలసిన యుపాయనమే యధిక మయినప్పుడు వాది యభియోగ పత్రమునకు బెట్టువలసిన ముద్రకాగితముల మూలన పరిమితి తగ్గింపబడిన మాత్రముననే గెలుపొందియు నతఁడేమి లాభమనుభవింపఁగలుగును? చేసిన యపరాధమునకయి శిక్షాస్మృతినిబట్టి కట్టవలసిన ధనదండనము కంటె దోషిని దండింపక విడుచుటకును నిర్దోషిని దండించుటకును దండ విధాయి స్వీకరించెడు ముడుపే యెక్కువయినప్పుడు దండ శాసనముల యందు మంచి మార్పులు కలిగింపబడిన మాత్రముననే మాన ప్రాణ రక్షణము కలవారయి ప్రజలెట్లు సుఖమనుభవింపఁగలుగుదురు? ఆ కాలమునందు రాజకీయోద్యోగులలో లంచములు పుచ్చుకొనుట సర్వసాధారణము, పుచ్చుకొన కుండుట మృగ్యము, లంచము తప్పుగాక యద్యోగధర్మమనియె యెల్లవారి నమ్మకము. కాబట్టి రాజకీయోద్యోగులలోని యీ యక్రమమును మాన్పఁబూనుట మా పత్రికోద్దేశములలో నొకటి. లంచము లిచ్చెడు ప్రజలలోను పుచ్చుకొనెడి యధికారులలోను నీతిగౌరవము వర్ధిల్లక లంచము లడఁగవు. కాబట్టి జనులలో నీతిమానమును వృద్ధి చేయుట యింకొక యుద్దేశము. వేశ్యాగమనాదులు దురాచారము లని కులములో భావింపఁబడకుండు నంతవరకు నీతి యెట్లు తలయెత్తి వర్ధిల్లఁగలుగును? కాబట్టి కులాచారములను చక్కఁబఱుపఁబూనుట మరియొక యుద్దేశము. తులసీ రుద్రాక్ష మాలాది బాహ్యచిహ్న ధారణమునకంటె సత్ప్రవర్తనము మతమున కధికావశ్యకమని జనులలో విశ్వాసము కుదురువరకును మతము పరిశుద్ధమయి దురాచార నివారకము కానేరదు. కాబట్టి పరిశుద్ధ మత సిద్ధాంతములను బోధించుట వేరొక యుద్దేశము. ఇట్టి సదుద్దేశములతో మా వివేకవర్ధని మొదట వెలువడినది.

**('స్వీయ చరిత్రము' నుండి)**

---

దురభిప్రాయం. తరువాత ఆళ్వారు రాస్తున్నాడని కనిపెట్టారు. ఆళ్వారూ, నేను కలిసివున్న మూడునెల్లూ మూడు ఘడియల్లా గడిచాయి జైల్లో. తరువాత ఆయన్ను గుల్బర్గా జైలుకు మార్చారు. నేను హైదరాబాదు (చంచల్గూడా) జైలుకు వచ్చేశాను. అకాల మృత్యువు వాతబడిన శ్రీ ఆళ్వారుస్వామి, త్యాగమూర్తి నా హృదయ ఫలకం మీద సర్వదా అధిష్టించి ఉంటాడు. ఆయనకు మైత్రీ చిహ్నంగా ఈ చిన్ని పొత్తము అంకితము చేసుకున్నాను. కల్మషాలు లేని కమనీయమూర్తి, కరుణజాలువారే అనురాగమూర్తి ఆళ్వారు. ఆయనను కోల్పోయి మేము ఎలా జీవిస్తున్నామో నాకు ఆశ్చర్యంగా వుంటుంది. అతను లేకుండా జీవించి ఉన్నందుకు నావరకు నేను సిగ్గుపడుతున్నాను. రాత ముఖ్యం కాదు. చేత ముఖ్యం అన్న ఆయన సూక్తి ఎప్పుడూ నా మనస్సులో మెదులుతుంటుంది. నా జీవితంలో కూడా అనుసరణీయమైన సూత్రం అదే. 'అగ్నిధార'ను ఈనాడు పునర్ముద్రించడానికి పూనుకున్న వారు నా మిత్రులు శ్రీ చందా రాజేశ్వరరావుగారు. ఇందుకు ప్రోత్సాహమిచ్చినవారు శ్రీ ఎం.ఆర్. బలరామాచార్యులు. శ్రీ పి. హనుమంతరావు గారలు పునర్ముద్రింపబడిన ఈనాడు, సుమారు పదిహేనేండ్ల నాటి నా జీవితాన్ని, కాలాన్ని స్మృతికి తెచ్చుకుంటే ఆనంద విషాదాలు, శృంగార వీరాలు అహమహమికతో కళ్ళ ముందు పరుగెత్తుతాయి. మల్లెలూ, మోదుగులూ రెండూ నాకు నచ్చినట్లు శృంగార వీర రసాలు రెండూ నా హృదయాన్ని పొంగిస్తాయి. ఆనాటికీ, ఈనాటికీ ఆ రెండు రసాల రసాలాల ఫలాలను ఆస్వాదించి ఆనందిస్తున్నాను.

ఈ రెండవ ముద్రణకు గూడా పీఠిక వ్రాసి నన్ను ఆశీర్వదించిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి సహృదయతకు నా జోహార్లు.

**('అగ్నిధార' ముందుమాట)**



# స్నేహపాశమే సాహిత్య రహస్యం

## బుచ్చిబాబు

(14.06.1916 - 1967)

అసలు పేరు శివరాజు వెంకట సుబ్బారావు. అగ్రశ్రేణి రచయిత.

గతించిపోయిన యౌవనం, జాడ్యం, బీదతనం, మృత్యువు- ఇవి జీవితంలోని చెడుగు. ఈ చెడుగులో, మానవుడు గుండె బాదుకోవాల్సిన విషాదం ఏమీ లేదు. జీవితంలో నిజమైన విషాదం ద్వేషించడం కూడా కాదు, నిజమైన విషాదం ప్రేమించలేకపోవడం. ద్వేషించడంలో కొంత పట్టుదల, కార్యసాధన కూడా వుండొచ్చు; కాని ప్రేమించలేక పోవడంలో అట్లా సమాధాన పడేటందుకేమీ లేదు. "నా కొరకు చెమ్మగిలు నయనమ్ము లేదు."- కంటె విషాదకరమైన గీతం ఏదుంది? ఈ సమస్య నన్ను బాధించింది. దీన్నిబట్టి ఈ సమస్యని నవలలో చర్చించి, వొక సమాధానం కనుక్కున్నానని కాదు. ఈ వస్తువుని వ్రాసేస్తే విషయం నాకు విశదపడుతుందనీ, నలుగురితో పంచుకుంటే బాధనుండి విముక్తి లభిస్తుందనీ తోచింది వ్యక్తిగతమైన విముక్తి ఈ నవలకి ప్రేరణ.

ప్రేమించలేకపోవడం వొకటే కాదు ఈ నవలలో వస్తువు. జీవితంలో 'చెడుగు'... 'పాపం'... ముఖ్యంగా పెద్దలు చేసిన తప్పిదాలు పిన్నలపై బడి వారి జీవితాల్ని ఏ విధంగా వికసించ నీయకుండా, పాడుచేసింది... ఇది కూడా వొక ప్రధానమైన అంశమే. ఒకరు చేసిన అపచారాలకి మరియొకరు బాధ్యులై బాధపడటం వల్ల సమాజంలో వ్యక్తిగతమైన నైతిక విలువలకి తావులేకుండా పోతుంది.

ఈ నవల (చివరకు మిగిలేది) 1942లో తలపెట్టినా, రచన 1946లో 'నవోదయ'లో సీరియల్‌గా ప్రారంభమై పదహారు మాసాల తరువాత పూర్తయింది.

నవల ముగియగానే శ్రీ పిలకా గణపతి శాస్త్రి, శ్రీమతి అచంట శారదాదేవి 'నవోదయ'లో విపులంగా, లోతుగా పరిశీలిస్తూ, విమర్శలు ప్రచురించారు. వారికి నా కృతజ్ఞత.

పాశ్చాత్య దేశాలలో నవల జీవితం మూడు మాసాలట. మన దేశంలో మూడు సంవత్సరాలనుకున్నా, ఈ నవల మరుగునపడి నాలుగేండ్లు కావస్తోంది. 'దేశికవితా మండలి' వారి సాహసం వల్ల ఈ నాటికి పుస్తక రూపంగా వెలువడుతోందని విని, కొందరు స్నేహితులు ఇందులో విశేషమేమిటని ప్రశ్నించారు. నిజంగా నాకు ఏం సమాధానం చెప్పాలో తెలీదు. ఈ ప్రశ్ననే నేను వేసుకుని మరొకరి పుస్తకాన్ని చదివినట్లుగా తిరిగి చదివితే కొన్ని విషయాలు తెల్లమైనై. కాలం గడిచిన తర్వాత, రచయితకి తన రచనపై ఒక రకం ఏవగింపు పుడుతుంది. ఈ రకం రోత వల్లనే కాబోలు కొన్ని జంతువులు తమ సంతానాన్ని పుట్టగానే తినేస్తుంటాయి. ఇన్ని పుటల గ్రంథంతో విడవక, ఇంకా కొంత వ్యాఖ్యానంతో పాఠకుణ్ని ఇబ్బంది పెట్టడం అన్యాయంగా తోచినా ఏవగింపుని కాసేపు దిగమింగుకుని నవల పుట్టుపూర్వోత్తరాలని పరిచయం చేద్దామని ఈ ఉపోద్ఘాతం సాగిస్తున్నాను.

గతించిపోయిన యౌవనం, జాడ్యం, బీదతనం, మృత్యువు– ఇవి జీవితంలోని చెడుగు. ఈ చెడుగులో, మానవుడు గుండె బాదుకోవాల్సిన విషాదం ఏమీ లేదు. జీవితంలో నిజమైన విషాదం ద్వేషించడం కూడా కాదు, నిజమైన విషాదం ప్రేమించలేకపోవడం. ద్వేషించడంలో కొంత పట్టుదల, కార్యసాధన కూడా వుండొచ్చు; కాని ప్రేమించలేకపోవడంలో అట్లా సమాధాన పడేటందుకేమీ లేదు. "నా కొరకు చెమ్మగిలు నయనమ్ములేదు."– కంటె విషాదకరమైన గీతం ఏదుంది?

1943లో రాయలసీమ ప్రజల్ని పరిశీలించే అవకాశం కలిగింది నాకు. వార్ని పూర్తిగా అర్థం చేసుకున్నానని కాదు. చాలా కాలం దగ్గర పరిచయం వల్ల, వ్యక్తుల్ని అర్థం చేసుకోవడం సులభమన్నది నా అనుభవం కాదు. దూరంగా, అప్పుడప్పుడు లభ్యమయ్యే తాత్కాలిక పరిచయం వల్ల, చెత్తాచెదారం లేకుండా వ్యక్తుల ప్రధాన మనస్తత్వాలు, లక్షణాలు, ప్రస్ఫుటమవు తాయనుకుంటాను. ఈ పరిచయం వల్ల, రాయలసీమ ప్రజలకీ, సర్కారుజిల్లాల ప్రజలకీ పరస్పర వైముఖ్యాలున్నాయన్న సంగతి నాకు స్పష్టమైంది. వారినిగాని, వీరినిగాని విమర్శించాలన్న ఉద్దేశం నాకు లేదు. ఆర్థిక స్థితిగతులు; చరిత్రా ఈ విముఖత్వానికి కొంతవరకూ కారణాలైనా కేవలం అవే కారణాలన లేము. అసలు జనం ఎందుకు పరస్పరం ద్వేషించుకుంటారు? ఇరుగు పొరుగు ప్రాంతాలవారి స్నేహ భావానికి ఆటంకాలేవి? పరస్పర ద్వేషం, అసహనం– ఇవి ఆ రోజుల్లో నన్ను కలవరపెట్టినై. భాష, ఆర్థిక పరిస్థితులు, రాకపోకల సౌకర్యాలు– ఇవన్నీ సంతృప్తిగా ఏర్పాటైనా, ఇరుగు పొరుగు ప్రాంతాల ప్రజలలో, ద్వేష చిహ్నాలుంటూనే ఉంటాయి. ఒకవేళ సర్కారు జిల్లాల వారు, రాయలసీమ వారు ఏకమై ఆంధ్రరాష్ట్రం సిద్ధించినప్పటికీ, వీరిరువురూ కలిసి ద్వేషించేటందుకు మరో ప్రాంతం ప్రజ– ఏ తమిళులో, మహారాష్ట్రులో, కన్నడులో– ఎవరో వొకరు కనిపిస్తూనే వుంటారను కుంటాను. ప్రాంతీయ వైరాలు, అంతర్జాతీయ రంగంలో కూడా ఉంటున్న విషయం మన మందరమూ గమనిస్తూనే ఉన్నాము.

ఇందులో నాయకుడు సర్కారు జిల్లాల వాతావరణంలో ఇమడలేదు. అనేక అనుభవాలు అతన్ని ఏకాకిని చేస్తాయి. రాయలసీమలో మరో జీవితం ప్రారంభిస్తాడు. అదృష్టవశాత్తు అతనికి భాగ్యం లభిస్తుంది. స్థిమితపడుతుండగానే మళ్లా పూర్వపు అనుభవాలు, శక్తులు అతన్ని చుట్టుముట్టుతాయి. ప్రేమ రాహిత్య ప్రవాహంలో పడిపోతాడు. ప్రాణాలతో బయటపడి, మరోచోట, మరో జీవితం సాగించడానికి వెళ్లి పోతాడు. ఇదీ ఇందులో కథ. అతనేమీ సాధించలేడు. కాని సాధించలేకపోయానన్న జిజ్ఞాస అతన్ని జీవితానికి కట్టిపడేసినా కూడా, నిస్పృహుణ్ని చెయ్యలేదు.

గతించిపోయిన యౌవనం, జాడ్యం, బీదతనం, మృత్యువు– ఇవి జీవితంలోని చెడుగు. ఈ చెడుగులో, మానవుడు గుండె బాదుకోవాల్సిన విషాదం ఏమీ లేదు. జీవితంలో నిజమైన విషాదం ద్వేషించడం కూడా కాదు, నిజమైన విషాదం ప్రేమించలేకపోవడం. ద్వేషించడంలో కొంత పట్టుదల, కార్యసాధన కూడా వుండొచ్చు; కాని ప్రేమించలేకపోవడంలో అట్లా సమాధాన పడేటందుకేమీ లేదు. "నా కొరకు చెమ్మగిలు నయనమ్ములేదు."– కంటె విషాదకరమైన గీతం ఏదుంది? ఈ సమస్య నన్ను బాధించింది. దీన్నిబట్టి ఈ సమస్యని నవలలో చర్చించి, వొక సమాధానం కనుక్కున్నానని కాదు. ఈ వస్తువుని వ్రాసేస్తే విషయం నాకు విశదపడుతుందనీ, నలుగురితో పంచుకుంటే బాధనుండి విముక్తి లభిస్తుందనీ తోచింది వ్యక్తిగతమైన విముక్తి ఈ నవలకి ప్రేరణ.

ప్రేమించలేకపోవడం వొకటే కాదు ఈ నవలలో వస్తువు. జీవితంలో 'చెడుగు'... 'పాపం'... ముఖ్యంగా పెద్దలు చేసిన తప్పిదాలు పిన్నలపై బడి వారి జీవితాల్ని ఏ విధంగా వికసించ నీయకుండా, పాడుచేసింది... ఇది కూడా వొక ప్రధానమైన అంశమే. ఒకరు చేసిన అపచారాలకి మరియొకరు బాధ్యులై బాధపడటం వల్ల సమాజంలో వ్యక్తిగతమైన నైతిక విలువలకి తావులేకుండా పోతుంది. ఒక వ్యక్తికి కంటి మెల్ల ఉన్నప్పుడు, అతన్ని హింసించదలచుకున్నప్పుడు సంఘం, అతని గుడ్డితనాన్ని వేలెత్తి చూపుతుంది. ఈ కథలో నాయకుడి "తల్లి" పాత్ర చిత్రించబడలేదు. కాని ఆమె చేసిన అపచారాల ఫలితం, నీడలా అతన్ని వెంటాడి, సంఘ విమర్శ ద్వారా, జీవితాన్ని కలుషితం చేస్తుంది. ఈ దౌర్జన్యాన్ని ఎదుర్కోవడంలో అతను కొన్ని విలువల్ని సాధిస్తాడు. ఆ విలువలతో ఈ నవలకి నిమిత్తం ఉంది.

ఈ సమస్యని కథావస్తువుగా తీసుకొని, ఇదివరలో అనేకులు వ్రాశారు. మన ప్రాచీన వాఙ్మయంలో రేణుక, జమదగ్నుల కథ ఎన్నదగ్గది. తల్లి అపచారం చేసింది గనుక ఆమెని సంహరించమని, ఆ ఋషి తన పుత్రుల నడుగుతాడు. ఎవ్వరూ అంగీకరించరు. ఒక్క కుమారుడు మాత్రం సిద్ధపడి, ఆ కార్యం నెరవేరుస్తాడు. తండ్రి దానికి సంతోషించి, ప్రసాదించిన వరం వల్ల, తన తల్లిని బ్రతికించుకుంటాడు. తల్లిని బ్రతికించు

తల్లిదండ్రుల గుణాలుగాని, అవగుణాలుగాని రక్తం ద్వారా పిల్లలకు ఏ విధంగా సంక్రమిస్తాయో వివరించడం "చివరకు మిగిలేది" తలపెట్టదు. తన తల్లిని గురించి సమాజంలో చాటుమాటుగా నీతికీ, అవినీతికీ సంబంధంలేని కథలేవో ప్రచారమవుతుండగా వింటున్న కొడుకు జీవితం ఎన్ని విధాల కుంటుపడిపోతుందో చిత్రించడమే ఈ నవల లక్ష్యం. అంచేత ఈ ప్రచారాలకి తావునిచ్చిన తల్లి జీవితంలోని ఘట్టాలలోని సంఘర్షణ తొలగించి, వాటిని మరుగుపరచడం జరిగింది.

కోగలనన్న ధైర్యం వల్లనే, అతనీ పని చెయ్యగలిగాడని నాకు స్ఫురిస్తుంది. ఇందులో ధ్వని కేవలం మాతృప్రేమ కాదు; అసలు మానవత్వం యొక్క ప్రేమ ప్రకర్ష.

షేక్స్‌పియర్ తన "హామ్‌లెట్" నాటకంలో ఈ వస్తువునే కళానుగుణంగా ప్రదర్శించయత్నించాడు. ఈ యత్నంలో షేక్స్‌పియర్ విఫలుడయ్యాడని తీర్మానం చేస్తూ, T.S.Eliot ఇలా విమర్శిస్తున్నాడు.

కళ ద్వారా ఉద్రేకాన్ని ప్రదర్శించాలంటే, ఆ ఉద్రేకంతో సమంగాతూగే పరిస్థితులనుగాని, వస్తువులనుగాని సృష్టించాలి; భౌతికానుభవంలో అంతమయ్యే ఆ పరిస్థితులను, వస్తువులను చిత్రించగానే, ఆ ఉద్రేకం ఉద్భవిస్తుంది. బాహ్య స్థితిగతులకు, ఆంతరంగిక ఉద్రేకానికి సమత్వం కుదిరినప్పుడే రసానుభూతి కలుగుతుంది. "హామ్‌లెట్"లో ఇది లేదు. స్థూల జగత్తులో కనపడే వాటికి మించిపోయిన ఉద్రేకానికతను లొంగిపొయ్యాడు. తల్లిచర్య అతనికి రోత పుట్టిస్తుంది. కాని ఆ రోత తీవ్రతకి "తల్లి ప్రతిమ" సరిపడలేదు. అతని ఏవగింపు ఆమెని కమ్మివేసి అతీతమైంది. ఆ బాధకి సరిపడ్డ వస్తువు బాహ్యజగత్తులో లేకపోవడం వల్ల అతను విముఖుడయ్యాడు.

నాయకుని బాధకి, స్పృశించగల శక్తులకూ సమత్వం కుదర్చడానికీనవల యత్నిస్తుంది.

తరువాత 1887లో గైడిమొపాసా ఈ సంఘటననే, తన 'పెర్రి అండ్ జీన్' అనే పెద్ద కథలో చిత్రించాడు. ఇందులో తల్లి చేసిన అపచారాలు ఆమె జీవించి వుండగానే తన సంతానంపై కురిపించిన అరిష్టాలని అందంగా చూపించాడనిపిస్తుంది. మొపాసా తన కథకు వ్రాసిన ఉపోద్ఘాతంలో "చిత్రపటం గీయించుకున్న చిత్రకారుడు, ఎముకల సొంపుని గురించి పట్టించుకోడు" అని వ్రాశాడు. ఫ్రెంచి విమర్శకులు- ఈ రచన చదివినవాడు బాధపడతాడు గాని, రంజితుడు కాలేడన్నారు. ఎముకల అమరికతో నిమిత్తం లేకుండా చిత్రపటం గీయటానికి పూనుకోవడం సాహసమే మరి.

తల్లిదండ్రుల గుణాలుగాని, అవగుణాలుగాని రక్తం ద్వారా పిల్లలకు ఏ విధంగా సంక్రమిస్తాయో వివరించడం "చివరకు మిగిలేది" తలపెట్టదు. తన తల్లిని గురించి సమాజంలో చాటుమాటుగా నీతికీ, అవినీతికీ సంబంధంలేని కథలేవో ప్రచారమవుతుండగా వింటున్న కొడుకు జీవితం ఎన్ని విధాల కుంటుపడిపోతుందో చిత్రించడమే ఈ నవల లక్ష్యం. అంచేత ఈ ప్రచారాలకి తావునిచ్చిన తల్లి జీవితంలోని ఘట్టాలలోని సంఘర్షణ తొలగించి, వాటిని మరుగుపరచడం జరిగింది.

ఈ సంకల్పం దోషభూయిష్టమైందని పాఠకులకి తోస్తే ఈ వస్తువే సారస్వతంలో కళానుగుణంగా ప్రదర్శించడానికి అర్హత లేనిదని అనుకోవాల్సి వొస్తుంది. ఈ విషయం పాఠకునికే వొదిలేస్తున్నాను. ఇవన్నీ అనవసరమని తోచినవారు "చీకటి సమస్య" అన్న అధ్యాయాన్ని వొదిలెయ్యవచ్చును.

సమాజాల మధ్య వున్న ద్వేషాలకీ, వ్యక్తులు ప్రేమించలేకపోవడానికీ ఏదో సంబంధం ఉండివుండాలని నా నమ్మకం. అదేమిటో, ఎల్లా ఉంటుందో కనుక్కుందామని ఈ నవలా రచన సాగిందనిపిస్తుంది. ఇదంతా చదివి ఈ నవల సమస్యలతో ప్రమేయం ఉన్న ప్రచారక గ్రంథం అనుకోవద్దని విన్నపం. తిరిగి చదివి, వెదికితే స్ఫురించే వ్యాఖ్యానాలివన్నీను. సమస్యల చర్చే ప్రధాన విషయమైతే ఈ నవలే వ్రాయను. ఏ ఒక్క విలువతోనూ ఈ నవలకి ప్రమేయం లేదు? అంతమాత్రం చేత, దీనిలో ఏ విలువా లేదనుకోకూడదు.

కొందరు రచయితలవలె గ్రంథంలో ఉపయోగించే నిమిత్తమైన అనుభవాన్ని నేను అన్వేషించను. సంస్కృతిని సంస్కృతి కోసమే ఆరాధించేవాడ్ని కాను. ప్రవర్తనపైన శీలంపైన ఉన్న, ప్రభావంలోనే సంస్కృతి, కళల ప్రయోజనం ఉందనుకుంటాను. ఇది నేను ప్రగల్భంగా చెప్పడం కాదు. ఇందులో నాయకుడు, చివరలో జీవితానికి అర్థం లేదన్న నిర్ణయానికొస్తాడు. తనని గురించిన నిజం తెలుసుకోవాలని బయలుదేరిన వొక యువకుని అభిప్రాయంగాని, అది రచయిత నేర్చుకున్న పాఠం అనుకోవద్దని కోరుతున్నాను.

నిజంగా కూడా, పాఠకునికి రచయిత ఉద్దేశాలతోనూ, నమ్మకాలతోనూ "స్వీయ" గాథతోనూ నిమిత్తం ఉండదు. ఇవి అతనికి జీవితంపై ఉన్న జిజ్ఞాసని, సమగ్రంగా, నిజాయితీతో, అనుభవించగలిగేటట్టుగా చిత్రమైనవా లేవా, అన్నదే పాఠకునికి కావాల్సింది.

అంతేకాదు రచయితకి ముఖ్యమని తోచిన విషయాలే పాఠకుడికి కూడా ముఖ్యంగా తోస్తే, ఈ ఘట్టాలని హర్షించడం తేలిక. అల్లా కొందరు సాహితీప్రియులు ఈ గ్రంథం కుతూహలంతో చదివారనడానికి ఇందు పొందుపరచిన కొన్ని అభిప్రాయాలు తార్కాణం. తన విముక్తి కోసం రచన సాగించినా, తన అంతరంగికాన్ని నలుగురితోనూ పంచుకున్నప్పుడే రచయితకి నిజమైన సంతృప్తి కలుగుతుంది.

ప్రథమ రచనలో కొంత పాండిత్య ప్రకర్ష ఉంటుంది. తాను తెలుసుకున్న విజ్ఞానాన్ని పాఠకుడికి తెలియచెయ్యాలని రచయిత ఉబలాటపడతాడు కాబోలు. ఇది లోపమే. ఇట్లాంటిది అక్కడక్కడ ఈ నవలలో కూడా కనిపించింది. కాని అది కథాసంవిధానంలో ఇమిడిపోయింది. దాన్ని విడదీసి సంక్షిప్తం చెయ్యడం నా వల్ల కాలేదు. ఆధ్యాత్మిక, సాంఘిక విషయాలను గురించిన తర్కం, జీవిత సమస్యలపై నిర్వచనాలు, కొందరికి విసుగు పుట్టించవచ్చు; మరి కొందరికి కథ, పాత్రకంటె ఈ నిర్వచనాలే ప్రధానంగా తోచొచ్చు. ఇప్పుడు ఆ విషయమై నవలలో శిల్పం గురించి నిర్వచనాలు చెయ్యపూనుకోవడం లేదు. నవలను గురించిన రచయిత అభిప్రాయాలు, తాను రచించే నవలల్ని సమర్థించేవిగా ఉంటాయనుకుంటాను.

ఏ వ్యక్తి జీవితంలోనూ అన్నీ రసవత్తరమైన ఘట్టాలుండవు. చాలాకాలం మామూలుగా జీవించి, ఒక్క క్షణంలో మహత్తరమైన అనుభవాలకి గురికావొచ్చు. "అల్లాగే పెద్ద గ్రంథంలో కొన్ని విసుగు పుట్టించే ఘట్టాలుంటాయి... మొదటి పుట నుండి, చివర పుట దాకా, చమత్కారంగా అద్భుతంగా, విసుగులేకుండా నడచిన గ్రంథం, గొప్ప గ్రంథం అవదు" అన్నాడు బెర్ట్రండ్ రసెల్. ఈ కారణంగా, ఈ ఘట్టాలని భరాయించమనడం లేదు నేను. రెండు మహాసంగ్రామాల మధ్యకాలంలో, తెలుగునాట కొందరి యువతీ యువకులు జీవితం చిత్రితమైంది. ఈ నవలలో, ఆ అల్లికలో ఇవన్నీ పోగులు వాటిని తొలగిస్తే మందం తగ్గొచ్చు కాని ఆకృతి పోతుందనుకుంటాను.

అంతేకాదు రచయితకి ముఖ్యమని తోచిన విషయాలే పాఠకుడికి కూడా ముఖ్యంగా తోస్తే, ఈ ఘట్టాలని హర్షించడం తేలిక. అల్లా కొందరు సాహితీప్రియులు ఈ గ్రంథం కుతూహలంతో చదివారనడానికి ఇందు పొందుపరచిన కొన్ని అభిప్రాయాలు తార్కాణం. తన విముక్తి కోసం రచన సాగించినా,, తన అంతరంగికాన్ని నలుగురితోనూ పంచుకున్నప్పుడే రచయితకి నిజమైన సంతృప్తి కలుగుతుంది. అట్లా పంచుకోడంలో దానికొక మూల్యం, సామాజిక ప్రయోజనం ఏర్పడుతుంది. ఇందుకుగాను ఈ అభిప్రాయాలు తోడ్పడతాయని తోచినప్పుడు వాటిని పొందుపరచడంలో ఆక్షేపణేమీ కనబడలేదు.

"నా ఆనందం కోసం నేను వ్రాసుకున్నాను. ఎవరికర్థంకాక పోయినా, ఎవరు బాగులేదన్నా నాకు లెక్కలేదు" అని నేననుకోలేను. ఏ రచయితైనా, అట్లా అన్నా అది నేను నమ్మను. నా సమకాలికులలో కొందరు పిన్నలకీ పెద్దలకీ కూడా నే చెప్పదలచుకున్నవి అవగాహన కావడం, రుచించడం, సానుభూతితో వారు విమర్శించగలగడం నాకు ఉత్సాహాన్నీ, సంతృప్తినీ కలిగించింది. ఇది నా అదృష్టం.

ఈ గాథకి నేను మొదట అనుకున్న పేరు "ఏకాంతం". కథంతా చెప్పగా విని "చివరకు మిగిలేది" అని నామకరణం చేసింది శ్రీ అచంట జానకీరామ్. ఈ పేరు, గాథకి సమగ్రత నివ్వడమే కాకుండా, సరిహద్దుల్ని కూడా నిర్ణయించింది. ముఖచిత్ర నిర్మాణంలో సూచనలు చేసి, రచన సాగుతున్నప్పుడు తన విమర్శతో ఎక్కువ ప్రోత్సాహం కూడా ఇచ్చారాయన. ఇట్లాంటివి ఆయనకి నచ్చకపోయినా, కృతజ్ఞత చెప్పడం నా కర్తవ్యంగా తోచింది.

ఈ నవలలో పాత్రలు, ఎవర్నీ ఉద్దేశించినవి కావని రచయిత చెప్పుకోవడం, తప్పకుండా అవి ఫలానా వార్ని ఉద్దేశించినవి అని చదువరి అనుకోవడం పరిపాటి. అందుచేత ఆ విషయం కూడా చెప్పడం లేదు.

పుస్తకాలపై కాస్తో కూస్తో గౌరవం, అభిమానం ఉండి, సారస్వతాన్ని నమ్మి, దానికొక స్థానం ఇవ్వడానికి అలవాటు పడ్డవారు, ఎందరు చదివి అనుభవం పొందితే అంతటి సంతృప్తి. ఎందుకంటే జీవితంపై ఒక దృక్పథాన్ని కలగచెయ్యాలన్న ఉద్దేశంతోనే ఈ రచన సాగింది. ఆర్థిక సాంఘిక చారిత్రక వ్యత్యాసాల కతీతమై- మనిషినీ, మనిషినీ స్నేహపాశంలో బంధించివేసే మానవత్వం యొక్క శక్తుల్ని తరచి చూచినప్పుడు, ఆ దృశ్యాన్ని తన్మయతతో అనుభవించగలం. కాని ఆ అనుభవాన్ని మాటల్లో చెప్పలేం. ఈ జీవిత రహస్యం- దాన్ని తెలుసుకోవడానికి మానవుడు చేసే యత్నం- ఏ గొప్ప గ్రంథానికైనా ఇవి పునాది. ఈ నవలకీ అదే పునాది.

ఇది చదివినవారు, విషయం ఏమిటో తెలిసిపోయింది కదా అనుకుని విరమించకుండానే ఈ ప్రస్తావన ముగించి నవల సమర్పించుకుంటున్నాను.

**విజయవాడ. 1-7-1952**

**('చివరకు మిగిలేది' ఉపోద్ఘాతం)**



# ఎందుకు రాసేను?

## రావిశాస్త్రి

**(30.07.1922 - 10.11.1993)**

ప్రముఖ కథా రచయిత, నవలాకారుడు. ఒక ప్రత్యేక శైలికి ప్రయోక్త.

**లోకంలో మంచి చెడ్డా అనేవి ఉంటూ వస్తున్నాయి. వాటి మధ్య నిత్యం పోరాటం జరుగుతూనే ఉంటుందనే విషయం అందరికీ తెలిసిన విషయమే. ఆ పోరాటపు స్థాయి ఒకప్పుడు ఉన్నంత తీవ్రంగా ఇంకొకప్పుడు ఉండకపోవచ్చు. కాని మంచి చెడ్డల మధ్య నిత్యం సంఘర్షణ జరుగుతూనే ఉంటుందని నేను అనుకుంటాను.**

**ప్రతి రచయిత కూడా రెండు, మూడు లేక ఎన్నో కొన్ని మజిలీలు చేసి చివరికి ఈ మంచి చెడ్డల క్రాస్ రోడ్సుకి వస్తారనీ రాక తప్పదనీ నేను నమ్ముతాను. అప్పుడు అతను పాఠకుడికి తను ఏ మార్గం చూపించాలో నిశ్చయం చేసుకుంటాడు. ఆ దారంట వెళ్ళమని అందరికీ చెప్తాడు.**

**గొప్ప ప్రతిభగల రచయితలు అని చాలామంది ఒప్పుకునే రచయితలు కొంతమంది ఉన్నారనేది నిర్వివాదమైన విషయం. ఆ ప్రతిభగల రచయితల రచనలు కొన్ని నన్ను చెడ్డకి తిప్పేయనీ, కొన్ని నాకు మంచిని చూపించేయనీ నాకు తెలుసు. అందుచేత కవిత్వానికి మనుష్యుల్ని ఎటో అటు మళ్ళించే శక్తికలదని నేను నమ్ముతాను.**

"ఎందుకు రాయడం?" అనే భోగట్టా అందరికీ తెలియడానికి వీలుగా ప్రతి రచయితా తనెందుకు ఫలానా కథ కాని కావ్యంకాని రాసేడో ఆనెస్ట్‌గా నిజాయితీతో చెప్తే బావుంటుందని నాకు తోస్తోంది. వారు చెప్పినదాన్ని బట్టి అందులోంచి "ఎందుకు రాయడం?" అనే అసలు ప్రశ్నకి సమాధానం కొంతగానైనా లాగొచ్చునేమోననే ఆశ కూడా నాలో ఉంది.

నా గురించి చెప్పవలిసొస్తే...

సాహిత్యపు లక్ష్యాల గురించి నేను చాలాకాలం వరకూ ఆలోచించలేదు. ఆలోచన ప్రారంభించిన తరువాతనైనా ఆ విషయం గురించి సరిగ్గా ఎప్పుడూ ఆలోచించలేదు. కనీసం, అందుగురించి పెద్దలు రాసిన గ్రంథాలైనా చదవలేదు. రాయడం మాత్రం కొన్ని కథలూ ఒక నవలా రెండు నాటకాలూ ఒక నాటికా రాసేన్నేను. "అవి ఏ ప్రేరణ వల్ల రాయడం జరిగింది? ఏం సాధిద్దామని ఏ ఉద్దేశంతో అవి రాసేను? అవి ఎవరికోసం రాసేను" అనే ప్రశ్నలకి సమాధానాలు నాకు తెలిసిన మట్టుకు, జ్ఞాపకం ఉన్నంతమట్టుకు, చెప్పడానికి ప్రయత్నిస్తాను. "ఎందుకు రాసేను?" అనే ఒక ప్రశ్నలోనూ ఈ మూడు ప్రశ్నలూ ఇమిడి ఉన్నాయని నేననుకుంటాను.

మొదటిసారిగా నడక నేర్చుకున్న పిల్లల్ని నడక నేర్చిన ఆ క్షణంలో (చాలా రోజుల క్రిందట) నేను చూడ్డం జరిగింది. అప్పటి ఆ పిల్లాడి సంతోషాన్నీ, ఉత్సాహాన్నీ నేనెప్పటికీ మర్చిపోలేదు. రాత్రి ఎనిమిదిగంటలయింది. హాల్లో విద్యుద్దీపం ధగధగలాడుతోంది. పడుతూ లేస్తూ పకపక నవ్వుతూ రెండు చేతులూ జాచి బాలెన్స్ చేసుకుంటూ నడిచే ఆ నెలల పిల్లాడి సంతోషం, సంరంభం – అదృశ్యం అంతా కూడా నాకిప్పుడు కళ్ళకి కట్టినట్టు కనిపిస్తోంది.

పెద్దలు చెప్పిన కథలు వినీ చదివీ నాకు కథల్లో ఆసక్తి కలిగింది. పెద్దవాళ్ళని ఇమిటేట్ చేద్దామనే ఉత్సాహం అప్పట్లో నాకు చాలా ఉండేదని ఇప్పుడు నాకు బాగా స్పష్టంగా తెలుస్తోంది. అది అప్పుడు నాకు చాలా గొప్పగా కూడా తోచింది. ఆ కథ రాయడం నేను మా ఇంట్లో వాళ్ళంతా చదవాలనే సరదాతో రాసేను. "నా కథ ఎవరూ చదవడానికి వీల్లేదు. నేను ఇదెవరికీ ఇవ్వను" అని నేరాసిన కాయితాలు ఎంత గట్టిగా పట్టుకు తిరిగినా, ఆ కాయితాలు మా ఇంట్లో వాళ్ళు బలవంతంగా లాక్కొని చదివితే బావుండునని అనిపించడం నాకు ఇప్పటికీ బాగా గుర్తుంది.

నడవగలిగినందుకు సంతోషం ప్రకటించేదే తప్ప ఆ సమయంలో ఆ పిల్లడు "నడక ఎందుకు?" అనే విషయం గురించి ఆలోచించి ఉండడని మనందరికీ కూడా తెలుసు. ప్రతి మానవుడూ నడుస్తాడు. నడవాల్సిన అవసరానికి నడవగలిగిన శక్తి అతనికుంది. ఆ తరువాత పెద్దవుతూన్న కొద్దీ "ఈ నడక ఎందుకోసం? ఎక్కడికి?" అనే ప్రశ్న ఎదురవుతుంది. బడికి వెళ్ళడానికా లేక బడి ఎగ్గొట్టడానికా? స్నేహితుణ్ని మీటవటానికా? లేక అతను లేనప్పుడు అతని చెల్లెల్ని చెరచడానికా? అడవిలో ఆపదలో ఉన్నవాడి పెళ్లాన్ని ఎత్తుకుపోవడానికా లేక అలా అందుకోసం వెళ్లేవాణ్ణి ఎదిరించి ఆపడానికా? ఆటకా, పాటకా, ప్రణయానికా, (సాయం విహారానికా) చోరీకా, జూదానికా, హత్యకా? పుణ్యానికా లేక పాపానికా? ఎందుకీ పిల్లినడకలు? ఎక్కడికి ఈ తొందర పరుగులు? అనే ప్రశ్నలన్నీ ఆ తరువాత మనం వేసుకొని సమాధానాలు తెలుసుకోవలసుంటుంది.

అదే విధంగా...

రచనా శక్తి లేక కల్పనాశక్తి ప్రతి మానవుడిలోనూ ఉంటుందని నేను తలుస్తున్నాను. అది రకరకాల రూపాల్లో బైటపడవచ్చు. ఆ శక్తే కాని మానవునికి లేకపోయినట్లయితే ఈ సంఘం ఈ నాగరికత ఈ పురోగమనం ఏదీ ఉండదనీ, మనకీ పశువులకీ మధ్యతేడా ఉండకపోనీ నేననుకుంటాను. ఊహా, కల్పనా ఉండబట్టే మానవుడు అంకెలు, అక్షరాలు, ఇళ్ళు, మేడలు, మరలు, మందులు, దీపాలు, పంకాలు, పాటలు, పుస్తకాలు, దయ్యాలు– దేవతలు అన్నింటినీ కనిపెట్టగలిగేడని నేను భావిస్తాను. ప్రకృతిని పరిశీలించడం, అందుమీదట వూహించడం అనే శక్తులు (లేక) గుణాలు పండితులకీ పామరులకీ అందరికీ ఉంటాయనీ, ఉన్నాయనీ నేను తలుస్తాను. అందర్లోనూ ఉన్నట్టే నాలో కూడా కల్పనాశక్తి (కొద్దిమేరకి) ఉందనీ, నన్నది అనేక రంగాల్లోకి దింపినట్టే కథల్లో కూడా దింపిందనీ నేననుకొంటున్నాను.

చిన్నప్పుడు రామాయణం భారతం కథలు వినడం వల్ల చిన్నప్పుడే కథలంటే నాకు సరదా కలిగింది. ఆ తరువాత అపరాధ పరిశోధక నవల్లు చదివేక నాకు సరదా హెచ్చయింది. నాక్కూడా ఓ డిటెక్టివ్ నవల రాయాలని సరదా వేసింది. మా అన్నయ్యకి తమ్ముళ్ళకి కూడా నాలాగే కథలంటే చాలా సరదా ఉండేది. అయితే వాళ్ళు నాలాగ కథ రాయడానికి ఎందుకు ప్రయత్నం చెయ్యలేదో నేను చెప్పలేను. మా అన్నయ్య బొమ్మలు బాగా వేసేవాడు. మా తమ్ముడు పద్యాలు చెప్పడానికి సరదాపడేవాడు. మా ఆఖరి తమ్ముడు అయిదో యేటనే పేకాట అద్భుతంగా ఆడేవాడు. నేను నా తొమ్మిది లేక పదోయేట ఒక డిటెక్టివ్ నవల రాయడానికి ప్రయత్నం చేసి పది పదిహేను పేజీలు రాసేను. పెద్దవాళ్ళలాగా మనవూఁరాసేద్దాం అనే సరదాతోనూ, మా ఇంట్లో వాళ్ళ దగ్గర గొప్ప కోసమూ ఆ ప్రయత్నం చేసేనని ఇప్పుడు అనుకొంటున్నాను. నాకు తెలిసిన పరిసర ప్రాంతాల్నే అందులో వర్ణించినట్లుగా నాకిప్పుడు బాగా గుర్తుంది. మేవూ ఆ రోజుల్లో విశాఖపట్నంలో బీచికి దగ్గరగా ఉంటూ ఉండేవాళ్ళం. నేను రాయబోయిన ఆ నవల్లో పత్తేదారు నారాయణరావు (మా నాన్నగారి పేరు నారాయణమూర్తి) లైట్ హవుస్ నుంచి వూటగెడ్డవైపుకి నడుస్తూంటే (సాయంకాలపు నీడల్లో) బీచిని ఉన్న బ్రహ్మచెముడు డొంకలు బ్రహ్మరాక్షసుల్లా కనిపించేయి; సముద్రము పెద్దగా చప్పుడు చేసింది; ఈదురుగాలి హోరున వీచింది. అదీ నేను చేసిన కథా ప్రారంభం– కథా రచనకి అది నా ప్రథమ ప్రయత్నం.

"అది ఎందుకు రాసేను!" అని ఆలోచించి సమాధానం చెప్పాలంటే కొంత వరకూ కరెక్టుగా చెప్పగలనని నేననుకుంటాను.

పెద్దలు చెప్పిన కథలు వినీ చదివీ నాకు కథల్లో ఆసక్తి కలిగింది. పెద్దవాళ్ళని ఇమిటేట్ చేద్దామనే ఉత్సాహం అప్పట్లో నాకు చాలా ఉండేదని ఇప్పుడు నాకు బాగా స్పష్టంగా తెలుస్తోంది. అది అప్పుడు నాకు చాలా గొప్పగా కూడా తోచింది. ఆ కథ రాయడం నేను మా ఇంట్లో వాళ్ళంతా చదవాలనే సరదాతో రాసేను. "నా కథ ఎవరూ చదవడానికి వీల్లేదు. నేను ఇదెవరికీ ఇవ్వను" అని నేరాసిన కాయితాలు ఎంత గట్టిగా పట్టుకు తిరిగినా, ఆ కాయితాలు మా ఇంట్లో వాళ్ళు బలవంతంగా లాక్కొని చదివితే బావుండునని అనిపించడం నాకు ఇప్పటికీ బాగా గుర్తుంది. వాళ్ళు చివరికి బలవంతంగా ఆ కాయితాలు లాక్కొని నేను రాసింది చదివి పకపకమని నవ్వినప్పటికీ నేను ఆ మాత్రమైనా రాయగలగడం చూసి వాళ్ళంతా ఆశ్చర్యపడ్డారని గమనించి నేను గర్వించడం నాకు చాలా బాగా గుర్తుంది. పెద్దలు నడిచినట్టు మనమూ నడవగలం అనే గొప్పతనం చాద్దం కోసం ఆ కథ రాసేనని నేనిప్పుడు నమ్ముతున్నాను.

**స్వతహాగా డబ్బుగలవారి కుటుంబాలకే చెంది వాళ్ళ మధ్యనే ఉంటూ కారణాంతరాల వల్ల డబ్బులేనివాడుగా అవడం వల్ల నాలో పరస్పర విరుద్ధమైన వాంఛలూ సరదాలూ, చింతలూ చిరాకులూ, ఆశలూ నిరాశలూ, నిర్లక్ష్యతా బాధ్యతా అన్నీ ఒకేసారిగా ఉంటూ వచ్చేయి. వాటిని వ్యక్తీకరించడంలో నాలోనించి రకరకాల కథలొచ్చేయని నేను తలుస్తున్నాను.**

మా క్లాస్‌మేట్సు (సెకెండ్ ఫాంలో) కొంతమంది రాస్తున్నారని తెలియడంతో రాయాలనే సరదా నాకు హెచ్చయింది. "అబ్బూరి రాజేశ్వరరావు రాసేస్తున్నాడు; పన్యాల రంగనాథరావు రాసేస్తున్నాడు. మనం కూడా ఎందుకు రాయకూడదు!" అనే పోటీ స్పిరిటుతో నేను అతి రహస్యంగా కొన్ని కథలు పరపర రాసేసేను. అవి ఎవరికీ చూపించలేదు. ఆ తరువాత రోజుల్లో రసపుత్ర రాజులే మన అసలయిన తెలుగు రాజులని చెప్పి వాళ్ళంటే చాలా అభిమానం ఉండేది. అంచేత రసపుత్ర వీరుల గురించి పెద్ద నవల రాసేద్దామని ఓ నలభై పేజీలు రాసి మరింక ఆ నవల ఎలా కొనసాగించాలో తెలియక ఆపేశాను. అది నేను థర్డుఫాం చదువుతున్నప్పుడు. ఆ రోజులలోనే నేను సెక్స్‌తో నిండిన కథలు చదవడం జరిగింది.

సెక్స్ కథలు చిన్నప్పుడే చదివి జీవితం కొంతవరకూ పాడుచేసుకున్న వాళ్ళెవరయినా ఉన్నారో లేదో కాని నేను మాత్రం ఉన్నాను. ఈ కథల ప్రభావం అందరికీ చెడ్డగా పరిణమించక పోవచ్చు. నాలో మాత్రం అవి చెడ్డనే కలిగించాయి గాని మంచిని కలిగించలేదు. డాక్టర్ పావ్‌లోవ్‌గారు కుక్కని గంట మోతకి కట్టిపడేసినట్లు లేత వయసు పిల్లల్ని సెక్సు వాంఛలకి కట్టిపడేయటం చాలా సులభం అని నేను నమ్ముతాను. అది సులభమే కాని మంచిది మాత్రం కాదని నేను తలుస్తాను. అది నాకు చెడ్డ తప్ప మంచి చెయ్యలేదనే విషయం స్వానుభవం వల్ల నాకు బాగా తెలుసు. నా ఒక్కళ్లో అటువంటి చెడ్డ కలిగించే ఉద్దేశ్యంతో వారు ఆ కథలు రాసివుండరని కూడా నేనే నమ్ముతున్నాను. కాని ఆ కథలు చదవడం వలన ఆ తరువాత రోజులలో మనుచరిత్ర దగ్గర నుంచి మైదానం వరకూ ఏ పుస్తకం చదివినా సెక్సు కోనం తప్ప మరొకందుకోనం నేను చదవలేకపోయాను. అటువంటి పుస్తకాలు చిన్నప్పుడే సెక్సు కోసమే చదవడం వలన నేను కొన్ని తప్పుదార్లు పట్టడం జరిగింది.

అటు తరువాత నా రచనలలో కూడా కొన్ని తప్పుదార్లు తొక్కడం జరిగింది. "బూతుగా రాస్తే రాస్తాను. నా యిష్టం. నువ్వెవడివి అడగడానికి? చదువుతే చదువు లేకపోతే ఫో" అనగలిగిన నిర్లక్ష్యం కూడా ఆ తరువాత నాలో పెరిగింది. చెలరేగిన కామ ప్రభావం వలన నేను చిన్నప్పుడు "ఏది రాస్తేనేం? నా యిష్టం వచ్చింది నే రాస్తాను" అనే నిర్లక్ష్యం వలన పెద్దయ్యాక కూడా సెక్సీ కథలు రాసేను. నేను నా పదిహేనోయేట "దేముడే చేసేడు" అని ఓ కథ రాసేను. నా అచ్చయిన కథల్లో అదే మొదటిది. పేదింటి ఆడపిల్లని చెరిచిన పెద్దింటివాడ్ని పాము కరుస్తుంది. వాడు చచ్చిపోతాడు. అదీ కథ. అందులో ఆ పేదింటి ఆడమనిషిని వర్ణించినప్పుడు పాఠకుల్లో కామ భావాలు కలిగేలా నేను కోరి వర్ణించేను. అంతకు ముందు కూడా నేను కొన్ని (అచ్చవని) అటువంటి కథలు రాసేను. అంత చిన్న వయసులో ఆ విధంగా రాయడం అది చాలా మేరకు నా తప్పే అయినప్పటికీ, చిన్నవాళ్ళకి పెద్దపుస్తకాలు అందుబాటులో వుంచిన పెద్దల సంఘానిక్కూడా ఆ తప్పుకి కొంత జవాబుదారీ వుందని నేను అనుకొంటూ ఉంటాను.

లోకంలో డబ్బున్నవాళ్లూ డబ్బులేని వాళ్ళూ ఉంటారనీ, వాళ్లకీ వీళ్లకీ మధ్య చాలా తేడాలుంటాయనీ నాకు తొమ్మిది లేక పదోయేట నుంచీ బాగా తెలుసు. డబ్బులో ఉండే సౌఖ్యాలూ, లేమిలో ఉండు దుఃఖాలూ, ధనం కల్పించే గొప్పగర్వం మదాంధతా, లేమి కల్పించే నిస్పృహా నైచ్యం దైన్యం అవన్నీ కూడా నా జీవితంలో లోంచి నేను బాగా తెలుసుకొన్నాను. అదంతా చిన్నప్పుడే (అస్పష్టంగా అయినా) తెలుసుకోవడం చేత ఇప్పటికి కూడా నా మనసుని ఆ బాధ, ఆ ఆవేదన పట్టుకు వదలటం లేదు. మరింక వదలదు. కాని స్వతహాగా డబ్బుగలవారి కుటుంబాలకే చెంది వాళ్ళ మధ్యనే ఉంటూ కారణాంతరాల వల్ల డబ్బులేనివాడుగా అవడం వల్ల నాలో పరస్పర విరుద్ధమైన వాంఛలూ సరదాలూ, చింతలూ చిరాకులూ, ఆశలూ నిరాశలూ, నిర్లక్ష్యతా బాధ్యతా అన్నీ ఒకేసారిగా ఉంటూ వచ్చేయి. వాటిని వ్యక్తీకరించడంలో నాలోనించి రకరకాల కథలొచ్చేయని నేను తలుస్తున్నాను. అప్పటికీ ఇప్పటికీ కూడా నాకు కుష్టురోగాన్ని చూస్తే ఎంత భయమో దారిద్ర్యం అంటే అంత భయం. దారిద్ర్యం ఎవరికీ, నా పగవాడిక్కూడా, ఉండకూడదని నేను అనుకొంటూ ఉంటాను. నేను పేదవాళ్ళని చాలామట్టుకు క్షమించగలను. కాని డబ్బున్నవాళ్ళని క్షమించలేను. తెలిసి కూడా తమ సాటివారికి ద్రోహం చేసే పేదవాళ్ళని క్షమించలేను. డబ్బు సంపాదించేక పేదవాళ్ళని మర్చిపోయిన (పేద) వాళ్లని క్షమించలేను.

నా పదిహేనోయేట, నేను చార్లెస్ డికెన్స్ నవలలు చదవడం ప్రారంభించేను. సెక్సీగా లేకపోయినా ఆయన నవలలు బాగానే ఉన్నాయనిపించాయి! నాలో "మంచి" అంటూ ఏదైనా ఉంటే అందుకు డికెన్స్ మహాశయుడు కొంత కారణం అని

కథ వ్రాయాలనే సరదా నాలో ఎక్కువ అవడానికి మరో కారణం నేను ఆంటన్ ఛెకోవ్‌గారి కథలు చదవడం. ఆ రోజుల్లోనే నేను శ్రీశ్రీగారి గేయాలు చదివేను. శ్రీశ్రీగారు గేయాలు రాసినట్టుగా అటువంటి చక్కటి భాషలో ఛెకోవ్‌గారు రాసిన కథలవంటి కథలు రాసేయాలని నాకు కోరిగా ఉండేది. ఛెకోవ్‌గారు రాసిన "మిజరీ" అనే కథ "దౌర్భాగ్యం" అనే పేరిట అప్పట్లో నేను అనుసరించేశాను. ఆ రోజుల్లో నేను రాసిన కథలు ఎక్కువే అయినప్పటికీ పబ్లిష్ అయినవి చాలా తక్కువ. మహాత్మాగాంధీగారు చదువుకున్న వారంతా పల్లెటూళ్లుపోయి పల్లె ప్రజల్ని బాగుచెయ్యాలనేవారు. దాని గురించి నేను కథ రాసేను. మా తుమ్మపాల గ్రామంలో కొత్తగా పంచదారమిల్లు పెట్టేరు. వెంటనే నేను ఒక కార్మికుడి కష్టం గురించి కథ రాసేను.

నేను నమ్ముతాను. జీవితంలో మంచి మనుషుల్నీ చెడ్డ మనుషుల్నీ కళ్ళకట్టినట్టు నాకు ఆయన చూపించేరు. "మంచి" యెడల నాకు ఉండే అభిమానాన్ని ఎక్కువ చేసేరు. డికెన్స్‌గారి నవలలు చదివేక నాకు ఆయనలా నవల్లు రాసేయాలనిపించేది. 1938-1941 మధ్య నేను రాసిన కథల్లో ఆయన ప్రభావం కనిపించకపోవచ్చు. కాని పేదవాళ్ళ గురించి రాయాలనీ రాయొచ్చుననీ నాకు డికెన్స్‌గారి వల్లనే తెలిసింది. ఆ తరువాత 1938-42 మధ్య నేను వోడ్ హవుసు గారి నవల్లు చదివేను. ఆయన విషబాహువుల్లోంచి నేను బైటపడేసరికి చాలా కాలం పట్టింది. నల్లవాళ్ళ పీకలమీంచి తమ సామ్రాజ్య రథాన్ని నడిపించుకుపోయిన బ్రిటిష్ ప్రభువులు "నిజంగా (??) ఎంత మంచివాళ్ళు! ఎంత అమాయకులు! వాళ్ళ సరదాలు ఎంత ఇన్నొసెంటు! వాళ్ళకి ఎవరైనా అంటే ఎంత దయ, ఎంత జాలి!" అనే అభిప్రాయాలు (కథ్రలాయాలనే సరదాతో పాటు) వోడ్ హవుసుగారు నాలో కలిగించేరు. కథ వ్రాయాలనే సరదా నాలో ఎక్కువ అవడానికి మరో కారణం నేను ఆంటన్ ఛెకోవ్‌గారి కథలు చదవడం. ఆ రోజుల్లోనే నేను శ్రీశ్రీగారి గేయాలు చదివేను. శ్రీశ్రీగారు గేయాలు రాసినట్టుగా అటువంటి చక్కటి భాషలో ఛెకోవ్‌గారు రాసిన కథలవంటి కథలు రాసేయాలని నాకు కోరిగా ఉండేది. ఛెకోవ్‌గారు రాసిన "మిజరీ" అనే కథ "దౌర్భాగ్యం" అనే పేరిట అప్పట్లో నేను అనుసరించేశాను. ఆ రోజుల్లో నేను రాసిన కథలు ఎక్కువే అయినప్పటికీ పబ్లిష్ అయినవి చాలా తక్కువ. మహాత్మాగాంధీగారు చదువుకున్న వారంతా పల్లెటూళ్లుపోయి పల్లె ప్రజల్ని బాగుచెయ్యాలనేవారు. దాని గురించి నేను కథ రాసేను. మా తుమ్మపాల గ్రామంలో కొత్తగా పంచదారమిల్లు పెట్టేరు. వెంటనే నేను ఒక కార్మికుడి కష్టం గురించి కథ రాసేను. "నిష్కల్మషమైన ప్రేమ" గురించి నేను చాలా కథలు చదివేను. అటువంటి ప్రేమ గురించి నేనూ ఓ కథ రాసిపారేసేను. ఆ రోజుల్లో ఎంతచదివి ఎన్ని డిగ్రీలు సంపాదించినా ఉద్యోగం సంపాదించడం మాత్రం కష్టంగా ఉండేది. ఆ విషయం గురించి "పంజరంలో చిలక" అని నేనో కథ రాసేను. ఈ కథలు నా క్లాసుమేట్సూ, స్నేహితులూ, తెలిసినవాళ్ళూ చదువుతే నాకు చాలా సరదాగా ఉండేది. పైవాళ్ళెవరో ఎక్కడో చదవొచ్చునని తెలిసినా, వారి గురించి నేనెప్పుడు ఆలోచించలేదు. నేను రాసిన కథలు మా బంధువులంతా చదవాలని కోరిగ్గా ఉండేది. అదంతా ఆ రోజుల సంగతి.

1941 సం॥రం తరువాత ఏడెనిమిదేళ్ళ వరకూ అంటే 1948-49 వరకూ నేనేమీ రాయలేదు. రాయాలనే సరదా నాకు చిన్నతనంలో ఎక్కువగా ఉండేది. బాగా రాయగలనని కూడా నేను అనుకొనేవాణ్ణి. ఆ తరువాత ఓ రోజున నేను రాసిన కథల గురించి తల్చుకుని నాకు చాలా నవ్వొచ్చింది. ఏదైనా బాగా రాయడం అటువంటి కనీసం, బొక్కిగా కూడా నేనేదీ రాయలేనని నాకెందుకోగాని అనిపించింది. దానితో రచనా ప్రయత్నం చాలాకాలం ఆపుచేసేసేను.

ఒకానొకప్పుడు నేను కథలు రాసేననే సంగతి నాకు ఆ తరువాత అప్పుడప్పుడు జ్ఞాపకం వస్తూండేది. ఆ సంగతి ఓనాడు నేను నా భార్యతో చెప్పేను. ఆమె నన్ను చాలా క్యూరియాసిటీతో చూసింది. నేను కథ వ్రాయగలిగి ఉండడం ఆమెకి చాలా గమ్మత్తుగా తోచింది. నేను సర్కస్‌లో బఫూనుగా ఉండేవాణ్ణనిచెప్తే వింతపడ్డట్టు ఆమె చాలా వింతపడిపోయి, "ఓ కథ రాయకూడదూ?" అంటూ తిరిగి నా పాత ట్రిక్కులొకసారి చూపించమన్నట్టుగా రోజూ అడుగుతూ ఉండేది. ఆమె గురించి తిరిగి నేను కథ్రలాయడంలోకి దిగేను. అటు తరువాత రాసిన చాలా కథలు ఆమె చదవడం కోసమే రాసేను. ఆ కథలు పైవాళ్ళు చదివి ఆనందించాలని నేనెప్పుడూ అనుకోలేదు.

నా భార్య కోరిన మీదట ఏం కథ రాద్దామా అని ఆలోచించేను. కాని నాకేమీ తట్టింది కాదు. అప్పట్లో నేను మతకలహాల గురించి ఎక్కువగా ఆలోచిస్తూ ఉండేవాణ్ణి. హిందువులూ, మహమ్మదీయులు పొడుచుకు కొన్ని లక్షల మంది చచ్చిపోయేరు. ఈ ఈర్ష్యలూ అసూయలూ, ఈ తీవ్ర కోపాలూ ఘోరద్వేషాలూ మనుషుల్ని పట్టుకుని మరింక ఎన్నటికీ వదలవేమోనని నాకు అనిపించేది. చచ్చి దెయ్యాలయితేనే తప్ప, బతికుండగా మాత్రం మనుషులు మంచికి మారరనే అభిప్రాయం నాలో కలిగింది. ఆ విషయం తెలియజేస్తూ, "దయ్యాలకు ద్వేషాల్లేవు" అని ఓ కథ రాసేను. ద్వేషాలు మనిషిని వదలవు. మనుషుల కంటె దయ్యాలే నయం అని ఈ కథలో చెప్పేన్నేను.

నేను కొన్నాళ్ళపాటు ఓ వెయ్యి మంది గుమాస్తాలతో కలిసి పనిచేసేను. గుమాస్తాలు ఎలా ఉంటారో నాకు బాగా తెలుసు. అందుచేత ఆ నవల్లో చిన్నవాడిగా చిత్రించడానికి గుమాస్తా పాత్రని తీసుకున్నాను. నవల ప్రారంభించినప్పుడు గుమాస్తా యెడల సానుభూతి తెలియజేద్దామనుకున్నాను. కాని నవల చివరికి వచ్చేసరికి ఆ పాత్ర యెడల నాకు సానుభూతి చాలా తగ్గిపోయింది. ఎందుచేత తగ్గిపోయిందో మాత్రం నేను తెలుసుకోలేకపోయాను. ఆ నవల పెద్దలయిన వారెవ్వరూ చదవగలరని నేను అనుకోలేదు. పనీపాటా లేని కుర్రవాళ్ళెవరైనా చదవగలరేమో అనుకున్నాను. 'పెద్దవాళ్ళు' అంటే 'భారతి' పాఠకులని అప్పట్లో నాలెక్క. 'భారతి' వారు ఆ నవల ప్రచురిస్తామంటే నేను చాలా ఆశ్చర్యపోయాను. ఆ నవల మారుపేరుతో కాకుండా నా పేరుతోనే పబ్లిష్ అవడం నాకు చాలా సిగ్గువేసి చిరాకువేసింది. ఇప్పుడు మారుపేరు వాడ్డం మానేసేను. సిగ్గుపోయింది. చిరాకు మాత్రం మిగిలిపోయింది. కథకులు "గొప్పవాళ్ళు" అనే నా చిన్నప్పటి భావన పూర్తిగా తుడుచుకుపోయింది.

ఆ కథ మా ఆవిడికి అంతగా నచ్చలేదు. మనుషుల కంటే దయ్యాలే నయం అంటే ఎలా నచ్చుతుంది? నచ్చలేదు. కాని ఖాళీ బుట్టలోంచి గారడీవాడు కుందేల్ని లాగినట్టుగా ఖాళీకాయితం మీద నేనే కథ అల్లగలగడం ఆమెని ఆశ్చర్యచకితురాలను చేసింది. ఈ ట్రిక్కు ఆమె కోసం నేను చాలాసార్లు రిపీట్ చేసేను.

కథ రాయడం నాకదో తమాషాగా ఉండేది; అందుచేత తమాషా కథలు రాయడానికి నేను ప్రయత్నం చేసి ఆ కథలు రాసేనుగాని అవి బాగా రాయలేకపోయాను. సెక్సు రాయడం సులభం కాబట్టి సెక్సు మిళాయించి కొన్ని కథలు రాసేను. సెక్సు వెదజల్లటం తప్పు అని తెల్సినప్పటికీ అదేమి పట్టించుకోకుండా నిర్లక్ష్యంగా రాసేను. అది కొంత మందికి తప్పవొచ్చునేమోగాని "మనకి" తప్పు కాదని సమాధానం చెప్పుకొని సమర్థించుకొని సరిపెట్టేసుకొనేవాణ్ణి. నేను ఏదో విధంగా ఎక్కువ్వాళ్ల జాబితాకి చెందిన వాణ్ణని అనుకొంటూ ఉండేవాణ్ణి. పుట్టుక చేతా డబ్బువల్లా "ఎక్కువతనం" రాదని మాత్రం నేను అప్పుడు కూడా నమ్మేవాణ్ణి. మరైతే నీ "ఎక్కువతనం ఎందులో వుందీ?" అని ఎవరైనా ఆ రోజులలో అడిగివుంటే "మనం చాలా మందికంటే హయ్‌లీ కల్చర్డ్ గదా?" అని సమాధానం చెప్పి ఉండేవాణ్ణి "హయ్ కల్చర్ అంటే ఏమిటి?" అని కాలర్ పట్టుకు నిలదీసి అడిగితే మాత్రం సమాధానం చెప్పి ఉండలేకపోయేవాణ్ణి.

నా గురించి నేను ఎంతటి ఎక్కువ్వాణ్ణని అనేసుకున్నప్పటికీ ఆర్థికంగా చాలా తక్కువ్వాణ్ణని ఆ రోజుల్లో నాకు బాగా తెలుసు. నా జీవితం చాలా ఇబ్బందులతో కూడుకొని కలతలతో నిండిపోయి ఉండేది. నాకు చాలా చిరాగ్గా గ్లూమీగా ఉండేది. అందుచేత నేను "ఎక్కువ్వాళ్ళ" నిర్లక్ష్యంతో బేఖాతర్ కథలు రాస్తూనే "తక్కువ్వాళ్ల" చింతలతో కూడుకున్న కథలు కూడా రాస్తూండేవాణ్ణి. నాలోని సారోని నేను బాగా వ్యక్తం చేసి ఉండలేకపోయుండొచ్చు. ఆ సారో కథలు అందరూ కాని, నా భార్యతప్ప ఎవరైనా చదువుతారని చదవాలని కాని నేను స్పష్టంగా అనుకోలేదు. అటువంటి "ఇబ్బంది కథలు" రాస్తే చదివి ఆనందించే వాళ్ళుంటారని నేను తలంచలేదు కూడాను. అసలు కథలు ఎవరూ ప్రకటించరేమోననే డిఫిడెన్సుతో కూడా నేనా కథలు రాసేను. 'విలువలు' 'నీడలు' 'మెరుపు మెరిసింది' 'జరీ అంచుతెల్లచీరె' 'ఇద్దరు పిల్లలు' 'కిటికీ' వగైరా కథలు నేను ఆ విధమైన మూడ్‌లోనే రాసేను.

1952 సం॥రంలో "అల్పజీవి" అనే నవల రాసేను. చిన్నవాళ్ళకి చిన్నతగవులే మహావిషమ సమస్యలవుతాయనే సంగతి మాత్రం నేను ఆ నవల్లో తీసుకున్నాను. అంతే చెప్పదలచుకున్నాను. "ఏ పరిస్థితుల్లో ఏ మనుషులు ఎందుకు ఏ విధంగా ప్రవర్తిస్తారు?" అనే విషయం గురించి నేను అప్పట్లో గట్టిగా ఏమీ ఆలోచించలేదు. ఆ నవల రాయడానికి ముందు నేను కొన్నాళ్ళపాటు ఓ వెయ్యి మంది గుమాస్తాలతో కలిసి పనిచేసేను. గుమాస్తాలు ఎలా ఉంటారో నాకు బాగా తెలుసు. అందుచేత ఆ నవల్లో చిన్నవాడిగా చిత్రించడానికి గుమాస్తా పాత్రని తీసుకున్నాను. నవల ప్రారంభించినప్పుడు గుమాస్తా యెడల సానుభూతి తెలియజేద్దామనుకున్నాను. కాని నవల చివరికి వచ్చేసరికి ఆ పాత్ర యెడల నాకు సానుభూతి చాలా తగ్గిపోయింది. ఎందుచేత తగ్గిపోయిందో మాత్రం నేను తెలుసుకోలేకపోయాను. ఆ నవల పెద్దలయిన వారెవ్వరూ చదవగలరని నేను అనుకోలేదు. పనీపాటా లేని కుర్రవాళ్ళెవరైనా చదవ గలరేమో అనుకున్నాను. 'పెద్దవాళ్ళు' అంటే 'భారతి' పాఠకులని అప్పట్లో నాలెక్క. 'భారతి' వారు ఆ నవల ప్రచురిస్తామంటే నేను చాలా ఆశ్చర్యపోయాను. ఆ నవల మారు పేరుతో కాకుండా నా పేరుతోనే పబ్లిష్ అవడం నాకు చాలా సిగ్గువేసి చిరాకువేసింది. ఇప్పుడు మారుపేరు వాడ్డం మానేసేను. సిగ్గు పోయింది. చిరాకు మాత్రం మిగిలిపోయింది. కథకులు "గొప్పవాళ్ళు" అనే నా చిన్నప్పటి భావన పూర్తిగా తుడుచుకుపోయింది.

"అల్పజీవి" నవల రాసిన పిమ్మట నా చదువ్వల్ల వచ్చిన అనుభవం నా మిగతా జీవితానుభవానికి జోడించి కొన్ని విషయాలు తెలుసుకున్నా లేకపోయినా తెలుసుకున్నాను కొంటున్నాను.

లోకంలో చాలా అన్యాయాలు జరుగుతున్నాయి. (విస్‌మేజర్ మినహా) చాలా అన్యాయాలకి మానవులే కారణం.

అందరూ చదివితే బావుందునని అనుకుంటూ ఉండేవాణ్ని. అవి రాస్తూన్నప్పుడు "ఇది శ్రీశ్రీ చదు వుతే ఏమంటారు? కొడవటిగంటి ఏమనుకుంటారు? కాళీపట్నం రామారావు బావుందంటారా, అనరా?" అని ఈ విధంగా అనుకొంటూ ఉండేవాణ్ణి. రాస్తున్నప్పుడు రచయితకి అస్పష్టంగా అయినా ఏదో ఒక ఆడియన్సు ఉంటుందని నేను అనుకుంటాను.

నేను అడ్వకేట్‌ని. ప్రాక్టీసు చేస్తున్నాను. కోర్టుకి వెళ్లిన కొన్నాళ్ల వరకూ కూడా నాకు దేవుడంటే చాలా భక్తి ఉండేదనే చెప్పాలి. (ఇప్పటికీ దేవుడు ఉన్నాడనే నమ్మకం పూర్తిగా పోలేదేమో) ఎవరిమట్టుకు వాళ్ళు తమకి సాయం చెయ్యాలని దేవుణ్ని ప్రార్థించకూడదు. అది స్వార్థం, అందరూ బాగుండేట్టు చెయ్యమని భగవంతుణ్ని మనం ప్రార్థించాలి- అని చిన్నప్పుడు మా ఇంట్లోవాళ్ళ వల్ల నేను నేర్చుకున్నాను. అందుచేత నేను దేవుణ్ని ప్రార్థించినప్పుడల్లా భూలోకాన్ని అతడు ఆశీర్వదిస్తున్నట్లుగా రూపకల్పన చేసుకొని ప్రార్థించేవాడ్ని. అప్పటి నా ఆవేదన ఇప్పుడు తల్చుకొంటూంటే నాకు ఏడుపూ నవ్వూ కూడా వస్తాయి. కోర్టుకి వచ్చిన కొన్నాళ్లకి(నాకు) సంఘాన్ని ప్రస్తుతం నడిపించే శక్తులు దుర్మార్గమూ, దౌర్జన్యం, దోపిడీ, అబద్ధం, అన్యాయం అని నా కంటికి స్పష్టంగా కనిపించింది. న్యాయం కోసం, నిజం కోసం ఎంత విలవిల్లాడి, ఎంతటి తహతహతో భగవంతుణ్ని ప్రార్థించినా లాభం ఉండదని నా అనుభవం వల్ల నాకు తోచింది. అందుమీదట నా మనసు చాలా కష్టపడింది. దేవుడి యెడల రోజు రోజుకీ నాకు నమ్మకం తగ్గిపోసాగింది. (దేవుడు ఉన్నాడనే ప్రిజమ్షన్ మీద) అతడంటే కోపం రాసాగింది. చివరికి దేవుడు ఉన్నప్పటికీ కూడా పేదవాడికి సాయం చెయ్యడనే నమ్మకం నాకు గట్టిగా కలిగిపోయింది. అతని మీద నాకు ఉండే దుఃఖం వ్యక్తం చేస్తేగాని నేను ఉండలేకపోయాను. ఆరు సారా కథల్లోనూ నిజం నాటకంలోనూ ఎండ అనే కథలోనూ విషాదం అనే నాటికలో కొంతగానూ నేను నా విసుగునీ దుఃఖాన్నీ వ్యక్తం చేసుకున్నాను. దేవుడు లేడనుకోవడం కంటె దేవుడు ఉన్నాడనుకోవడమే నాకు ఒకప్పుడు ఇష్టంగా ఉంటుంది; లేడనుకొంటే ద్వేషించడానికి నాకెవరూ ఉండరు. ఎంచేతనంటే రాజుని ద్వేషించడం కష్టం (ప్రమాదం); దేవుణ్ని ద్వేషించడం సులభం. (ప్రస్తుతం కొంత ప్రమాదరహితం) కాని మానవులు మానవుల్ని పెట్టే బాధల గురించి (చాలా మంది ఉన్నాడనుకునే) భగవంతుణ్ని ప్రార్థించి కాని నిందించి కాని ప్రయోజనం లేదని నేను తెలుసుకున్నాను. నమ్ముతున్నాను. నా నమ్మకం ఇతరులకి తెలియజేయాలనే కోరిక నాలో ఎందుకు కలిగిందో నేను స్పష్టంగా చెప్పలేను. ఒకరు తెలుసుకున్నాననుకున్న విషయాలు ఇంకొకరితో చెప్పడమే లేకపోతే చెప్పాలనే కోరికే లేకపోతే మనుష్యులం ఈ విధంగా ఉండనే ఉండము.

ఈ అన్యాయాలకి కారణం ఇదీ అని తెలిసినవాళ్ళు చాలామందున్నారు. అన్యాయాలవల్ల లాభాలు పొందుతూన్నవాళ్ళు అసలు కారణాలు చెప్పరు. అన్యాయాలకి భయపడ్డవాళ్ళు (అసలు కారణాలు తెలుసుకున్న వాళ్ళయినప్పటికీ) అసలు కారణాలు చెప్పరు, ఈ అన్యాయాల వల్ల దెబ్బతినేవాళ్లకి అసలు కారణాలు సరిగ్గా తెలియవు, తెలుసుకొని అన్యాయాన్ని ఎదిరించబోతే, లాభాలు పొందేవాళ్ళు వాళ్ళని అణచిపారేయడానికి ప్రయత్నం చేస్తారు. అన్యాయాన్ని ఎదిరించేవాళ్ళు చిట్ట చివరికి, అన్యాయాల వల్ల బాధపడే వాళ్ళే అవుతారు కాని మరొకరు అవరు.

నేను తెలుసుకున్న (తెలుసుకున్నానుకుంటూన్న) విషయాలు చాలా మందికి తెలిసినవే అవొచ్చు. కాని ఈ సంగతులు తెలిసిన తరువాత నా చుట్టూ జరిగే విషయాలు నాకు కొంత స్పష్టంగా బోధపడసాగేయి. బోధపడ్డ విషయాలు కథ రూపంలో నాకు కనిపించసాగేయి. కుక్క పిల్లా వగైరా కథల్లోనూ "ఆరు సారా కథ"ల్లోనూ "నిజం" నాటకంలోనూ "విషాదం" నాటికలోనూ ఈ విషయాలు చెబుదామనే సరదాతో అవి రాసేను. ఇవి రాసినప్పుడు (రాస్తూన్నప్పుడు కూడా) అది వరకు అంతగా లేని సరదా ఒకటి నాలో పుట్టుకొచ్చింది. (లేదా ఎక్కువయింది). ఇవి అందరూ చదివితే బావుండునని అనుకుంటూ ఉండేవాణ్ని. అవి రాస్తూన్నప్పుడు "ఇది శ్రీశ్రీ చదు వుతే ఏమంటారు? కొడవటిగంటి ఏమనుకుంటారు? కాళీపట్నం రామారావు బావుందంటారా, అనరా?" అని ఈ విధంగా అనుకొంటూ ఉండేవాణ్ణి. రాస్తున్నప్పుడు రచయితకి అస్పష్టంగా అయినా ఏదో ఒక ఆడియన్సు ఉంటుందని నేను అనుకుంటాను.

నా కోపం, తాపం నా దుఃఖం, సంతోషం, నా సరదా, నా క్యూరియాసిటీ వగైరాలు ఇతరులకి తెలియచెయ్యడానిక్కూడా నేను కథలు రాసేననుకొంటున్నాను. నా మీద నాకు ఉండే అసహ్యం కొద్దీ కూడా నేను కొంతగా రచన చేసేను. అగ్గిపుల్ల అనే కథలో శేషగిరిలా నేను ఉండగలనని నాకు నమ్మకం ఉంది. అటువంటి వాళ్ళంటే నాకు అసహ్యం. అసహ్యం ఈ కథలో వ్యక్తం అయిందని నేను తలుస్తాను. రొట్టెముక్క అనే కథలో వచ్చే మూర్తి కవిలాంటివాళ్ళని చూస్తే నాకు ఇష్టం లేదు. వాళ్ళు దొంగ రచయితలని నా అభిప్రాయం. అలా నేను ఎప్పటికీ ఉండకుండా ఉండేందుగ్గాను ఇటువంటి పాత్రని నాకు చిత్రించుకొని అటువంటి వాళ్ళమీద పర్మనెంటు అసహ్యాన్ని పెట్టుకున్నాను.

# సిద్ధాంత గ్రంథాల తొలి ప్రచురణ



## - మహీధర రామ్మోహనరావు

**(16. 11.1909 - 06.10. 2000)**

"వేము ముగ్గురన్నదమ్ములము - మహీధర రామమోహనరావు, జగన్మోహనరావు, కృష్ణమోహనరావులం, 1935 లో సోషలిస్టు సాహిత్యాన్ని తెలుగు ప్రజలకు అందించే లక్ష్యంతో "ముంగండ" అనే మారుమూల గ్రామం నుంచి 'విశ్వ సాహిత్యమాల' ప్రచురణ సంస్థను ప్రారంభించాము. మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాల ప్రచురణకు అది, దానికి అనుబంధంగా STORES, FICTION వంటి వానిని ప్రచురించేందుకు 'అవంతీ ప్రచురణ'లు పెట్టాం. 'అవంతీ' నా PEN NAME. నా నవలలో అధికభాగం అవంతీ ప్రచురణలలోనే వచ్చాయి. ప్రజాశక్తి ప్రచురణాలయం వచ్చాక విశ్వసాహిత్యమాల తాత్త్విక గ్రంథాలు, శాస్త్ర గ్రంథాల మీద దృష్టి పెట్టింది. 1978 లో జగన్మోహనరావు మరణించే వరకూ విశ్వసాహిత్యమాల రమారమి 100 పుస్తకాలకు పైగా తెచ్చింది. నా రచనలకే పరిమితమయిన అవంతీ ప్రచురణలు ఇంకా సజీవంగానే ఉంది. మాకు ముందూ, తర్వాత సోషలిస్టు సాహిత్య ప్రచురణలకు ఎన్నో గ్రంథాలు వచ్చాయి. సోషలిజాన్ని ప్రజానీకానికి అందించడం కోసం విశ్వసాహిత్యమాల చేసిన కృషి ఈనాటికీ మరువలేరు. అయితే సిద్ధాంత గ్రంథాలుగా వేసినవీ, తాత్త్విక, శాస్త్రీయ గ్రంథాలుగా వేసినవి ముఖ్యంగా లెనిన్ రచనలూ, సోవియట్ రచనలూనే. ప్రథమ దినాలలో మార్పువిగా మేము వేసినవి మూడేమూడు చిన్న పుస్తకాలు. VALUE - PRICE - PROFIT, WAGE LABOUR AND CAPITAL, ADDREN TO THE COMMUNIST కి అనువాదాలు. ఆ మూడు నేనే అనువదించాను. ఇదిగాక శ్రీమతి దర్శి సుభద్రమ్మగారు అనువదించిన SO CIALISM UTOPIN AND SCIEHNTIJFEN ఇది ఏంజిల్సుది. 1940 నాటికి తెలుగునాట లభించిన మార్క్స్ రచనలు ఇంతేనంటే తప్పు పట్టనక్కరలేదు. ఆనాటికీ, ఈనాటికీ పెద్దగా మారలేదు. •

---

"ఎందుకు రాసేను?" అనే ప్రశ్నకి నాకు తెలిసిన సమాధానం చెప్పేను. "ఎందుకు రాయాలి" అనే ప్రశ్నకి సరైన జవాబు నాకు తెలియదు; (లేక) నాకు తెలిసిన జవాబు సరైంది కాకపోవచ్చు. కాని, చెప్పుకుందికి ప్రయత్నిస్తాను.

లోకంలో మంచి చెడ్డా అనేవి ఉంటూ వస్తున్నాయి. వాటి మధ్య నిత్యం పోరాటం జరుగుతూనే ఉంటుందనే విషయం అందరికీ తెలిసిన విషయమే. ఆ పోరాటపు స్థాయి ఒకప్పుడు ఉన్నంత తీవ్రంగా ఇంకొకప్పుడు ఉండకపోవచ్చు. కాని మంచి చెడ్డల మధ్య నిత్యం సంఘర్షణ జరుగుతూనే ఉంటుందని నేను అనుకుంటాను.

ప్రతి రచయిత కూడా రెండు, మూడు లేక ఎన్నో కొన్ని మజిలీలు చేసి చివరికి ఈ మంచి చెడ్డల క్రాస్ రోడ్సుకి వస్తారనీ రాక తప్పదనీ నేను నమ్ముతాను. అప్పుడు అతను పాఠకుడికి తను ఏ మార్గం చూపించాలో నిశ్చయం చేసుకుంటాడు. ఆ దారంట వెళ్ళమని అందరికీ చెప్తాడు.

గొప్ప ప్రతిభగల రచయితలు అని చాలామంది వప్పుకునే రచయితలు కొంతమంది ఉన్నారనేది నిర్వివాదమైన విషయం. ఆ ప్రతిభగల రచయితల రచనలు కొన్ని నన్ను చెడ్డకి తిప్పేయనీ, కొన్ని నాకు మంచిని చూపించేయనీ నాకు తెలుసు. అందుచేత కవిత్వానికి మనుష్యుల్ని ఎటో అటు మళ్ళించే శక్తికలదని నేను నమ్ముతాను. నిజాన్ని తెలుసుకోవడం, అందులో మంచి చెడ్డలేవో నిర్ణయించుకోవడం, మనుష్యుల్ని మంచికి మళ్లించడానికి ప్రయత్నించడం రచయితల కర్తవ్యం అని ప్రస్తుతం నేను అనుకొంటున్నాను. ప్రతి రచయితా కూడా తను రాస్తున్నది రావణుణ్ని సమర్థించి రాముణ్ని ఓడించడానికా, లేక సీతని విడిపించి న్యాయాన్ని గెలిపించడానికా అనే విషయం తేల్చుకోవల్సుంటుందని తలుస్తాను. కాని ఈ విషయం తేల్చుకునేముందు రావణుడు సీతాదేవిని ఎత్తుకుపోవడం న్యాయమో అన్యాయమో రచయిత నిర్ణయించుకోవలసుంటుంది. ప్రతి రచయితా కూడా తను ఎవరి మంచికోసం రాయాలో ఎప్పుడో ఒకప్పుడు నిర్ణయించుకుంటానని నేను అనుకుంటాను.

అందుచేత రచయిత ప్రతివాడూ తాను రాస్తున్నది ఏ మంచికి హాని కల్గిస్తుందో ఏ చెడ్డకి ఉపకారం చేస్తుందో అని ఆలోచించవలసిన అవసరం వుందని నేను తలుస్తాను. మంచికి హాని చెడ్డకి సహాయమూ చెయ్యకూడదని నేను భావిస్తాను. ఇది తెలుసుకుందికీ తెలియజెప్పడానికే నేనిదంతా రాసేను.

**("రావిశాస్త్రీయం" నుంచి)**

సాహితీ స్రవంతికి 'ప్రస్థానం' పత్రికకు శుభాకాంక్షలతో...

దశాబ్ద కాలం పైగా అన్ని రకాల వ్యాధి నిర్ధారణ పరీక్షలను అత్యున్నత ప్రమాణాలతో నిర్వహించే సంస్థ



# మెడినోవా

డయాగ్నస్టిక్ సర్వీసెస్, వైరా రోడ్, ఖమ్మం ఫోన్ : 08742 -224100



అత్యాధునిక టెక్నాలజీ కల్గిన Volusion E8 Expert అడ్వాన్స్‌డ్ 3D, 4D నూతన స్కానింగ్ మిషన్

- అల్ట్రా సౌండ్ స్కానింగ్, కలర్ డాప్లింగ్, 2D-Echo, TMT మరియు EEG
- క్వాలిఫైడ్ డాక్టర్లచే కంప్యూటరైజ్డ్ లేబొరేటరీ నందు పాథాలజీ, మైక్రోబయాలజీ, రేడియాలజీ పరీక్షలు
- ప్రముఖ సూపర్ స్పెషలిస్ట్ డాక్టర్లచే కన్సల్టేషన్ సర్వీసులు

ప్రపంచ ఖ్యాతి చెందిన "ELECSYS-2010 ROCHE HITACHI" వారి పూర్తి కంప్యూటరైజ్డ్ ఆటోమేటిక్ ఎనలైజర్‌తో థైరాయిడ్ హార్మోన్స్ మరియు ఇతర ఉన్నత శ్రేణి పరీక్షల రిపోర్టులు ఒకే రోజులో ఇవ్వబడును



ఆధునిక టెక్నాలజీ కల్గిన డిజిటల్ ఎక్స్‌రే మిషన్

సాహితీ స్రవంతికి 'ప్రస్థానం' పత్రికకు శుభాకాంక్షలతో...



ఖమ్మం విద్యారంగంలో మణిహారం

# BLOOMING MINDS

*Complete School with a difference*

గత 20 సంవత్సరాలుగా కేంద్రీయ విద్యాలయంలో టీచర్ మరియు ప్రిన్సిపాల్‌గా పనిచేసిన అనుభవం గల డైరెక్టర్ పర్యవేక్షణలో...




10 ఎకరాల సువిశాలమైన ప్రాంగణములో అత్యాధునిక భవన సముదాయములో కాలుష్య రహిత ప్రశాంతమైన వాతావరణంలో...

**Yellandu Road, Khammam. Cell : 9963681890, 9032036656**

అడ్మిషన్లు జరుగుచున్నవి / బస్ సౌకర్యం కలదు



# బానిసను కాను, విధాతను!

## అనిశెట్టి సుబ్బారావు

**(23.10.1923-1981)**

అభ్యుదయ కవి. అరసం నాయకులు. సినీ రచయిత.

ఎందుకు ప్రవేశించావు కమ్యూనిస్టు పార్టీలో? అన్నారు. అంటున్నారు. కొందరు విజ్ఞానులు సుముఖమౌతున్నారు. కొందరు అజ్ఞానులు దూరమౌతున్నారు.

వ్యవస్థా చక్రంలో తప్పనిసరిగా తిరుగుతూ కొత్తదాన్ని ప్రతిదాన్ని శంకించే వ్యక్తుల్ని చూస్తే జాలివేస్తుంది. నాకు తెలుసు. ఒక నాటికి ఈ విముఖులు, శత్రువులు తాము చరిత్రనే కళంకితం చేసినట్లు గ్రహిస్తారని.

మానవుణ్ణి నేను. కోట్ల మానవుల అమాయిక ప్రాణాలు దాహం తాగే సమాజ యంత్రంలో పనిముట్టు కాదు నా దేహం. వ్యక్తతా ప్రకాశం జీవన చైతన్యం కలిగిన నేను చరిత్రకు బానిసను కాను. నేతను.

చరిత్రలో బుద్ధుడు, జీసస్, సోక్రటీస్ జీవితాన్ని పరిణితి పొందించేందుకు మధనపడి వధ పొందిన సహస్రజీవులు ప్రేమ విశ్వాన్నంతనూ చైతన్యమయ జీవనోద్యమంగా మార్చుతుందని అన్నారు. విపులమైన పరిశీలనతో, గతితార్కిక తత్వంతో మార్క్సు సిద్ధాంతీకరించాడు. చరిత్రకు కర్తవ్యతాజ్ఞానం ఇచ్చాడు.

మానవ హృదయానికి, పాదానికి ఎల్లలు హద్దులూ లేవు. జగత్తు అంతా మానవుని శోభామయ గృహంగా వెలసేందుకు కమ్యూనిస్టులు కృషిచేస్తున్నారు.

నాకు తెలుసు! ఇది మానవుని బాల్యం. చైతన్య రాహిత్యం, జీవన దౌర్భల్యం కారణంగా సంప్రాప్తమైన బాల్యారిష్టాలు అతని జీవాన్నే కృంగదీసి పీల్చి పిప్పిచేస్తున్నాయి. ఇది నా విధి! స్వచ్ఛమైన, కళంకరహితమైన సమాజ వికాసాన్ని ప్రోద్భవించడం, నూత్నజీవన శంఖం పూరించడం!

గుండె గుండెకూ మధ్య కట్టుబాట్లు ఇంటింటి నడుమా రాతిగోడలూ, చేను చేనుకూ, జాతి జాతికీ మధ్య పొలిమేరలు. నన్ను, నా సోదర మానవుల్ని అవమానిస్తున్నాయి. ప్రబలమైన ఈ జాడ్యానికి మానవత్వం ఆహుతవుతుంది. అర్ధణా దబ్బుల వద్ద విచ్ఛిన్నమైన కుటుంబాలలో ద్వేషం, పొలంగట్ల వద్ద కొట్లాడిన పల్లీయులు ఓడ్చిన నెత్తురు, నది కోసం, గని కోసం పోరాడిన జాతులు కోల్పోయిన కోట్ల మానవుల కంకాళాలు ఏమని ఘోషిస్తున్నాయి!

ఈ వైకల్యానికి, వ్యధకు కారణం ఊహించలేక తత్వవేత్తలు వెత చెందారు. ప్రతి ఒకరి పరిశీలన, నిర్ణయాలూ నన్నాకర్షించినై. వారి ఊహాసౌధాలు చక్కని కాంక్షలుగా మాత్రం నిలిచిపోయినై. జగత్తు మాత్రం ఈ జాఢ్యభారంతో కుంగిపోతూనే వచ్చింది. గాఢంగా యోచించి, పఠించి, జీవన సంగ్రామాన్ని పరిశీలించేందుకు మార్క్సు అవలంభించిన గతితార్కిక తత్వం ఒక్కటే సరైందని గ్రహించాను. వేదాంతుల్ని వేధించిన సందేహాలన్నీ వర్గపోరాట సిద్ధాంతంలో, దానికి ప్రాతిపదిక అయిన భౌతికవాదంలో, సుస్పష్టంగా తీరిపోయాయి.

మానవుల్లో మానవులే కాదు, పిశాచులూ ఉన్నారనీ, యంత్రాలు నిర్జీవమైనవే కాదు, ప్రస్తుతం మానవుని పరిపాలిస్తున్నా యని నాకు తెలుసు. పూర్వ వేదాంతాలకు చరిత్ర జీవం పోసి నిలిపింది. మార్క్సు చరిత్రకు జీవం పోశాడు.

ఈ వైకల్యానికి, వ్యధకు కారణం ఊహించలేక తత్వవేత్తలు వెత చెందారు. ప్రతి ఒకరి పరిశీలన, నిర్ణయాలూ నన్నాకర్షించినై. వారి ఊహాసౌధాలు చక్కని కాంక్షలుగా మాత్రం నిలిచిపోయినై. జగత్తు మాత్రం ఈ జాడ్యభారంతో కుంగిపోతూనే వచ్చింది. గాఢంగా యోచించి, పఠించి, జీవన సంగ్రామాన్ని పరిశీలించేందుకు మార్క్సు అవలంభించిన గతితార్కిక తత్వం ఒక్కటే సరైందని గ్రహించాను. వేదాంతుల్ని వేధించిన సందేహాలన్నీ వర్గపోరాట సిద్ధాంతంలో, దానికి ప్రాతిపదిక అయిన భౌతికవాదంలో, సుస్పష్టంగా తీరిపోయాయి.

"ఇది రాక్షసం, సమాజ యంత్రం, సమాజాన్ని ధ్వంసం చేస్తుంది. దీన్ని బ్రద్దలు చెయ్యి. సమధర్మం నిర్మించు!" అని, ఈ ఘోష విన్న ప్రతి హృదయం దద్దరిల్లుతుంది. తన సర్వ శక్తులూ మేళవించి ఈ యంత్రాన్ని మూలమట్టం చేస్తుంది. ఈ మహత్కార్యం మానవత్వాన్ని నిరూపిస్తుంది. సర్వతోముఖంగా, అవ్యాహతంగా ఇందుకే కమ్యూనిస్టు పార్టీ పోరాడుతుందని చరిత్ర రుజువు చేస్తుంది!

పీడితులు, బాధితులు, దరిద్రులు జగత్తులో మానవత్వాన్ని సమర్థిస్తున్నారు. నిర్మిస్తున్నారు. ఈ మహోద్యమానికి కమ్యూనిస్టు పార్టీ శిరస్సు ప్రకృతిలో పాతుకుపోయిన పాదాలతో ఆదర్శ శిఖరాల్లో విహరించే ఊహలతో, అలజడితో, ఆందోళనతో ఏండ్ల తరబడి కలవరపడి విముక్తి మార్గాన్ని కనుగొన్నాను. సమ ధర్మ జగత్తు నిర్మించేందుకు నా మేధస్సు, హృదయం అర్పించాను.

కమ్యూనిస్టు పార్టీ ప్రపంచమంతటా శత్రువుకెదురయి పోరేందుకు ఆయుధాల్ని, నాయకత్వాన్నే కాక భావి సమాజాన్ని సృష్టించేందుకు తత్వ పరిజ్ఞానాన్ని కూడా ప్రసాదిస్తుంది. విప్లవం ఎప్పుడో రాదు. జరుగుతోంది!

నాకు తెలుసు : జగత్తులో ఇప్పుడే రెండే రెండు తెగలు గత ప్రస్తుతాల ఊబిలో కూరుకుపోయి ప్రస్తుతపు అమానుషాన్ని సహించే, సమర్థించే మూఢులూ, స్వార్థపరులూ ప్రస్తుతంలోని రాక్షసాన్ని గ్రహించి, హృదయం కంపించి ప్రస్తుతాన్ని బ్రద్దలు కొట్టి, మహత్తర భవిష్యత్తును నిర్మించేందుకు పిడికిలి ఎత్తి ప్రతిజ్ఞబూనే పురోగాములు.

అవ్యాహతంగా, నిరాఘాటంగా ప్రవహించే జీవన వాహినిని వెనక్కు తిప్పే వ్యర్థ యత్నంలో సమసిపోతోంది మొదటి తెగ.

అభ్యుదయోత్తరమైన సక్రమ పథాన మళ్ళించేందుకు జగత్తును పంటపొలం చేస్తోంది రెండవ తెగ.

మొదటి తెగ ప్రశ్నించవచ్చు. ఎందుకు? మీకు ఈ విపరీత త్యాగాలు కోరే మహోద్యమం? ఒకప్పుడు నేనూ ప్రశ్నించుకొని వెర్రెత్తిపోయాను.

యుగాలుగా దారిద్ర్యంలో కుమిలి కాలిన కొన్ని లక్షల కుటుంబాలు జవాబు చెప్పినై. శతాబ్దాలుగా మానవత్వాన్ని విసర్జించిన బానిసల దీన వదనాలు జవాబు చెప్పినై. సమాజమే సృష్టించి పెంచి లీలగా, ఆటగా వధించిన యాభైలక్షల బెంగాల్ సోదరుల మరణాక్రందనలు జవాబు చెప్పినై. తోవలో స్పృహ తప్పి పడిపోయే ప్రతి బిచ్చగాడూ ఈ ప్రశ్న విని పరిహసిస్తున్నాడు. చరిత్ర కంఠంతో శపిస్తున్నాడు.

ఈ వైకల్యానికి, వ్యధకు కారణం ఊహించలేక తత్వవేత్తలు వెత చెందారు. ప్రతి ఒకరి పరిశీలన, నిర్ణయాలూ నన్నాకర్షించినై. వారి ఊహాసౌధాలు చక్కని కాంక్షలుగా మాత్రం నిలిచిపోయినై. జగత్తు మాత్రం ఈ జాడ్యభారంతో కుంగిపోతూనే వచ్చింది. గాఢంగా యోచించి, పఠించి, జీవన సంగ్రామాన్ని పరిశీలించేందుకు మార్క్సు అవలంభించిన గతితార్కిక తత్వం ఒక్కటే సరైందని గ్రహించాను. వేదాంతుల్ని వేధించిన సందేహాలన్నీ వర్గ పోరాట సిద్ధాంతంలో, దానికి ప్రాతిపదిక అయిన భౌతికవాదంలో, సుస్పష్టంగా తీరిపోయాయి.

మానవుల్లో మానవులే కాదు, పిశాచులూ ఉన్నారనీ, యంత్రాలు నిర్జీవమైనవే కాదు, ప్రస్తుతం మానవుని పరిపాలిస్తున్నాయని నాకు తెలుసు. పూర్వ వేదాంతాలకు చరిత్ర జీవం పోసి నిలిపింది. మార్క్సు చరిత్రకు జీవం పోశాడు. సర్వతోముఖ సుఖజీవనం కమ్యూనిస్టు దశలోనే సాధ్యమని, తప్పనిసరి అయిన కమ్యూనిస్టు దశలోకి సమాజాన్ని పరిణమింప చెయ్యాలని:

కమ్యూనిస్టు సిద్ధాంతం పురోగామి సిద్ధాంతం. అది జగత్ సత్యాన్ని గ్రహించి కర్తవ్యం నిర్ణయిస్తుంది. పతితుల జీవంతో వెలిగించిన ఈ జ్యోతి గాఢాంధమైన భావిని దీప్తివంతం చేసింది. మానవ జీవితం ఆ త్రోవననుసరించటానికి చేయూతనిచ్చేందుకు నాకు దార్ఢ్యం కూర్చింది అందుకని.

ప్రస్తుతం మానవ జీవితం మూసలో కళపెళ లాడుతుంది. గత కాలపు జడతత్వ కాఠిన్యాలు కరుగుతున్నాయి. వర్తమానపు ముద్రలు చెరిగిపోతున్నాయి. దివ్యమైన నూత్నాకారాన్ని పొందుతోంది జీవితం. అందుకే భావిని ఆలపించే కవులు–

'రారా ఓ మానవుడా
మానవుడా
రారా మానవుడా!
కరువుల పుట్టిల్లు ధాత్రి కామధేను వయ్యేనురా
కాడులేని స్వర్గమిచట కట్టితిమయ్యానీకై!
రారా ఓ మానవుడా!
అవతరించె శుద్ధావని అవనిక పైకెక్కెనురా
నవజీవన దివ్యవాణి నాంది పఠించెను నీకై
రారా ఓ మానవుడా!

అంటున్నారు. జీవశక్తి మహోధృతంగా విజృంభిస్తోంది ఈ పరిణామ దశలో నా కర్తవ్యం ఇది.

**నాకు తెలుసు** : ఈ కష్ట సముద్రం దాటేందుకు కట్టే వారధికి ఎత్తే ఒక రాయినైతే చాలునని!

భవిష్యత్తు కోసం శత్రువుల్ని బలి ఇచ్చేటప్పుడు వారి గుండెల్లోంచి దూసుకుపోయే ఒక తుపాకీ గుండునయితే చాలునని.

నూత్న జగత్తులో ద్వేషం, ఈర్ష్య, అప్పులు, అసూయ ఎరగని శిశువు పెదవుల్లో పూచే చిరునవ్వునైతే చాలునని!

**('నేను కమ్యూనిస్టుని ఎలా అయ్యాను' పుస్తకం నుంచి)**

# ఒకో తరానికి ఒక పరిభాష



ఆరుద్ర

(31.8.1925 - 04.06.1998)

అసలు పేరు భాగవతుల శంకరశాస్త్రి. సుప్రసిద్ధ అభ్యుదయ కవి, రచయిత, పరిశోధకుడు.

**Personalist Writings అని కొంత అభివృద్ధి నిరోధక సాహిత్యాన్ని రాస్తారు గానీ అందులోని నవీనతని ఒంట పట్టించుకోండి. ఇవన్నీ నేను మదరాసు పోతూ పిఠాపురంలో దిగి మీకు చెప్తామనుకొన్నాను.**

**ప్రతీ తరం కవులకి ఒక పరిభాష ఉంటుంది. భావ కవులకి కోయిల, విరహం, కన్నీళ్లు ఉన్నట్టే శ్రీశ్రీ తరం వాళ్లకి స్మశానాలూ, అస్థి పంజరాలూ, రక్తం, రాబందులు ఉన్నాయి. ఈ తరం కవులకి చరిత్ర, దోపిడీ తిరగలి, కూలి వాళ్ల కండలు ఉన్నాయి. గానీ చెయ్యి తిరగని రచయితల పద్యాల్లో పడి వాటి అర్థాలు పాడై పోతున్నాయి. కాబట్టి మీరు వాటిని వోతాదుగా వాడండి. ఓసారి కుటుంబరావుగారు "ఈలోకం" అని మొదలెట్టి వ్రాసిన ప్రతి గేయాన్నీ దాస్తానన్నారు. చెప్పొచ్చేదేమిటంటే "చరిత్ర"కి అర్థం లేకపోతున్నది. Leftist పద్యాలకి ప్రస్తుతం వాడుతున్న పరిభాషే అక్కర్లేదు.**

డియర్ సో.మ.సుందరంగారూ!

ఇక్కడికి ఎప్పుడొచ్చేనో, ఎందుకొచ్చేనో మొదలయిన విషయాలు వ్రాసి విసిగించను. ఇక్కడికి వచ్చేనంతే. ఉంటాను ఓ రెండు నెల్లపాటు. (బహుశా మరి రెండు నెల్లపాటు, మూడొంతులు ఇంకో రెండు నెల్లపాటు). జీవితం అంటే విసిగి విసిగి ఎక్కడా నాకు కావలసిన జీవితం, సహవాసం, సమాజం, సభ్యత మొదలయినవి దొరక్క అందక, విసిగి, విసిగి ఈ దూరానికి ఎదురీది వచ్చేను. బహుశా మూడొంతులు, ఇక్కడే ఓ రెండు నెల్లలో, మరి రెండు నెల్లలో, ఇంకో రెండు నెల్లలో అన్నీ జత పడతాయని ఆశిస్తూ ఇక్కడే- ఇక్కడే, ఇలాగే- ఇలాగే ఉండిపోదలచుకొన్నాను. ఆశ అడియాస అవుతుందని నాకు తెలుసు. అయినా మదరాసులో ఎరిగిన ముఖం కాదు కలకత్తాది. అందుకే అనుకొన్నవి దొరక్కపోయినా అన్వేషణ మాత్రం (ఫలం నిష్ఫలం- అని ముందే తెలిసినా) చెయ్యవచ్చు అన్న ధీమాతో ఓ ఆర్నెల్లు ఉండదలచుకున్నాను. దొరికాయో కావలసిన బాధల మూట దొరికిందన్న నునువెచ్చని సంతోషంతో కాలాన్ని సద్వినియోగం చెయ్యవచ్చు. లేదా ఉండనే ఉంది, బొహీమియన్ జీవితం.

అసలు నాకు ఆ జీవితవే కిట్టదు. సవ్యమైన సమాజం లేనప్పుడు, కృత్రిమ సమాజపు చట్టాలలోనికి కుదించబడే నేర్పు చాతకానప్పుడు నాకు బొహీమియన్ వే ఆఫ్ లైఫ్‌లోనే సౌందర్యం గోచరిస్తుంది. ఎయిర్ ఫోర్సులోంచి విడుదల కాగానే ఈ జీవిత విధానానికి ఎర అయ్యేను. క్షణిక సౌందర్యం సాక్షాత్కరించింది. ఇప్పుడు నెమరు వేసుకొంటే అదంతా డొస్టవస్కీ నవలల్లాగ, మొపాసా కథల్లాగ, కన్యాశుల్కంలో రాత్రిలాగ భయపెడుతూ వికిర తాండవం ఆడుతున్నట్టు ఆలోచనలు. "విప్పనా విప్పనా, విషాలసంచి, చెప్పనా చెప్పనా దాన్ని గురించి". ఆ రోజుల్లో నాకు ఇల్లు లేదు, వాకిలి లేదు. శ్రీ శ్రీదీ నాదీ ఒకే

మళ్లా మదరాసు వెళిపోతున్నానని రాశానా మీకు. అప్పుడు విశాఖ జీవితానికి అలసిపోయే. గానీ, ఆ గాలి ఇటు కలకత్తాకి కొట్టేసింది. ఈ ఊరు చాలా బాగుంది. ఊరనగా ఏం లేదు. నాలుగు రైల్వే కొంపలూ, పాతిక మంది రైలు మనుష్యులూ. గానీ ఊరంత చెరువుంది. అదే నా రోజుల్లో రెండు గంటల్ని తింటున్నది.

ఎడ్రసు. కేరాఫ్ పేవ్‌మెంట్సు. రోజుకి ఇద్దరం ఎడంచెత్తో పది రూపాయలు ఆర్జించే వాళ్లం. ఒక నెలలో మా ఇద్దరి ఆర్జనా ఆరు వందలు. ఖర్చు కనబడలేదు. వెరసి బండ సున్నా. ఇల్లు లేక ఇక్కడా అక్కడా బతికేవాణ్ణి. తాగుబోతులతో, జూద గొట్టులతో, సాని ముండలతో సంఘం అడుగున జీవించే పురుగులతో భుజం, భుజం కలిపి ఊపిరి తీసేవాణ్ణి. ప్రతి ఒక్కడూ బాధపడుతున్నా ఆ విషాదాన్ని ఉతికి ఇస్త్రీ చేసి తొడుక్కొనేవాడు. వాళ్ల ఏడుపులో వాటా పుచ్చుకొని మదరాసు వీధుల్లో నడిచేవాణ్ణి. చేస్తున్నది పరువైన ఉద్యోగం. మోస్తున్నది బరువైన గౌరవం. రెండు రకాల మొఖాలను ధరించే నేర్పు లేక చాలా మంది చేత "ఆరుద్ర చెడిపోతున్నా"డని అనిపించుకొన్నాను. రెండు రకాల నాలుకలు లేక 'ఆనందవాణి' నుంచి విరమించుకొన్నాను. రెండు రకాల మాటలు చేతగాక మద్రాసు నుంచి మహాభినిష్క్రమణం చేశాను. చిత్రం! ప్రతీ ఒక్కడూ వెళుతున్నది ఆ బాటనే. అయినా నన్ను చూసి పెదవి విరిచి 'అబ్బాయీ! చూడలేదా ఈ సైన్ పోస్టు. ఇక్కడికీ వినాశనానికీ ఎంతో దూరం లేదు. ఫో. ఫో వెనక్కి' అన్నవాడే. అయితే వాళ్లు చేస్తున్న పనులు నాలుగు గోడల మధ్యా, చీకటి ఎల్లలలోనా. అప్పుడే అనుకొన్నాను– నా భావికి తూర్పున బంగాళాఖాతం, పశ్చిమాన కీకారణ్యం ఉన్నా ఇలాగే వెళిపోవాలని. గానీ నెరవేరింది కాదు మహా సంకల్పం. నా రెండు చేతులూ పట్టుకొని, నా రెండు కాళ్ళూ కలిపి కట్టి విసిరేశారు. ఇద్దరు నా 'మంచి' కోరే మిత్రులు నన్ను విశాఖపట్నంలోకి.

విశాఖపట్నంలో జీవితాన్ని చూస్తే ఇంతేనా జీవిత పరమార్థం అనిపించింది. స్వల్పమైన ఆశయాలతో అల్పమైన జీవితాన్ని జాపోరుస్తూ ఈడ్చుకొంటూ బతికే లిల్లీ పుట్లను చూసి జాలి వేసింది. పొద్దున్నే ఆయాసంగా నిద్రలేచి తొందరగా ఆఫీసు మొఖాన్ని తగిలించుకొని భయపడుతూ ఉద్యోగాన్నీ, నిర్వేదాన్నీ పొదుగుతూ నీరసంగా ఇల్లు చేరుకొని బద్ధకంగా నిద్రపోయే ఆఫీసు గత ప్రాణుల్ని చూస్తే వీళ్లెప్పుడూ ఇలాగే కచేరీలను మోయాలా అనిపిస్తుంది. వీళ్ల జీవితానికల్లా సారె గదిలోనిదే రొమాన్సు, పెద్ద దొర ముందు మాట్లాడ్డమే ఎడ్వెంచరు, ఇంక్రిమెంటే కైవల్యం. ఇంత అల్పులతో వుండలేక ఉక్కిరి బిక్కిరి అయి ఇక్కడికి వచ్చేశాను. అయితే నేను కూడా ఒక గుమాస్తా మాత్రుడనై కొంతకాలంపాటు కాలాన్ని ఈడ్చవలసి వస్తే నాకేం ఆశ్చర్యం లేదు. గానీ ఈ గతి పట్టకుండా కొన్ని రకాల దాలులు తయారు చేసుకొంటున్నాను.

మళ్లా మదరాసు వెళిపోతున్నానని రాశానా మీకు. అప్పుడు విశాఖ జీవితానికి అలసిపోయే. గానీ, ఆ గాలి ఇటు కలకత్తాకి కొట్టేసింది. ఈ ఊరు చాలా బాగుంది. ఊరనగా ఏం లేదు. నాలుగు రైల్వే కొంపలూ, పాతిక మంది రైలు మనుష్యులూ. గానీ ఊరంత చెరువుంది. అదే నా రోజుల్లో రెండు గంటల్ని తింటున్నది. పది గంటలకి భోంచేసి, ప్రబంధ కన్యలని చదువుకొంటూ అల్లసాని పెద్దన, కూచిమంచి జగ్గకవి, శేషం వెంకటపతి, చేమకూర వెంకటకవి మొదలైన వాళ్ళ గ్రాంథిక బూతులు వింటూ కూర్చుంటాను. 'మీకూ ఇంత తీరుబాటు ఉంటే పూర్వకవి ప్రబంధాలన్నీ ముఖ్యఘట్టాలు కంఠతా వచ్చేటట్టు చదవండి. ప్రబంధాలలో వర్ణనలను ఫక్కీ స్టీరో టైపుదయినా ఒక్కొక్క కవికొక ప్రత్యేకత ఉంది. చేమకూర పద ప్రయోగం చాలా చమక్‌లతో ఉంటుంది. వాళ్ళు శబ్దాలని బానిసలుగా చేసుకొన్నారు. ఆ విద్య పట్టించుకోండి. మీకు చక్కని పద్యాలు రాయడం వస్తుంది. ఒక్కొక్క వృత్తాన్ని మాస్టరీ చేస్తే మాత్రాచంధస్సులలో ప్రచ్ఛన్నంగా వాటి వాటి గమ్మత్తులని వాడవచ్చు. మూలపడివున్న కొన్ని చంధస్సులని స్వంతం చేసుకోండి. తరలం, వనమయూరం, వృషభగతి రగడ, హంసగతి రగడ, భుజంగ ప్రయాతం మొదలైన చట్రాల్లో జాను తెనుగు మాటలు పొదుగుతే తమాషా దేఖో లంకకే రాజా! (ఈ మధ్య నేను ఒక తెలంగాణా రణ గీతం భుజంగ ప్రయాతం వాడుతూ రాశాను. శాస్త్రోక్తంగా చంధోబద్ధంగా యతిప్రాసలుండాలిగానీ మాత్రా చంధస్సులో అంత్యప్రాస పెట్టి రాసినా ధుమాగా వుంటుంది). శ్రీ శ్రీ స్వాతంత్ర్య దిన గీతంలో మహాస్రగ్ధర ఒకటి వాడేడు చూశారా! "మహాసంకల్పం" అనే శీర్షికతో 1944 'ఆనందవాణీ' సంచికల్లో "ఆసియా అంత వాణ్ణి" అని రాశాడు చూశారా? అందులో శిఖరిణీ వృత్తం వాడేడు. ఈ గమ్మత్తులు జాగ్రత్తగా ఆచోకీ తీసి అతడు చెయ్యని

> ఆధునిక ఆంగ్ల సాహిత్యం గురించి బాగా చదవండి. ప్రస్తుతానికి **Stephen Spender** రాసిన **"Poetry Since 1939"** అనే పుస్తకం **Henry Reed** రాసిన **"Novel since 1939"** అనేవి చదవండి. ఆధునిక సాహిత్యానికి ముందు పూర్వ సాహిత్యం చదవాలి. **Spender** పుస్తకంలో **Dylan Thomas, George Barker** ల మీద కొంచెం చిన్న చూపు చూశాడు. **George Barker** రాసిన **Calamiterror** అనే కావ్యం చాలా గొప్పది. స్పెయిన్ మీద రాశాడు దాన్ని.

పరిశోధనలు చేసినవాడే శ్రీశ్రీకి వారసుడు అవుతాడు. పఠాభి కృషి చూశారా! అతడు వాడే కొత్త చంధస్సులు ఊరే చోటు ప్రబంధాలే. మనందరికీ పూర్వ కవి అబ్బూరి రామకృష్ణారావుగారు ఆ రోజుల్లో కవులు వాడని భుజంగ ప్రయాతాన్ని నగిషీ చెక్కి "సాధుగీతి" (చూ. వైతాళికుడు) రాశారు. వృత్తం భుజంగ ప్రయాతమైనా ఆఖరి పాదాల్లో గమ్మత్తులు చూశారా? రామకృష్ణారావుగారి లీడ్ అందుకొని శ్రీశ్రీ స్వంత పరిశోధనలు చేసుకొన్నాడు. శ్రీశ్రీ ముత్యాల సరాల కోసం చేసిన కృషి చేసిన ప్రతి ఒక్కడూ ఒక సింహాసనం చేసుకోగలడు. 'ఉదయిని' పాత కాపీలు దొరికితే శ్రీశ్రీ వ్యాసం "ముత్యాలసరములు: ఒక కృషి" అనేది చదవండి. కవికొండల వెంకటరావు కూడా స్వంత పొలాలను దున్నుకొంటాడు. ఆయన కూడా అనేక స్వంత పోకడలుగలవాడు. ఆయన రాసిన ప్రతి పద్యం కళ్లు విప్పి చదవండి. ఈ సలహాలన్నీ మీకు ఎందుకిస్తున్నానంటే మీరు రాస్తున్న ఇటీవలి గీతాల్లో 'టెక్నిక్' లోపం చాలా వుంది. ఇంక ఆంగ్లసాహిత్యంలో W.H.Auden, Dylon Thomasల పద్యాలు చదవండి. Thomas నేటి ఆంగ్ల పఠాభిని Anden శ్రీశ్రీ కన్నా గొప్పవాడెవడేనా తెలుగులో ఉంటే వాడితో పోల్చతగ్గవాడు. Auden పుస్తకాలన్నీ సంపాదించండి. The Orators, Look Stranger, For the Time Being అనేవేనా చదవండి. Dylon Thomas ది Deaths and Entrances అనేది ఇటీవలి పుస్తకం, దాన్ని మననం చేసుకొంటే మంచిది. T.S.Eliot Collected Poems (Waste land) చదివే ఉంటారనుకుకొంటాను. T.S.Eliot మన విశ్వనాథ సత్యనారాయణ లాంటివాడు. గానీ విశ్వనాథ మనఃప్రవృత్తి వేరు. అందుకే విశ్వనాథ విశ్వనాథ అయ్యేడు.

ఆధునిక ఆంగ్ల సాహిత్యం గురించి బాగా చదవండి. ప్రస్తుతానికి Stephen Spender రాసిన "Poetry Since 1939" అనే పుస్తకం Henry Reed రాసిన "Novel since 1939" అనేవి చదవండి. ఆధునిక సాహిత్యానికి ముందు పూర్వ సాహిత్యం చదవాలి. Spender పుస్తకంలో Dylan Thomas, George Barker ల మీద కొంచెం చిన్న చూపు చూశాడు. George Barker రాసిన Calamiterror అనే కావ్యం చాలా గొప్పది. స్పెయిన్ మీద రాశాడు దాన్ని. శ్రీశ్రీ నడగండి దాన్ని వర్ణించమని. ఆధునిక సాహిత్యం మీద తాజా వార్తలు Transformation అనే పత్రిక లాంటి పుస్తకంలో ఉంటాయి. ఈ Transformation అనే పుస్తక సంపాదకులకి Apocalypticism అనే జబ్బు ఉంది. దాన్ని చూసి మోసపోకండి. Personalist Writings అని కొంత అభివృద్ధి నిరోధక సాహిత్యాన్ని రాస్తారు గానీ అందులోని నవీనతని ఒంట పట్టించుకోండి. ఇవన్నీ నేను మదరాసు పోతూ పిఠాపురంలో దిగి మీకు చెప్తామనుకొన్నాను.

ప్రతీ తరం కవులకి ఒక పరిభాష ఉంటుంది. భావ కవులకి కోయిల, విరహం, కన్నీళ్లు ఉన్నట్టే శ్రీశ్రీ తరం వాళ్లకి స్మశానాలూ, అస్థి పంజరాలూ, రక్తం, రాబందులు ఉన్నాయి. ఈ తరం కవులకి చరిత్ర, దోపిడీ తిరగలి, కూలి వాళ్ల కండలు ఉన్నాయి. గానీ చెయ్యి తిరగని రచయితల పద్యాల్లో పడి వాటి అర్థాలు పాడై పోతున్నాయి. కాబట్టి మీరు వాటిని మోతాదుగా వాడండి. ఓసారి కుటుంబరావుగారు "ఈలోకం" అని మొదలెట్టి వ్రాసిన ప్రతి గేయాన్నీ దాస్తానన్నారు. చెప్పొచ్చేదేమిటంటే "చరిత్ర"కి అర్థం లేకపోతున్నది. Leftist పద్యాలకి ప్రస్తుతం వాడుతున్న పరిభాషే అక్కర్లేదు.

నేను మళ్లా ఏరి సాల్పూర్, అంధేరా, అంబాలా లాహోరులలో ఉన్నట్టు దేశానికి దూరంగా సాహిత్యానికి (అనగా పత్రికలకి) అందువిడిగా కాకుండా ఉంటాను. కాబట్టి ఎవరేవి రాస్తున్నదీ కాస్త సంజయుడిలా వార్తా ప్రసారం చెయ్యండి.

నేను ప్రస్తుతం ఒక నవల రాసేందుకు ఉపక్రమించేను. వచన రచనలో కూడా కొత్త దారులనేకం ఉన్నాయి. మన నవలలు మన కవిత్వం అంత ముందుకి పోలేదు. మనకున్న నవలా రచయితలే వేళ్లమీద లెక్కపెట్టవలసిన వాళ్లు. కుటుంబరావుగారి నవలలు సజావుగా సైకిలు తొక్కుతూ ఒకే రస్తామీద వెళ్లిపోతాయి. రస్తాకిరువైపులా చీలేదారుల పేరులే మనం చూస్తాం. ఆయన సూటిగా బాణం కొట్టడంలో

నేను ప్రస్తుతం ఒక నవల రాసేందుకు ఉపక్రమించేను. వచన రచనలో కూడా కొత్త దారులనేకం ఉన్నాయి. మన నవలలు మన కవిత్వం అంత ముందుకి పోలేదు. మనకున్న నవలా రచయితలే వేళ్లమీద లెక్కపెట్టవలసిన వాళ్లు. కుటుంబరావుగారి నవలలు సజావుగా సైకిలు తొక్కుతూ ఒకే రస్తామీద వెళ్లిపోతాయి. రస్తాకిరువైపులా చీలేదారుల పేరులే మనం చూస్తాం.

సిద్ధహస్తుడు. అతనికి పరిశోధనతో పని లేదు. బుచ్చిబాబు ఒక నవల రాసి ప్రచురించుతున్నాడు. అది ఏనాటికేనా పూర్తవుతే పుస్తక రూపంలో చదివి అతనేమాత్రం పరిశోధన చేశాడో చూడాలనిపిస్తున్నాది. ఏవంటే అతడు చైతన్య స్రవంతి టెక్నిక్‌లో కొన్ని రాశాట్ట. బుర్రా సుబ్రహ్మణ్యంగారి విజయలో కొన్ని భాగాలు ప్రచురణ అయినంతమట్టుకు చదివేను. కథకి యవ్వనం తప్ప పరిశోధన కనబడలేదు. ధనికొండ హనుమంతరావు వగైరాల రచనలకి ముందు సీట్ల అర్హత లేదు. జరుక్ దేవయ్య స్వీయ చరిత్రలో మంచి నవలాకారుడవుతాడన్న ఆశలు కల్పించేడు. జరుక్ నవలలు రాయలేదన్న బాధ నాకు లేదు. ఏవంటే అతడు మంచి నాటికా శిల్పాన్ని అలవర్చుకొంటున్నాడు. ఇంక వచన రచయితలేరీ? నిజంగా వచన రంగంలో అనేక గమ్మత్తులు చెయ్యవచ్చు. అవి చెయ్యి తిరిగిందికి నేను నా కథలలో తాపత్రయపడ్డాను. మీరు ఈ క్రింది నా కథలు చదివేరా?

1. మళయాళం అర్థమైంది.
2. మానవత్వం
3. తల్లి ఊఁ అంది
4. నిశానాలు
5. వైనతేయులు
6. చింతచిగురు
7. ఇందలి నీతి చెడలేదు
8. తా'ళ్లూ, తో'ళ్లూ
9. మనిషీ ఆడమనిషీ కథలు

ఒక్కొక్క దానికి ఒక లక్షణం ఉంది. ముఖ్యంగా "వైనతేయులు", "ఇందలి నీతి చెడలేదు" అన్న కథల్లో కథలో ఒక పేరాకీ, ఇంకొక పేరాకీ పోల్తి బాగా చూడవచ్చు. ఒక్కొక్క పేరా ఒక పద్యంలా ఉంటుంది. ఇందులో ఎన్ని పాదాలో అందులో కూడా రమారమి అన్ని పాదాలే ఉంటాయి.

శైలి గమ్మత్తులు (విచిత్రమే సౌందర్యం) అభ్యుదయ ప్లాటుతోపాటు నేయదలుచుకొన్నాను. శైలి అడ్డుపట్టి, ప్లాటు నిలువుపట్టీ. కొన్ని ప్రకరణాలు పచ్చి వ్యావహారికంలో వృత్తాలు రాసి పాద విభాగం లేకుండా పేర్చదలచుకొన్నాను. ఎందుకా అని అడగవచ్చు. Sound effect కోసం.

ఇక్కడ నేనుండబోయే ఆర్నెల్లలోనూ చిత్తు ప్రతి పూర్తవవచ్చు.

నేను అంధేరీలో, అంబాలాలో ఆ 'వాణీలో ఉంటున్నప్పుడు రాస్తానన్న పెద్ద వుత్తరం ఈ రూపంలో మీకు రాసేశాను. మీరు బాకీ చెల్లు పెట్టించండి.

మళ్లా యుద్ధం వచ్చే సూచనలు వాతావరణంలో అమర్చబడుతున్నాయి. కాబట్టి కాకీ దిరుసు మళ్లా ధరించవలసి వస్తుందేమో అని అనుమానంగా ఉంది. ఆ మధ్య ప్రకాశం ప్రకాశంగా హైద్రాబాదు మీదకి వలంటీరు బలం నడుపుతానని వ్రాకుచ్చేడే అది నేపథ్యంలో ఏమయింది? ఏవేనా దళాలు తయారయ్యాయా? కలకత్తా వచ్చే ముందు వలంటీరుగా హైద్రాబాదు యుద్ధంలో దిగుదామనుకొన్నాను. అన్ని సత్సం కల్పాల లాగే అదీ పరిస్థితుల ప్రవాహానికీ కొట్టుకుపోయింది.

యుద్ధమొస్తే ఈసారి మీరు బర్తీ అవండి. రచన చెట్టెక్కించకుండా ఉంటే మిలట్రీ బతుకంత తీరుబాటయినది మరోటి లేదు. బొక్కీసు ముండాకొడుకులకే కాదు, పెళ్లీ పెటాకులయిన వాళ్లకి కూడా ఈ బోటులో చోటుంది.

వింతలు, విశేషాలు, సంగతులు, సందర్భాలూ, సన్నివేషాలూ, సన్నివేశాలూ, సమావేశాలూ, వార్తలు వగైరాలు, భోగట్టాలు గట్రాలు కొట్రాదా నా మొఖాన్ని. సంతోషిస్తాను.

గోరాశాస్త్రి మంచి వచన రచయిత. అతని శైలికి పదును ఉంది. "స్వర్ణయుగం" అనే అతని కథ చదివేరా? మంచి కథలో మంచి కథ అది.

నా వచన రచనల కట్టింగు లేవేనా మీ దగ్గరుంటే దయచేసి పంపించండి.

ఇప్పటికీ సంగతులు
చిత్తగించండి.
Yours comradingly
ఆరుద్ర
**29-4-48.**

**(పోస్టు చేయని ఈ లేఖ ఆరుద్ర షష్ఠిపూర్తి సంచిక నుంచి)**



# సాహిత్య సృజన సామాజిక బాధ్యతగా ...

## వాసిరెడ్డి సీతాదేవి

(15.12.1933 - 13.04.2007)

ప్రముఖ రచయిత్రి, మహిళా చైతన్యవాది.

**మీ సాహితీ జీవిత ప్రారంభంలోగానీ, ఆ తర్వాత గానీ మీపై ప్రముఖ రచయితలెవరి ప్రభావమైనా ఉందా?**

ఏ గొప్ప రచయిత ప్రభావమూ నాపై ఉందనుకోవడం లేదు. నిజాయితీగా చెప్పాలంటే నేను పెరిగిన వాతావరణం, నేను పరిశీలించిన అంశాలే నాపై ప్రభావం చూపాయి. ప్రేమ్‌చంద్ నవలలను ఇష్టంగా చదివేదాన్ని. వీటన్నిటి ప్రభావం నాపై ఉండవచ్చు. అయితే ఖచ్చితంగా చెప్పలేను.

**తెలుగు సాహిత్య చరిత్రను పరిశీలిస్తే గొప్ప గొప్ప రచనలలో ఎక్కువభాగం పురుషులే చేశారు. మీరు కూడా మంచి రచనలు సాగించారు. రచయిత్రిగా మీకు అనుకూలతలు గానీ ప్రతికూలతలు గానీ ఎదురయ్యాయా?**

సమాజాన్ని అధ్యయనం చేయడానికి, గుర్తింపు పొందడానికి మహిళలకు అవకాశాలు లేవు. దాంతో గొప్ప రచనలు చేయడం దాదాపు అసాధ్యమేనని చెప్పాలి. 70లలో రచయిత్రులు పెద్ద సంఖ్యలో కాల్పనిక రచనలు సాగించినప్పటికీ ఇళ్లలోని పరిస్థితులకు తమను తాము పరిమితం చేసుకున్నారు. వారికి తెలిసిన జీవితం అదే. నా విషయానికొస్తే రచయిత్రిగా నాకూ ఖచ్చితంగా ఒక పరిమితి ఉంది. ఉదాహరణకు చెప్పాలంటే రావిశాస్త్రి 'ఆరు సారా కథలు' రాసేటపుడు నగరంలో రాత్రిపూట పరిస్థితులను గమనించడం కోసం అర్ధరాత్రి బైట తిరిగినట్లుగా నేను తిరగలేను కదా! అయితే జీవితాన్ని అధ్యయనం చేయడానికి మహిళగా నేను ఎటువంటి అడ్డంకులూ ఎదుర్కోలేదనే చెప్పాలి. ఉద్యోగం వల్ల కానివ్వండి లేక నేను విస్తృతంగా జరిపిన ప్రయాణాల వల్ల కానివ్వండి నాకు అది సాధ్యపడింది.

టి.వి. ఇంకా ఇతర కారణాల రీత్యా పాఠకులు తగ్గుతుండడంతో చాలామంది యువరచయితలు నిరాశ పడుతున్నారు. అనేకమంది సామర్థ్యమున్న రచయితలు వాణిజ్య సాహిత్యంవైపు మక్కువ చూపుతున్నారు. అయితే మంచి సాహిత్యానికి ఎల్లప్పుడూ మంచి భవిష్యత్ ఉంటుంది. పఠనానికున్న ప్రాముఖ్యతను ప్రజలు త్వరలోనే గుర్తిస్తారు. ఒక పుస్తకాన్ని చదవడం మేధావితో మాట్లాడిన అనుభవాన్నిస్తుంది. పుస్తకాన్ని చదవడం ప్రారంభించామంటే మనదైన ప్రత్యేక ప్రపంచంలోకి మనం ప్రవేశిస్తాం. కథ, పాత్రలపై మనదైన ఒక ఖచ్చితమైన అభిప్రాయాలనేర్పరుచుకుంటాం. ఈ అభిప్రాయాలు మనతో చాలాకాలం ఉంటాయి. అయితే ఈ క్రమంలో వర్ధమాన రచయితలు నిరాశ చెందకూడదు. అదే సమయంలో వాణిజ్య సాహిత్యంవైపు మళ్ళకూడదు. సాహిత్యాన్ని వారు ఒక బాధ్యతగా భావించాలి. తపస్సుగా పరిగణించాలి.

**యువత తప్పుదోవ పట్టడానికి కారణాలు కనుగొనాలన్నదే నా కోరిక. ఇది సామాజిక సంస్థల లోపమనే నాకు అపుడపుడు అన్పిస్తుంది. మరీచికలో ఈ విషయాన్ని ప్రస్తావించాను. ఈ నవలలో తీవ్రవాదులకు నేను చెప్పినదేమంటే: విప్లవం కొందరు వ్యక్తుల వల్ల విజయవంతం కాదు. ప్రజల్లో సైద్ధాంతిక పరివర్తన రావాలి. విప్లవ క్రమంలో వారు చురుగ్గా పాల్గొనాలి. అప్పుడు అది విజయవంతమవుతుంది.**

**వివాహ వ్యవస్థపై మీ అభిప్రాయం ఏమిటి? వివాహితలు సమస్యల వలయంలో ఉక్కిరిబిక్కిరి అవుతారని చెబుతుంటారు. దానిపై మీ అభిప్రాయమేమిటి?**

నా జీవితంలో వివాహాన్ని అంత ముఖ్యమైనదిగా తీసుకోలేదు. ఎందుకంటే జీవితంలో చేయాల్సినవి ఇంకా చాలా ఉన్నాయి. పెళ్లి, పిల్లలు కన్నా జీవితంలో ముఖ్యమైనవి చాలా ఉన్నాయని నేను భావిస్తాను. నేను ఎంచుకున్న మార్గం పట్ల నాకు బాధేమీ లేదు.

**మీ నవలల్లో యువత సమస్యలు ప్రధానంగా చోటు చేసుకుంటుంటాయి. ముఖ్యంగా మరీచిక, వెన్నెల పెళ్లాడుతోంది వంటి వాటిలో ఇది కన్పిస్తుంది. దీనికి ప్రత్యేకమైన కారణమేమైనా ఉందా?**

నేటి సమాజంలో యువత మాదకద్రవ్యాలకు బానిసలౌతున్నారు. లేదా తీవ్రవాద సిద్ధాంతంవైపు ఆకర్షితులవుతున్నారు. యువత తప్పుదోవ పట్టడానికి కారణాలు కనుగొనాలన్నదే నా కోరిక. ఇది సామాజిక సంస్థల లోపమనే నాకు అపుడపుడు అన్పిస్తుంది. మరీచికలో ఈ విషయాన్ని ప్రస్తావించాను. ఈ నవలలో తీవ్రవాదులకు నేను చెప్పినదేమంటే: విప్లవం కొందరు వ్యక్తుల వల్ల విజయవంతం కాదు. ప్రజల్లో సైద్ధాంతిక పరివర్తన రావాలి. విప్లవ క్రమంలో వారు చురుగ్గా పాల్గొనాలి. అప్పుడు అది విజయవంతమవుతుంది.

**మీ నవలల్లో మహిళా పాత్రలు ప్రత్యేకంగా తిరుగుబాటు స్వభావంతో కన్పిస్తాయి. ఎందువల్ల?**

సామాజిక సమస్యల సాధన లక్ష్యంగా నవల రాయాలంటే మహిళా పాత్రలు లేకుండా కష్టం. ఏదైనా సమస్యకు పరిష్కారం కనుగొనాలంటే రాజీపడకూడదు. అలాగే నిస్సహాయంగా ఏడుస్తూ కూర్చోకూడదు. అందుకే నా నవలల్లోని మహిళాపాత్రలు ప్రతికూల పరిస్థితులపై తిరగబడతాయి.

**మీ నవలల్లో ఫెమినిజం, మార్క్సిజం రెండూ అంతర్లీనంగా కన్పిస్తాయని ఇటీవల మీ 'మట్టిమనిషి' నవలపై నవీన్ వ్యాసం రాస్తూ పేర్కొన్నారు. దానిపై మీ అభిప్రాయమేమిటి?**

ఇటీవలి దళిత ఉద్యమం, ఫెమినిజం సిద్ధాంతాలు నా నవలల్లో అంతగా చోటు చేసుకోలేదు. అయితే 'మహిళలకు స్వాతంత్ర్యం' అన్న భావనతో మహిళా సమస్యలను నేను తీసుకున్నాను. నా నవలల్లో మార్క్సిజం కొంతమేర కన్పిస్తుంది.

**మీ 'సమత' నవల వాస్తవ సంఘటనల ఆధారంగా రాసిందని చెబుతుంటారు. మీ కథలకు, నవలలకు ప్రేరణ ఏమిటి? మీ రచనల్లో పాత్రలకు నిజ జీవితానికి సంబంధముంటుందా? లేక అవి మీ ఆలోచనల ప్రకారం రూపుదిద్దుకుంటాయా?**

నవలలు లేదా కథలు ఆవిర్భావానికి ప్రాథమికంగా రెండు కారణాలున్నాయి. ఒకటి మనం ప్రత్యక్షంగా చూసిన సంఘటనలు, రెండు మన చుట్టూ ఉన్న పరిస్థితులపై మన పరిశీలన. ఇవి రచనకు ప్రేరణ అవుతాయి. 'సమత' నవల 1960లలో రాజకీయాలకు వ్యతిరేకంగా రాసినది.

**మీ ఇతర నవలలకు కూడా ఇది వర్తిస్తుందా?**

అవును. ఉదాహరణకు 'మట్టిమనిషి'. అయితే ఎవరైనా ఒక మహిళనే దృష్టిలో ఉంచుకొని రాశానని మాత్రం నేను చెప్పలేను. అందులోని కథానాయిక వరూధినితో అనేకమంది మహిళలు తమను తాము పోల్చుకున్నారు.

**వరూధిని చాలా సంక్లిష్టమైన పాత్రగా కన్పిస్తుంది. ఆమె సామాజిక నేపథ్యాన్ని మీరు వివరించారు. ఆమె మనస్తత్వం గురించి చెబుతారా?**

వరూధిని మనస్తత్వానికి మూలం నాటి సామాజిక పరిస్థితులు. ఆనాటి అనేకమంది మహిళలాగానే వరూధిని కూడా నగరకాంతులకు ఆకర్షితురాలౌతుంది. అదనంగా ఏమిటంటే ఆమె తన భర్తకు చదువు రాకపోవడం పట్ల అసంతృప్తితో వుంటుంది. గ్రామాలలోని గానుగెద్దు జీవితానికి భిన్నంగా నగర జీవితంలో ఆమెకు కొంత ఊరట లభిస్తుంది.

**మీరు 39 నవలలు, 9 కథల సంపుటాలు రచించారు. వాటిలో మీకు బాగా నచ్చినదేమిటి? అత్యుత్తమైనదేమిటి?**

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడం చాలా కష్టం. నా 'మట్టిమనిషి' నవల చాలా ఉత్తమ నవల అని సామాన్య పాఠకులతోపాటు మేధావులు సైతం అంటుంటారు. 'సమత' కూడా దానంత ఉత్తమమైనదనే నేను అనుకుంటాను. ఈ రెండింటికన్నా ఉత్తమమైనది 'వైతరిణి' అని కొందరంటుంటారు. అందుకే ఈ మూడు నవలలూ ఉత్తమమైనవని నేనంటాను.

నా 'మట్టిమనిషి' నవల చాలా ఉత్తమ నవల అని సామాన్య పాఠకులతోపాటు మేధావులు సైతం అంటుంటారు. 'సమత' కూడా దానంత ఉత్తమమైనదనే నేను అనుకుంటాను. ఈ రెండింటికన్నా ఉత్తమమైనది 'వైతరిణి' అని కొందరంటుంటారు. అందుకే ఈ మూడు నవలలూ ఉత్తమమైనవని నేనంటాను. అయితే ఒక్కటే చెప్పండని మీరు గట్టిగా అంటే 'మట్టి మనిషి' అనే చెబుతాను.

అయితే ఒక్కటే చెప్పండని మీరు గట్టిగా అంటే 'మట్టి మనిషి' అనే చెబుతాను.

**ఇటీవలి సంవత్సరంలో తెలుగులో ఫెమినిస్టు రచయితలు అనేకమంది వచ్చారు. వారిలో నవలా రచయితలు, కవులు ఉన్నారు. తెలుగులో ఫెమినిజం ఆగిపోతుందను కుంటున్నారా? అది ఒక సాహితీ ఉద్యమంగా మారుతుందను కుంటున్నారా?**

ఈ రచయితలు ఫెమినిజాన్ని ఉద్యమంగా మార్చామనుకుంటున్నారు. అయితే నిజానికి దాన్ని ఒక 'సాహితీ సరళి'గా మాత్రమే పరిగణించాలి. ఏళ్ల క్రితం మేము రాసిందానికన్నా భిన్నంగా లేదా గొప్పగా ఈ రచయితలు రాస్తున్నారని నేననుకోవడం లేదు. వారి రచనలు చదువు తున్నప్పుడు ఆ విషయం చాలాకాలం క్రిందటే నేను చెప్పాను గదా అని నాకనిపిస్తున్నది. అయితే ఫెమినిస్టు కవయిత్రులకు ఇందులో మినహాయింపు ఉంది. వారు నిజంగా మంచి కవిత్వాన్ని అందిస్తున్నారు.

**వారి రచనలకు సాహిత్యపరంగా భవిష్యత్తు ఉందను కుంటున్నారా? ముఖ్యంగా వారి లక్ష్యం నెరవేరాక కూడా?**

అసలు వారి లక్ష్యం అంత సులభంగా లేదా అంత త్వరగా నెరవేరుతుందని నేననుకోవడం లేదు. మహిళలపై వివక్ష, అకృత్యాలు ఇంకా అనేక ఏళ్లపాటు కొనసాగుతాయి. అంతవరకూ ఈ పోరాటం కూడా సాగుతుంది. అప్పటివరకు ఫెమినిస్టు రచనలకు మనుగడ ఉంటుంది. అవి పోరాటానికి ప్రేరణనిస్తాయి.

**మనస్తత్వంపై మీరు లోతుగా అధ్యయనం చేశారు. మీ నవలల్లో సైతం దానికి స్పష్టమైన ఆధారాలు కన్పిస్తాయి. అయితే కొన్నిటిలో ఇది అసలు కన్పించదు. అన్నిటిలోనూ మీరు ఈ తరహా విశ్లేషణను ఎందుకు కొనసాగించలేదు.**

పూర్తిగా మనస్తత్వ విశ్లేషణగా నవలలుగా పిలువబడేటటు వంటి నవలలు కొన్ని రాశాను. వాటిలో 'ఆమె కథ' ఒకటి. దానిని సినిమా కూడా తీశారు. 'మనసుకథ', 'మరో మనసు కథ', రాగహేల వంటి నవలలకు సామాజిక హద్దులేవీ లేవు.

**తెలుగు సాహిత్యానికీ దాదాపు వెయ్యేళ్ల చరిత్ర ఉంది. ఇతర భారతీయ భాషల సాహిత్యంతో పోల్చితే నేడు దాని స్థానం ఏమిటి? ఒక పక్క ఎలక్ట్రానిక్ మీడియా దాడి, మరోవైపు అనువాదాల కొరతల నేపథ్యంలో తెలుగు సాహిత్యానికి భవిష్యత్‌లో ఉచ్ఛదశ ఉంటుందంటారా?**

ఏ ఇతర భారతీయ భాషా సాహిత్యమూ తెలుగు సాహిత్యానికి సాటిరాదు. అందులో సందేహమేమీ లేదు. అనువాదాల పరిస్థితి అంతంతమాత్రంగానే ఉంది. ఇతర భాషలలోకి తర్జుమా చేయాల్సిన అనేక గొప్ప రచనలు మన తెలుగు సాహిత్యంలో ఉన్నాయి.

**మీరు ప్రభుత్వంలో అనేక బాధ్యతాయుత పదవులు నిర్వహించారు. తెలుగు సాహిత్యానికి ప్రభుత్వం చేయగల సాయం గురించి మీ అభిప్రాయం?**

సాహిత్యానికి ప్రభుత్వం ఏరకమైన సాయమూ చేయగలదని నేననుకోవడం లేదు.

**ప్రఖ్యాతిపొందిన, సీనియర్ రచయితగా వర్థమాన రచయితలకు మీరిచ్చే సందేశం?**

టి.వి. ఇంకా ఇతర కారణాల రీత్యా పాఠకులు తగ్గుతుండడంతో చాలామంది యువరచయితలు నిరాశ పడుతున్నారు. అనేకమంది సామర్థ్యమున్న రచయితలు వాణిజ్య సాహిత్యంవైపు మక్కువ చూపుతున్నారు. అయితే మంచి సాహిత్యానికి ఎల్లప్పుడూ మంచి భవిష్యత్ ఉంటుంది. పఠనానికున్న ప్రాముఖ్యతను ప్రజలు త్వరలోనే గుర్తిస్తారు. ఒక పుస్తకాన్ని చదవడం మేధావితో మాట్లాడిన అనుభవాన్నిస్తుంది. పుస్తకాన్ని చదవడం ప్రారంభించామంటే మనదైన ప్రత్యేక ప్రపంచంలోకి మనం ప్రవేశిస్తాం. కథ, పాత్రలపై మనదైన ఒక ఖచ్చితమైన అభిప్రాయాలనేర్పరుచుకుంటాం. ఈ అభిప్రాయాలు మనతో చాలాకాలం ఉంటాయి. అయితే ఈ క్రమంలో వర్థమాన రచయితలు నిరాశ చెందకూడదు. అదే సమయంలో వాణిజ్య సాహిత్యంవైపు మళ్ళకూడదు. సాహిత్యాన్ని వారు ఒక బాధ్యతగా భావించాలి. తపస్సుగా పరిగణించాలి.

**చివరగా మహిళలకు మీరిచ్చే సందేశం?**

మహిళలు, అవమానాలను, అణచివేతలను సహించ కూడదు. నిరసన తెలపడం నేర్చుకోవాలి. ఆత్మ విశ్వాసంతో, ధైర్యంతో అడుగుముందుకేసే మహిళను ఎవ్వరూ అడ్డుకోలేరు.

**(ప్రజాశక్తి సాహిత్య ప్రత్యేక సంచిక 'దర్పణం' నుంచి)**



# మరపురాని మా బడి

## మాదిరెడ్డి సులోచన

**(1936 - 17.02.1983)**

**70కి పైగా నవలలు రాసిన ప్రముఖ రచయిత్రి.**

అది ఇప్పటి మాట కాదు. ఇరవై ఏడేళ్ళ ముందటి మాట. బేగంపేట గురుకులం నుండి, నేను చెల్లి. మా కజిన్స్ అందరం బయటికి వచ్చాము. అప్పుడు కొందరు విద్యార్థినులను కలుసుకుని యెక్కడ చదువుతున్నావు అంటే ఆంధ్ర గర్ల్స్ హైస్కూల్. నారాయణగూడ అనేవారు. అది వింటుంటే నాకు ఆంధ్ర గర్ల్స్ హైస్కూల్లో చదవాలనే కోర్కె ప్రబలమైంది. ఆ పేరే ఓ మధుర స్వప్నం. వింత అనుభూతి కలిగించేది. మా అన్న అక్కడ చేర్పిస్తానన్నప్పుడు రంగు, రంగుల కలలు వచ్చేవి. నేను అక్కడ చదివి అన్నింటా ఫస్ట్ మార్కుస్ తెచ్చుకున్నట్లు, ఉపాధ్యాయులంతా 'శభాష్' అన్నట్టు అనిపించేది. నా జీవితంలో యెప్పుడూ కోర్కెలనే గుర్రాలకు పరిస్థితులు పగ్గాలుగా పడుతూనే ఉన్నాయి. ఆడపిల్లను శంషాబాద్ నుండి హైదరాబాద్ పంపడమా అని ఛస్ వల్ల కాదంది అమ్మ. అంతే నా సర్వస్వం పోయినట్టు ముఖం పెడితే అన్న ఏమనుకున్నాడో ప్రయివేటుగా మాస్టర్ని పెట్టారు. కాని కలలోని బడి 'ఆంధ్రగర్ల్స్ హైస్కూల్'. అక్కడ చదవని చదువూ ఓ చదువేనా? రోజూ బడికి వెళ్ళే చెల్లితో గిల్లి కయ్యం పెట్టుకునేదాన్ని. అమ్మతో దెబ్బలాడేదాన్ని 'ఆంధ్ర స్కూల్' అనుకునేదాన్ని, నిట్టూర్చే దాన్ని. ఆంధ్ర గర్ల్స్ హైస్కూల్లో చదవాలనే నా కోర్కెను నిర్భయంగా మా వారికి చెప్పాను. శ్రీవారు అంగీకరించారు. విద్యార్థిగా ఉండగా టెంపరరీగా వారక్కడ ఉద్యోగం చేశారట. అందరూ తెలుసట. అందుకే నైన్త్‌క్లాసులో ప్రవేశం దొరికింది. నాకు అక్కడ హెడ్‌మాస్టరుగాని, మిగతా ఉపాధ్యాయ బృందంగాని గుర్తు లేరు. ఆఫీసులో తీరుగా కూర్చునే శకుంతలమ్మగారు, రామ్మూర్తిగారు, అత్యంత శ్రద్ధగా పాఠం చెప్పే కస్తూరి టీచర్‌లు మాత్రం మరచిపోలేని వ్యక్తులుగా నా హృదయంలో నిలిచిపోయారు. నాకు చిన్నప్పటి నుండి నిర్మొహమాటంగా అడగడం అలవాటు. రామ్మూర్తి సార్ డొమెస్టిక్ సైన్స్ చెబితే 'ఆడవారు చెప్పే సబ్జెక్టే' అని చివాట్లు, మొట్టికాయలు తిన్నాను. వారి గొంతు యెక్కడో విన్నట్టు అనిపించి, రేడియోలో నాటకాలు వేస్తారా సార్ అని అడిగి చీవాట్లు తిన్నాను. ఆ తరువాత దగ్గరకు పిలిచి అనునయించారు. ఆ కస్తూరి టీచర్ సైన్స్ పాఠం చెబుతుంటే ఏనాటికయినా అలా పాఠం చెప్పి, విద్యార్థుల మన్ననలు పొందాలని ఉవ్విళ్ళూరేదాన్ని. ఒకసారి రామ్మూర్తిగారు సౌమ్యంగా పిలిచారు. సంతోషంగా దగ్గరగా వెళ్ళాను. "చూడమ్మా! మిగతా సబ్జక్ట్స్ గురించి తెలియదు గాని ఇంగ్లీష్, లెక్కల్లో పూర్ అన్నారు. నాకు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. "భలే పిల్లవే. రెగ్యులర్ స్టూడెంట్సే వీక్‌గా ఉన్నారు. కృషి చేయాలి" అన్నారు ఓదార్పుగా. ఆయన అంచనా తప్పలేదు. ఆ తరువాత సంవత్సరం పరీక్ష ఇచ్చాను. పాసయ్యాను. అది వేరే సంగతి. అప్పటి 'ఆంధ్ర గర్ల్స్ స్కూలు'కి, ఇప్పటి మాడపాటి హనుమంతరావు బాలికల ఉన్నత పాఠశాలకి, నాకు అవినాభావ సంబంధం. నా విద్యా సముపార్జనకు పునాదులు వేసిన ఆ బడి అన్నా, అభిమానంతో హెచ్చరించిన రామ్మూర్తిగారన్నా నాకెంతో అభిమానం. అలా వెడుతూ వస్తున్నప్పుడు, ఆ బడి వంక చూస్తుంటే ఏదో స్వంత ఆస్తిని చూచినంత అనిర్వచనీయమైన అనుభూతి కల్గుతుంది.

**మాడపాటి హనుమంతరావు బాలికల ఉన్నత పాఠశాల స్వర్ణోత్సవ సంచిక (1978)**

# జీవితాంతం మార్క్సిస్టు దృక్పథంతోనే విమర్శ



## వల్లంపాటి వెంకటసుబ్బయ్య

**(15.03.1937 - 2.02.2007)**

మార్క్సిస్టు విమర్శకుడు, రచయిత.

**జీవితం మీద గౌరవం, సాహిత్యాన్ని ప్రేమించేమనసు, సత్యం చెప్పగలిగే ధైర్యం ఉండాలి. విమర్శ సిద్ధాంతాన్ని, సాహిత్యాన్ని సమగ్రంగా అధ్యయనం చేసి ఉండాలి. తన మిత్రులను గూర్చి నెగిటివ్ అంశాలు, శత్రువుల గూర్చి పాజిటివ్ అంశాలు చెప్పగలిగిన వాడే నిజమైన విమర్శకుడని జాన్సన్ అన్నాడు. అదే నా విశ్వాసం కూడా.**

**మూడు రకాల బాధ్యతలు నిర్వర్తించాల్సి ఉంటుంది. 1. రచయితకు కొన్ని సందర్భాల్లో దారి చూపిస్తాడు. 2. కొన్ని సందర్భాల్లో రచయిత పక్కన నడుస్తాడు. 3. కొన్ని సందర్భాల్లో రచయిత వెనుక నడుస్తాడు.**

**తెలుగు కథా సాహిత్యం ముందు నుంచి గొప్పగానే ఉంది. లేదంటే గత రెండు మూడు సంవత్సరాలుగా నీరసంగా ఉంది. అందుకు రచయితలే కారణం కాదు. తెలుగులో గొప్ప సాహిత్యాన్ని ప్రచురించే పత్రికలు అతి తక్కువగా ఉన్నాయి. కథా రచయితలు గొప్ప సాహిత్యాన్ని చదవడం తగ్గించినట్లు అనిపిస్తోంది. దీనికి తోడు పర్యావరణ విధ్వంసం, నూతన ఆర్థిక విధానం, వస్తు వ్యామోహ సంస్కృతిలో వ్యక్తి పరాయీకరణ, భావజాలాల విధ్వంసం మొదలయిన అనేక కొత్త వస్తువుల గూర్చి పెద్ద సంఖ్యలో కథలు రావాలి.**

**మీ సాహితీ రచనకు ప్రేరణ ఎవరు?**

16 సంవత్సరాల వయసులో మధురశ్రీ అన్న రచయితతో పరిచయం, 20 సంవత్సరాల వయస్సులో మధురాంతకం రాజారాం గారితో పరిచయమే నాకు ప్రేరణ.

**మీ మొదటి రచన, ప్రచురణల గూర్చి చెబుతారా?**

1958 నుండి సుమారు 50 కథలను రచించాను. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, జ్యోతి, ఆంధ్రజ్యోతి మొదలగు పత్రికల్లో వీటిని ప్రచురించారు. 1958లో 'అన్యథాశరణం నాస్తి' కథ ఆంధ్రప్రభలో ప్రచురితమైంది. 1958లోనే విద్వాన్ విశ్వం పెన్నేటిపాట మీద రాసిన వ్యాసం తెలుగు స్వతంత్రలో ప్రచురితమైంది. 1961లో 'మొదటి నవల 'ఇంద్రధనస్సు', 1962లో దీనికి ఆంధ్రప్రభ వారు ద్వితీయ బహుమతి ఇచ్చారు. 1964లో 'దూరతీరాలు' నవల, 1967లో మమతలు- మంచుతెరలు నవల రాయడం జరిగింది.

**సాహితీ విమర్శ మీద మీకు ఎలా అభిరుచి కలిగింది?**

మొదటినుండి ఉంది. కథారచన, విమర్శ దాదాపుగా ఒకే కాలంలో ప్రారంభించాను. చదువు మీద ఆసక్తి పెరిగిన కొద్దీ విమర్శ మీద అభిరుచి పెరిగింది. 'మేఘదూతం' మీద నేను రాసిన వ్యాసాన్ని చదివి పుట్టపర్తి నారాయణాచార్యులు గారు విమర్శలో ప్రత్యేక కృషి చేయడానికి ప్రోత్సహించారు. "ఆధునికాంధ్ర సాహిత్యతత్వం" అనే శీర్షికతో నేను 1967లో రాసిన వ్యాసాన్ని పుట్టపర్తి వారు బాగా మెచ్చుకోవడం గొప్ప ఆత్మ విశ్వాసాన్నిచ్చింది.

**సాహితీ విమర్శపై మీకు పట్టు ఎలా సాధ్యమయింది?**

మార్క్సిజం, సాంఘిక శాస్త్రాలు, సాహిత్య సిద్ధాంతం, ప్రాచీన భారతీయ అలంకార శాస్త్రం, పాశ్చాత్య సాహిత్య విమర్శలను బాగా అధ్యయనం చేయడం ద్వారా లభించింది.

**విమర్శనా సాహిత్యాన్ని మీరు ఎందుకు ఎంచుకున్నారు?**

రెండవ శ్రేణి కథలు రాయడం కంటే మొదటి శ్రేణి విమర్శ రాయడం మంచిదని నిర్ణయించుకోవడం వల్ల. ఆధునిక సాహిత్య విమర్శ పద్ధతులు అన్న వ్యాసంతో నా మీద నాకు నమ్మకం కలిగింది.

**తెలుగు కథా సాహిత్యం ముందు నుంచి గొప్పగానే ఉంది. లేదంటే గత రెండు మూడు సంవత్సరాలుగా నీరసంగా ఉంది. అందుకు రచయితలే కారణం కాదు. తెలుగులో గొప్ప సాహిత్యాన్ని ప్రచురించే పత్రికలు అతి తక్కువగా ఉన్నాయి. కథా రచయితలు గొప్ప సాహిత్యాన్ని చదవడం తగ్గించినట్లు అనిపిస్తోంది. దీనికి తోడు పర్యావరణ విధ్వంసం, నూతన ఆర్థిక విధానం, వస్తు వ్యామోహ సంస్కృతిలో వ్యక్తి పరాయీకరణ, భావజాలాల విధ్వంసం మొదలయిన అనేక కొత్త వస్తువుల గూర్చి పెద్ద సంఖ్యలో కథలు రావాలి.**

**సాహితీ విమర్శలో మీ దృక్పథం ఏమిటి?**

నేను మార్క్సిస్టు విమర్శకుణ్ణి. నాకు తెలిసినంతలో మార్క్సిస్టు సామాజిక సూత్రాల ఆధారంగా విమర్శ చేస్తాను. కాని రచనలో సాహితీ విలువలకు చాలా ప్రాధాన్యత ఇస్తాను.

**మీకు మార్క్సిజం మీద అభిమానం ఎలా కలిగింది?**

మార్క్సిజం గురించి తెలిసే సమయానికి నాకు తెలిసింది చాలా తక్కువ. గోర్కీ 'అమ్మ' నవల, శ్రీశ్రీ మహాప్రస్థానం చదివి మార్క్సిజం మీద అభిమానం కలిగింది.

**మార్క్సిజం మీద మీకు ఇంకా అభిమానముందా?**

ఉంది. మార్క్సిజం ఓడిపోయిందని కానీ, పతనమయిందని కానీ నేను భావించడం లేదు. సోవియట్‌లో జరిగిన పతనం తాత్కాలికం మాత్రమే. గొప్ప సిద్ధాంతం ఎప్పుడూ పతనం కాదు.

**సోవియట్‌లో కమ్యూనిస్టులు అధికారం కోల్పోవడంపై మీ అభిప్రాయం?**

సోవియట్ ప్రభుత్వాలు చేసిన తప్పులు కూడా ఉన్నాయి. దానికి తోడు క్యాపిటలిస్టు ప్రభుత్వాలు సోవియట్‌లో మార్క్సిజాన్ని కూలదోయడానికి 70 ఏళ్లు ప్రయత్నించి చివరగా 1989లో విజయం సాధించాయి. అమానవీయమైన క్యాపిటలిస్టు సంస్కృతి కంటే సోషలిస్టు సంస్కృతి గొప్పదని సోవియట్ ప్రజలకు నచ్చజెప్పలేకపోయింది.

**మీ నవలా శిల్పం, కథాశిల్పం ద్వారా సాధించ దలచుకున్న దేమిటి?**

యువ రచయితలకు రచనకు సంబంధించిన ప్రాథమిక లక్షణాలు తెలియజేయడం, పాఠకులు గొప్ప సాహిత్యాన్ని గుర్తు పట్టడానికి దోహదం చేయడం.

**ఇప్పుడు మీరు చేస్తున్న రచన ఏమిటి?**

ఇంతవరకు సాహితీ విమర్శ సిద్ధాంతం మీద ప్రామాణికమైన పుస్తకం లేదు. అందువల్ల విమర్శ శిల్పం అన్న గ్రంథాన్ని ప్రారంభించాను. మొదటి అధ్యాయం 'జీవితం, సాహిత్యం, సాహితీ విమర్శ' పూర్తయింది. భారతీయ అలంకార శాస్త్రంలోనూ, పాశ్చాత్య సాహితీ శాస్త్రంలోనూ ఉన్న ప్రధానమైన సిద్ధాంతాలను ఈ గ్రంథం ద్వారా పరిచయం చేయాలనుకుంటున్నాను. అలాగే వివిధ సాహితీ ప్రక్రియలను అధ్యయనం చేసే విధానాలను కూడా పరిచయం చేయాలనుకుంటున్నాను.

**కథకు, విమర్శకు తేడా ఏమిటి?**

జీవితం మీద కథ పుడుతుంది. కథ మీద విమర్శ పుడుతుంది. ఇవి రెండూ ప్రతిభావంతమయినవే.

**మంచి విమర్శకునికి ఉండాల్సిన లక్షణాలు తెలియజేస్తారా?**

జీవితం మీద గౌరవం, సాహిత్యాన్ని ప్రేమించేమనసు, సత్యం చెప్పగలిగే ధైర్యం ఉండాలి. విమర్శ సిద్ధాంతాన్ని, సాహిత్యాన్ని సమగ్రంగా అధ్యయనం చేసి ఉండాలి. తన మిత్రులను గూర్చి నెగిటివ్ అంశాలు, శత్రువుల గూర్చి పాజిటివ్ అంశాలు చెప్పగలిగిన వాడే నిజమైన విమర్శకుడని జాన్సన్ అన్నాడు. అదే నా విశ్వాసం కూడా.

**విమర్శకుని బాధ్యత లేమంటారు?**

మూడు రకాల బాధ్యతలు నిర్వర్తించాల్సి ఉంటుంది. 1.రచయితకు కొన్ని సందర్భాల్లో దారి చూపిస్తాడు. 2.కొన్ని సందర్భాల్లో రచయిత పక్కన నడుస్తాడు. 3. కొన్ని సందర్భాల్లో రచయిత వెనుక నడుస్తాడు.

**ఈనాటి తెలుగు కథా సాహిత్యం ఎలా ఉందంటారు?**

తెలుగు కథా సాహిత్యం ముందు నుంచి గొప్పగానే ఉంది. లేదంటే గత రెండు మూడు సంవత్సరాలుగా నీరసంగా ఉంది. అందుకు రచయితలే కారణం కాదు. తెలుగులో గొప్ప సాహిత్యాన్ని ప్రచురించే పత్రికలు అతి తక్కువగా ఉన్నాయి. కథా రచయితలు గొప్ప సాహిత్యాన్ని చదవడం తగ్గించినట్లు అనిపిస్తోంది. దీనికి తోడు పర్యావరణ విధ్వంసం, నూతన ఆర్థిక విధానం, వస్తు వ్యామోహ సంస్కృతిలో వ్యక్తి పరాయీకరణ, భావజాలాల విధ్వంసం మొదలయిన అనేక కొత్త వస్తువుల గూర్చి పెద్ద సంఖ్యలో కథలు రావాలి.

**తెలుగు సాహిత్యంపై పత్రికల పాత్ర ఏమంటారు?**

ప్రస్తుతం ఒక తెలుగు సాహితీ పత్రిక కూడా లేదు. కాబట్టి సీరియస్ సాహిత్య విమర్శకు ప్రచురణ అవకాశాలే లేవు. అవకాశాలు లేనిచోట అభివృద్ధి లేనే లేదు. తెలుగు యూనివర్సిటీ వారు తెలుగు సాహితీ పత్రికలు ప్రారంభించి నడపవచ్చు.

**మిమ్మల్ని ప్రభావితం చేసిన విమర్శకులెవరు?**

జీవితాన్ని – సాహిత్యాన్ని సమన్వయం చేయడం ఎఫ్.ఆర్.లీవిస్ దగ్గర నుండి నేర్చుకున్నాను. మార్క్సిస్టు విమర్శలను గూర్చి లూకాచ్ నుండి తెలుసుకున్నాను. నామీద తెలుగులో ఎక్కువ ప్రభావం చూపిన విమర్శకుడు రాచమల్లు రామచంద్రారెడ్డి.

**మీ జీవిత ఆశయం ఏమిటి?**

సాహితీరంగంలో విమర్శకే అధిక ప్రాధాన్యత ఇవ్వడం. జీవితాంతం మార్క్సిస్టు దృష్టితోనే నా సాహిత్యం కొనసాగిస్తాను.

**('ప్రజాశక్తి' సాహిత్య పత్రిక సంచిక 'దర్పణం' నుంచి)**

సాహితీ స్రవంతికి 'ప్రస్థానం' పత్రికకు శుభాకాంక్షలతో...



LIFE LINE

# జనత సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్




8-2-27, ఎల్.ఐ.సి. ఆఫీస్ వెనుక, వైరా రోడ్, ఖమ్మం

ఫోన్ : 08742 - 248787

**డా॥ సి. భారవి**
M.D., D.M. (Gastro)
లివర్ మరియు జీర్ణకోశ వ్యాధుల వైద్య నిపుణులు

**డా॥ కె. మాధవి**
M.B.B.S. D.G.O. D.N.B. (Gyn)
ప్రసూతి మరియు స్త్రీల వైద్య నిపుణులు

---

సాహితీ స్రవంతికి 'ప్రస్థానం' పత్రికకు శుభాకాంక్షలతో...

# న్యూ జనరేషన్ జూనియర్ కళాశాల

(డే స్కాలర్స్‌కు బస్ సౌకర్యం కలదు)

ఇల్లెందు క్రాస్‌రోడ్స్, కవిరాజ నగర్, ఖమ్మం

ఫోన్స్ : 08742 - 254216, 9848795599, 9440987399/4

**బాల బాలికలకు విడివిడిగా వసతి సౌకర్యం కలదు**

---

సాహితీ స్రవంతికి 'ప్రస్థానం' పత్రికకు శుభాకాంక్షలతో...



# సెంచరీ విద్యా సంస్థలు

## డే - రెసిడెన్షియల్

జమ్మిబండ పార్కు - రోటరీ నగర్, ఖమ్మం

ఫోన్ : 227990, 236390

గతాన్ని మించింది - గమ్యాన్ని శాసించింది
ర్యాంకుల సాధనలో తరగని ఒరవడి మరోసారి సృష్టించింది

**ఎస్.ఎస్.సి. ఫలితాలలలో 5 సార్లు స్టేట్ ర్యాంకులు**



# చెట్టు చూపుతో కవిత్వ ప్రేమ

## స్మైల్

**(03.02.1942 - 05.12.2008)**

**ఈయన తన ఆదర్శపు చెట్టు కింద నిలబడి ఎన్నెన్ని దృశ్యాల్ని చూశాడో చూపాడో ఎన్ని అనుభూతుల్ని పట్టుకున్నాడో మన కోసం, మన తరపున, గోడకి కొట్టిన మేకు, ఆకాశాన్ని భూమి సంబాళించే భార్య, కోటిపల్లి ప్రయాణం, వేయి పిర్రల సముద్రం, టాగూర్‌తో బోట్లో షికారు, బెల్లంకాయతో ఆడుకునే బుడతడు, ప్రియురాలి రహస్య చర్మం, చంద్రుడ్ని నెమరేసిన గేదె, చీకటిని పీల్చేసిన దీపం- ఎంత వైరైటీ, ఎంతో వైరైటీ- చాలామంది కవులకి ఉంటుంది కాని అందులోంచి ఇస్మాయిల్ బాగా చమత్కారంగా ఒక తాత్విక దృశ్యాన్ని ఒక సౌందర్యపు భాషలో దించగల ప్రజ్ఞ చాలా తక్కువమంది కవులకుంటుంది.**

**ఎవరికీ అర్థం కాని మాటల్లోనో, సమాసాల్లోనో, భావాల్లోనో ఈయన కవిత్వం రాయలేదు. మనందరం నిత్యం చూసే, అనుభవించే మామూలు విషయాలు గురించి చిన్న చిన్న మాటలలో రాశాడాయిన.**

**ఈ కవికి ఇవి తప్ప, వీటి అనుభూతులు తప్ప ఇంకేం పట్టవా? ఈ సమాజాన్ని పీడించే ఆకలిదప్పులు ఇంకెన్నెన్నో సమస్యలు? అంటే, అంటాడు కదా 'కవికి సామాజిక స్పృహ ఉండకూడదని కానీ, ఆకలి, ఆప్రెషన్ వంటి విషయాలు గురించి రాయకూడదని కానీ, అలా రాసింది కవిత్వం కాదని కానీ నేననటం లేదు. అది నిజంగా కవి స్వీయానుభవం నుంచి ఉద్గతమైతే గొప్ప కవిత్వం అయితీరుతుంది.**

ఇస్మాయిల్ గారిలాగే చిన్నప్పట్నుంచీ నాకు చెట్లంటే చాలా ఇష్టం. నాకు జ్ఞాపకం వచ్చే మొట్టమొదటి చెట్టు మా ఇంట్లో మునగచెట్టు. చెట్టుకు వేలాడుతున్న ఆశ్చర్యార్థకాల్లాగా ఉండేవి చెట్టు మొదట్లో గొంగళి పురుగులు. వాటిని తిట్టుకుంటూ తప్పించుకుని చెట్టెక్కేవాణ్ణి. కింద నిలబడి మా అమ్మ ఒకటే గొడవ పడిపోతానేమోనని. ఎప్పుడూ కిందపడలా, చిత్రంగా పడాలనే కోరిక ఉండేది. ఆ వెంటనే భయమూ, ఇది నా మొట్టమొదటి చెట్టు అనుభవం.

మునగచెట్టు నుంచి నేను తర్వాత్తర్వాత మావూరి చింతతోపులో చింతచెట్లకెగబాకేను. అదొక థ్రిల్. కొమ్మ నుంచి కొమ్మకి లంఘించి అప్పటి రంజన్‌లాగా ఫీలయ్యేవాణ్ని. ఆ తర్వాత నేను ఇష్టపడ్డ చెట్టు మావూళ్ళో (తేలప్రోలు)లో ఏలూరు కాలువగట్టున నేరేడు చెట్లు, వర్షాకాలపు ఆకాశాన్ని జల్లిస్తున్నట్లు ఉండేవి ఆకులు. పిల్లగాలి వీస్తుండగా కాలువని కొమ్మల పెదాల్తో ముద్దెట్టుకొంటూ వుంటే అలల లలుగా జలదరిస్తున్నట్టుండేవి కాలువల చెట్టు మీంచి కాలువలోకి దూకేవాళ్ళం పిల్లలం మేం. మరి, సీతాఫలాల చెట్లుండేవి. ఘోషా బీబమ్మలాగా ఆకుల చాటు నుంచి అంతలేసి కళ్ళతో చూస్తున్నట్టు ఉండేవి సీతాఫలాలు. పాలివ్వడానికి పిలుస్తున్న తల్లుల్లాగా ఉండేవి కాయలతో మామిడిచెట్లు మావూరి మామిడితోపులో. నేల తల్లి తలలో కుప్పెల్లాగా ఉండేవి. తాటితోపులో తాడిచెట్లు.

చెట్లు - ఎన్ని అందాలో, ఎన్నిరూపాలో, గుబురుగా, గుబులుగా, ముదురుగా, ముచ్చటగా, చిగురుగా, చిరునవ్వుగా తలంటుకొంటున్నట్లు కొన్ని తలారబోసుకున్నట్లు కొన్ని, దిగులుగా ఉన్నట్లు కొన్ని సిగ్గుతో ముడుచుకుని పోయి కొన్ని, చికాకుగా ఉన్నట్లు కొన్ని, బెదిరిస్తున్నట్లుగా కొన్ని, ఆహ్వానిస్తున్నట్లు కొన్ని, కొన్ని వికసించిన కవిత్వంలాగే కాదు, వికటించిన కవిత్వంలాగానూ.

నా మనసు వందకోతులయ్యేది. ఇస్మాయిల్‌గారి చెట్లు నన్నింత మూవ్ చేశాయ్. చిన్నప్పుడు శ్రీశ్రీగారి మహాప్రస్థానం చదివినప్పుడు అర్థం అయిన మేరకి వెర్రి ఆవేశం వచ్చి శ్రీశ్రీ గారికి కాపీ గేయాలు రాశా, పాడా. అలాగే డబ్బైల్లో కాకినాడలో ఉన్నప్పుడు ఇస్మాయిల్‌గారు 'చెట్టు నా ఆదర్శం' అన్నప్పుడు, చెట్టులాగే వికసించడం కొమ్మలు కొమ్మలుగా విస్తరించడం తనకెంతో ఇష్టమని చెప్పినప్పుడు కొన్ని రాత్రులు నిద్రపట్టలేదు నాకు. నేను ప్రేమించి, నాకు దొరక్కుండా పోయిన కవితాకన్య ఈయన ఇంట్లో

ఈ కవికి ఇవి తప్ప, వీటి అనుభూతులు తప్ప ఇంకేం పట్టవా? ఈ సమాజాన్ని పీడించే ఆకలిదప్పులు ఇంకెన్నెన్నో సమస్యలు? అంటే, అంటాడు కదా 'కవికి సామాజిక స్పృహ ఉండకూడదని కానీ, ఆకలి, ఆప్రెషన్ వంటి విషయాలు గురించి రాయకూడదని కానీ, అలా రాసింది కవిత్వం కాదని కానీ నేననటం లేదు. అది నిజంగా కవి స్వీయానుభవం నుంచి ఉద్గతమైతే గొప్ప కవిత్వం అయితీరుతుంది. అంటూ 'వైయుక్తిక అనుభవానికీ, సాంఘిక చైతన్యానికీ సామరస్యం సాధించిన కవులే మంచి కవిత్వం రాయగలిగారు' అని ఖచ్చితంగా చెప్తాడు.

ఉందన్నమాట అనిపించింది ఆయన కవిత్వం చదువుతుంటే.

ఎలా పట్టుకుంటాడీ ఇస్మాయిల్ ఈ భావాల, అనుభూతుల రంగురంగుల చేపల్ని. చాలామంది వేళ్ళ సందుల్లోంచి జారిపోతాయే! ఇస్మాయిల్ వాటిని నాజుగ్గా పట్టుకుని 'చూశారా వీటిని' అని కృష్ణశాస్త్రీయంగా చిరునవ్వులు పోతాడు.

ఈయన తన ఆదర్శపు చెట్టు కింద నిలబడి ఎన్నెన్ని దృశ్యాల్ని చూశాడో చూపాడో ఎన్ని అనుభూతుల్ని పట్టుకున్నాడో మన కోసం, మన తరపున, గోడకి కొట్టిన మేకు, ఆకాశాన్ని భూమి సంబాళించే భార్య, కోటిపల్లి ప్రయాణం, వేయి పిర్రల సముద్రం, టాగూర్‌తో బోట్లో షికారు, బెల్లంకాయతో ఆడుకునే బుడతడు, ప్రియురాలి రహస్య చర్మం, చంద్రుడ్ని నెమరేసిన గేదె, చీకటిని పీల్చేసిన దీపం- ఎంత వైరైటీ, ఎంతో వైరైటీ- చాలామంది కవులకి ఉంటుంది కాని అందులోంచి ఇస్మాయిల్ బాగా చమత్కారంగా ఒక తాత్విక దృశ్యాన్ని ఒక సౌందర్యపు భాషలో దించగల ప్రజ్ఞ చాలా తక్కువమంది కవులకుంటుంది.

ఎవరికీ అర్థం కాని మాటల్లోనో, సమాసాల్లోనో, భావాల్లోనో ఈయన కవిత్వం రాయలేదు. మనందరం నిత్యం చూసే, అనుభవించే మామూలు విషయాలు గురించి చిన్న చిన్న మాటలలో రాశాడాయిన.

ఈ కవికి ఇవి తప్ప, వీటి అనుభూతులు తప్ప ఇంకేం పట్టవా? ఈ సమాజాన్ని పీడించే ఆకలిదప్పులు ఇంకెన్నెన్నో సమస్యలు? అంటే, అంటాడు కదా 'కవికి సామాజిక స్పృహ ఉండకూడదని కానీ, ఆకలి, ఆప్రెషన్ వంటి విషయాలు గురించి రాయకూడదని కానీ, అలా రాసింది కవిత్వం కాదని కానీ నేననటం లేదు. అది నిజంగా కవి స్వీయానుభవం నుంచి ఉద్గతమైతే గొప్ప కవిత్వం అయితీరుతుంది. అంటూ 'వైయుక్తిక అనుభవానికీ, సాంఘిక చైతన్యానికీ సామరస్యం సాధించిన కవులే మంచి కవిత్వం రాయగలిగారు' అని ఖచ్చితంగా చెప్తాడు.

ఈయన్ని ఈ కోణం నుంచి అర్థం చేసుకోలేని ఎందరో ఆయన కవిత్వాన్ని పనికి మాలిన కవిత్వం అన్న వాళ్ళున్నారు. ఆయన నవ్వి ఊరుకున్నాడు. అవసరమనుకున్నప్పుడు తన కవిత్వ దృక్పథం గురించి, తన నమ్మకాల గురించి నిర్ద్వంద్వంగా, నిష్కర్షగా చెప్పాడు. తన కమిట్‌మెంట్ కవిత్వానికి కాని, ఏ యిజాలకి, ఏ వాదాలకీ కాదన్నాడు. తన 'కవిత్వంలో నిశ్శబ్దం', 'కరుణ ముఖ్యం' గ్రంథాల్లో తన నమ్మకాలని ఎంతో స్పష్టంగా చెప్పాడాయిన.

తన కవిత్వం గురించి ఆయన చమత్కారంగానే అన్నా, కవులందరికీ వర్తించే ఒక గొప్పమాటన్నాడాయన. తన సైకిల్‌కి అన్వయించుకొంటూ.

"ఇది అంగుళం మేర మాత్రం అంటిపెట్టుకునుంటుంది నేలని, నా కవిత్వం లాగే. ఒక చక్రం భూమీద్ద అన్చి, ఒక చక్రం కలల్లోకి తేల్చి నిద్దరోతుంది నా కవిత్వం లాగే" ఆయన యివాళ లేరు. ఇంత కాలంగా ఆయన్ని చూసినవారు ఒకటి గ్రహిస్తారు. ఆయన తన కవిత్వంలాగా నిరాడంబరుడు. క్లిష్టత లేనివాడు, కవిత్వం అంటే పులకరించిపోయి తన్మయిత్వం చెందినవాడు.

'కవిత్వంతో నువ్వు కవిత్వాన్ని ప్రేమించకపోతే కవిత్వంలో నువ్వుదేన్ని ప్రేమించగలవు' అంటూ కొరియన్ కవి చాంగ్ మాన్ జోంగ్ లాగా ప్రశ్నిస్తాడు ఆయన. ప్రపంచంతో ప్రపంచపు ఆరాటాలతో పరుగులెత్తే 'రాత్రులు కురిసే మంచుని ఎవ్వరూ చూడరు?' అని ఆశ్చర్యపోయి, ఆవేదనపడతాడు.

ఇలాంటి ఫీలింగ్స్‌తోనే ఇస్మాయిల్ తుదిశ్వాస దాకా జీవించాడు.

ఈయన భూమ్మీద నిలబడి ఆకాశంలోకి దృష్టిని సారించిన భావుకుడు. ఈయన దృష్టిలో, ఈయన చేతిలో చిన్న చిన్న సామాన్యమైన విషయాలు, వస్తువులు మనోహరంగా ఒక తాత్విక అస్థిత్వాన్ని సంతరించుకుని నిలుస్తాయి. ఈయన వర్గాలకి, కుల, మతాలకి, భాషా ప్రాంతాలకీ, అతీతంగా జీవించిన మహా మనిషి. తెలుగు సాహిత్యానికి ఆయన రచనలు - కవిత్వమైనా, వచనమైనా - ఒక గొప్ప సౌందర్యాన్ని, చేవని, నైర్మల్యాన్ని చేకూర్చాయి. ఆయన ఇంత విశిష్టమైన రచనా వ్యవసాయంలో దాదాపు అరవైయేళ్ళుగా వున్నా ఏ సాహితీ పురస్కారాలకీ అర్రులు చాచినవారు కాదు. సాహిత్య సృజన ఒక బాధ్యతగా భావించి నిరాడంబర జీవితాన్ని ఒక తాత్విక దృక్పథంతో సాగించినవాడు.

మొన్న నవంబర్ 26 సాయంత్రం ఆయన అంత్యక్రియల్లో పాల్గొని వస్తున్నప్పుడు డిలాన్ థామస్ రాసిన 'పోయం యిన్ అక్టోబర్'లో రెండు లైన్లు మరీమరీ జ్ఞాపకం వచ్చాయి నాకు.

"My Birthday began with water Birds, and the birds of the winged trees flying my name"

చిగిర్చే చెట్టుకి ఎగిరే పిట్ట ఆదర్శం అన్న ఇస్మాయిల్ గారికి ఈ లైన్లు వర్తిస్తాయి. ఆయన ప్రతి కవితా చెట్టుమీద వాలిన చిలక మాత్రమే కాదు. చెట్టుమీంచి ఆయన పేరును పలుకుతూ దిశ దిశలకి ఎగిరే చిలక కూడా.

ఈ అనుభూతి సింధువు నా బంధువూ, ఆత్మబంధువూ. ఈయన సదా బాలకుడిగా ప్రపంచాన్ని చూశాడు. నిత్య నూతనుడిగా జీవించాడు. ఆయనకు మరణమేమిటి?

**(స్మైలూ... జ్ఞాపకాలూ... నుంచి)**

II

# నిలబడ్డమే తిరుగుబాటు



## రవీంద్రనాథ్ టాగూర్

**(07.05.1861 - 07.08.1941)**

విశ్వకవి 'గీతాంజలి' కావ్యానికి **1913**లో నోబుల్ బహుమతి పొందారు. కథకుడు, నవలాకారుడు, నాటకకర్త. చిత్రకారుడు, సంగీత నిధి.

అ ధర్వ వేదములోని కొన్ని మంత్రాలలో కవి మానవుని గురించి అత్యుదాత్తంగా అభివర్ణించాడు. ఆ మంత్రాలలోని భావమిది :

"మానవునకు స్వరూపము, ఆభిజాత్యము, సంచార శక్తి, అభివ్యక్తి, శీలము సమకూర్చిన వారెవ్వరు? అతని విజ్ఞానమును, గానమును, నృత్యమును ప్రోత్సహించినవారెవరు? అతని శరీరము నిటారుగా నిలుపబడినప్పుడు అతడు ప్రక్క భాగాలను, తనలోని మిగిలిన అన్ని దిశలను కూడా చూచుకున్నాడు. అతడే అనంత తత్వానికి ఆస్థాన పీఠియైన మహామానవుడు."

"తస్మాద్వైవిద్వాన్ పురుషమిదమ్ బ్రహ్మేతి మన్యతే"

"కనుకనే విద్వాంసు లా పురుషుడే బ్రహ్మ అని తెలుసుకుంటున్నారు."

"సనాతనమేన మహురుతాద్య స్సాతునర్నవః."

మానవుడు తన అవతార ప్రారంభ దశలోనే తన శరీరాకృతిలోనే అనాదిగా వస్తూన్న ప్రాకృతిక 'విషయాల నుండి విముక్తి పొందాలనే తన సంకల్పం తొలిసారిగా ప్రకటించాడు. పరిణామ పథంలో ఒక మలుపు దగ్గరకు వచ్చేసరికి, మానవుడు చతుష్పాద జంతువుగా ప్రవర్తించడానికి నిరాకరించాడు. తన శరీరానికి అతడు కొత్తగా అలవరచుకున్న భంగిమమే అతని ప్రబలమైన అవిధేయతకు శాశ్వత నిదర్శనం. భూమిమీద తిరిగే జంతువులన్నిటికీ వాటి దీర్ఘదేహాలకు ముందూ వెనుకా తూకం సమంగా కుదిరేటట్టు రెండు జతల కాళ్ళు ఏర్పాటు చేయడం ప్రకృతి నియమమని వేరుగా చెప్పనక్కరలేదు. ఇది ఎన్నడూ మార్పుకూర్పులు లేని భూమ్యాకర్షణ శక్తితో ప్రకృతి చేసుకొన్న భద్రతా సంధి. ఇట్టి క్షేమకరమైన ఏర్పాటును కాదని వస్తూన్న ప్రాకృతిక 'విషయాల నుండి విముక్తి పొందాలనే తన సంకల్పం తొలిసారిగా ప్రకటించాడు.

మన ఇంట్లో ఉన్న నాలుగు కాళ్ల బల్ల రెండు కాళ్లపైన నిటారుగా లేచి నిలబడి, మిగిలిన రెండు కోళ్లను ప్రక్కన ఊగులాడిస్తూ నడిచి వస్తూన్నట్లు మనకు కనిపిస్తే, అది ఏ భూతమో అని భయపడతాం. లేక, దానిని సృజించిన వడ్రంగి పనితనాన్ని పరిహసించడానికి ఆ బల్ల చేస్తూన్న అల్లరి అనుకుంటాము. సరిగ్గా అల్లాంటి అసమంజస ప్రవర్తనే శారీరకంగా మానవునిలో కూడా కనిపిస్తూండటం చూస్తే అతడు ఏ విపరీత గ్రహకూటమిలోనో జన్మించడం వల్ల ఈవిధంగా తలతిక్కగా ప్రకృతి సూత్రాలను ఉల్లంఘిస్తున్నాడేమో అనిపిస్తుంది. పైగా, ఈవిధంగా పశుసంచరణ నియమాలను ప్రతిఘటించడం వల్ల ఎన్నిసార్లు ఎన్ని ఎదురు దెబ్బలుతిన్నా మానవుడు తన మూర్ఖపు పట్టుదల వదలడం లేదు. అతని కండరాలు సులభంగా సమతౌల్యం కుదుర్చుకునే అవకాశంలో సగ భాగం అతడీవిధంగా చేజేతుల వదులు కున్నాడు. అలాగే చాలీ చాలని పట్టుతోనే నిలబడి శైశవ దశలో తరచుపడుతూ లేస్తూ ప్రమాదకరమైన పద్ధతిలో నడక నేర్చు కుంటాడు. జీవితం పొడుగునా అలాగే ఎన్నోసార్లు తూలిపడుతూ ఒక్కొక్కప్పుడు ప్రమాదకరమైన అంగవైకల్యకరమైన దెబ్బలు తింటాడు. అయినా లెక్కచేయడు. జంతువులకు ఈ ప్రమాదాలేవీ లేవు. అడుగడుగునా భూదేవతకు సలాములు చేస్తూ జీవయాత్ర సాగించడానికి ఇష్టపడితే మానవుడు కూడా ఆ అవయవ భద్ర స్థితిని యథాతథంగా ఉంచుకొని సుఖంగా బ్రతికేవాడు. అది ఇష్టం లేకనే ఈ మహాసాహసానికి పూనుకొన్నాడు.

**ఒక స్వాతంత్ర్యం మరొక స్వాతంత్ర్యానికి మార్గదర్శి అవుతుంది. ఆవిధంగా మానవుని నేత్రదృష్టికి కూడా విస్తృతావకాశం లభించింది. అతని భౌతిక దృష్టి శక్తి వృద్ధి అయినదనిగాదు: నిజానికి, కాంతికి అనుగుణంగా మారగల శక్తి వేటాడి జీవించే కొన్ని జంతువుల దృష్టికే విశేషంగా ఉంది. అయితే, ఎత్తు నుంచి చూచే వీలు వల్ల మన దృష్టికి విలక్షణమైన సౌకర్యం ఏర్పడింది. ఈ సౌకర్యం వివిధ వస్తువుల స్థానాన్ని గురించిన భోగట్టా తెలుసుకొనడానికేగాక ఆయా వస్తువుల పరస్పర సంబంధా లను, సామరస్యాన్ని గ్రహించడానికి కూడా ఉపకరిస్తున్నది.**

పరిణామ పథంలో ఒక మలుపు దగ్గరకు వచ్చేసరికి, మానవుడు చతుష్పాద జంతువుగా ప్రవర్తించడానికి నిరాకరించాడు. తన శరీరానికి అతడు కొత్తగా అలవరచుకున్న భంగిమమే అతని ప్రబలమైన అవిధేయతకు శాశ్వత నిదర్శనం. భూమిమీద తిరిగే జంతువులన్నిటికీ వాటి దీర్ఘదేహాలకు ముందూ వెనుకా తూకం సమంగా కుదిరేటట్టు రెండు జతల కాళ్లు ఏర్పాటు చేయడం ప్రకృతి నియమమని వేరుగా చెప్పనక్కరలేదు. ఇది ఎన్నడూ మార్పుకూర్పులు లేని భూమ్యాకర్షణ శక్తితో ప్రకృతి చేసుకొన్న భద్రతా సంధి. ఇట్టి క్షేమకరమైన ఏర్పాటును మానవుడు తిరస్కరించాడు. ఇది మానవునిలోని విధిశాసనల్లోంఘన తత్త్వానికి నిరంతర సంస్కరణ కాంక్షకు నిదర్శనం.

మన ఇంట్లో ఉన్న నాలుగు కాళ్ల బల్ల రెండు కాళ్లపైన నిటారుగా లేచి నిలబడి, మిగిలిన రెండు కోళ్లను ప్రక్కన ఊగులాడిస్తూ నడిచి వస్తూన్నట్లు మనకు కనిపిస్తే, అది ఏ భూతమో అని భయపడతాం. లేక, దానిని సృజించిన వడ్రంగి పనితనాన్ని పరిహసించడానికి ఆ బల్ల చేస్తూన్న అల్లరి అనుకుంటాము. సరిగ్గా అల్లాంటి అసమంజస ప్రవర్తనే శారీరకంగా మానవునిలో కూడా కనిపిస్తూండటం చూస్తే అతడు ఏ విపరీత గ్రహకూటమిలోనో జన్మించడం వల్ల ఈవిధంగా తలతిక్కగా ప్రకృతి సూత్రాలను ఉల్లంఘిస్తున్నాడేమో అనిపిస్తుంది. పైగా, ఈవిధంగా పశుసంచరణ నియమాలను ప్రతిఘటించడం వల్ల ఎన్నిసార్లు ఎన్ని ఎదురు దెబ్బలుతిన్నా మానవుడు తన మూర్ఖపు పట్టుదల వదలడం లేదు. అతని కండరాలు సులభంగా సమతౌల్యం కుదుర్చుకునే అవకాశంలో సగ భాగం అతడీవిధంగా చేజేతుల వదులు కున్నాడు. అలాగే చాలీ చాలని పట్టుతోనే నిలబడి శైశవ దశలో తరచుపడుతూ లేస్తూ ప్రమాదకరమైన పద్ధతిలో నడక నేర్చు కుంటాడు. జీవితం పొడుగునా అలాగే ఎన్నోసార్లు తూలిపడుతూ ఒక్కొక్కప్పుడు ప్రమాదకరమైన అంగవైకల్యకరమైన దెబ్బలు తింటాడు. అయినా లెక్కచేయడు. జంతువులకు ఈ ప్రమాదాలేవీ లేవు. అడుగడుగునా భూదేవతకు సలాములు చేస్తూ జీవయాత్ర సాగించడానికి ఇష్టపడితే మానవుడు కూడా ఆ అవయవ భద్ర స్థితిని యథాతథంగా ఉంచుకొని సుఖంగా బ్రతికేవాడు. అది ఇష్టం లేకనే ఈ మహాసాహసానికి పూనుకొన్నాడు.

నిటారుగా నిలబడగల శక్తి అలవరచుకొనడం వల్ల మన శరీరం సులభంగా ఎటుపడితే అటు తిరగడానికి, వంగడానికి అవకాశం ఏర్పడింది. చుట్టూ తిరిగిచూస్తూ, భౌతిక జగత్తులో మన కేంద్ర స్థితిని మనం గుర్తించగలుగుతున్నాం. తత్ఫలితంగా, జంతువులన్నీ భౌతికంగా ఏక సంకుచిత మార్గంలో ముందుకు సాగగలిగి ఉండగా, మానవ సంచార రంగం విశాల వృత్తం అయింది. కేంద్రస్థుడైన మానవుడు విశాలతర దృష్టిగలవాడై, తన పరిధి యొక్క వైశాల్యంలో స్వస్వరూపం దర్శనం చేసుకొనగలుగుతున్నాడు.

ఒక స్వాతంత్ర్యం మరొక స్వాతంత్ర్యానికి మార్గదర్శి అవుతుంది. ఆవిధంగా మానవుని నేత్రదృష్టికి కూడా విస్తృతావకాశం లభించింది. అతని భౌతిక దృష్టి శక్తి వృద్ధి అయినదనిగాదు: నిజానికి, కాంతికి అనుగుణంగా మారగల శక్తి వేటాడి జీవించే కొన్ని జంతువుల దృష్టికే విశేషంగా ఉంది. అయితే, ఎత్తు నుంచి చూచే వీలు వల్ల మన దృష్టికి విలక్షణమైన సౌకర్యం ఏర్పడింది. ఈ సౌకర్యం వివిధ వస్తువుల స్థానాన్ని గురించిన భోగట్టా తెలుసుకొనడానికేగాక ఆయా వస్తువుల పరస్పర సంబంధా లను, సామరస్యాన్ని గ్రహించడానికి కూడా ఉపకరిస్తున్నది.

నిటారుగా నిలబడడానికి మానవుడు సంపాదించు కొన్న భౌతిక స్వాతంత్ర్యం వల్ల అతని చేతులకు ముక్తి లభించింది. ఇదే దీనివలన కలిగిన అత్యుత్తమ ప్రయోజనం. మన శరీర నిర్మాణంలో చేతులే నైపుణ్యానికి, సౌందర్యానికి పనిపాటులకు, సర్వ ప్రయోజనాలను మించిన ఇతర విషయాలకు ప్రఖ్యాతమైనవి. మన అవయవాలన్నిటిలో చేతులే ఎక్కువ విశృంఖలతగలవి. ఒకప్పుడు ఇవి మన శరీరభారాన్ని మోసే కంబాలుగా ఉండేవి. ఆ భారవాహక వృత్తి నుండి ఉద్ధరింపబడిన వెంటనే మనకు సహాయకుల హోదా సంపాదించుకొన్నాయి. మన దిగువను స్తంభాలుగా ఉంచడం మాని పార్శ్వాన వాటికి స్థానమీయడంతో, మనం పశుత్వసీమలను అధిగమించడానికి ఉపకరించిన అపూర్వ సామర్థ్యాలను అవి ప్రదర్శించాయి.

ఈ దృష్టి స్వాతంత్ర్యం, ఈ కార్యస్వాతంత్ర్యం సాధించడంతో, మానవునిలో అతని భావనల ద్వారా మనో స్వాతంత్ర్యం కూడా సిద్ధించింది. మన ప్రజ్ఞలన్నింటిలోకి ఈ

సృజనాత్మకమైన విముక్తి, తన ప్రయోజనాలను అతిశయించిన నూతన సూచనలేవో సదా అంకురింపజేస్తూ ఉంటుంది. విముక్తి లక్ష్యమే అనంత తత్త్వావిష్కరణం. అది తన క్రియలలో పరిమితులను ఏర్పరుస్తుంది. కాని ఆ పరిమితులను శాశ్వతంగా నిలిపి ఉంచదు. ఎప్పటికప్పుడు వాటిని భంగపరుస్తూ, ఆనిరతరాద్భుత క్రియలలో అనంత తత్త్వాన్ని అభివ్యక్తం చేస్తుంది. దీనివలన నిరంతర పునరుజ్జీవనంతో, ఎప్పటికప్పుడు నూతనారంభాలతో, మౌలికమైన ఏదో ఒక ఆదర్శసత్యంతో పూర్ణతర సామరస్యం సాధించడానికిగాను పదే పదే ప్రాచీనాచారాలను అధిక్షేపిస్తూ, వీటికి స్వస్తి చెబుతూ సాగే నూతన చరిత్ర ప్రారబ్ధమయింది.

భావనా స్వాతంత్ర్యమే పూర్తిగా మానవ ప్రత్యేకమైనది. శిల్పిచే కొంతవరకు రూపొందించబడి, నిర్వస్త్రాలంకారంగా, కవచాయుధ రహితంగా వదలివేయబడి, పైగా చాలావరకు ఆ సంస్కృతమైన, అశిక్షితమైన 'మనస్సు' చెప్పుచేతలకు అప్పగించబడిన మానవునికి నాటి నుండి ఈ భావనాశక్తే దిక్కు అయింది. కళాకారులందరి వలెనే తప్పులు చేయడానికి తన మనస్తత్త్వానికీ శారీరక సుస్థితికీ విరుద్ధమైన, బాధాకరమైన సాహసాలు చేయడానికి కూడా భావనాశక్తికి స్వాతంత్ర్యం ఉన్నది. అశిక్షితులు, అసంస్కృతులు, అయిన మర్త్యులకు ఈ స్వాతంత్ర్యం దివ్యమైన వరంగా లభించింది. అందువల్లనే మనుషుల నిర్మాణాత్మకమైన అభ్యుదయ మార్గమంతా దారుణ శిథిలావశేష మయంగా కనిపిస్తుంది. వారి విజయ దశలు కూడా భయంకరమైన వైకల్యాలతో కూడినవి. అయి నప్పటికీ, అసలు సృష్టి శిక్షణే ఒక లక్ష్యాన్ని స్పష్టంగా ప్రకటిస్తున్నది. ఆ లక్ష్యం హఠాత్తుగా ఏదో ఒక వ్యక్తి మనస్సులో ఫలించేది కాదు: కేవలం జీవనావశ్యకతలకు పరిమితమై ఉండేది కాదు.

సృజనాత్మకమైన విముక్తి, తన ప్రయోజనాలను అతిశయించిన నూతన సూచనలేవో సదా అంకురింపజేస్తూ ఉంటుంది. విముక్తి లక్ష్యమే అనంత తత్త్వావిష్కరణం. అది తన క్రియలలో పరిమితులను ఏర్పరుస్తుంది. కాని ఆ పరిమితులను శాశ్వతంగా నిలిపి ఉంచదు. ఎప్పటికప్పుడు వాటిని భంగపరుస్తూ, ఆనిరంతరాద్భుత క్రియలలో అనంతతత్త్వాన్ని అభివ్యక్తం చేస్తుంది. దీనివలన నిరంతపునరుజ్జీవనంతో, ఎప్పటికప్పుడు నూతనారంభాలతో, మౌలికమైన ఏదో ఒక ఆదర్శసత్యంతో పూర్ణతర సామరస్యం సాధించడానికిగాను పదే పదే ప్రాచీనా చారాలను అధిక్షేపిస్తూ, వీటికి స్వస్తి చెబుతూ సాగే నూతన చరిత్ర మొదలైంది.

విశిష్ట సామర్థ్యం సాధించడం కోసం నిరంతర కృషిలో నిమగ్నమైన మన నాగరికతలో ఏ అధ్యాయానికి ఆ అధ్యాయం ఆకస్మిక విషపరిణామాలతోనే ప్రారబ్ధం అవుతూ వస్తుంది. ఈ నాగరికతలో పరిణామాలు, ఋతువుల క్రమంలో వలె కొత్త కొత్త పూలు కొత్త కొత్త పండ్లతో పాటుగా అంకురించే నవీనభావాల పర్యవసానంగా కలిగేవి కావు. అందువలన ఇంచుమించు ఈ నాగరికతా చరిత్రలో ప్రతి యుగము మహాసంరంభంతో మొదలవుతూంది. ఆ మహా సాహసాలన్నీ రహస్యంగా పొంచి ఉండి ఒక్కసారిగా బయటపడి, విప్లవాత్మక సంస్కరణలను తెచ్చిపెట్టిన మహాశ్చర్యకర సంఘటనలు. సజీవాదర్శాలనే రాజవంశాలను తారుమారు చేసిన పరిణామాలు. ఆ ఆదర్శాలు భౌతిక మానసికాచారాలు, చిహ్నాలు, ఉత్సవాలు, భూషణాలు మొదలైన ఏర్పాటుతో తమ సామ్రాజ్యాన్ని ఎంత కట్టుదిట్టం చేసుకొన్నప్పటికీ ఇట్టి సంఘటనలు జరుగుతూవచ్చాయి. ఇట్టి విప్లవాలు ఏ దేశంలో ఏ యుగంలో జరిగినా, అవి వాటి ఏకైక కేంద్రానికి సంబంధం లేకుండా పూర్తిగా వ్యస్తంగా జరిగినవి కావు. చరిత్ర ఒక్కటే : అలాటి సంఘటనలన్నిటికీ చరిత్రలో స్థానం ఉంది.

ఇండియా చైనాలలోగాని, పర్షియా జుడాయియాలలో గాని, గ్రీస్ రోములలోగాని వర్ధిల్లిన నాగరికతలన్నీ భిన్న భిన్న ఔన్నత్యాలు, శీతోష్ణస్థితులు, వృక్ష జంతు జాతులు కలిగిన ఒకే పర్వత శ్రేణిలోని వేరు వేరు పర్వతశిఖరాల వంటివి. వాటి నడుమ పరస్పర సంబంధాలను అసాధ్యం చేసే అవరోధాలేమీ లేవు. అన్నీ ఒకే పునాదిపైన పెరిగినవి. వాతావరణంలో అవి కలిగించే మార్పులన్నీ మనందరికీ సమంగానే అనుభవమవుతున్నాయి. "మానవులందరికీ ముక్తి కలిగితే తప్ప నాకు ముక్తి అవసరం లేదు" అన్న మహాప్రబోధకుని వాక్యంలోని తాత్పర్యానికి ఇదే ప్రాతిపదిక.

ఆటవిక మానవుడు తనను గురించి తాను ఊహించుకున్న ఆదర్శ చిత్రానికి మెరిసే రంగులు, ఆడంబరమైన దుస్తులు, భీషణ భూషలు, అత్యుద్వేగ జన్యుములైన వికృత వైకల్యాలు కూడా కావాలి. ఆదర్శమానవుని ఘనతకు అవసరమని తాను విశ్వసించే విధంగా వ్యక్తిగతంగా తనను తాను రూపొందించుకోవాలని ఆటవిక మానవుని ప్రయత్నం. ప్రాకృతిక పరిమితులలోని తన స్థితితో అతనికి సంతృప్తి లేదు. తనను

ఈ విధానమంతా ఎంత మొరటుగా కనిపించినా, ఒక్క విషయం మాత్రం మనం గ్రహించవచ్చు. మానవుడు తనకన్న విశిష్టమైన వ్యక్తిత్వంలో తన ప్రతినిధిని సందర్శిస్తున్నాడు. తాను అసమగ్రుడే కాని, అపరిపూర్ణుడు మాత్రం కాడనే చైతన్యం మానవునకు ఉన్నది. తనలోని ఏదో రహస్యార్థాన్ని తానింకా గ్రహించవలసి ఉన్నదని నిరంతరం మానవుడు అనుకుంటున్నాడు. ఇందులో మనం ఆశ్చర్యపడేదేమీ లేదు. మానవునిలోని మొరటుతనం నిత్యమైనది కాదని దాని పరిమితులు దిక్చక్రపు సరిహద్దుల వంటివనీ మనకు స్పష్టంగా తెలుసు.

గురించి తనకు స్పష్టంగా తెలిసిన దానినంతటినీ మించిన విశిష్టత ఏదో తనలో ఉన్నదనే ప్రబలమైన భావం అతనిలో ఉన్నది. ఆ విశిష్టతే తనకు విలువను, ఘనతను ఈయగలదని కూడా అతని తలంపు. అదే శక్తి సూత్రం. అతని ప్రస్తుత మానసిక దశననుసరించి అదే విశ్వసత్య పదార్థం తాను దానికి బంధువుడు గనుక, స్వసుఖాన్ని త్యాగం చేసి అయినా సరే ఆ సత్యాన్ని తనలో ప్రదర్శించడమే తన పవిత్రకర్తవ్యమని అతని భావం. దాని ద్వారానే అతడు భగవంతునితో ఐక్యం కాగలడు. ఆటవిక మానవుడు అమితంగా శ్రమపడ్డాడు. తరచు దారుణమైన బాధలు అనుభవించాడు. శక్తే అతని భగవంతుడు : అందుకు అతీతుడు కాడు. ఆ శక్తిని చిత్ర విచిత్రవర్ణాలతో, వికృతాకృతులతో, నిష్ఠుర క్రూర విశృంఖల సాహస కృత్యాలతో తనలో ప్రతిభాసింప జేసుకొనడం కోసం ఆటవిక మానవుడు విపరీతంగా శ్రమపడ్డాడు. అందులో అనేక దారుణ వేదనలకు గురయ్యాడు. ఆ ముష్కర దర్పాడంబరాలు చూచిన స్వసంఘీయులందరికీ అతని యందు గౌరవ ప్రతిపత్తులు ఏర్పడినవి. దానితోపాటుగా కలిగిన భయం వారికి ఒక విధమైన రసానందం, సంతృప్తి కలిగించింది. వారికి తెలిసినంతలో ఆదర్శ మానవుణ్ణి గురించిన ఒక చిత్రాన్ని అతని భయంకర దర్పంలో వారు సందర్శింపగలగడమే ఈ సంతృప్తికి హేతువు. అట్టి సాహసికునిలో అతని వ్యక్తినిగాక, తమకందరికీ ప్రాతినిధ్యం వహించే మహాపురుషుణ్ణి వారు చూశారు. తామెన్ని బాధలు పడుతున్నా సహించారు. అద్భుతమైన అతని పరపీడన తృష్ణలో భయంకరంగా వ్యక్తమయ్యే అసాధారణ సంకల్ప శక్తికి పరవశులై అతని అత్యాచారాలకు తాము గురవుతున్నా హర్షించారు. అపరిమిత సంకల్ప శక్తిని గురించి తమ భావాలను వారు తమ దేవతలకు సంకేతాలుగా చేసుకున్నారు. ఆ దేవతలు భౌతికంగా వికృతాకారులనీ, నైతికంగా అతి ప్రమాదకరులనీ, రక్తతృష్ణతో తమకు బలులు కావాలంటూ భయంకరమైన కోరికలు కోరతారనీ వరాలు శిక్షలు ప్రసాదించడంలో విచక్షణ లేకుండా యథేచ్ఛగా ప్రవర్తిస్తారనీ విశ్వసించారు. ఈ దేవతలు ఆధునికులైన అతి వివేకులు కేవలం మనోదౌర్బల్యమని తిరస్కరించే జాలితో కూడిన మనసు పట్టింపులతో అక్రమంగా ప్రవర్తించారని నిందించడానికి వీలు లేదు.

ఈ విధానమంతా ఎంత మొరటుగా కనిపించినా, ఒక్క విషయం మాత్రం మనం గ్రహించవచ్చు. మానవుడు తనకన్న విశిష్టమైన వ్యక్తిత్వంలో తన ప్రతినిధిని సందర్శిస్తున్నాడు. తాను అసమగ్రుడే కాని, అపరిపూర్ణుడు మాత్రం కాడనే చైతన్యం మానవునకు ఉన్నది. తనలోని ఏదోరహస్యార్థాన్ని తానింకా గ్రహించవలసి ఉన్నదని నిరంతరం మానవుడు అనుకుంటున్నాడు. ఇందులో మనం ఆశ్చర్యపడేదేమీ లేదు. మానవునిలోని మొరటుతనం నిత్యమైనది కాదని దాని పరిమితులు దిక్చక్రపు సరిహద్దులవంటివనీ మనకు స్పష్టంగా తెలుసు. మానవునిలోని అంతస్సత్యం యొక్క ఆదేశం ప్రబలంగా వినిపిస్తూ వుంది. ఆ సత్యం మన ప్రత్యక్ష జ్ఞానానికీ, మన హేతువాద వివేచనకూ అతీతమైనది. ఈ మానవోత్తముని గురించిన సత్యాన్ని సర్వాత్మనా విశ్వసించిన వ్యక్తులనేక మంది జన్మించారు. మన చైతన్యం ఆ విషయాన్ని గురించి పర్యాలోచించిన కొలది మనలో ఉదాత్తనూతన ప్రమాణాలు, విలువలు రూపొందుతున్నాయి. అగాధసీమలు, సున్నిత కోణాలూ విశదమవుతున్నవి : ఆడంబరతను, ఉన్మత్తోద్వేగాలను, రూపవర్ణవచః ప్రవర్తనలలో దౌర్జన్యమునూ, కూక్లక్స్‌క్లాన్ (అమెరికాలో వర్గ విద్వేషులైన హంతల రహస్య సంస్థ) ధోరణిని పరిత్యజించడం ద్వారా వివేకవంతమైన ఉదాత్త ప్రవర్తన అలవడుతున్నది.

ప్రతి యుగం ఏవో కొన్ని కలలు కంటూ, కొన్ని ఉదాత్తభావాలను వ్యక్తీకరిస్తుంది. ఈ భావాలలోనే ఆ యుగపు వ్యక్తిత్వం వ్యక్తమవుతుంది. ఆ భావాలే దానిని శతాబ్దులనే అభ్యంతర గిరి శృంగాలను అధిగమింపజేసి, ఖండమధ్యస్థమైన శాశ్వతమానవ చరిత్ర అనే పీఠ భూమికి చేరుస్తాయి. ఈ భావాలు కేవలం మత సంబంధాలే కానవసరం లేదు. అయినా పరోక్షంగా వాటికి మానవుని మతంతో సంబంధం ఉన్నది. అవి ఆయా జాతుల వ్యక్తుల ముఖతః ఆ మహా మానవుని చైతన్యంలో నుండే వెలువడ్డాయి. ఈ చైతన్యం విజ్ఞాన శాస్త్రాలలోగాని, తత్త్వ శాస్త్రంలోగాని, కళలోగాని, సాంఘిక ధర్మాలలోగాని, తమంత తాముగా శాశ్వతమైన, ప్రయోజనకారులైన ఇతర విషయాలలో గాని వ్యక్తం కావచ్చు.

**("విశ్వమానవుడు" గ్రంథం నుంచి -**

**అనువాదకుడు : బొమ్మకంటి వెంకట సింగరాచార్య)**

# సాహిత్య ఉద్దేశం



## ప్రేమ్‌చంద్

(31.07.1880-08.10.1936)

ప్రముఖ హిందీ రచయిత. సాహిత్యంలో వాస్తవికతను బలంగా ప్రవేశపెట్టాడు. వందల కొలదీ కథలు, ఎన్నో నవలలు రాశాడు.

సాహిత్య యితిహాసంలో భాషకు చాలా ప్రాధాన్యత ఉంది. కాని భాష సాధనం మాత్రమే. సాహిత్యకారుడు అదృశ్యంగా భాష ద్వారా భావాలు వ్యక్తం చేస్తాడు. అతని శ్రోతల సంఖ్యా పరిధి చాలా విస్తృతమైంది. రచనలో వాస్తవం, సహజత్వం అంటే శతాబ్దాల పాటు మానవ హృదయాన్ని కదిలిస్తూనే ఉంటుంది.

రాసిందంతా సాహిత్యం కాదు. అందమైన భాషలో సత్యాన్ని వ్యక్తీకరిస్తూ మనస్సు మీద మేధస్సు మీద ప్రభావాన్ని కల్గించేది మాత్రమే సాహిత్యం. జీవితంలోని నగ్నసత్యాన్ని అనుభూతుల్ని యధాతథంగా వర్ణించినపుడే పై లక్షణాలు సాహిత్యానికి అబ్బుతాయి.

సాహిత్యాన్ని అనేకమంది అనేక రకాలుగా నిర్వచించారు. నా దృష్టిలో "జీవితాన్ని విమర్శించేదే" సాహిత్యం. వ్యాసం, కథ, కావ్యం, నవల ఏ రూపమైనా కావచ్చును. జీవితాన్ని తప్పనిసరిగా వ్యాఖ్యానించాలి. భాష్యం చెప్పాలి.

జీవితం అంటే అర్థం తెలియని యుగం నుండి బయటపడ్డాం. ఆనాటి సాహిత్యకారులు కల్పనని కేంద్రం చేసుకుని గారడీ కథలు అల్లేవారు. వాటి ఉద్దేశం అద్భుతాల్ని చెప్పి మనోరంజనం కల్పించడం కవులు వ్యక్తివాద ప్రభావాలకు లోనై శృంగార భావాల్ని ప్రకటించడం కోసం తమ కల్పనా ప్రతిభనంతా వెచ్చించేవాడు.

ఇతివృత్తం జీవితానికి ఎంత దూరమైందైనా కొత్త అలంకారాలు కల్పనలు ప్రయోగిస్తే అదే యశస్సుకు గీటురాయిగా నిలబడి పోతుందనుకొనేవారు. ఆ నైపుణ్యం అంతా విరహదశలో గుండెని కరిగించే నిరాశ, వేదనల వర్ణనకే. ఇలాంటి రచనలు ఇప్పుడు కూడా పాఠకుల మనసుల్ని ఎలా పట్టుకుంటాయో మనకు తెలుసు.

రోగి తన రోగాన్ని అసహ్యించు కున్నట్టు మానసికంగా నైతికంగా విలువలు కోల్పోయిన మనిషి కూడా తన స్థితిని అసహ్యించుకుంటాడు. వైద్యుడి పాత్రని రచయిత వహించాలి. సౌందర్య భావన లేకపోవడం వల్లనే ఈ బలహీనతలు. సౌందర్యం కోసం ప్రతి హృదయం అన్వేషిస్తుంది. సాహిత్యం కళాకారుడి భావాత్మకమైన సామ్యతని వ్యక్తీకరిస్తుంది. అది సౌందర్యాన్ని సృష్టిస్తుంది విశ్వాసాన్ని, సత్యాన్ని, సానుభూతిని, న్యాయ ప్రియత్వాన్ని, మమతను, మానవత్వాన్ని నింపుతుంది. ఇవి ఉన్నచోటే దృఢత్వం, నిజమైన జీవితం. లేనిచోట శత్రుత్వం, ద్వేషం, ఈర్ష్య, మృత్యువు. అనారోగ్యంలో అపథ్యం చేసినట్టు సాహిత్యం జీవితాన్ని స్వాభావికంగా స్వతంత్ర్యంగా చేస్తుంది హృదయానికి సంస్కారం కల్గిస్తుంది. దాని ఉద్దేశ్యమమూ అదే.

సాహిత్యకారుడు లేదా కళాకారుడు స్వభావసిద్ధంగా ప్రగతిశీలిగానే ఉంటాడు. ఒకవేళ ఈ స్వభావం లేకపోతే అసలు సాహిత్యకారుడు కానే కాదు. తన కల్పన ద్వారా వ్యక్తిలో గాని సమాజంలో గాని ముఖ స్వచ్ఛందతలను ఊహించలేనివాడు, వర్తమాన సామాజిక పరిస్థితులకు దూరంగా ఉండిపోతాడు.

**రచయితలు దళితులు పీడితుల పక్షపాతం వహిస్తారు. సమాజం అనే న్యాయస్థానంలో తీర్పు చదివి ప్రజలలో ఉదాత్త ప్రవృత్తి, సౌందర్య దృష్టి జాగృతం చేస్తారు. అయితే సత్యం నుండి వాస్తవికత నుండి ఏమాత్రం దూరం కానపుడే సమాజ హృదయంలో పరిణామం తేగలుగుతారు. భౌతికంగా మనిషి నిర్మాణంలో రక్తమాంసాలు, ఎముకలు కండరాలు ఎలాంటివో వాస్తవికత, సజీవత, భావవ్యంజత, మానవ పరిశీలన మానసిక శాస్త్ర అధ్యయనం వంటివి ప్రతి పాత్ర నిర్మాణంలో రచయితలకు ఆధారం కావాలి.**

సాహిత్యం నిస్సందేహంగా మన అనుభూతుల తీవ్రతని ఉన్నత స్థాయికి తీసుకెళ్ళాలి. అయితే మానవ జీవితం అంటే కేవలం స్త్రీ పురుషుల ప్రేమ సంబంధమైంది మాత్రమే కాదు కదా. శృంగారం విరహతాపాలు అందులోని నిరాశకే పరిమితమైపోయే సాహిత్యం ప్రపంచంలోని వాస్తవిక అనుభవాల్ని దూరంగా ఉంచడానికి ప్రయత్నిస్తుంది.

ఆనాటి రచయితలు చాలామందికి రచనలే జీవనాధారం. రాజులు జమీందార్లు పోషకులు. సాధారణ జీవిత సమస్యలు వాటి ప్రభావాలు తెలుసుకునే స్థితికి కవులు ఎదగలేకపోయారు. అందువల్ల రచనల్లో మానసిక బౌద్ధిక జీవనం లుప్తమైపోయింది. అయితే ఈ దోషాన్ని సాహిత్యవేత్తలకు అంటగట్టకూడదు. సాహిత్యం ఆయా కాలాలకి ప్రతిబింబం ఏ భావం ఏ ఆలోచన మానవ హృదయాన్ని స్పందింపచేస్తుందో అదే సాహిత్యం మీద కూడా నీడలు పరుస్తుంది.

సాహిత్యంలో ప్రతి శబ్దం నైరాశ్యంలో మునిగి తేలుతూ కాలానికి విరుద్ధంగా రోదిస్తూ కేవలం శృంగారానికి ప్రతిబింబమై నిలిస్తే మానవజాతి పతనమైపోయి జడత్వ పంజరంలో చిక్కుకుపోతుంది. కృషికి గాని, సంఘర్షణకు గాని ఆధారమే లేకుండా పోతుంది. మనిషి ఉన్నత లక్ష్యాన్ని గ్రహించలేదు. ప్రపంచాన్ని అర్థం చేసుకొనే శక్తి కోల్పోతాడు.

మన సాహిత్య శక్తులు వేగంగానే పరివర్తన చెందాయి. ఇప్పటి సాహిత్యం కేవలం మనసును ఉల్లాసపరచే వస్తువు మాత్రమే కాదు ఇంకా అనేక ఆదర్శాలున్నాయి. నాయికా నాయకుల సంయోగ వియోగ గాథలు విన్పించి ఊరుకోదు. జీవిత సమస్యల్ని చర్చిస్తూ పరిష్కారాన్ని సూచిస్తుంది. స్ఫూర్తి ప్రేరణల కోసం అద్భుత ఆశ్చర్య ఘటనల్ని వెతకడం కాదు. వ్యక్తి, సమాజాలపై ప్రభావం కలిగిస్తున్న సమస్యలే సాహిత్యానికి ఆధారమౌతున్నాయి. సాహిత్యంలోని ప్రజల ఉత్కృష్ట అనుభూతుల తీవ్రత రచయితల భావాల్ని ఉద్దేశాల్ని పరిణమింపచేస్తున్నాయి.

నీతిశాస్త్ర సాహిత్య శాస్త్రాల లక్ష్యాలు ఒక్కటే. అయితే ఉపదేశ పద్ధతిలో భేదముంది. నీతిశాస్త్రం తర్కాన్ని తీసుకుంటే, సాహిత్యం మానసిక సంఘర్షణ భావాల ఆధారంగా ఉపదేశిస్తుంది. వాస్తవ అనుభూతులే కల్పనగా పరిణమించి సాహిత్య నిర్మాణం సాగుతుంది. కవిలో అనుభూతుల తీవ్రతను బట్టి రచన కూడా అంత ఆకర్షణీయంగా ఉదాత్త లక్ష్యాలతో ఉంటుంది. ఆ భావాలే లుప్తమైతే, సౌందర్య ప్రేమ జాగృతం కాకపోతే నిజమైన సంకల్పాన్ని సాధించే దృఢ దీక్ష కల్పించేది కాకుంటే ఆ సాహిత్యం నిరుపయోగం అసలు అది సాహిత్యమే కాదు. పూర్వ సమాజం మతాధీనం. మనిషి ఆధ్యాత్మిక నైతిక ప్రవర్తనకు పుణ్య పాపాల సాధనాలతో భయపెట్టి "ధర్మం" తన కార్యం సాధించుకున్నది. ఇప్పుడు ఆ బాధ్యత సాహిత్యానికి వచ్చింది. అయితే సౌందర్య ప్రేమ యిక్కడ సాధనం. మానవుడి ఔన్నత్యానికి దివ్యతకు, అవరోధంగా ఉన్నవాటన్నింటినీ ఎదుర్కొంటారు. రచయితలు దళితులు పీడితుల పక్షపాతం వహిస్తారు. సమాజం అనే న్యాయస్థానంలో తీర్పు చదివి ప్రజలలో ఉదాత్త ప్రవృత్తి, సౌందర్య దృష్టి జాగృతం చేస్తారు. అయితే సత్యం నుండి వాస్తవికత నుండి ఏమాత్రం దూరం కానపుడే సమాజ హృదయంలో పరిణామం తేగలుగుతారు. భౌతికంగా మనిషి నిర్మాణంలో రక్తమాంసాలు, ఎముకలు కండరాలు ఎలాంటివో వాస్తవికత, సజీవత, భావవ్యంజత, మానవ పరిశీలన మానసిక శాస్త్ర అధ్యయనం వంటివి ప్రతి పాత్ర నిర్మాణంలో రచయితలకు ఆధారం కావాలి.

కొందరు విమర్శకులు సాహిత్యం రచయిత మానసిక జీవితానికి ప్రతిబింబం అంటారు. ఒకే ఘటన అందరి మీదా ఒకే ప్రభావం కల్గించకపోవచ్చు. దృష్టి కోణం మనఃప్రవృత్తిని బట్టి వేరుగా ఉంటుంది. అయితే రచయిత ఏ దృక్కోణాన్ని ఇస్తాడో పాఠకుడు అదే అనుసరిస్తాడు. ఇదే రచయిత సాఫల్యం. రచయితలోని ఉదాత్త సంస్కార స్థాయిని చేరుకోవాలని ప్రతి పాఠకుడు వాంఛిస్తాడు.

అన్య వస్తువులలాగే కళ కూడా అవసరమైన ఒక సాధనంగా ఉపయోగిస్తున్నారని చెప్పడానికి సందేహించను. జీవితావసర సమస్యల్ని పరిష్కరించలేని మానసిక ఆధ్యాత్మికానందాలు నిరుపయోగం. ఆనందం స్వభావ సిద్ధంగా ఉపయోగకరమైన వస్తువు. ఆకాశంలో లాలిమ నిస్సందేహంగా సుందర దృశ్యం. కాని ఆషాఢంలో మాత్రం నల్లని మబ్బులు కనిపిస్తేనే ఆనందం. ప్రకృతితో మన జీవన స్వరాలను మేళవిస్తేనే మనకు భావావేశంతో కూడిన ఆనందం కలుగుతుంది. ఆనందం కల్గించే భావాలు, అనుభూతులు అన్నీ వృద్ధి వికాసాలకు తోడ్పడేవే. కళాకారుడు సౌందర్యాన్ని సృష్టించి సామాన్య పరిస్థితిని వికాసోన్ముఖంగా చేస్తాడు. ఇతర వస్తువుల్లాగా సౌందర్యానికి ఆకారం లేదు.

రోగి తన రోగాన్ని అసహ్యించుకున్నట్టు మానసికంగా నైతికంగా విలువలు కోల్పోయిన మనిషి కూడా తన స్థితిని అసహ్యించుకుంటాడు. వైద్యుడి పాత్రని రచయిత వహించాలి. సౌందర్య భావన లేకపోవడం వల్లనే ఈ బలహీనతలు. సౌందర్యం కోసం ప్రతి హృదయం అన్వేషిస్తుంది. సాహిత్యం కళాకారుడి భావాత్మకమైన సామ్యతని వ్యక్తీకరిస్తుంది. అది సౌందర్యాన్ని సృష్టిస్తుంది విశ్వాసాన్ని, సత్యాన్ని, సానుభూతిని, న్యాయ ప్రియత్వాన్ని, మమతను, మానవత్వాన్ని నింపుతుంది. ఇవి ఉన్నచోటే దృఢత్వం, నిజమైన జీవితం. లేనిచోట శత్రుత్వం, ద్వేషం, ఈర్ష్య, మృత్యువు. అనారోగ్యంలో అపథ్యం చేసినట్టు సాహిత్యం జీవితాన్ని స్వాభావికంగా స్వతంత్ర్యంగా చేస్తుంది హృదయానికి సంస్కారం కల్గిస్తుంది. దాని ఉద్దేశ్యమమూ అదే.

సాహిత్యకారుడు లేదా కళాకారుడు స్వభావసిద్ధంగా ప్రగతిశీలిగానే ఉంటాడు. ఒకవేళ ఈ స్వభావం లేకపోతే అసలు సాహిత్యకారుడు కానే కాదు. తన కల్పన ద్వారా వ్యక్తిలో గాని సమాజంలో గాని ముఖ స్వచ్ఛందతలను ఊహించలేనివాడు, వర్తమాన సామాజిక పరిస్థితులకు దూరంగా ఉండిపోతాడు.

బానిసత్వం నుండి పేదరికం నుండి మన జాతి విముక్తి పొందాలనే వేదన సంఘర్షణ ఎంత వ్యాకులతతో అనుభవిస్తాడో ఆ సాహిత్యకారుడి రచనలో అంత వాస్తవికత వెలుగు నింపుకుంటుంది. అనుభూతుల్ని క్రమపద్ధతిలో వ్యక్తీకరించే విధానమే కళాకౌశలత్వ రహస్యం. ఈ అంశం ఇంతలా చెప్పాల్సిన అవసరం ఎందుకొచ్చిందంటే ఔన్నత్యానికి ప్రగతికి ఒకే అర్థాన్ని అందరూ చెప్పడం లేదు. కొంతమంది ఒక పద్ధతి ఔన్నత్యాన్ని సాధనం అనుకుంటే మరికొంతమంది తద్విరుద్ధంగా భావిస్తారు. ప్రతివారూ తన మనోభావాలు వ్యక్తీకరించడమే కళ అనుకుంటారు. అయితే దాని ప్రభావం వ్యక్తి మీద, సమాజం మీద ఎలా ఉంటుందో అని గమనించే స్థితి ఉండదు. మనల్ని నిర్జీవ జఢత్వ స్థితిలో నిర్బంధించిన అంతర్బాహ్య కారణాలని దూరం చేసి కర్తవ్యాన్ని కర్మని ఇవ్వగలదాన్నుంచి ఔన్నత్యం లభిస్తుంది.

క్షణికమైన ఇతివృత్తంతో నైరాశ్యంలో ముంచే రచనలు, ప్రస్తుతం అనేక మాసపత్రికలలో పడే ప్రేమ కథలు మనలో ఆదర్శంగాని, ఆవేశంగాని సృష్టించవు. ఇక్బాల్ అంటాడు "నువ్వు జీవితంలో రహస్యాల్ని తెలుసుకోవాలంటే సంఘర్షణలలో తప్ప మరెక్కడా లభించవు. "సముద్రంలో విశ్రాంతి తీసుకోవడం నది సిగ్గుపడాల్సిన విషయం. ఆనందం కోసం నేను గూడులాంటి ఇంట్లో బతకలేను."

అహంకారం, వ్యక్తిగత దృక్కోణమే సర్వస్వం అనుకోవడం జడత్వంలోకి, పతనంలోకి విసిరేస్తుంది. అలాంటి కళ వ్యక్తిగతంగా గాని సాముదాయకంగా గాని నిరుపయోగం.

అన్య వస్తువులలాగే కళ కూడా అవసరమైన ఒక సాధనంగా ఉపయోగిస్తున్నారని చెప్పడానికి సందేహించను. జీవితావసర సమస్యల్ని పరిష్కరించలేని మానసిక ఆధ్యాత్మికానందాలు నిరుపయోగం. ఆనందం స్వభావ సిద్ధంగా ఉపయోగకరమైన వస్తువు. ఆకాశంలో లాలిమ నిస్సందేహంగా సుందర దృశ్యం. కాని ఆషాఢంలో మాత్రం నల్లని మబ్బులు కనిపిస్తేనే ఆనందం. ప్రకృతితో మన జీవన స్వరాలను మేళవిస్తేనే మనకు భావావేశంతో కూడిన ఆనందం కలుగుతుంది. ఆనందం కల్గించే భావాలు, అనుభూతులు అన్నీ వృద్ధి వికాసాలకు తోడ్పడేవే. కళాకారుడు సౌందర్యాన్ని సృష్టించి సామాన్య పరిస్థితిని వికాసోన్ముఖంగా చేస్తాడు. ఇతర వస్తువుల్లాగా సౌందర్యానికి ఆకారం లేదు. ఆ ఆనందమూ అందరికీ ఒకే పాళ్ళలో లభించదు.

సంఘజీవనం ఆరంభించినప్పటి నుండి బంధుత్వం, సమత, సభ్యత, ప్రేమ, అనేవి ఆదర్శవాదులకు తీపి కలలుగానే మిగిలిపోయాయి. ధార్మికవాదులంతా నైతిక ఆధ్యాత్మిక పరిమితులతో ఆ కలలను యధార్థాలు చేయాలని శతధా యత్నించారు. బుద్ధుడు, క్రీస్తు, మహ్మద్‌లాంటివారు నీతి పునాదుల మీద సమతా నిలయాన్ని నిర్మించాలని కృషి చేశారు. ఏం లాభం? ప్రస్తుత సమాజంలో ఉన్నన్ని కులమత భేదాలు బహుశా ఏ

**తన చుట్టూ ప్రత్యేక ప్రపంచాన్ని సృష్టించుకుని అదే సర్వస్వం అనుకునే జమిందార్లను ఆశ్రయించే జీవితాలనే చిత్రిస్తూ ఆందోళనలకు, విప్లవాలకు దూరంగా ఉండేది అసలు సాహిత్యమే కాదు. వ్యక్తివాదానికి పరిమితమై పోకుండా సామాజిక దృక్పథం పెంపొందించుకున్న సాహిత్యకారుడు వ్యక్తిని, సంఘాన్ని వేరుగా కాక, వ్యక్తి కూడా సంఘంలో ఒక అంశ మాత్రమే అని గ్రహిస్తారు. అప్పుడు సంఘం మీద వ్యక్తి అధికారం లేదా వ్యక్తి స్వార్థం కోసం పనిముట్టుగా ఉండాలన్న వాదాల్ని, సంఘానికి వ్యక్తికి శతృత్వం ఉందన్న అభిప్రాయాన్ని తిరస్కరిస్తాడు. సమాజ నిర్మాణంతో బాటే వ్యక్తి ఔన్నత్యం, సమాజం నుండి వేరయితే వ్యక్తి విలువ శూన్యం అని గ్రహించగలుగుతాడు. రచయితా తత్వవేత్తా కూడా యింతకన్నా భిన్నం కాదు.**

కాలంలోను ఉండి ఉండవు. ఇప్పుడు కూడా నీతి ధర్మాల అంచులు పట్టుకుని సమతోన్నత లక్ష్యాలను చేరాలంటే వైఫల్యం తప్పదు. అయితే ఈ కలలు "ఉత్తేజిత మస్తిష్కాల సృష్టి" అనుకుని విస్మరిస్తామా? అదే జరిగితే మానసిక ఔన్నత్యానికి పూర్ణత్వానికి ఒక్క ఆదర్శం కూడా మిగలదు. అలా అదర్శం లేకపోవడం కన్నా మానవుడి ఉనికే లేకుండా పోవడం మేలు.

ఏ ఆదర్శాన్ని మనం సభ్యతతో బాటు నిలబెట్టామో, దేనికోసం మానవుడు అనేక త్యాగాలు చేశాడో, ఏ పరిణామం కోసం ధర్మాల సృష్టి జరిగిందో, ఏ ఆదర్శం కోసం మానవ సమాజ చరిత్ర నిల్చిందో దాన్ని శాశ్వత సత్యంగా భావించి ఔన్నత్య సోపానాల మీద అడుగు పెట్టాలి. సమత కేవలం నూతిక బంధనాల్ని ఆశ్రయించకుండా ప్రత్యేక రూపం ధరించినప్పుడు మనం నైతన సంఘటనకు సర్వాంగాల్ని సృష్టించి పరిపుష్టం చేస్తాం. ఈ ఆదర్శాన్నే సాహిత్యం మన ఎదుట నిలబెట్టాలి.

సౌందర్యం అర్థాన్ని మార్చాల్సి ఉంది. ఇప్పటి వరకు అది ధనం. విలాసాల పరిధుల్లోనే ఉంది. కళాకారులు బతుకు తెరువు కోసం ధనవంతుల్ని ఆశ్రయించాల్సి వస్తోంది. ఆ శ్రీమంతుల గొప్పతనాలే రచనలకు మూల వస్తువు. వాళ్ళ సుఖదుఃఖాలు, ఆశ, నిరాశలు వీటిని చిత్రించడమే కళ ఉద్దేశ్యమై పోయింది. ఆ దృష్టి ఎప్పుడూ అంతఃపురాలు, బంగళాల వైపే పరుగెడు తుంది. శిథిలాలు గుడిసెలు ఆ కళ్ళకి కనిపించవు. ఆ గుడిసెలు శిథిలాలు మానవత్వ పరిధుల అంతర్భాగం కాదని వారి ఉద్దేశ్యం. అక్కడక్కడ వాటిని వర్ణించినా హాస్యం కోసమే. పల్లెటూరి వారి వేషభాషలు హాస్యం సృష్టికి వస్తువనుకుంటారు. నిజా నికి వారి హృదయాలు, ఆశలు, ఆవేశాలు గ్రహించడమే కళ.

భక్తి వైరాగ్యంలో, ఆధ్యాత్మిక భావాలో, జీవితపు క్షణిక ఆలోచనలలో కళకి కల్పనలుగా తీసుకొనే కళాకారుడి చరమోద్దేశం కూడా ఆ పరిధుల్ని దాటదు. జీవిత సంఘర్షణలో సౌందర్యోత్కర్ష చూసే శక్తి వారికుండదు. వాస్తవంలోని సౌందర్యం ఉనికిని వారు అంగీకరించరు. యవ్వనభారంతో ఉరకలేస్తున్న విలాసినే అతడికి సౌందర్యం. గట్టు మీద పిల్లల్ని నిద్రపుచ్చి పొలంలో చెమటోడ్చే స్త్రీలోని ఉదాత్త సౌందర్యాన్ని చూడలేడు. చిందరవందరైన కేశాలు, పాలిపోయిన అధరం, వాడిన కపోలాలలో సౌందర్యం చూడలేకపోవడం దృష్టి లోపం. దృష్టిలో ఉన్నత భావం ఉంటే సిరితో మిడిసి మెరుస్తున్న పెదవులు, చెక్కిళ్ళ వెనక గర్వాన్ని, క్షణికత్వాన్ని గమనించగల్గుతారు. వాడిపోయిన పెదవుల్లో చెక్కిళ్ళ మీద ప్రవహించే కన్నీటి ప్రవాహంలో త్యాగం, భక్తి, శ్రద్ధ, ఓర్పులను చూడగల్గుతారు. ఇందులో వారనుకొనే "అందం, సౌకుమార్యం" ఉండవు.

మన కళలు యవ్వనపు ఉన్మత్త దశలో మునిగి తేల్తున్నాయి. యవ్వనం గుండెల మీద తల ఉంచి కవిత్వం చెప్పడం, శృంగార నాయిక అస్వాభావిక భావావేశాన్ని చిత్రిస్తూ రోదించడం, ఆ నాయిక రూపగర్వాన్ని మత్తెక్కిన కన్నులతో చూపడం వల్ల కళ ఉద్దేశ్యం నెరవేరదు. యవ్వనపు ఆవేశం ఆదర్శాలకు కష్టాల్ని ఎదుర్కొనే సాహసానికి, ఆత్మ త్యాగానికి మాత్రమే ప్రతిబింబం కావాలి.

"ప్రవాహ వేగాన్ని లక్ష్యపెట్టని తరంగాల లాగే నా జీవితమూను. ఈ అపార సాగరంలో నేను మాత్రం గట్టును వెదుక్కోదం లేదు" అంటాడు ఇక్బాల్. సౌందర్య దృష్టికి ఉన్నత లక్ష్యాలున్నప్పుడు సృష్టి మొత్తాన్ని ఆ దృష్టి పరిధిలోకి యిముడ్చుకోగల్గినప్పుడు, మనకు కూడా ఇక్బాల్ వంటి స్థితి కలుగుతుంది. చెడుని సహించలేనినాడే దాని నిర్మూలనకు నడుం బిగిస్తాం. మానవ జీవితాలు అత్యాచారాలు, బానిసత్వం సహించలేనపుడు కేవలం అది మాత్రం కాయితాల మీద రాసుకుని సంతృప్తిపడం, సౌందర్యం, నీతి, ఆత్మగౌరవం మానవత్వాల్ని సృష్టించి తీరాలంటాం.

విలాస మందిరాల్ని సృష్టించడం మనోరంజక సామగ్రిని పోగుచేయడం సాహిత్యకారుడి లక్ష్యం కాదు. సాహిత్య స్థితిగతుల్ని ఆ దుర్గతికి దిగజార్చకూడదు. దేశభక్తి, రాజనీతిని అనుసరించడంతో బాటు, సాహిత్యం వాటి ముందు నిల్చి వాస్తవికతా కరదీపిక చేపట్టిన మార్గదర్శి కూడా కావాలి.

తన చుట్టూ ప్రత్యేక ప్రపంచాన్ని సృష్టించుకుని అదే సర్వస్వం అనుకునే జమిందార్లను ఆశ్రయించే జీవితాలనే చిత్రిస్తూ ఆందోళనలకు, విప్లవాలకు దూరంగా ఉండేది అసలు సాహిత్యమే కాదు. వ్యక్తివాదానికి పరిమితమై పోకుండా సామాజిక దృక్పథం పెంపొందించుకున్న సాహిత్యకారుడు వ్యక్తిని, సంఘాన్ని వేరుగా కాక, వ్యక్తి కూడా సంఘంలో ఒక అంశ మాత్రమే అని గ్రహిస్తారు.

తన చుట్టూ ప్రత్యేక ప్రపంచాన్ని సృష్టించుకుని అదే సర్వస్వం అనుకునే జమిందార్లను ఆశ్రయించే జీవితాలనే చిత్రిస్తూ ఆందోళనలకు, విప్లవాలకు దూరంగా ఉండేది అసలు సాహిత్యమే కాదు. వ్యక్తివాదానికి పరిమితమై పోకుండా సామాజిక దృక్పథం పెంపొందించుకున్న సాహిత్యకారుడు వ్యక్తిని, సంఘాన్ని వేరుగా కాక, వ్యక్తి కూడా సంఘంలో ఒక అంశ మాత్రమే అని గ్రహిస్తారు. అప్పుడు సంఘం మీద వ్యక్తి అధికారం లేదా వ్యక్తి స్వార్థం కోసం పనిముట్టుగా ఉండాలన్న వాదాల్ని, సంఘానికి వ్యక్తికి శతృత్వం ఉందన్న అభిప్రాయాన్ని తిరస్కరిస్తాడు. సమాజ నిర్మాణంతో బాటే వ్యక్తి ఔన్నత్యం, సమాజం నుండి వేరయితే వ్యక్తి విలువ శూన్యం అని గ్రహించగలుగుతాడు. రచయితా తత్వవేత్తా కూడా యింతకన్నా భిన్నం కాదు. వారికీ ఆ బాధ్యత ఉంది.

అంతర్జాతీయ సాహిత్య సభల కార్యక్రమాలు చూస్తే శాస్త్రీయ సామాజిక ఇతిహాసిక విజ్ఞాన రంగాలలో అన్ని అంశాలపై సుదీర్ఘంగా, లోతుగా పరిశీలిస్తున్నారు. వాటితో పోలిస్తే మన అజ్ఞానానికి సిగ్గుపడాలి. సాహిత్య రచన ఆశువుగా చెప్పగల స్తోమతకు వేగం ఉంటే చాలనుకుంటాం. కాని ఈ భావమే మన సాహితీ సంకోచ, వినాశాలకు హేతువు. సాహిత్య ప్రమాణాలను ఉన్నతం చేసి, సంఘం మీద అధికారం సాధించి, సమాజంలోని ప్రతి భాగాన్ని సునిశితంగా వ్యాఖ్యానించాలి. అయితే ఇందులో అన్య భాషా సాహిత్యాన్ని గుడ్డిగా అనుకరించడం కాదు. స్వశక్తి ఉంటేనే ఉన్నత లక్ష్యాలు సాధ్యం.

ఆంతర్యాలు సౌందర్య ప్రేమ ప్రకాశితమైతే సేవా ఆదర్శాలు దారులుగా నిలబడితే ప్రతి క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొని జయించవచ్చు. కాని ధనాన్ని, విలాసాన్ని ఆరాధించే వారికి సాహిత్య మందిరంలో స్థానం లేదు. సేవే జీవితాదర్శంగా హృదయంలో కష్టాల అనుభూతుల్ని పొదుపుకున్నవారూ ప్రేమావేశం గల అరాధకులు ఉదాత్త సాహిత్యాన్ని నిర్మించగలరు. చిత్తశుద్ధితోసేవిస్తే కీర్తిప్రతిష్టలు పాదాల్ని చుంబిస్తాయి. ఇక గౌరవ ప్రతిష్టల కోసం బాధపడ్డం దేనికి? కీర్తి రాకపోతే నిరాశ పడ్డం దేనికి? సేవలో కలిగే ఆత్మానందమే అమూల్యమైన బహుమతి – ధనవంతుల జాబితాలో చేరాలన్న కోరిక ఎందుకు బాధించాలి? సంఘాన్నే పతాకంగా ధరించి సాగిపోయే సిపాయిలం. సామాన్య జీవితంలో ఉన్నత లక్ష్యాలను పొందాలన్నది మన ఆదర్శం. నిజమైన కళాకారుడు స్వార్థపూరిత జీవితాన్ని గడపడానికి యిష్టపడడు. కృత్రిమత్వాన్ని అసహ్యించుకుంటాడు. అప్పుడే ప్రతి కళాకారుడూ ఇక్బాల్‌గా మారుతాడు.

మన ప్రగతిశీల రచయితల సంఘం కొన్ని విశిష్ట సిద్ధాంతాల ప్రాతిపదికగా నూతన పద్ధతులను ఆచరణలోకి తెచ్చింది. సాహిత్యాన్ని కృత్రిమంగా విలాసంగా చేయడం కోసం కాదు. అందంగా అర్థవంతంగా చేయడానికి. ఈ ఆదర్శంతో భాష నిరాడంబరంగా మారుతుంది.

సామాన్య ప్రజల మీద సానుభూతి కలవారు సరళ శైలిలోనే రచిస్తారు. దేశంలో ఉదాత్తమైన ఉద్దేశాలు గల సాహిత్యాన్ని సృజించి వికసింప చేయడం మా ధ్యేయం. నియమపూర్వకమైన సాహిత్య చర్చలు జరిపి నిగూఢ విషయాలపై ఉపన్యాసాలు ఇప్పించి, వాళ్ళ విమర్శలతో సాహిత్యమంటే ఏమిటో తెలియజెప్పాలి. అప్పుడే సాహిత్యంలో నూతన యుగారంభానికి అనుకూల వాతావరణం ఏర్పడుతుంది.

దేశంలోని ప్రతి భాషలోను మన సందేశం అందించేందుకు అన్ని చోట్ల మనం మన సంస్థని నెలకొల్పాలి. దేశంలోని సాహిత్య సేవకుల హృదయంలో ఐకమత్య భావనలు నిండుగా ఉన్నాయి. ప్రతి భాషలోనూ ఈ ఆదర్శం నాటి వాటి లక్ష్యాల సాఫల్యానికి కృషి చేయడం మన కర్తవ్యం.

ప్రస్తుతం సాహిత్యకారుల్లో సృజనాత్మక క్రియా శక్తి లోపించింది. ఈ అంశంపై దృష్టి సారించకుండా ఉండలేము. ఇప్పటి వరకు సాహిత్యానికి ఉన్న ఆదర్శాలకు సృజన అవసరం లేకపోయింది. కేవలం మనోరంజనానికి పరిమితమై జోల పాడి నిద్రపుచ్చి కన్నీరు కార్పించి దానితో గుండె తేలిక పర్చడమే పనిగా సాహిత్యం ఉన్నంత వరకు క్రియాశక్తితో అవసరం లేదు. గత సాహితి ఆవేశం ఉన్మాదం లాంటిది ఫలితం మాత్రం ఇంకొందరిది. కాని మన సాహిత్య ఉద్దేశ్యం వేరు. మన గీటురాయి మీద సాహిత్యానికి మెరుగు పెట్టాలి.

ఉన్నత భావాలు, స్వతంత్ర ఆలోచనలు, సౌందర్యారాధన, ఆత్మవికాసం జీవిత యధార్థ ఘటనలు అందులో ఉంటాయి. అవే మనలో ఉత్తేజాన్ని సంఘర్షణల్ని, ఆదర్శాల్ని సృష్టిస్తాయి. వాటిని నిద్రపుచ్చడానికి ప్రయత్నించకూడదు.

అధిక నిద్ర మృత్యువుతో సమానం కాదా?

**('సాహిత్యము-ఉద్దేశము' గ్రంథం నుంచి)**

# గంటలు మోగించండి!



## సుబ్రహ్మణ్య భారతి

**(11.12.1882 - 11.09.1921)**

తమిళ సాహిత్యంలో ఆధునికతకు ఆద్యుడు. సంస్కరణవాది, స్వాతంత్ర్య పిపాసి

ఓ వీరుడా! ధైర్యంగా నిలబడు.
భారతీయుడనని గర్వపడు.

సగర్వంగా 'నేను భారతీయుణ్ణి; ప్రతి భారతీయుడూ నా సోదరుడే" అని చెప్పు.

భారతదేశంలోని ప్రజలందరూ ఏకోదరులు. మనలో జాతిభేదం, మతభేదం, కులభేదం, భాషాభేదం- ఇటువంటివేమీ లేవు. ఇదే ఈ కాలానికి వర్తించే లక్ష్యం.

నిర్మల జ్ఞానాన్ని నిర్లక్ష్యం చేయకు.
ఎన్నడూ కృషిని మానకు.
నీవేమి చేసినా, అది 'మంచి'గానే పర్యవసించాలి.
భయం వల్ల విరోధం పెరుగుతోంది.
విరోధం వల్ల యుద్ధం ఏర్పడుతోంది.

మానవజాతి నశిస్తోంది, నిష్కారణంగా నష్టం వాటిల్లుతోంది నలుగురికీ.

'తనలో ప్రపంచాన్నీ, ప్రపంచంలో తననూ ఎవడు చూడగలుగుతున్నాడో, అతడే కళ్ళున్నవాడు.' మన పూర్వుల లక్ష్యం ఇదే.

'బీదా బిక్కీ బాధపడితే, మన కేం?' అనుకునే వారు పరమమూఢులు.

దుఃఖం ప్రకృతి సహజమనే మాటను మరచిపోదాము. ఆనందం ప్రసాదింపుమని తల్లిని ప్రార్థిద్దాం. అన్నిటినీ ఆమె ప్రసాదిస్తుంది.

నమ్మిన వారు చెడరు
నాలుగు వేదముల తీర్పిది.
తల్లిని శరణు వేడిన
వరము పొందుట తథ్యము.

ఆ మహాశక్తిని దర్శించాను
వెన్నెల వెలుగులో,
ఆమె శరణుజొచ్చినాను,
ఇంద్రియముల నిర్జించితిని.
మమతను హతమార్చితిని.
అందుల కాతల్లి
ఫలము నపేక్షించక కృషి చేయుమన్నది.
భక్తి భరితహృదయుడవై బ్రతుకు మన్నది.
నా దుఃఖమును నశింపజేసినది,
నా కష్టమును తొలగించినది.

ఆధారము శక్తియని
ప్రాజదువులను చున్నవి.
నీదేని ఒక పని చేయుదము
ఏదైనా ఆమె చేతయే.

ప్రాణభయం, వ్యాధిభయం, భక్తి లోపం, గర్వం, మమత, సోమరితనం నాలో ఉన్నాయి. వీటిని రూపుమాపాలి.

ఎప్పుడూ వ్యాధి భయంతో బాధపడే ఓ మనసా! పిరికిపందవు నీవు.

తమ్ముడూ మనస్సే లోకము,
పద, పద, పైపైకి,
నీకు రెక్కలు కలుగుగాక, ఎగిరి వెళ్ళు.
ఎగురు, ఎగురు, పైపైకి.

ఈ ప్రపంచపు ప్రథమ ధర్మం మార్పు. మార్పు అంటే అన్నిటినీ ఒక్కసారిగా మార్చివైచుట- అని కాదు అర్థం. అర్థవంతములైన మంచి విషయాలను గ్రహించి, లాభరహితములైన వాటిని మార్చాలి.

క్రైస్తవులైనా, పార్శీలయినా, మహమ్మదీయులైనా, ఎక్కడి నుంచి వచ్చి యే దైవాన్ని పూజించినా, భారత దేశంలో పుట్టి, పెరిగి ఈ దేశాన్నే నమ్ముకున్న వారినందరినీ భారతీయులనే భావించాలి. ఇది ఏక జాతి; విభజింపరానిది; నాశనం లేనిది.

మోగించండి గుడి గంటలు
నవ భారతం అవతరించింది.
ఆవె కొత్త పేరం-
పూర్వమున్న పేరే- భారతవర్షం.
మోగించండి గుడి గంటలు.
విందులు చేయండి; జరపండి వేడుకలు.


చిత్తమనే ఈ జలధిని జయిస్తాను. ఎన్నో రోజులుగా ఇందుకోసం ప్రయత్నిస్తున్నాను. చిత్తజలధిని జయించడానికి నేను పడేపాట్లు ఆ దేవునికే ఎరుక!

ఏ ఒక్కని కడుపు మాడినా
ఈ లోకాన్ని నశింపజేద్దాము.

అందరిదీ ఒకే కులము
అందరిదీ ఒకే జాతి
అందరూ భారతీయులు
అందరూ ఈ దేశపు రాజులు.
లేదనే బాధను లోకంలో
లేకుండా చేస్తాను.


తల్లి కొత్త విజ్ఞానం సంతరించు కుంటోంది; కళలూ, శాస్త్రాలూ అభ్యసిస్తున్నది.

మోగించండి గుడి గంటలు, మోగించండి.

అసత్యం లేకుంటే దృష్టి సవ్యంగా ఉంటుంది.

శ్రద్ధగా విను,

అసత్యం లేనప్పుడే సూటిగా చూడవచ్చు.

భయం నశించినప్పుడే సూటిగా చూడవచ్చు. శ్రద్ధగా విను,

అసత్యం లేనప్పుడే భయం నశిస్తుంది.

భయం నశించినప్పుడే అసత్యం నశిస్తుంది.

యుగయుగాలుగా గాలినీ కడలినీ మట్టినీ ఒకే ఆకృతిలో ఉంచి కాపాడుచున్నావు. పరాశక్తి! నా సాధన సామగ్రిలో సైతమూ నెలకొని నన్ను కూడా అటులనే కాపాడవలెను.

పరాశక్తి! ఈ లోకపు ఆత్మవు నీవు.

నన్ను జయించు శక్తిని నాకు ప్రసాదింపుము.

పరాశక్తి ! విరామ రహితంగా కవితలల్లునట్లు నన్ననుగ్రహింపవా? తల్లీ! ఋణదాతలు నన్ను పీడించుకు తింటుంటేనూ, బియ్యానికనీ పప్పుకనీ నేను ఆలోచిస్తూ కూర్చుంటేనూ- నిన్నెలా నేను కీర్తించగలను?

నా కుటుంబ భారమంతా నీకు సంబంధించింది. నిన్ను కీర్తించే భారం నాకు సంబంధించినది. తల్లీ! సమ్మతమేనా నీకిది!

ఇతరులకు నేను హాని తలపెట్టకుండా ఉండేటట్లు నీవు నన్ననుగ్రహింపవలెను. దుష్టులను నీవు శిక్షించుకో. అందులో నాకు సంతోషం కనిపించదు. ఇతరులకు నాకు తలపెట్టేహాని నుండి నన్ను కాపాడుము. నేను నిన్నే శరణు వేడినాను.

చిత్తమనే ఈ జలధిని జయిస్తాను. ఎన్నో రోజులుగా ఇందుకోసం ప్రయత్నిస్తున్నాను. చిత్తజలధిని జయించడానికి నేను పడేపాట్లు ఆ దేవునికే ఎరుక!

ఏ ఒక్కని కడుపు మాడినా
ఈ లోకాన్ని నశింపజేద్దాము.

అందరిదీ ఒకే కులము
అందరిదీ ఒకే జాతి
అందరూ భారతీయులు
అందరూ ఈ దేశపు రాజులు.
లేదనే బాధను లోకంలో
లేకుండా చేస్తాను.
వృషభంలా గంభీరంగా నడు.
అనుకొన్న ముగింపు కావలె
మంచితలంపులె కావలె
దిటవైన గుండె కావలె
నిర్మలజ్ఞానము కావలె.
ఓ దేవ దేవ!

భూమి మీది ప్రజలు, పక్షులు, మృగాలు, పురుగులు, చెట్టుచేమలు- సర్వమూ- నా చేతలవల్ల బాధలు మరచి సంతోషంగా, హాయిగా ఉండేటట్లు అనుగ్రహించవా?

మహిళను నీచంగా చూచే
మౌఢ్యాన్ని కాల్చివేద్దాము.

భారతదేశము ప్రాచీన మహాదేశము;
నీవు దాని సంతతివి; విస్మరింపకు దీనిని.

వేదము వెలసిన దేశమిది- మేటి
వీరులు పుట్టిన దేశమిది.
అఖండ హిందూస్థాన మిది- దైవ
మనుచు పూజింపుము దీనిని పాపా.

జాతులు లేవే పాపా- కులమున
హెచ్చు తగ్గులు ఎంచుట పాపము.
నీతీ న్యాయము, విద్యా బుద్ధులు
గలవారే జాత్యధికులు.

పురుషుడైనా స్త్రీ యైనా మారు గొంతుతో పాడకూడదు; బాగా గొంతెత్తి పాడితేనే వినడానికి హాయిగా ఉంటుంది.

నీకు మరణ వాంఛ ఉన్నదా, అయితే ఆత్మప్రశంస చేసుకో.

వ్రాయుము,
పరాశక్తిని కీర్తిస్తూ వ్రాయుము.
భారతి!
దీన్ని మించిన పరిశ్రమ
ఈ లోకంలో లేదు మరొకటి.

ప్రళయతాండవం

# ఏప్రిల్ నెల పురస్కారాలు



## కూలిపోయిన సున్నపుబట్టీ

కథకు........రూ.700/-

రచయిత : ఆవుల వెంకటేశులు

## ఉత్తరం



కవితకు.......రూ.500/-

రచయిత : బొగ్గరపు రాధాకృష్ణమూర్తి

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

బ్రద్దలైన బ్రహ్మాండములో బహుభంగుల ఉరుములు
తాళము వేయగ
రోదసిలో రుధిరతృష్ణ రూపెత్తిన భూతవ్రాతము పాడగ
పాటలోని భావం నీ అందెల రవళిని లీనము కాగా
మైమరచి ఆడే కాళి, చాముండి, కంకాళి
అమ్మా, అమ్మా,
చెదరిపోయిన పంచభూతాలు ఏకమై, ఆవల
అవి కూడా శక్తిపథమున లీనము కాగా- అక్కడ
కన్నులు చెదిరే కాంతితో, మనసుకు అందని వేగంతో
చేసెదవు తుదలేని తాండవం, క్రక్కెదవు నిప్పులు
అమ్మా, అమ్మా,
నిను కన్గొని ముగ్ధుడ నైతినమ్మా.
పాడువడిన యెడారిరూపు మరింత మాసిపోగా-
సంచలనం, సత్త్వసంపన్నత గతి తప్పగా
విధిపిశాచం 'ఓహోహో' అంటూ సందడి చేయగ
శివ మెక్కినదానవై చేసెదవు ప్రళయతాండవం
అమ్మా, అమ్మా
నిను కన్గొని ముగ్ధుడ నైతినమ్మా,
శక్తిభూతాలు కేశాకేశి పోరాడగా
చట్టచ్ఛడ చడచట్టని తాళం వినబడగా, అప్పుడు
ఎటు చూచిన కనిపించు- త్వదీయ
వీక్షణాగ్నికి నుసియైపోయిన వస్తు సముదాయం
అమ్మా, అమ్మా
నిను కన్గొని ముగ్ధుడ నైతినమ్మా.
లోకత్రయమూ కాలంలా నిర్మూలము కాగా
ప్రతిభాసించునపుడు ఈశ్వరుని మౌనజ్యోతి ఒక్కటే- ఆ
పరమశివుని చూచినంతనె తొలగును నీ క్రోధాగ్నియు
అప్పుడతనితో కలసి చేసెదవు ఆనంద తాండవం
అమ్మా, అమ్మా
నిను కన్గొని ముగ్ధుడ నైతినమ్మా.
వెడలిరండు దిశాష్టకమూ
మరలిరండు కళాసంపదతో
కాకి రెక్కలలో నందలాలా- నీ
నల్లనిరూపు పొడసూపు నందలాలా,
చెట్టు చేమలలో నందలాలా- నీ
శ్యామల వర్ణము కనిపించు నందలాలా,

వినవచ్చే ధ్వనులన్నిట నందలాలా- నీ
గానమె వినిపించు నందలాలా,
నిప్పున వేలుంచిన నందలాలా- నీ
స్పర్శాసౌఖ్యము తెలిసెను నందలాలా,

కల్లలాడకు పాపా- ఎన్నడూ
సాడీలు చెప్పకు పాపా,
దేవుడే మనల కాపాడు పాపా- ఎట్టి
కీడూ వాటిల్లదు పాపా.

ప్రేమింపుము జీవకోటిని
విశ్వసింపుము భగవంతుని
తప్పక కావలె గుండెదిటవు.
జీవన విధాన మిదియే పాపా.

**(అనువాదం: చల్లా రాధాకృష్ణ శర్మ)**



# ఇది ముందుమాట కాదు

## భగత్‌సింగ్

(27.09.1907 - 23.03.1931)

యోగ్యుడయిన మిత్రుడు లాలారామ్ సరణ్‌దాస్ తాను రాసిన ఆంగ్ల కావ్యం 'డ్రీమ్‌ల్యాండ్'ని నాకిచ్చి 'ముందుమాట' రాయమని కోరారు. నేను కవిని కాను, సాహిత్యవేత్తని కాను, పత్రికా రచయితనుకాను, సాహిత్య విమర్శకుణ్ణి అంతకన్నా కాను. అందువల్ల మిత్రుని అభ్యర్థనలోని ఔచిత్యాన్ని అర్థం చేసుకోలేకపోతున్నాను. నేనున్న భౌతిక పరిస్థితుల్లో (జైలులో వుంటూ) రచయితతో ఈ విషయం గురించి చర్చించటం సాధ్యంకాని పని. ఇహ నాముందు మిగిలినది మిత్రుని అభీష్టాన్ని మన్నించి 'ముందుమాట' రాయటం.

ముందే చెప్పినట్టుగా నేను కవినిగాను గనక. ఆ దృష్టికోణం నుంచి ఈ కావ్యాన్ని చర్చించటం లేదు. ఛందస్సు గురించిగానీ, అంత్యప్రాస గురించిగానీ నాకు బొత్తిగా పరిజ్ఞానం లేదు. అందువల్ల అంత్యప్రాసలకి సంబంధించిన ప్రమాణాలను దృష్టిలో వుంచుకొని ఈ కావ్యాన్ని పరిశీలించటం సరైంది అవునో, కాదో నాకు తెలీదు. సాహిత్యకారుణ్ని కాను గనక, జాతీయసాహిత్యంలో ఈ కావ్యానికి సముచిత స్థానం కల్పించే దృష్టితో సైతం దీన్ని గురించి నేను చర్చించటం లేదు.

నేనొక రాజకీయ కార్యకర్తని గనక ఎక్కువలో ఎక్కువ ఆ దృష్టికోణం నించే దీన్ని గురించి మాట్లాడగలను. అయితే ఇక్కడ కూడా ఒక ఇబ్బంది నాకు ఎదురవుతోంది. అదే నా కలాన్ని ముందుకి సాగనీకుండా అడ్డుపడుతోంది. పుస్తకంలోని వస్తువు గురించి రచయితతో నేను ఏకీభవించలేకపోతున్నాను. అంతేకాదు. మిత్రునితో (పుస్తకంలోని) అన్ని విషయాల్లోనూ ఏకాభిప్రాయం లేనివాణ్ని. చాలా మౌలిక అంశాల్లో తనతో నేను విభేదిస్తున్న విషయం ఆయనకి సైతం స్పష్టంగా తెలుసు. అందువల్ల నేను రాస్తున్నది ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ పుస్తకానికి 'ముందుమాట' కాలేదు. ఒక విధంగా చెప్పాలంటే-ఇది ఈ పుస్తకాన్ని విమర్శిస్తున్న వ్యాసం కావచ్చు. అందువల్ల ఇది పుస్తకం చివరలో వుండాలి తప్ప, ప్రారంభంలో కాదు. రాజకీయరంగంలో 'డ్రీమ్‌ల్యాండ్'కి విలువయిన స్థానం ఉంటుంది. నేటి పరిస్థితుల్లో ఇది ఉద్యమంలోని ఓ ముఖ్యమైన లోపాన్ని పూరిస్తోంది. వాస్తవానికి ఆధునిక చరిత్రలో ఒక విధంగా విలువయిన స్థానాన్ని కలిగివున్న చాలా

చివరిగా అతను తన కవితలో రాసిన ఎంతో విలువయిన భాగం వస్తుంది. భావి సమాజం గురించి అతను రాశారు. మనమంతా స్థాపించాలని ఉవ్విళ్ళూరుతున్న సమాజం గురించి. అయితే మొదట్లోనే ఒక విషయం స్పష్టం చేయదలచుకున్నాను. వాస్తవానికి 'డ్రీమ్‌ల్యాండ్' ఒక స్వప్నలోకం. రచయిత పుస్తకానికి పెట్టిన శీర్షిక ద్వారా ఎలాంటి అరమరికలు లేకుండా దాన్ని ఆమోదించారు. దీనికి సంబంధించి తాను ఎలాంటి వైజ్ఞానిక థీసెస్ కూడా రాయదలచినట్టు చెప్పుకోలేదు. పుస్తకానికి 'డ్రీమ్‌ల్యాండ్' (స్వప్నలోకం) శీర్షికే ఈ విషయాన్ని మరింత స్పష్టం చేస్తోంది. అయితే సామాజిక ప్రగతిలో స్వప్న లోకాలకి ప్రధానపాత్ర వుంది. సెయింట్ సైమన్, ప్రౌధాన్, రాబర్ట్ ఒవేన్‌ల సిద్ధాంతాలు లేనినాడు మార్క్సిస్టు శాస్త్రీయ సోషలిజం కూడా వుండేది కాదనే చెప్పాలి. మన కార్యకర్తలు తమ లక్ష్యానికి ఆచరణాత్మక రూపం ఇచ్చేందుకు ఉద్యమానికి సంబంధించిన ఒక శాస్త్రీయ దృష్టికోణం ఏర్పరుచుకొనే అవసరాన్ని గుర్తించిననాడు, ఈ పుస్తకం వారికి ఎంతగానో ఉపకరిస్తుంది.

ఆయన ఆరంభంలో సిద్ధాంతం గురించి చెబుతారు. ఆ సిద్ధాంతం బెంగాల్‌కి, పంజాబ్‌కీ చెందిన విప్లవోద్యమాన్నిటికీ వెన్నెముక వంటిది. నాకూ రచయితకీ ఈ పాయింట్ మీద అతిపెద్ద అభిప్రాయ భేదం వుంది. విశ్వం గురించిన అతని వ్యాఖ్య హేతుబద్ధమయినదీ, పారలౌకికమైనదనీ(మెటాఫిజికల్). మరి నేనేమో పక్కా భౌతికవాదిని. అందువల్ల దృగ్గోచర జగత్తుకి సంబంధించిన నా వ్యాఖ్య హేతువుకి కట్టుబడి ఉంటుంది. అయినప్పటికీ ఎట్టి పరిస్థితిలోనూ ఈ రచన సందర్భశుద్ధిలేనిది మాత్రం కాదు.

రాజకీయ ఉద్యమాలు ఆదర్శహీనంగా వుంటున్నాయి. విప్లవోద్యమం సైతం ఇందుకు మినహాయింపు కాదు. అయితే గదర్‌పార్టీ మాత్రం దీనికి మినహాయింపుగా నిలుస్తుంది. అది (గదర్‌పార్టీ) అమెరికా తరహా ప్రభుత్వం నుంచి ప్రేరణపొంది, తాము 'భారతదేశంలో వునికిలో ఉన్న ప్రభుత్వాన్ని గద్దెదించి, దాని స్థానే ప్రజాస్వామ్య తరహా ప్రభుత్వాన్ని స్థాపించగల'మని స్పష్టంగా చెప్పుకున్నది. తాము ఏ లక్ష్యసాధన కోసమయితే పోరాటం చేస్తున్నారో, తెలియజెప్పే విప్లవపార్టీ ఒక్కటి కూడా నేను ఎరిగినంత వరకూ నా దృష్టికి రాలేదు. మిగతా అన్ని ఇతర పార్టీల్లోనూ ఉన్నవారికి, తాము విదేశీ పాలకులతో పోరాడాలన్న విషయం మాత్రం సుస్పష్టంగా తెలుసు. ఈ ఆలోచన ప్రశంసించదగ్గదే అయినా, దీన్ని విప్లవ భావం అనలేం గదా! ఇక్కడ ఒక విషయం మేం స్పష్టంగా చెప్పదలచుకున్నాం. విప్లవమంటే ఒక తిరుగుబాటో, నెత్తురోడే ఒక సంఘటనో కానేకాదు. మనం విప్లవం గురించి చెబుతున్నప్పుడు, అందులో ఉనికిలో ఉన్న పరిస్థితులను అంటే ప్రభుత్వాన్ని పూర్తిగా ధ్వంసం చేసి, తర్వాత సమాజాన్ని సరైన పద్ధతిలో పునర్నిర్మించే కార్యక్రమం కూడా ఇమిడి ఉంది.

రాజకీయ రంగంలో లిబరల్ భావాలు కలవారు, వునికిలో ఉన్న ప్రభుత్వం కింద వుంటూనే కొన్ని సంస్కరణలు కోరుతూ ఉంటారు. అదే ఉగ్రవాదులయితే వారి డిమాండ్‌లు కొన్ని అధికంగానే ఉంటాయి. తమ లక్ష్యసాధనకోసం వారు తీవ్రమయిన మార్గాలను ఎన్నుకోవటం తమ బాధ్యతగా భావిస్తారు- వారు విదేశీ పాలకుల ఆధిపత్యాన్ని కూకటివేళ్ళతో పెకిలించి వేయాలని భావిస్తారు. వీరిలో మరికొందరు తీవ్రమార్గాల ద్వారా మరిన్ని సంస్కరణలు పొందాలను కుంటున్నారనడంలో ఎలాంటి సందేహమూ లేదు. ఈ అన్ని ఉద్యమాలన్నీ మనం సరైన అర్థంలో విప్లవాత్మకమయినవి అనలేం. కానీ 1908లో పంజాబ్‌లో అండర్‌గ్రౌండ్‌లో వుండిన ఓ బెంగాలీ విప్లవకారుడు మొట్టమొదటి వ్యక్తిగా లాలారామ్ సరణ్‌దాస్‌ని ఫార్మల్‌గా ఒక పద్ధతి ప్రకారం (విప్లవపార్టీలోకి) తీసుకున్నారు. అప్పట్నించీ ఆయన విప్లవోద్యమంతో సంబంధం కలిగి ఉన్నారు. అంతిమంగా తాను గదర్‌పార్టీలో చేరారు. అంతమాత్రం చేత ఉద్యమ లక్ష్యాలకి సంబంధించి తమ (1908 నాటి విప్లవకారులు) పాత భావాలను వారు త్యజించారని చెప్పలేం. పుస్తకం అందాన్నీ, దాని విలువనీ పెంచే ఆసక్తికరమైన, విలువయిన అంశం ఒకటి ఉంది. లాలారామ్ సరణ్‌దాస్‌కి కోర్టు 1915లో ఉరిశిక్ష విధించింది. తర్వాత ఆ శిక్షని తగ్గించి యావజ్జీవ కారాగారశిక్షగా మార్చింది. ఇవేళ నేను స్వయంగా జైలు గది నుంచి ఉరిశిక్ష ఖైదీగా నా పాఠకులకి సాధికారంగా ఒక విషయం చెప్పగలను- యావజ్జీవ కారాగారశిక్ష, ఉరిశిక్షకన్నా ఎక్కువ కఠినమయిన శిక్ష అని. లాలారామ్ సరణ్‌దాస్ పద్నాలుగు సంవత్సరాల కఠిన కారాగారశిక్షను అనుభవించేరు. ఈ కావ్యాన్ని తాను దక్షిణభారతదేశంలోని ఓ జైలులో రచించారు. నాటి తన మానసికస్థితి, మానసిక సంఘర్షణల ప్రభావం రచయిత రాసిన ఈ కావ్యంపై స్పష్టంగా పడింది. అంతేకాదు, అవి ఈ కావ్యం మరింత సుందరంగా, ఆకర్షణీయంగా రూపొందటానికి ఎంతగానో దోహదపడ్డాయి. ఈ కావ్యాన్ని సృజించాలనే నిశ్చయానికి రావటానికి ముందు అతను (రచయిత) తనలో వున్న కొన్ని విషాదకర మనోభావాలతో తీవ్రంగా ఘర్షించారు. అదే సమయంలో అతని సహచరులు చాలామంది అండర్‌టేకింగ్ రాసి ఇచ్చేసి, జైలు నుంచి బయటపడ్డారు. అందరి ముందూ- ఇతని ముందు కూడా పెద్ద పెద్ద ప్రలోభాలు వుంచబడ్డాయి. భార్యాబిడ్డల, మధుర, దుఃఖపూరిత స్మృతులకి-జైలు నుంచి విమోచనం పొందాలనే ప్రబలమైన ఆకాంక్షకి మరింతగా బలం చేకూర్చసాగాయి. అంతట తాను ఈ విషయాలన్నింటికీ వ్యతిరేకంగా తీవ్ర సంఘర్షణ చేయాల్సి వచ్చింది. అతను తన దృష్టిని దీనిపైకి (ఈ కావ్యరచనపై) మరల్చారు. బహుశా అందువల్లే కావచ్చు. కావ్యం ప్రారంభ చరణాల్లో ఈ విధమయిన ఆకస్మిక భావోద్వేగం మనకి దర్శనమిస్తుంది.

Wife, children, friends that me surround
Were poisonous snakes all around

పొరుసుకుంటూ సంచరించే విషసర్పాలు
చుట్టుముట్టే స్నేహితులూ, భార్యా, సంతానాలు.

ఆయన ఆరంభంలో సిద్ధాంతం గురించి చెబుతారు. ఆ సిద్ధాంతం బెంగాల్‌కి, పంజాబ్‌కీ చెందిన విప్లవోద్యమాన్నిటికీ వెన్నెముక వంటిది. నాకూ రచయితకీ ఈ పాయింట్ మీద అతిపెద్ద అభిప్రాయ భేదం వుంది. విశ్వం గురించిన అతని వ్యాఖ్య హేతుబద్ధమయినదీ, పారలౌకికమైనదనీ(మెటాఫిజికల్). మరి నేనేమో పక్కా భౌతికవాదిని. అందువల్ల దృగ్గోచర జగత్తుకి సంబంధించిన నా వ్యాఖ్య హేతువుకి కట్టుబడి ఉంటుంది. అయినప్పటికీ ఎట్టి పరిస్థితిలోనూ ఈ రచన సందర్భశుద్ధిలేనిది మాత్రం కాదు. మనదేశంలో సాధారణంగా వునికిలో ఉన్న

నా వ్యక్తిగత అనుభవం వెలుగులో నేను సాధికారంగా ఒక విషయం చెప్పగలను. రహస్య కార్యకలాపాల్లో- నిరంతరం వ్యక్తి ప్రమాదభరితమయిన జీవితం గడపాల్సి వస్తున్నప్పుడు- 'ఆశారహితంగా, నిర్భయంగా' నిరంతరం అజ్ఞానంతో, ఏ గౌరవమూ లేకుండా, ఏ రాగాలూ లేకుండా' చావు కోసం ఎదురుతెన్నులు చూస్తూ- అప్పుడు ఇలాంటి సందర్భాల్లో వ్యక్తిగత ప్రలోభాలతో, కోర్కెలతో సతమతమవుతున్నప్పుడు తను ఇటువంటి రహస్యవాదం సహాయంతో పోరాడగలుగుతాడు.

భావాల్లో అధిక భాగం ఈ రచనలో ఈ రచయిత అభివ్యక్తం చేసిన భావాలతో సారూప్యత కలిగిఉన్నాయి. ఆ సమయంలో తనలో గూడుకట్టుకొని వున్న ఉదాసీనతతో సంఘర్షించేందుకు అతను ప్రార్థనామార్గాన్ని ఎన్నుకున్నారు. పుస్తకంలోని ప్రారంభభాగమంతా భగవంతుడు, అతని స్తుతి, అతనికి సంబంధించిన పరిభాష వగయిరాలకి సమర్పించటాన్ని బట్టి ఈ విషయం స్పష్టమవుతుంది. భగవంతుణ్ని విశ్వసించటం అన్నది మార్మికవాద ఫలితం. మార్మికవాదం మానసిక దౌర్బల్యానికి సహజ సిద్ధంగా ఉద్భవించింది. 'జగత్ మాయ' లేక 'జగత్ మిధ్య' ఒక స్వప్నం, ఒక కల్పన. ఇలాంటి భావాలనే మార్మికవాదం అంటారు. ఈ భావాన్ని గత కాలంలో శంకరాచార్యుడు, తదితర తత్త్వవేత్తలు పుట్టించి వికసింపజేశారు. కాని భౌతికవాద సిద్ధాంతం క్రింద ఇలాంటి సిద్ధాంతానికి ఎలాంటి తావులేదు. అయినప్పటికీ రచయిత ప్రవచించిన ఈ రహస్యవాదం ఏ రూపంలోనూ హీనమైనదీ, తుచ్ఛమయినదీ ఖేదం కలిగించేదీ కాదు. అతని భావాలు ఉత్సాహం కలిగించేవిగా ఉంటాయి. చూడండి.

Be a foundation stone obscure,
And on the breast cheerfully bear
The architecture vast and huge,
In suffering find true refuge
Entry not the plastered top-stone
On which all worldly praise is
thrown etc, etc.

దృష్టి ఎవరికీ కనబడని పునాదిరాయిగా మలుచు,
నీ గుండెలపై (దాన్ని) చిరునవ్వుతో సహించు
నిర్మాణం విశాలమైనదీ, భారంతో కూడినదీ
కష్టాన్ని సహించటంలో అనుభవించు నిజమైన
ఆశ్రయం (సంతోషం)
ద్వారానికి అమర్చిన రాతిని చూసి ఈర్ష్య చెందకు
లోకమంతా కురిపిస్తోంది దాని మీదే ప్రశంసల వర్షం
సహిష్ణుతలో సంతోషం దర్శించు

నా వ్యక్తిగత అనుభవం వెలుగులో నేను సాధికారంగా ఒక విషయం చెప్పగలను. రహస్య కార్యకలాపాల్లో- నిరంతరం వ్యక్తి ప్రమాదభరితమయిన జీవితం గడపాల్సి వస్తున్నప్పుడు- 'ఆశారహితంగా, నిర్భయంగా' నిరంతరం అజ్ఞానంతో, ఏ గౌరవమూ లేకుండా, ఏ రాగాలూ లేకుండా' చావు కోసం ఎదురుతెన్నులు చూస్తూ- అప్పుడు ఇలాంటి సందర్భాల్లో వ్యక్తిగత ప్రలోభాలతో, కోర్కెలతో సతమతమవుతున్నప్పుడు తను ఇటువంటి మార్మికవాదం సహాయంతో పోరాడగలుగుతాడు. ఇటువంటి మార్మికవాదం ఏవిధంగానూ నీచత్వాన్ని లేదా శిథిలత్వాన్ని ఉద్భవింపజేసేదికాదు.

మానసిక రచయిత ఒక విప్లవకారుని దశని వర్ణించేరు. లాలారామ్ చరణ్‌దాస్ ఒక విప్లవ పార్టీ సభ్యుడు. ఆ పార్టీ ఎన్నో హింసాత్మక కార్యాలు చేసిందని ఆరోపించబడింది కానీ, విప్లవకారులు, సర్వనాశనం విధ్వంసం నుండి సుఖాన్ని అనుభవించే రక్తదాహపు దానవులు అవుతారన్న విషయం దీనివల్ల రుజువు కాలేదు.

అవసరం అయితే బయటికి ఉగ్రంగానో
భయంకరంగానో తయారుకా
నీ గుండెల్లో మాత్రం వుండు ఎన్నడూ నమ్రత కలిగి
బుసలు కొట్టు అవసరం అయిన చోట,
కాటేయకు నువ్వు మాత్రం ఎవర్నీ
హృదయమంతటితోనూ ప్రేమించు,
బయటకు పోరాడు.

నిర్మాణానికి ధ్వంసం చెయ్యటం అవసరమేకాదు, అనివార్యం కూడా. విప్లవకారులు దీన్ని తమ కార్యక్రమంలో ఒక భాగంగా స్వీకరించాలి. హింస, అహింసల తాత్త్విక దృక్కోణాన్ని పై పంక్తుల్లో చాలా అందంగా వర్ణించటం జరిగింది. ఒక సందర్భంలో లెనిన్, గోర్కీతో అన్నారు. "నరాల్లో ప్రాణం నింపే సంగీతం వినలేకపోయాను. ఇలాంటి సంగీతం విన్న తర్వాత కళాకారుల శిరస్సుల్ని మెల్లగా తాటించి, జో కొట్టాలని తనకి అనిపించిందని ఆయన (లెనిన్) అన్నారు. ఇంకా ఆయన ఇలా అన్నారు," అయితే ఈ సమయంలో చేతుల పని తల తాటించి, జోకొట్టడం కాదు. తలల్ని తొలగించటం. మన అంతిమ లక్ష్యం అన్ని రకాల హింసల్ని పరిసమాప్తి చేయటమే అయినప్పటికీ" తప్పనిసరి పరిస్థితిలో ఒక అవసరంగా విప్లవకారులు హింసాత్మక పద్ధతుల్లో పనిచేసుకుంటూ పోవాల్సి వచ్చినప్పుడు, వారు సైతం సరిగ్గా ఇలానే ఫీలవుతూ ఉంటారు. తర్వాత రచయిత పరస్పరం సంఘర్షించుకునే మతాలను గురించి రాశారు. జాతీయ వాదులందరికీ మల్లేనే తాను కూడా సర్వమతాల మధ్య సామరస్యం తెచ్చే ప్రయత్నం చేశారు. సమస్యని పరిష్కరించే

ఒక నావికుడు ప్రతి ఇరవై నాలుగు గంటల తర్వాత తన ఓడని విడిచి భుక్తికోసం నాలుగు గంటలపాటు పనిచేసేందుకు వేరే చోటుకి వెళ్ళటం, లేదా ఒక సైంటిస్టు (శాస్త్రవేత్త) తన ప్రయోగశాలను, తాను చేస్తూ వస్తున్నప్రయోగాన్ని పక్కనబెట్టి తనకి ఇచ్చిన సమయాన్ని పూర్తి చేసేందుకు- పొలంలో పనిచేసేందుకు వెళ్లటంలోని ఔచిత్యాన్ని మీరు ఆలోచించాల్సి వుంటుంది. వీరిరువురూ ఎంతో విలువయిన ఉత్పత్తి కార్యక్రమాన్ని చేస్తున్నారు.

ఈ పద్ధతి కారల్‌మార్క్సు చెప్పిన ఒకే ఒక వాక్యంతో దీన్నే కొట్టిపారేస్తాను "మతం ప్రజలకి నల్లమందు లాంటిది."

చివరిగా అతను తన కవితలో రాసిన ఎంతో విలువయిన భాగం వస్తుంది. భావి సమాజం గురించి అతను రాశారు. మనమంతా స్థాపించాలని ఉవ్విళ్ళూరుతున్న సమాజం గురించి. అయితే మొదట్లోనే ఒక విషయం స్పష్టం చేయదలచుకున్నాను. వాస్తవానికి 'డ్రీమ్‌ల్యాండ్' ఒక స్వప్నలోకం. రచయిత పుస్తకానికి పెట్టిన శీర్షిక ద్వారా ఎలాంటి అరమరికలు లేకుండా దాన్ని ఆమోదించారు. దీనికి సంబంధించి తాను ఎలాంటి వైజ్ఞానిక థీసెస్ కూడా రాయదలచినట్టు చెప్పుకోలేదు. పుస్తకానికి 'డ్రీమ్‌ల్యాండ్' (స్వప్నలోకం) శీర్షికే ఈ విషయాన్ని మరింత స్పష్టం చేస్తోంది. అయితే సామాజిక ప్రగతిలో స్వప్న లోకాలకి ప్రధానపాత్ర వుంది. సెయింట్ సైమన్, ప్రౌధాన్, రాబర్ట్ ఒవేన్‌ల సిద్ధాంతాలు లేనినాడు మార్క్సిస్టు శాస్త్రీయ సోషలిజం కూడా వుండేది కాదనే చెప్పాలి. మన కార్యకర్తలు తమ లక్ష్యానికి ఆచరణాత్మక రూపం ఇచ్చేందుకు ఉద్యమానికి సంబంధించిన ఒక శాస్త్రీయ దృష్టికోణం ఏర్పరుచుకొనే అవసరాన్ని గుర్తించిననాడు, ఈ పుస్తకం వారికి ఎంతగానో ఉపకరిస్తుంది.

రచయిత రచనాశైలి పరిపక్వమయినది కాదన్న విషయం నేను గ్రహించేను. తను స్వప్నలోకం గురించి వివరించే సందర్భంలో రచయిత వర్తమాన సమాజం గురించిన ఆలోచనలను స్పృశించకుండా ఉండలేకపోయారు.

భవిష్యత్ సమాజంలో, అంటే కమ్యూనిస్టు సమాజంలో- దాన్ని నిర్మించాలని తాపత్రయం పడుతున్న మనం మతపరమయిన సంస్థల్ని స్థాపించబోవటంలేదు. పైగా ఆ సమాజంలో బీదాబిక్కీయే కాదు, అవసరాలు ఉన్నవారూ, దానం చేసేవారూ, అవసరాలు తీర్చేవారూ ఉండరు. ఇలా యుత్తం కానిదివున్నా రచయిత సమస్యని ఎంతో చక్కగా ప్రవేశపెట్టారు.

పుస్తకంలో రచయిత ఏ సమాజపు సాధారణ రూపురేఖలు గురించి చర్చించారో, అది ఇంచుమించుగా శాస్త్రీయ సోషలిజాన్ని పోలి ఉంటుంది. అయితే ఇందులో ఉపయోగించిన కొన్ని పదాల గురించి అభ్యంతరం చెప్పటం లేక వ్యతిరేకించటం ఎంతయినా అవసరం. మరోలా చెప్పాలంటే వాటిని (ఆ పదాలని) పరిష్కరించాల్సి వుంది. ఉదాహరణకి 427వ పదం కింద ఇచ్చిన అధోజ్ఞాపికలో ఇలా రాసి వుంది. ప్రభుత్వంలో పనిచేసేవారు భుక్తి కోసం సంపాయించటం కోసం ప్రతిరోజూ నాలుగు గంటలు పొలాల్లోగానీ, కార్ఖానాల్లోగానీ పనిచేయాలి. అయితే ఇది సాధ్యం కాని గాలిమాట. ఈ మాట బహుశా నేటి వ్యవస్థలో ఎక్కువ జీతాలు అందుకుంటున్న ప్రభుత్వ తాబేదార్లంటే ఆయనలో ఏర్పడ్డ వ్యతిరేక భావం నుంచి పుట్టినదయి వుండాలి. వాస్తవానికి బోల్షివిక్‌లు సయితం ఒక విషయం ఆమోదించాల్సి వచ్చింది- మేధోశ్రమ కూడా శారీరక శ్రమ, ఉత్పాదక శ్రమ లాంటిదే. రానున్న సమాజంలో వివిధ తత్త్వాల పరస్పర సంబంధాలు సమాన స్థాయిలో వున్ననాడు, ఉత్పత్తి, పంపిణీ- రెండూ కూడా సమాన రూపంలో విలువయినవిగా విభజింపబడ్డాయి. ఒక నావికుడు ప్రతి ఇరవై నాలుగు గంటల తర్వాత తన ఓడని విడిచి భుక్తికోసం నాలుగు గంటలపాటు పనిచేసేందుకు వేరే చోటుకి వెళ్ళటం, లేదా ఒక సైంటిస్టు (శాస్త్రవేత్త) తన ప్రయోగశాలను, తాను చేస్తూ వస్తున్నప్రయోగాన్ని పక్కనబెట్టి తనకి ఇచ్చిన సమయాన్ని పూర్తి చేసేందుకు- పొలంలో పనిచేసేందుకు వెళ్లటంలోని ఔచిత్యాన్ని మీరు ఆలోచించాల్సి వుంటుంది. వీరిరువురూ ఎంతో విలువయిన ఉత్పత్తి కార్యక్రమాన్ని చేస్తున్నారు. సోషలిస్టు సమాజంలో మేధోశ్రమ, శరీర శ్రమకన్నా ఉన్నతమయినదిగా భావించరని ఆశించవచ్చు.

ఉచిత విద్యకి సంబంధించి లాలారామ్ సరణ్‌దాస్ అభిప్రాయం నిజంగానే విలువయింది. రష్యాలో అక్కడ పరిపాలిస్తున్న సోషలిస్టు ప్రభుత్వం విద్యకి సంబంధించి ఇంచుమించు ఇటువంటి పద్ధతినే అనుసరిస్తోంది.

నేరం గురించి ఆయన చేసిన చర్చని వాస్తవానికి ఎంతో అభివృద్ధి చెందిన భావజాలంగా చెప్పుకోవచ్చు. అపరాధం (నేరం) ఒక గంభీరమైన సమస్య. ఎంతో జాగ్రత్తగా దాన్ని పరిష్కరించాలి. తన జీవితంలో అధిక భాగం రచయిత జైలులోనే గడిపేశారు. రచనలో ఒక చోట అతను ఫక్తు జైలులో వాడే పదాలను ఉపయోగించారు. ఉదాహరణకి- హాలీ మశక్కత్ (తేలికపాటిశ్రమ), దరమి యానీ మశక్కత్ (మధ్య తరహా శ్రమ) సఖ్త్ మశక్కత్ (కఠినశ్రమ) వగయిరా- అందరు సోషలిస్టులకి మల్లేనే అతని సలహా కూడా. శిక్షకి ఆధారం పగతీర్చుకోవటానికి బదులు సంస్కరణ కావాలనే న్యాయం, సంస్కరణకి దారితీసే సిద్ధాంతం. (ఒక నేరస్థుణ్ని) శిక్షించటం గాకుండా, రుజుమార్గంలోకి తేవటంగా వుండాలి. జైళ్ల రూపం వాస్తవానికి నరకానికి బదులు సంస్కరణలకి ఆలయం కావాలి. ఈ విషయంలో పాఠకులు రష్యా కారాగార వ్యవస్థని అధ్యయనం చేస్తే బావుంటుంది.

సేనలను గురించి చర్చించే సందర్భంలో అతను యుద్ధం గురించి సయితం తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. నా అభిప్రాయం ఏమిటంటే- భవిష్యత్తులో యుద్ధాల గురించిన

సేనలను గురించి చర్చించే సందర్భంలో అతను యుద్ధం గురించి సయితం తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. నా అభిప్రాయం ఏమిటంటే- భవిష్యత్తులో యుద్ధాల గురించిన సమాచారం విజ్ఞాన దర్శనాలలో అతి తక్కువ ఉంటుంది. యుద్ధ సామాగ్రిని మ్యూజియంలో వుంచితే, అవి మ్యూజియం అందాన్ని ఇనుమడింపజేస్తాయి. కారణం- ఆ సమాజంలో యుద్ధాలకు జన్మనిచ్చే పరస్పర విరోధులు వుండరు.

సమాచారం విజ్ఞాన దర్శనాలలో అతి తక్కువ ఉంటుంది. యుద్ధ సామాగ్రిని మ్యూజియంలో వుంచితే, అవి మ్యూజియం అందాన్ని ఇనుమడింపజేస్తాయి. కారణం- ఆ సమాజంలో యుద్ధాలకు జన్మనిచ్చే పరస్పర విరోధులు వుండరు.

ఎక్కువలో ఎక్కువ మేం ఒక విషయం చెప్పగలం. యుద్ధాలు సంక్రమణ కాలం దాకా వుంటాయి. అంటే రష్యాని మనం ఉదాహరణగా తీసుకుంటే- ఈ విషయాన్ని మరింత చక్కగా అర్థం చేసుకోగలం. అక్కడ ఇప్పుడు శ్రామికవర్గ అధినాయకత్వం నెలకొని వుంది. వారు సోషలిస్టు సమాజాన్ని స్థాపించే ప్రయత్నంలో ఉన్నారు. అప్పటిదాకా పెట్టుబడిదారీ సమాజం నుంచి తమని తాము రక్షించుకొనేందుకు ఒక సైన్యాన్ని పెట్టుకుంది రష్యా. అయితే యుద్ధానికి సంబంధించిన వారి ఉద్దేశం భిన్నమైనది. విప్లవ సైన్యాలు ఇతర దేశాల్లోకి అడుగుపెట్టడం, అక్కడ ప్రజలను దోచుకోవాలనో, వారిని పాలించాలనో కానేకాదు. అక్కడి పీడక పాలకుల్ని గద్దెదించి, ప్రజల నెత్తురు తాగే పీడనని అంతమొందించేందుకూ, అక్కడి శ్రామిక ప్రజలకి విముక్తి కలిగించేందుకు మాత్రమే ఇతర దేశాల్లో అడుగు పెడ్తుంది. అయితే అక్కడి మన సైనికులను యుద్ధం చేయమని, పాత జాతీయ లేక జాతికి సంబంధించిన ఏహ్య భావం రెచ్చగొట్టడం కొరకు కాదు.

విశ్వ సమాజం అనే భావన నేడు స్వేచ్ఛా ఆలోచనా పరులందరి అత్యధిక జనప్రియ అభిప్రాయం. రచయిత ఈ విషయం గురించి చాలా చక్కగా రాశారు. అదే విధంగా సోకాల్డ్ 'లీగ్ ఆఫ్ నేషన్స్' అనే అభిప్రాయం అందమయినది.

571 (కాదు 572 సరైనది- అను॥)వ పదం కింద ఇచ్చిన ఆధోజ్ఞాపికలో రచయిత సంక్షిప్తంగా పథకాలను గురించి వివరించారు. అతను ఇలా అంటున్నారు, "ఈ విధమయిన రాజ్యాలు శరీరాలను హింసించే విప్లవాల ద్వారా స్థాపించ బడజాలవు. అవి వెలుపల నుంచి సమాజం మీద రుద్దబడజాలవు. అవి లోపల నుంచి పుట్టుకు రావాలి. అవి పొందటం నెమ్మది నెమ్మదిగా అల్పవికాస ప్రక్రియ ద్వారా, ప్రజల్ని మేం పైన ఉదహరించిన లైనుకి అనుగుణంగా శిక్షణ ఇవ్వటం ద్వారా సాధ్య పడుతుంది. అయితే దానిని గురించి నేను వ్యాఖ్యానించక పోవటం అది కొన్ని అపోహలనుగాని లేదా చిక్కులనుగాని సృష్టించవచ్చుననే ఉద్దేశంతోనే. అంటే లాలారామ్ సరణ్‌దాస్‌కి బల ప్రయోగం ఎంత వ్యర్థమయినదో అన్న విషయం తెలియ వచ్చిం దని అనుకోవచ్చా? తను అహింసని తు.చ. తప్పక సమర్థించే వారు అయిపోయారనా? లేదు. దాని అభిప్రాయం అది కాదు.

పైన ఉదహరించిన వ్యాఖ్య అంతర్యం ఏమిటో దానిపై కాస్త వెలుగుని ప్రసరిద్దాం. ఏ ఇతర వ్యక్తికన్నా విప్లవకారుడికి ఈ విషయం గురించి ఎక్కువ బాగా తెలుసును. సోషలిస్టు సమాజస్థాపన హింస ద్వారా సాధ్యం కాదు. పైగా ఆ సమాజంలోపల నుంచే అది పుట్టుకురావాలి. అభివృద్ధి చెందాలి. ఒక పథకంగా కేవలం శిక్షణ ఇవ్వటం ద్వారానే పని పూర్తి చేసుకోవాలన్నది రచయిత సూచన. ఇక్కడ ఉనికిలో ఉన్న ప్రభుత్వం- వాస్తవానికి అన్ని పెట్టుబడిదారీ ప్రభుత్వాలూ ఇటువంటి ప్రయత్నాలకి సాయం చేయకపోవటమే కాదు-పైగా దానికి వ్యతిరేకంగా, దాన్ని నిర్దాక్షిణ్యంగా అణిచివేస్తుందన్న విషయం ప్రతి వ్యక్తి బాగా ఎరిగివున్నాడు. అటువంటప్పుడు దాని క్రమవికాసం వల్ల ఏం సాధించగలుగుతాం? విప్లవకారులమయిన మనం ప్రభుత్వాధికారాన్ని హస్తగతం చేసుకొని, ఒక విప్లవ ప్రభుత్వాన్నీ, ప్రజలనీ శిక్షితులను చేయటానికి మనకివున్న సాధనాలన్నిటినీ ఉపయోగించుకోవాలి. ఏ విధంగా ఈనాడు రష్యాలో జరుగుతున్నదో అలాగన్నమాట. పెట్టుబడిదారుల చేతుల్లోంచి రాజ్యాధికారాన్ని గుంజుకున్న తర్వాత నిర్మాణ కార్యక్రమాలు శాంతియుతంగా చేసుకుంటూ పోవాలి. ఎదురయిన అడ్డంకుల్ని తొలగించుకొనేందుకు బలప్రయోగం చేయక తప్పదు. ఒకవేళ రచయితదీ ఇదే అభిప్రాయం అయితే, మేం అతణ్ని సమర్థిస్తాం. అతనితో కలిసి వుంటాం. దాని అర్థం ఇదేనని మా నమ్మకం.

పుస్తకం గురించి నేను విస్తారంగానే రాశాను. నిజానికి నేను దీన్ని విమర్శిస్తూ రాశాను. అయినా పుస్తకంతో ఎలాంటి మార్పు తెమ్మని రచయితకి నేను చెప్పదలచుకోలేదు. దానికి ఓ చారిత్రక విలువ వుండటమే ఇందుకు కారణం. 1914-15 సంవత్సరాల మధ్య కాలం నాటి విప్లవకారుల అభిప్రాయాలు ఈ పుస్తకంలో పొందుపరచబడి వున్నాయి.

నేను మా యువతకి ప్రత్యేకంగా ఈ పుస్తకం కొని చదవాల్సిందిగా సిఫార్సు చేస్తున్నాను. అయినా ఓ హెచ్చరికతో. అదేమిటంటే- దయచేసి మీరు కళ్లు మూసుకొని ఇందులో ఉదహరించిన విషయాన్ని తు.చ. తప్పకుండా ఆచరించడం గానీ, ఇందులో రాసినట్లుగా ఆమోదించటం కోసమే దీన్ని చదవకండి. అయితే దీన్ని చదవండి. దాన్ని విమర్శించండి. దాన్ని గురించి ఆలోచించండి. దీని ఆధారంగా స్వంతంగా విషయాలను అర్థం చేసుకోండి.

**("నా నెత్తురు వృధా కాదు" నుంచి - అనువాదం : నిర్మలానంద)**



# ఒక లక్ష్యం కోసం

**- మిర్జా గాలిబ్**

**(27.12.1796 - 15.02.1869)**

పైకి సామాన్యమైదిగా కన్పించేపని కూడా చేయడం బహు కష్టమని తెలుసుకో, ఎంత మేరకంటే ఒక వ్యక్తికి మానవత్వం గల వ్యక్తిగా మసులుకోవడం అంత సులభం కాదు.

ఒక లక్ష్యం కోసం అలపు అనేది ఎరుగకుండా పని చేయమని తీరని ఆశ తొందర పెడుతుంది.
మరణమనేది లేకుండినట్టయితే, జీవితం ఏ విధమైన ఆకర్షణనూ ఇవ్వజాలదు.

చేసే సాహసాన్ని బట్టి దానికి తగిన మహత్కార్యాన్ని సాధిస్తాము, తాను ముత్యం కావడానికి ప్రయత్నం చేయలేదు కాబట్టి కంటిలో చుక్క (కన్నీటి చుక్క) గానే మిగిలిపోయింది.

మానవుని మనస్సు లక్షలాది ఆలోచనలకు ఆటస్థలం, నాకు మాత్రం ఏకాంతం సందడి చేసే మిత్రుల నిజమైన సమూహం.

రాత్రింబగళ్ళు సప్తగ్రహాలు చలన స్థితిలోనే ఉంటాయి.
అదో..ఇదో, ఏదో ఒకటి జరిగి తీరుతుంది. ఎందుకు కలతజెందడం?
కృతజ్ఞతా భావంతో మెలగ వలసిన నిర్బంధం వుందా, అది మన ఆకాంక్షలను నాశన మొనర్చుతుంది, కాబట్టి ప్రపంచానికి ఋణపడి ఉండకు, సంతుష్టి అనే పాఠాన్ని నేర్చుకోవడానికి మాత్రమే అలా వుండు.

ఈ ప్రపంచంలో రాగవతి అనే పూలమొక్క దాని లోపల కొరుకు వుండు మచ్చతో పుడుతుంది, అది చివరకు దానిని నాశనం చేస్తుంది.
అలాగే సేద్యదారుని వేడి చెమట పిడుగుగా మారి, అది ఒకరోజు అతని పంటను కాల్చి వేస్తుంది!
ఒక నీటి బొట్టు నదిలో విలీనమైనప్పుడు అది నదియే అవుతుంది

## కృతజ్ఞతలు

ఈ సంచికలో ఉపయోగించిన రచనల సేకరణకు సహకరించిన సంకలన కర్తలు ఎన్.వి. రమణయ్య (కావలి), మువ్వల సుబ్బరామయ్య (విజయవాడ), ప్రజాసాహితీ సంపాదకవర్గం, వేగుంట మోహనప్రసాద్, పరకాల పట్టాభిరామారావు, తదితరులకు కృతజ్ఞతలు. ఇంకా వివిధ రకాల అనువాదకులు, సాహితీ మిత్రులు ప్రతి ఒక్కరికి ధన్యవాదాలు.

ముఖచిత్రం అందించిన అక్బర్‌కు, ఈ సంచికకు ప్రకటనలిచ్చిన శ్రేయోభిలాషులకు ప్రత్యేక కృతజ్ఞతలు.

**- ఎడిటర్**

# నవ కవిత

**- శ్రీశ్రీ**

సింధూరం, రక్తచందనం,
బంధూకం, సంధ్యారాగం,
పులి చంపిన లేడి నెత్తురూ,
ఎగరేసిన ఎర్రని జెండా,
రుద్రాలిక నయన జ్వాలిక,
కలకత్తా కాళిక నాలిక
కావాలోయ్ నవకవనానికి.

ఘాటెక్కిన గంధక ధూమం,
పోటెత్తిన సప్త సముద్రాల్,
రగులుకొనే రాక్షసి బొగ్గూ,
బుగులుకొనే బుక్కా గుండా,
వికసించిన విద్యుత్తేజం.
చెలరేగిన జనసమ్మర్దం
కావాలోయ్ నవకవనానికి.

రాబందుల రెక్కల చప్పుడు,
పొగగొట్టపు భూంకార ధ్వని,
అరణ్యమున హరీంద్ర గర్జన
పయోధర ప్రచండ ఘోషం
ఖడ్గ మృగోదగ్ర విరావం,
ఝంఝూనిల షడ్జధ్వానం
కావాలోయ్ నవకవనానికి.
కదిలేదీ, కదిలించేదీ,
మారేదీ, మార్పించేదీ,
పాడేదీ, పాడించేదీ,
మునుముందుకు సాగించేదీ,
పెనునిద్దుర వదిలించేదీ,
పరిపూర్ణపు బ్రదుకిచ్చేదీ,
కావాలోయ్ నవకవనానికి.

**(3-8-1937)**

సాహితీ ప్రవంతికి 'ప్రస్థానం' పత్రికకు శుభాకాంక్షలతో...

☎ : 0863 - 2322236

# D.N.R. హాస్పిటల్

చిన్న ఆంజనేయ స్వామి గుడి దగ్గర, కొత్తపేట, గుంటూరు-522 001

## డా॥ D.V.S.B. రామమూర్తి, (M.D. Dermatology)

చర్మ వ్యాధుల వైద్య నిపుణులు

10.00 AM- 3.00 PM, 6.00 PM - 8.30 PM ఆదివారం , గురువారం సెలవు

## డా॥ D.(N) రమాదేవి, M.S. (Ophl)

నేత్ర వైద్య నిపుణులు

ఉదయం : కొత్తపేట : 11.00 AM- 3.00 PM

సాయంత్రం : పట్టాభిపురం, మెయిన్‌రోడ్, ఇ-సేవ ఎదురు : 6.30 PM - 8.30 PM

అపాయింట్‌మెంట్ కొరకు : 8.00 AM to 8.00 PM, Cell : 99482 71533

సాహితీ ప్రవంతికి 'ప్రస్థానం' పత్రికకు శుభాకాంక్షలతో...

*Empowered by excellence...* *Driven by values...*

# మధు

## విద్యాలయం & జూనియర్ కళాశాల

F.M./T.M.

సుందరయ్య నగర్ ; వైరా ఫోన్ : 08749 - 251305, 251089, సెల్ : 9704799333

**The only institution in Wyra achieving state ranks and running with advanced technology**




- Smart Class Rooms
- I.I.T. Foundation
- Nursery to X E.M. & T.M.
- Groups : M.P.C., Bi.P.C., M.E.C., C.E.C., H.E.C.
- Bus Facility
- Day & Residential

III

# మత బహిష్కరణ కోసం ఎదురు చూస్తున్నా



## టాల్‌స్టాయ్

(09.09.1828 - 20.11.1910)

విశ్వవిఖ్యాత రష్యా రచయిత.

నేను మరొకసారి టాల్‌స్టాయ్ సుపరిచిత వదనాన్ని వర్ణించనవసరం లేదు. వయస్సు, అనారోగ్యం వాటి ప్రభావం అవి చూపిస్తున్నాయి. మొహం బాగా బలహీనమైంది. జుట్టు బాగా తగ్గిపోయింది. టాల్‌స్టాయ్ చకచకా నడుస్తున్నాడు గాని వంగేటప్పుడు బాగా జాగ్రత్త పడుతున్నాడు. ఆయన తన వ్యాయామాన్ని విరమించలేదు. ప్రతి మధ్యాహ్నం గుర్రపు స్వారీ గాని, నడవడం గాని చేస్తాడు. అరుదుగా తన కూతురుతో ఆటలాడతాడు. తనొక్కడే బంతితో ఆడుకుంటాడు. ఆయన ఆరోగ్యం ఇప్పుడు బాగానే వుంది గాని తేలిగ్గా జలుబు చేయొచ్చని తన వ్యక్తిగత వైద్యుడు నాకు చెప్పాడు. ఇక ఆయన సాహిత్య కృషి విషయానికి వస్తే దురదృష్టవశాత్తూ అందరూ ఎంతగానో చెప్పుకుంటున్న ఆయన నవలా రచన ప్రస్తుతం ఆగిపోయింది. బహుశా మళ్ళీ మొదలవక పోవచ్చు కూడా. ఇప్పుడు ఆయన మహా వ్యక్తుల గురించిన కథలు రాయడంలో నిమగ్నమై వున్నాడు. ప్రతి నెలా మొదటి తేదీకి ఒక చిన్న కథ పూర్తి చేయాలని ఆయన సంకల్పం. అయితే వాటిలో కొన్ని ఇప్పటికే ప్రచురణ కర్త దగ్గరకు చేరాయి. ఇంగ్లాండు తదితర దేశాల నుంచి పదే పదే ప్రశ్నలు వచ్చిన మీదట ఆయన రష్యన్‌లో ఉదారవాద ఉద్యమంపై తన అభిప్రాయాలను గ్రంథస్థం చేసే పనిలో పడ్డారు. రాజ్యాన్ని గురించి రాజకీయాల గురించి తన అభిప్రాయాలు తెల్పేందుకు ఒక చిన్న కరపత్రం వెలువరిస్తున్నారు.

మా సంభాషణ కూడా రాజ్యాంగ అంశాల గురించే మొదలైంది. ఆయన అభిప్రాయం చాలా సూటిగా వుంది. "అది చాలా ప్రమాదం" అని ఆయనన్నారు. "ఎందుకంటే అది మనుషుల కార్యకలాపాలను సరైన మార్గం నుంచి మళ్లిస్తుంది. ప్రభుత్వాలన్నీ హింసతోనూ హింసకు సంబంధించిన హెచ్చరికలతోనూ నడుస్తాయి. మనిషి ఎప్పుడు స్వేచ్ఛగా వుంటాడంటే తను తప్పనుకునే పని మరెవరి బలవంతం వల్లనైనా చేసే అవసరం లేనప్పుడే. ప్రభుత్వానికి సంబంధించిన కార్యకలాపాలు వేటిలోనూ పాల్గొననప్పుడే మనిషి నిజంగా స్వేచ్ఛగా వున్నట్టు లెక్క."

"మంచితనం అన్నది సహజ లక్షణమైనప్పుడు పెద్ద విశేషం లేదు. కాని మంచితనంతో ఆగకుండా మరింత ఉన్నతమైన దిశగా నడవాలి" అన్నారు. టాల్‌స్టాయ్ తాత్విక విషయాలు వివరంగా మాట్లాడారు. కాంట్, హెగెల్ వంటి వారు చాలా గౌరవనీయులని అయితే నీషేలో తన శిష్యుడు డా.ఎగ్మన్ షిట్ అద్భుతమైన విషయాలు కనుగొన్నాడని చెప్పారు.

ఆయన సాహిత్య విమర్శ ఆసక్తికరంగా వుంది. రష్యన్ సాహిత్యం గురించి ఆయనకు పెద్ద గొప్ప అభిప్రాయం లేదు. నిజానికి ఇతర సాహిత్యాల పట్ల కూడా అంతే. లోగడ సాహిత్యం అనేది అస్థాన సంగీతం లాగా వుండి కొద్ది మందికే సంతోషం కలిగించేది. ఇప్పుడు సాహిత్యం చాలా విస్తారమైన వాణిజ్య, పారిశ్రామిక వర్గాల అభిరుచులకు తగినట్టు తయారవుతున్నది. కాని మొత్తంగా ప్రజలందరి దృష్టితో రూపొందేవరకూ సాహిత్యం తన స్వతంత్ర్యాన్ని తాను కాపాడుకోలేదు. అన్నారు ఇలా అంటూ ఇంగ్లీషు సాహిత్యం నుంచి కొన్ని ఉదాహరణలు చెప్పారు. చార్లెస్ డికెన్స్‌పై ఆయనకు అపరిమితమైన ప్రశంసా భావం.

నేను గత ఇరవై ఏళ్లుగా మత బహిష్కరణ కోసం ఎదురుచూస్తున్నాను. అదే జరిగితే నేను కాస్త కూడా కలత పడను. బహిష్కారం జరిగినంత మాత్రాన ఎవరూ తన నిజమైన జీవితం గడపకుండా వుండరు. ఇక పత్రికా స్వాతంత్ర్యం అంటారా? ప్రజలకు అది అవసరమా?

"అలాగే సైన్యంలో చేరేందుకు కూడా నిరాకరించాలి. పదవులు తీసుకోవడానికి నిరాకరించి ప్రతిరోజూ ఎల్లప్పుడూ మంచి పనులే చేయాలి. అలాగాక కేవలం రాజ్యాంగం కోసం ఆందోళన చేయడం వల్ల తప్పుడు ఫలితాలే కలుగుతాయి" అని చెప్పారు.

తన స్నేహితుడూ మతాధికారి అయిన ఫాదర్ గోపెన్ కొద్ది రోజుల ముందు ప్రజలను తీసుకుని జార్ చక్రవర్తికి వినతి పత్రం ఇచ్చేందుకు వెళ్ళినప్పుడు జరిగిన నరమేధాన్ని ఆయన ఖండించారు. ఆ మారణకాండ వివరాలు తెలుసుకుని హతాశుడై నాడు. ''అయితే ప్రభుత్వం నుంచి అంతకన్నా ఏమి ఆశించగలమని" కూడా ప్రశ్నించారు.

ఏ దేశంలోనైనా ఏ ప్రభుత్వమైనా మెరుగ్గా వుంటుందన్న భావనను ఆయన తోసిపుచ్చుతాడు. "రష్యాలో కన్నా ఇంగ్లాండు రాజకీయ వ్యవస్థలో వుండటం మెరుగని మీరు భావించడం లేదా" అన్నప్పుడు గట్టిగా ఖండించాడు. "కాస్త కూడా మెరుగుదల వుండదు అని తేల్చి చెప్పారు."హింస ఎక్కడున్నా ప్రజలకు స్వాతంత్ర్యం వుండదు. ఎక్కడి దాకా ఎందుకు? నా మిత్రుడు టెచర్కాఫ్ క్రైస్ట్ చర్చి పట్టణానికి బయట వుంటాడు. అతనికొక బాండు మేళం వుంది. దాన్ని తనెప్పుడూ వినేది లేదు. అయితే దాన్ని పట్టణంలో నడిపిస్తున్నందుకు అతను పన్ను కట్టాల్సి వచ్చింది. ఇక మత బహిష్కరణ విషయానికి వస్తే అది మనిషిని కొద్దిగానే ప్రభావితం చేస్తుంది. నేను గత ఇరవై ఏళ్లుగా మత బహిష్కరణ కోసం ఎదురుచూస్తున్నాను. అదే జరిగితే నేను కాస్త కూడా కలత పడను. బహిష్కారం జరిగినంత మాత్రాన ఎవరూ తన నిజమైన జీవితం గడపకుండా వుండరు. ఇక పత్రికా స్వాతంత్ర్యం అంటారా? ప్రజలకు అది అవసరమా? ఈ పెద్ద మనుషులకు తమ భావాలు వెల్లడించేందుకు అది అవసరం కావచ్చు గాని అది చాలా చిన్న సంగతి.

అసలు టాల్స్టాయినే సెన్సార్ నిబంధనలు తీవ్రంగా దెబ్బతీశాయి. అంత గొప్ప రచయిత రాతలను కూడా పేజీలకు పేజీలు కొట్టివేసి అచ్చులోకి రాకుండా ఆంక్షలు పెట్టారు. సెన్సార్షిప్ కారణంగానే ఇంగ్లాండులోనూ జర్మనీలోనో అచ్చయిన తన పుస్తకాల ప్రతులను ఆయన అందుకోలేని స్థితి ఏర్పడింది. ఆయన కార్మికుల సమ్మెలపైనా తన అభిప్రాయం చెప్పారు. దేశానికి తిండి పెట్టేవారి సమ్మె అన్నిటికన్నా బలమైందని వ్యాఖ్యానించారు.

"మంచితనం అన్నది సహజ లక్షణమైనప్పుడు పెద్ద విశేషం లేదు. కాని మంచితనంతో ఆగకుండా మరింత ఉన్నతమైన దిశగా నడవాలి" అన్నారు. టాల్స్టాయ్ తాత్విక విషయాలు వివరంగా మాట్లాడారు. కాంట్, హెగెల్ వంటి వారు చాలా గౌరవనీయులని అయితే నీషేలో తన శిష్యుడు డా.ఎగ్మన్ షిట్ అద్భుతమైన విషయాలు కనుగొన్నాడని చెప్పారు.

ఆయన సాహిత్య విమర్శ ఆసక్తికరంగా వుంది. రష్యన్ సాహిత్యం గురించి ఆయనకు పెద్ద గొప్ప అభిప్రాయం లేదు. నిజానికి ఇతర సాహిత్యాల పట్ల కూడా అంతే. లోగడ సాహిత్యం అనేది ఆస్థాన సంగీతం లాగా వుండి కొద్ది మందికే సంతోషం కలిగించేది. ఇప్పుడు సాహిత్యం చాలా విస్తారమైన వాణిజ్య, పారిశ్రామిక వర్గాల అభిరుచులకు తగినట్టు తయారవుతున్నది. కాని మొత్తంగా ప్రజలందరి దృష్టితో రూపొందేవరకూ సాహిత్యం తన స్వతంత్ర్యాన్ని తాను కాపాడుకోలేదు. అన్నారు ఇలా అంటూ ఇంగ్లీషు సాహిత్యం నుంచి కొన్ని ఉదాహరణలు చెప్పారు. చార్లెస్ డికెన్స్పై ఆయనకు అపరిమితమైన ప్రశంసా భావం. చైల్డ్స్ హిస్టరీ ఆఫ్ ఇంగ్లాండ్ అన్న డికెన్స్ పుస్తకాన్ని ఇటీవలనే మరోసారి చదివారు. ఇబ్సెన్ ఆయనకు అంతగా రుచించడు. వెన్ వుయ్ డెడ్ అవేక్ అన్న ఆయన రచనను తీవ్రంగా విమర్శించారు. అనటోల్ ఫ్రాన్స్ రాసిన క్రైన్ బిల్లే పట్ల ఆయన ప్రత్యేక ప్రశంసలు కురిపించారు. నవలా రచనా ప్రక్రియ ఎంతగా తీర్చిదిద్ద బడిందంటూ సంతోషపడ్డారు. అంతెందుకు ఈ రోజున రష్యన్ మహిళలు అద్భుతంగా రాస్తారు. టర్జనీవ్ కన్నా నా కన్నా కూడా ఎంతో బాగా రాస్తారు. కాకపోతే వాటిలో విషయమేమీ వుండదు' అన్నాడు.

"జర్నలిజం చాలా తప్పుడు వ్యాపారం అని ఆయన కొట్టిపారేశారు. వార్తా పత్రిక అనేది ఏదో ఒక పార్టీని బలపరుస్తుంది. కాని వాస్తవానికి అది స్వతంత్రంగా వుండాలి. అంతేగాక జర్నలిజంలో మనుషులు హడావుడిగా పని చేయాలి. ఇతరులను అధిగమించేందుకు యత్నించాలి. ఆ విధంగానూ అది చెడ్డదే" అని వివరించారు. "అయితే దానిలో చాలా మంచి కూడా వుంది. ఏమంటే అది మనుషులకు సమాచారం అందిస్తుంది. అసలు క్రైస్తవ విజ్ఞానం అనేదంతా చాలా వరకు భాషా జ్ఞానమే. అది మనుషులను దగ్గర చేస్తుంది" అన్నారు.

ఆ రోజుటి సంభాషణలో నేను మరింత నమోదు చేయలేకపోయాను. ఆయన చెప్పింది ఆయన మాటల్లోనే నమోదు చేసుకోవాలనే తపనతో నేను ఆయన వ్యక్తిత్వ అంశాలను పేర్కొనలేదు. మా సంభాషణ అనేక అవాంతరాలతో నడిచింది. కొంత భోజనంలో పోయింది. కొంత చదువులో కొంత టీ తాగడంలో ఇలా...టాల్స్టాయ్ శైలి వల్ల కూడా అనేకసార్లు ఆటంకాలు కలిగాయి. ఆయన గంభీరంగా మాట్లాడుతూ ఆషామాషీగా మారిపోతాడు. సాధారణ విషయాలు చెబుతూనే వ్యక్తిగత విషయాల్లోకి జారిపోతాడు. ఆయన చాలా నిరాడంబరంగా దయార్ద్రంగా ఎలాంటి భేషజాలు లేకుండా మాట్లాడాడు. పిడివాదం వంటిది ఎక్కడా గోచరించలేదు. తన అభిప్రాయాన్ని వ్యతిరేకించే మాటలు వినడానికి సిద్ధంగా వుంటాడు. ప్రశాంతత కోల్పోయిన భావన ఒక్కసారి కూడా కలిగించలేదు.

**(హెరాల్డ్ విలియమ్స్ 1905 ఫిబ్రవరి 9న మాంచెస్టర్ గార్డియన్ పత్రిక కోసం చేసిన ఇంటర్వ్యూ కథనం సంక్షిప్తంగా)**



# జీవితం లోంచి... పుస్తకాల్లోంచి...

## మక్సీమ్ గోర్కీ

**(28.03.1868-18.06.1936)**

ప్రముఖ రష్యన్ రచయిత. ఇతని రచనలలో ముఖ్యంగా 'అమ్మ' విప్లవానికి ఎంతో తోడ్పడింది.

నేను జీవితంనుంచీ, పుస్తకాలనుంచీ ఉభయత్రా అనుభూతుల్ని పోగుచేసుకున్నాను. మొదటి వాటిని ముడి పదార్థంతో పోల్చవచ్చు, రెండవ వాటిని సగం ఉత్పత్తి అయిన పదార్థంతో పోల్చవచ్చు. లేదా, ముతగ్గా అయినా సాదా మాటల్లో చెప్పాలంటే మొదటి సందర్భంలో నేను పశువుతో వ్యవహరించాల్సి వచ్చింది, తర్వాత సందర్భంలో మహా చక్కగా పదును చేసిన చర్మంతో వ్యవహరించాల్సి వచ్చింది. నేను విదేశీ సాహిత్యానికి చాలా యెక్కువగా రుణపడివున్నాను, ముఖ్యంగా ఫ్రాన్సు దేశపు సాహిత్యానికి. మా తాత క్రూరంగా, పిసినారిగా వుండేవాడు. కాని బాల్జాక్ "ఎజెనీ గ్రాండే" చదివే దాకా నేను ఆయన్ని సరిగా అర్థం చేసుకోలేకపోయాను. ఎజెనీ తండ్రి వృద్ధ గ్రాండే కూడా క్రూరంగా పిసినారిగా వుండి, మా తాతని పోలి వుండేవాడు. కాని అతను మా తాత కంటే మరింత మొరటుగా, ఆసక్తికరంగా వుండేవాడు. యీ ఫ్రెంచి మనిషితో పోలిస్తే, నేను ప్రేమించని ఓ ముసలి రష్యన్ మెరుగయ్యాడు. యిది ఆయన పట్ల నా దృక్పథంలో మార్పు తేలేదు కాని నేను గొప్ప ఆవిష్కరణ చేశాను. అంటే, మనిషిలో నేను చూడని దాన్నీ, నాకు తెలియని దాన్నీ, దేన్నో పుస్తకాలు నాకు తెలియజేస్తున్నాయి అన్నదాన్ని కనుగొన్నాను.

నీజ్ని నోవ్‌గొరాద్‌లోని తరహా జీవితాన్ని మనుషులు ఇంగ్లీషు, జర్మన్ రాష్ట్రాలలో గడపడం లేదు గాని, అంతకంటే పెద్ద మెరుగు యేమీ కాదని జార్జి ఎలియట్ నీరసపు నవల "మిడిల్ మార్చ్", ఔయెర్‌బాఖ్, ష్పిల్‌హాగెన్ పుస్తకాలు నాకు తెలియచేశాయి. వాళ్లు అలాంటి విషయాలే మాట్లాడుకునే వాళ్లు – తను ఇంగ్లీషు, జర్మన్ పైసలని గురించి, ప్రభువంటే భయపడ్డమూ, ఆయన్ని ప్రేమించడమూ గురించీ మాట్లాడుకునే వాళ్లు.

దగ్గర దగ్గర యిరవై యేళ్ల వయసప్పటికే, జనానికి చెప్పగలిగిందీ, చెప్పి తీరవలసిందీ యెంతో నేను చూసినట్టూ, విన్నట్టూ, అనుభవించినట్టూ నేను గుర్తించాను. మిగతా వాళ్లకంటే భిన్నంగా కొన్ని విషయాలని నేను తెలుసుకున్నట్టూ అనుభవించినట్టూ నాకు అనిపించింది. అది నన్ను కలత బెట్టింది, అశాంతిగా, వదిరేటు వంటి మానసిక స్థితిలో పెట్టింది కూడా. తుర్గేనెవ్ లాంటి సిద్ధహస్తులైన రచయితలు రాసినవి చదివేటప్పుడు కూడ ప్రధాన పాత్రల గురించి నేను బహుశా యేదో చెప్పగలనేమోననీ, ఉదాహరణకి "వేట గాని కథలు" నాయకుల గురించి తుర్గేనెవ్ కంటే మరోలా చెప్పగలనేమోనని అనిపించింది. అప్పటికే కథాకథన నైపుణ్యం వున్న వాడినని నాకు పేరు వచ్చింది. ఓడ రేవు కార్మికులు, రొట్టెలు తయారు చేసేవాళ్లు, తిరుగుబోతులు, తివాసీలు చేసేవాళ్లు, రైల్వే కార్మికులు, దేశద్రిమ్మరులు, మొత్తంమీద నేను యెవళ్ల మధ్య బతుకుతున్నానో వాళ్లంతా నేను చెప్పే వాటిని ఆసక్తిగా వినేవాళ్లు. నేను చదివిన పుస్తకాలనుంచి విషయాలనీ తిరిగి చెప్పేటప్పుడు, తరుచుగా యితివృత్త సన్నివేశాలని మార్చేస్తు న్నట్టూ, నేను చదివిన దాన్ని వక్రీకరిస్తున్నట్టూ, నా అనుభవంలో నుంచే సేకరించిన వాటిని జోడిస్తున్నట్టూ నాకు అవగతం అయింది. అలా ఎందుకు జరిగిందంటే జీవిత, సాహిత్యాల వాస్తవాలు నా మనసులో పెన వేసుకుపోయాయి. ఒక పుస్తకం మనిషి అంతగానూ ఒక కనిపించే విషయం. అది సజీవ, భాషణ వాస్తవం కూడా. అది మానవుడు సృష్టించిన, సృష్టిస్తూ వున్న విషయాలన్నిటి కంటె కూడా చాల తక్కువ "విషయం".

నా మీద "పెద్ద" ఫ్రెంచి రచయితలు స్టెండాల్, బాల్జాక్, ఫ్లోబెర్‌లు గాఢమైన రూపనిష్పాదక ప్రభావం కలిగించారు. ఆరంభకులందరికీ యీ రచయితల పుస్తకాలని చదవమని నేను సలహా యిస్తాను. వాళ్లు నిజంగా మేధావంతులైన కళాకారులు, రూపానికి సంబంధించి అందె వేసిన నిపుణులు.

కాని సరిగ్గా మా వీధిలో వాళ్లల్లాగానే ఒకళ్లనొకళ్లు ద్వేషించుకునే వాళ్లు, ముఖ్యంగా, యేదో ఒక రకంగా తను చుట్టుతా వున్న అధికసంఖ్యాకుల కంటే భిన్నంగా, వేరే తరహాగా వుండేవాళ్లని. రష్యన్లకీ విదేశీయులకీ మధ్యన సారూప్యంగా వుండే అంశాల కోసం నేను వెదకడం లేదు. నేను తేడాలు చూడబోయాను, అయినా కాని పోలిక కనిపించింది.

దివాళా తీసిన వర్తకులు, మా తాత ఆప్తమిత్రులు, థాకరే నవల "వానిటీ ఫెయిర్" లోని మనుషుల మాదిరే, అదే విషయాలని గురించి మాట్లాడేవాళ్లు. నేను రాయడమూ, చదవడమూ స్తోత్రపాఠంనుంచి నేర్చుకున్నాను. నాకు ఆ పుస్తకం అంటే యిష్టం యేమంటే అది కమ్మని, సంగీత భాషలో వుంది. మా తాతా యింకా యితర ముసలాళ్లూ తమ పిల్లల గురించి ఒకళ్లకొకళ్లు పితూరీలు చెప్పుకుంటూ వుంటే దేముడికి అవిధేయుడైన కొడుకు అబ్‌సాలెమ్ గురించి చక్రవర్తి డెవిడ్ చేసిన పితూరీలు నాకు గుర్తుకువచ్చాయి. మామూలుగా మనుషులు, ముఖ్యంగా యువకులూ, పాడై పోయారనీ, యింకా బదుద్ధాయిల్లాగా సోమరిగా తయారవుతున్నారనీ, భగవంతుడి పట్ల భయభక్తులు లేకుండా పోతున్నాయనీ ఆ ముసలాళ్లు అనుకునేటప్పుడు వాళ్ళు నిజం చెప్పడం లేదనే నాకు అనిపించింది. డికెన్సు చిత్రించిన వంచకులు సరిగ్గా అలాంటి విషయాలనే అనుకునేవాళ్లు.

చర్చి మనుషుల మధ్యన వాదాలని జాగ్రత్తగా విన్నాక, వాళ్లు మిగతా దేశాల్లోని చర్చి మనుషుల్లాగా మాటలని పట్టుకుని వేలాడుతున్నారనీ, చర్చి మనుషులందరికీ, మిగతా వాళ్లని అణగదొక్కి వుంచడానికి మాటలన్నీ ఒక దారి అనీ, చర్చి వాళ్ళనే పోలిన రచయితలు వున్నారనీ నేను కనిపెట్టాను. ఆసక్తికారకమైనా, యీ పోలికలో యేదో అనుమానస్పదమైంది వుందని త్వరలోనే నాకు అనిపించింది.

నేను చెత్త పుస్తకాలని లెక్కలేకుండా చదివాను. కాని అవి కూడా నాకు ఉపయోగపడ్డాయి. జీవితంలోని అనాకర్షక భాగాలని గురించి కూడా ఆకర్షవంతమైన భాగాలల్లాగానే యెవళ్లేనా తెలుసుకోవాలి. సాధ్యమైనంత అధిక జ్ఞానం సంపాదించాలి. అనుభవం యెంత వైవిధ్యపూరిత మైందైతే అంత పురోగమనాన్ని మనిషి సంపాదించుకుంటాడు, అతని దృష్టి పథం అంత విస్తృతమవుతుంది.

నా మీద "పెద్ద" ఫ్రెంచి రచయితలు స్టెండాల్, బాల్జాక్, ఫ్లోబెర్‌లు గాఢమైన రూపనిష్పాదక ప్రభావం కలిగించారు. ఆరంభకులందరికీ యీ రచయితల పుస్తకాలని చదవమని నేను సలహా యిస్తాను. వాళ్లు నిజంగా మేధావంతులైన కళాకారులు, రూపానికి సంబంధించి అందె వేసిన నిపుణులు.

మాటలతో ప్రజలని వర్ణించే కళ, వాళ్ల సంభాషణని సజీవంగా, శ్రవణ గ్రాహితంగా చేసే కళ, సంభాషణని సృష్టించడంలో పరిణతి చెందిన నైపుణ్యం గల బాల్జాక్, తదితర ఫ్రెంచి రచయితల నేర్పు యెప్పుడూ నన్ను ముంచెత్తేసేది. బాల్జాక్ పుస్తకాలు తైల వర్ణచిత్రాలతో చేసినవేమోననిపించేది. నేను మొదటి సారి రూబెన్స్ చిత్రాలు చూసినప్పుడు నాకు తక్షణం బాల్జాక్ గుర్తుకువచ్చాడు. దొస్తొవస్కీ రాసిన తిక్క పుస్తకాలు చదివినప్పుడు, నవలా సాహిత్యపు యీ మహా నిపుణుడికి ఆయన చాలా ఋణపడి వున్నాడని అనుకోకుండా వుండలేకపోయేవాణ్ణి . లేఖినితో గీసిన చిత్రాల్లాగా తీక్షణంగా వున్న బిగిగల గొన్‌కూర సోదరుల నవలలూ నాకిష్టంగానే వుండేవి. మబ్బుగా వుండే రంగులతో, హత్తుకునేటట్టు గీసిన చిత్రాల్లాగా వుండే జోల వ్యాకుల రచనలూ ఇష్టంగానే వుండే హ్యూగో నవలలు నన్ను ముగ్ధుణ్ని చెయ్య లేదు."1793వ సంవత్సరా"న్ని కూడా యేదో ఉదాసీనంగా చదివాను. తర్వాత మాత్రమే అనతోల్ ఫ్రాన్స్ రాసిన "దేవతల కాంక్ష" చూశాకనే ఆ ఉదాసీనతకి కారణం నాకు అర్థం అయింది. యెన్నో విషయాలని అసహ్యించుకోవడం నేను నేర్చుకున్నాకనే నేను స్టెండాల్ రాసిన వాటిని చదివాను, అతని నిబ్బరమైన మాటా, సంశయాత్మక మందహాసం నన్ను నా ద్వేషంలో దృఢం చేశాయి.

పైన చెప్పిన దాన్ని బట్టి తేలేది యేమిటంటే నేను రాయడం అనే దాన్ని ఫ్రెంచి రచయితలనుంచి నేర్చుకున్నాను. యిది యాదృచ్ఛికమే, కాని ఫలితాలు ప్రయోజనకరంగా వున్నాయి.

రష్యన్ సాహిత్యంలో మహా రచయితలైన గోగొల్, టాల్‌స్టాయ్, తుర్గేనెవ్, గొన్‌చరోవ్, దొస్తొయేవ్‌స్కీ, లెస్కోవ్‌ల

నేను తరుచుగా నన్ను అణగార్చినవో, లేక ఆనంద పెట్టినవో ఆ సకల విషయాలనీ వ్యక్తం చేయ్యాలనే ప్రేరణతోటి వాగ్దాటి దాడులని, మాటల ఝరిని అనుభవించి మత్తెక్కి పోయేటట్టువాణ్ణి. "నా గుండె గుబగుబ వదిలించుకోవాల"ని ఆత్రపడే వాణ్ణి. నా లోపలి ఉద్రిక్తతవల్ల నేను చిత్రహింస పడిన క్షణాలు వున్నాయి. నా కంఠంలో ఉండ కొట్టుమిట్టాడిన క్షణాలు వున్నాయి. నా మిత్రుడు, గాజు వూదే అనతోలి ప్రతిభ వున్న కుర్రాడనీ సహాయం యేం రాకపోతే నాశనమై పోతాడనీ అరవాలనిపించేది. సామాన్య వేశ్య థెరెసా చక్కని మనిషనీ ఆమె పడుపు వృత్తికి దిగడం అన్యాయమనీ అరవాలనిపించేది.

రచనలని నేను చదివింది చాలా తర్వాతనే, తన అద్భుతమైన భాషా సంపదతోటీ, జ్ఞానం తోటీ నా మీద నిస్సందేహంగా లెస్కోవ్ ప్రభావం కలిగించాడు. రష్యన్ జీవితంలోకి చొచ్చుకుపోయిన సన్నిహితమైన పరిశీలనా దృష్టిగల గొప్ప రచయిత ఆయన. ఆయనకి మన సాహిత్యంలో రావాల్సినంత పేరు రాలేదు. తను లెస్కోవ్‌కి యెంతో రుణపడివున్నానని చేహొవ్ అన్నాడు.

రష్యన్ సాహిత్యమూ, విదేశీ సాహిత్యమూ – వీటి అభివృద్ధి గురించిన పరిజ్ఞానం రచయితకి విధిగా వుండాలని మళ్లీ చెప్పడానికే యీ పరస్పర సంబంధాలనీ, ప్రభావాలనీ నేను పేర్కొన్నాను.

దగ్గర దగ్గర యిరవై యేళ్ల వయసప్పటికే, జనానికి చెప్పగలిగిందీ, చెప్పి తీరవలసిందీ యెంతో నేను చూసినట్టూ, విన్నట్టూ, అనుభవించినట్టూ నేను గుర్తించాను. మిగతా వాళ్లకంటే భిన్నంగా కొన్ని విషయాలని నేను తెలునుకున్నట్టూ అనుభవించినట్టూ నాకు అనిపించింది. అది నన్ను కలత బెట్టింది, అశాంతిగా, వదిరేటు వంటి మానసిక స్థితిలో పెట్టింది కూడా. తుర్గేనెవ్ లాంటి సిద్ధహస్తులైన రచయితలు రాసినవి చదివేటప్పుడు కూడ ప్రధాన పాత్రల గురించి నేను బహుశా యేదో చెప్పగలనేమోననీ, ఉదాహరణకి "వేట గాని కథలు" నాయకుల గురించి తుర్గేనెవ్ కంటే మరోలా చెప్పగలనేమోనని అనిపించింది. అప్పటికే కథాకథన నైపుణ్యం వున్న వాడినని నాకు పేరు వచ్చింది. ఓడ రేవు కార్మికులు, రొట్టెలు తయారు చేసేవాళ్లు, తిరుగుబోతులు, తివాసీలు చేసేవాళ్లు, రైల్వే కార్మికులు, దేశద్రిమ్మరులు, మొత్తంమీద నేను యెవళ్ల మధ్య బతుకుతున్నానో వాళ్లంతా నేను చెప్పే వాటిని ఆసక్తిగా వినేవాళ్లు. నేను చదివిన పుస్తకాలనుంచి విషయాలనీ తిరిగి చెప్పేటప్పుడు, తరుచుగా యితివృత్త సన్నివేశాలని మార్చేస్తున్నట్టూ, నేను చదివిన దాన్ని వక్రీకరిస్తున్నట్టూ, నా అనుభవంలో నుంచే సేకరించిన వాటిని జోడిస్తున్నట్టూ నాకు అవగతం అయింది. అలా ఎందుకు జరిగిందంటే జీవిత, సాహిత్యాల వాస్తవాలు నా మనసులో పెన వేసుకుపోయాయి. ఒక పుస్తకం మనిషి అంతగానూ ఒక కనిపించే విషయం. అది సజీవ, భాషణ వాస్తవం కూడా. అది మానవుడు సృష్టించిన, సృష్టిస్తూ వున్న విషయాలన్నిటి కంటె కూడా చాల తక్కువ "విషయం".

నేను చెప్పేది విన్న మేధావులు నాకు ఇలా సలహా యిచ్చారు: "మీరు రాసితీరాలి. ప్రయత్నించి చూడండి."

నేను తరుచుగా నన్ను అణగార్చినవో, లేక ఆనంద పెట్టినవో ఆ సకల విషయాలనీ వ్యక్తం చేయ్యాలనే ప్రేరణతోటి వాగ్దాటి దాడులని, మాటల ఝరిని అనుభవించి మత్తెక్కి పోయేవాణ్ణి. "నా గుండె గుబగుబ వదిలించుకోవాల"ని ఆత్రపడే వాణ్ణి. నా లోపలి ఉద్రిక్తతవల్ల నేను చిత్రహింస పడిన క్షణాలు వున్నాయి. నా కంఠంలో గుండె కొట్టుమిట్టాడిన క్షణాలు వున్నాయి. నా మిత్రుడు, గాజు వూదే అనతోలి ప్రతిభ వున్న కుర్రాడనీ సహాయం యేం రాకపోతే నాశనమై పోతాడనీ అరవాలనిపించేది. సామాన్య వేశ్య థెరెసా చక్కని మనిషనీ ఆమె పడుపు వృత్తికి దిగడం అన్యాయమనీ అరవాలనిపించేది. ఆమె దగ్గరికి వెళ్లే విద్యార్థి కుర్రాళ్లు యీ విషయాన్ని చూళ్లేదు, జీవనాధారం కోసం ముష్టి యెత్తుకునే ముసలామె మాతిత్సా, పడుచుదనంతో వుండి బాగా చదువుకున్న మంత్రసాని యాకొవ్‌లేవా కంటే గట్టి బుర్ర వున్న మనిషని గ్రహించినట్టే.

వచనం చాలా కాలం నా అడుగులని అనుసరించి, అవాంఛనీయంగా అనువు గాని చోట నా కథల్లోకి ఇంకిపోయింది... మొత్తం మీద నేను ఒక 'రమ్యమైన' శైలిని వాడటానికి ప్రయత్నించాను. ఒక ఉదాహరణ : "ఆ తాగుబోతు, వదనం మీద మందహాసంతో, చలించే తన నీడని పరీక్షిస్తూ దీపస్తంభాన్ని ఆలింగనం చేసుకుని నుంచున్నాడు." నేనే రాసినట్టుగా ఆ రాత్రి, సందర్భవశాత్తూ, గాలి లేకుండా, వెన్నెలగా

**కళాకారుడు తన దేశాన్నీ, తన వర్గాన్నీ ప్రభావితం చేసే సర్వాన్నీ అతి సున్నితంగా గ్రహించేవాడు - దాని చెవి, కన్ను, గుండెకాయ. అతనిది తన కాలపు గొంతు. అతను ఎంత వీలైతే అంతా తెలుసుకోవాల్సిన విధి వున్నవాడు. మరి అతను గతాన్ని గురించి ఎంత బాగా తెలుసుకుంటే, వర్తమానాన్ని అంతబాగా అర్థం చేసుకోగలడు. అంత గాఢంగా నిశితంగా అతను మన కాలపు సార్వజనీన విప్లవత్వాన్ని, దాన్ని ఎదుర్కొనే కర్తవ్యాల పరిధినీ గ్రహిస్తాడు. ప్రజల చరిత్రకి సంబంధించిన పరిజ్ఞానం ముఖ్యం, అలాగే దాని సాంఘిక, రాజకీయ ఆలోచనా సరళికి సంబంధించిన జ్ఞానమూనూ. పండితులు - సంస్కృతి చరిత్రకారులు, మానవ జాతుల శాస్త్రీయ వర్ణన చేసే వాళ్లు - యీ ఆలోచన అద్భుత కథల్లోనూ, కల్పిత కథల్లోనూ, సామెతల్లోనూ, సూక్తుల్లోనూ వెల్లడి అవుతుందని వివరించారు.**

వుంది. ఆ రోజుల్లో అలాంటి రాత్రుల్లప్పుడు వీధి దీపాల్ని వెలిగించేవాళ్లు కారు. పైగా ఒక వేళ దీపాలు వెలిగినా గాలి లేకుండా వున్నప్పుడు ఆ మనిషి నీడ నిశ్చలం వుంటుంది. అలాంటి పొరపాట్లూ, తప్పులూ నా కథల్లో ప్రతిదాంట్లోనూ తగిలాయి. దానికిగాను నన్ను నేనే తీవ్రంగా నిందించుకున్నాను.

కొన్ని తప్పులు చిన్నవిగానే కనిపించవచ్చును గాని అవి చాలా ముఖ్యమైనవి. ఏమంటే అవి కళాత్మక సత్యాన్ని అతిక్రమిస్తాయి. మొత్తం మీద, "అల్పాక్షరముల అనల్పార్థ రచన" కోసం, మాటని పొదుపుగా వాడుతూ కూడా విస్తారమైన ఆలోచనా పరిధిని పరివేష్టితం చెయ్యడం కోసం, మాటల ఉపకరణం ద్వారా సజీవ చిత్రాలని సృష్టించడం కోసం, ఒక పాత్ర ప్రధాన లక్షణాన్ని పదునుగా వివరిస్తూ తక్షణం పాఠకుని మనసుమీద ఆ పాత్ర నడవడిక, మాట తీరు చెక్కడం కోసం కచ్చితమైన మాటలని ఎన్నుకోవడం చాలా కష్టం. మాటల మాధ్యమికం ద్వారా మనుషులకీ, వస్తువులకీ "చిత్రాత్మకత"ని ఇవ్వడం ఒక యెత్తు, "యుద్ధమూ - శాంతీ"లో లాగా వాళ్లు భౌతికంగా స్పర్శనీయం అవగలందుకు 'త్రీ డైమెన్షన్స్'లో వాళ్లని కళ్లకి కట్టినట్టు వర్ణించడం ఇంకో యెత్తు.

నా దోషాలు ఎప్పుడూ ఒక కవి విచారపూరిత మాటలని మనసుకి తెచ్చేవి : "మాటల చిత్రహింసని మించిన నిశితమైన చిత్రహింస ప్రపంచంలో లేదు." మన బీద భాష శీతలంగా దారిద్ర్యంతో వుంది" అని నాద్‌సన్ కవి కామోసు అన్నాడు. భాషా "దారిద్ర్యాన్ని" గురించి అసంతృప్తి ప్రకటించని కవి అరుదు అనుకుంటాను.

భాషని ప్రజలు సృష్టిస్తారని మీకు గుర్తు చెయ్యడం ఉచితం ఇక్కడ. సాహిత్య భాష అనీ, ప్రజల భాష అనీ అనడం వూరికే ఒకటి "ముడి సరుకు" అనీ, రెండవది సిద్ధహస్తులు మలిచింది అని చెప్పడమే. దీన్ని పూర్తిగా గుర్తించిన మొదటివాడు పూష్కిన్. ప్రజలు సమకూర్చిన భాషణ సామాగ్రిని ఉపయోగపెట్టుకుని, వ్యవహరించాల్సిన తీరు చూపించిన మొదటివాడూ ఆయనే.

కళాకారుడు తన దేశాన్నీ, తన వర్గాన్నీ ప్రభావితం చేసే వాటన్నిటినీ అతి సున్నితంగా గ్రహించేవాడు - దాని చెవి, కన్ను, గుండెకాయ. అతనిది తన కాలపు గొంతు. అతను ఎంత వీలైతే అంతా తెలుసుకోవాల్సిన విధి వున్నవాడు. మరి అతను గతాన్ని గురించి ఎంత బాగా తెలుసుకుంటే, వర్తమానాన్ని అంతబాగా అర్థం చేసుకోగలడు. అంత గాఢంగా నిశితంగా అతను మన కాలపు సార్వజనీన విప్లవత్వాన్ని, దాన్ని ఎదుర్కొనే కర్తవ్యాల పరిధినీ గ్రహిస్తాడు. ప్రజల చరిత్రకి సంబంధించిన పరిజ్ఞానం ముఖ్యం, అలాగే దాని సాంఘిక, రాజకీయ ఆలోచనా సరళికి సంబంధించిన జ్ఞానమూనూ. పండితులు - సంస్కృతి చరిత్రకారులు, మానవ జాతుల శాస్త్రీయ వర్ణన చేసే వాళ్లు - యీ ఆలోచన అద్భుత కథల్లోనూ, కల్పిత కథల్లోనూ, సామెతల్లోనూ, సూక్తుల్లోనూ వెల్లడి అవుతుందని వివరించారు. ఎంతో బోధనాత్మకంగా, పరిపూర్తిగా వుండే రీతిలో ప్రజా బాహుళ్యం ఆలోచించే ధోరణిని సూక్తులూ సామెతలూనే వాస్తవంగా వ్యక్తం చేస్తాయి. కొత్త రచయితలు వాటికి సంబంధించి పరిజ్ఞానం సంపాదించుకోవాలి,

మొత్తం మీద, సామెతలూ, సూక్తులూ అనేవి శ్రామిక ప్రజలు కూడబెట్టుకున్న సాంఘిక చారిత్రక అనుభవాన్ని సంక్షిప్తంగా పొదివి పట్టుకున్నవే. గుప్పిట ముడిస్తే వేళ్లు ముడుచుకున్నట్టుగా, రచయిత అనేవాడికి మాటలని కుదించడం నేర్పే సరంజామా చాలా అవసరం. అలాగే ఇతరులు కుదించిన వాటిని విస్తరించడమూనూ. అది కూడా ఆ కాలానికి విరుద్ధంగా వున్న,

**నాకు సంబంధించి మనిషికి బయట భావాలనేవి లేవు. నాకు సంబంధించి మానవుడు– మానవుడే– సకల వస్తువులనీ, సకల భావాలనీ సృష్టించినవాడు, అద్భుతాలనీ చేసేవాడు అతనే, ప్రకృతి శక్తుల భవిష్యత్ నాధుడు అతనే. మన ఈ ప్రపంచంలో అత్యంత సుందరమైంది మానవుడి శ్రమవల్ల సృష్టింపబడిందే, అతని కుశలమైన హస్తాలవల్ల నిర్మితమైందే. మన సకల ఆలోచనలు, భావాలు శ్రమ క్రమంలో ఉత్పన్నమైనవే. కళా, విజ్ఞానశాస్త్ర, సాంకేతిక పరిజ్ఞాన చరిత్ర మనకి విశ్వాసం కలిగించేది ఇది. వాస్తవాన్ని అనుసరించి వస్తుంది ఆలోచన. నేను మానవుడికి నివాళ్ళు అర్పిస్తున్నాను, ఏమంటే మన ప్రపంచంలో అతని హేతువు, అతని వూహ, అతని కల్పనల మూర్తి తప్ప నాకేం గోచరం కాదు.**

లేదా పాతబడిపోయిన అంతర్భూత అర్థాలని వెల్లడిచేసేటట్టు వుండం.

నాకు తిరుగుబోతులూ, ఆవారాగాళ్లూ మామూలు గాడిలో లేని మనుషులుగా కనిపించారు. వాళ్లు ప్రజలతో విభేదించి వుండేవాళ్లు. యేమంటే కులం పోగొట్టుకోవడం వల్లా, తమ వర్గం నుంచి బహిష్కృతమవడం వల్లా వాళ్లు తమ పూర్వ వాసనలని వదిలించుకున్నారు.

ఈ వెలివేసిన మనుషులలో వింత మనుషులు వుండేవాళ్లు. నాకు అర్థం కానిది వాళ్లల్లో చాలా వుండేది. నేను వాళ్ల పట్ల అనుకూలంగా వుండడం అనేది, వాళ్ళు జీవితం మీద ఫిర్యాదు లేమి చెయ్యకపోవడం వల్లనే. స్థితిమంతుల కులాసా జీవితం అంటే వాళ్లకి అసూయ లేదు. దాన్ని గురించి పరిహాసంగా, ఎత్తిపొడుపుగా మాట్లాడుకుంటూ, అందని ద్రాక్ష పళ్ళు పుల్లన అనే భావమే ద్యోతకం కానియ్యరు. తమ జీవితాలు బీదరికంతో వున్నా, కులాసాగా గడిపేవాళ్లకంటే తామే మెరుగని, తాము ఏదో గుర్తించినట్టుగా, వాళ్లు గొప్పగా భావించుకునేవాళ్లు.

బహిష్కృతుల పట్లా, ఆవారాల పట్లా నాకు గల మొగ్గుకి సంబంధించిన వివరణే నేను చెప్పింది అంతా మందకొడి సంస్కారహీనులని కాకుండా మామూలు జీవితపు గాడికి బయట వున్న వాళ్లని, చిత్రించాలన్న నా కోరికని వివరించిందే. నేను విదేశీ సాహిత్య ప్రభావం కింద కూడా వున్నాను. మొదటగా ఫ్రెంచి సాహిత్యం,అది రష్యా సాహిత్యం కంటే ఇంకా ఎక్కువ కళ్లకి కట్టినట్టూ, వర్ణ శోభితంగానూ వుంది. "అణగార్చే మందకొడి జీవితాన్ని" నా వూహద్వారా ఉత్సాహభరితం చెయ్యడమనే నా కోరికే ప్రధాన కారణం.

నేనిదివరకే చెప్పినట్టుగా ఆ కోరికని "రొమాంటిసిజం" అంటారు. కొంత మంది విమర్శకుల అభిప్రాయంలో నా రొమాంటిసిజం నా తాత్వికతలో వున్న భావవాదపు ప్రతిబింబమే. ఆ అంచనా తప్పని నా అభిప్రాయం.

నాకు సంబంధించి మనిషికి బయట భావాలనేవి లేవు. నాకు సంబంధించి మానవుడు– మానవుడే– సకల వస్తువులనీ, సకల భావాలనీ సృష్టించినవాడు, అద్భుతాలనీ చేసేవాడు అతనే, ప్రకృతి శక్తుల భవిష్యత్ నాధుడు అతనే. మన ఈ ప్రపంచంలో అత్యంత సుందరమైంది మానవుడి శ్రమవల్ల సృష్టింపబడిందే, అతని కుశలమైన హస్తాలవల్ల నిర్మితమైందే. మన సకల ఆలోచనలు, భావాలు శ్రమ క్రమంలో ఉత్పన్నమైనవే. కళా, విజ్ఞానశాస్త్ర, సాంకేతిక పరిజ్ఞాన చరిత్ర మనకి విశ్వాసం కలిగించేది ఇది. వాస్తవాన్ని అనుసరించి వస్తుంది ఆలోచన. నేను మానవుడికి నివాళ్ళు అర్పిస్తున్నాను, ఏమంటే మన ప్రపంచంలో అతని హేతువు, అతని వూహ, అతని కల్పనల మూర్తి తప్ప నాకేం గోచరం కాదు. భగవంతుడు మానవుడి వూహాలో కల్పితమే, ఫొటోగ్రఫీలాగా, తేడా ఏమంటే కెమెరా వాస్తవమైన దాన్ని చిత్రిస్తుంది. భగవంతుడు అనేవాడు మానవుడు సర్వజ్ఞుడుగా, సర్వశక్తివంతుడుగా, పరమ ధర్మమూర్తిగా వుండగలిగి, వుండాలని కోరుకున్న జీవిగా తను ఊహించిన దాన్ని కనిపెట్టిన ఫొటోగ్రాఫే.

"పవిత్రమైన" దాన్ని గురించి మాట్లాడాల్సిన అవసరం వుంటే, నేను పవిత్రంగా ఎంచే ఒక్కటీ ఏమంటే మానవుడు తనపట్ల తను చెందే అసంతృప్తి, ఇంతకంటే అధికుడుగా తయారవాలని అతను చేసే కృషి. మానవుడు తనే ఉనికి కలిగించి, జీవితాన్ని బంధనం చేసే చెత్త అంతటినీ ద్వేషించడాన్నే పవిత్రంగా భావిస్తాను. అసూయని, దురాశని, నేరాన్ని, రోగాన్ని, యుద్ధాలని ప్రపంచంలోని ప్రజల మధ్య శత్రుత్వాలన్ని రూపుమాపాలనే అతని సంకల్పాన్ని పవిత్రంగా భావిస్తాను. అతని శ్రమని పవిత్రంగా భావిస్తాను.

**(గోర్కీ "సాహిత్య వ్యాసాలు" నుంచి -**
**అనువాదం - ఆర్వీఆర్)**



# శ్రామిక వర్గ రచయితలు భ్రమలు, వాస్తవాలు


## లూసన్

**(25.9.1881-19.10.1936)**

ప్రపంచ ప్రసిద్ధ చైనీస్ రచయిత, కథకుడు, విమర్శకుడు. చైనాలో విప్లవ సాహిత్య ఉద్యమ సారథి.


ఈ రోజు 'వామపక్ష' రచయితలు మితవాద (రచయితలుగా మారిపోవటం చాలా సులువని నా అభిప్రాయం. మొట్ట మొదటి అంశం నిజమైన సామాజిక ఘర్షణల గురించి పట్టించుకునే బదులు నీవు మూసిన గాజు కిటికీల వెనుక ఉండిపోయి వ్రాయటం, అధ్యయనం చేస్తే నీవు అత్యంత విప్లవకరం లేక 'వామపక్షం' కావటం చాలా సులువవుతుంది. కాని వాస్తవాన్ని ఎదుర్కొన్న మరుక్షణమే నీ ఆలోచనలన్ని పటాపంచలౌతాయి. మూసుకున్న తలుపుల వెనక విప్లవకర భావాలు మొలకెత్తటం చాలా సహజం. కాని 'మితవాదిగా' మారిపోవటం కూడా అంతే సులువు. పాశ్చాత్య దేశాల్లో 'సేలన్ సోషలిస్టు' అని దీన్నే అంటారు. సేలన్ అంటే నలుగురు కూర్చునే గది. అలాంటి చోట సోషలిజం గురించి, అది వాస్తవ రూపం దాల్చే ఏ ఆలోచనా లేకుండా చర్చిస్తూ కూర్చోవటం చాలా కళాత్మకంగా, హుందాగా ఉంటుంది. ఇలాంటి సోషలిస్టులను అస్సలు నమ్మలేం.

నిజం చెప్పాలంటే నేడు ముస్సోలిని మినహా ఆయన సాహిత్యానికి చెందిన మనిషి కాదు. ఎటువంటి సోషలిస్టు భావాలు లేకుండా ఉండి కార్మికులు, కర్షకులను బానిసగా మార్చాలి, చంపేయాలి, దోచుకోవాలి అనే రచయితలు, కళాకారులు దొరకడం అరుదు. (అలాగని అలాంటివారు అసలే లేరని మనం చెప్పలేం. చైనాలో క్రెసేంట్‌మూన్ ముఠా పైన పేర్కొన్న ముస్సోలిని ప్రీతిపాత్రుడైన డాన్నున్జియో దీనికి ఉదాహరణ).

రెండవది. నీవు విప్లవం అసలు స్వభావాన్ని అర్థం చేసుకోకపోయినా మితవాది అయిపోవటం చాలా సులభం. విప్లవం ఒక చేదు వస్తువు, చీము, రక్తంతో కూడుకున్నది. కవులను కున్నంతలా ఏ లోపం లేకుండా ముచ్చటగా ఉండేది కాదు. అది పూర్తిగా భేషజాలు లేనిది, ఎన్నో చిన్న చిన్న కఠోరమైన పనులతో కూడుకున్నది. కవులు కోరే మోజు కల్పించేది కాదు. అయితే విప్లవంలో వినాశనం ఉంటుంది, కాని నిర్మాణం దానికి ఇంకా ఎక్కువ అవసరం. అలాగే వినాశనం ముక్కుసూటిగా జరిగితే నిర్మాణం మాత్రం కష్టంతో కూడుకున్న పని.

**ఇంకొక తప్పు ఆలోచన ఏమంటే కవులు, రచయితలు శ్రేష్టజీవులని, వారు చేసే పని వేరే ఏ పనికన్నా శ్రేష్టమైనదని అనుకోవడం. హేన్ అభిప్రాయం : కవులు శ్రేష్ట జీవులు గనక, దేవుడు చాలా న్యాయప్రియుడు గనక, చనిపోయిన తరువాత కవులు వెళ్ళి దేవుడి పక్కన కూర్చుంటారు, దేవుడు వాళ్ళకి అల్పాహార విందు చేస్తాడు. నేడు దేవుడి అల్పాహార విందు ఇవ్వటం గురించి ఎవరు నమ్మరు అనుకోండి. కాని కొంత మంది ఇప్పటికీ, కష్టజీవుల విప్లవాన్ని కవులు, రచయితలు బలపరుస్తే విప్లవం విజయవంతమైన తరువాత కార్మిక వర్గం వారికి ప్రత్యేక మర్యాదలు చేసి, తిరగటానికి కార్లిచ్చి, తినటానికి ప్రత్యేకమైన తిండి ఏర్పాటు చేసి, ఘనంగా బహూకరిస్తుందని నమ్ముతారు. కార్మికులు వారికి రొట్టె, వెన్న ఇచ్చి 'తినండి, మీరు మా కవులు!' అని అనగలరు. ఇది ఇంకో భ్రమ.**

నీవు విప్లవం అసలు స్వభావాన్ని అర్థం చేసుకోకపోయినా మితవాది అయిపోవటం చాలా సులభం. విప్లవం ఒక చేదు వస్తువు, చీము, రక్తంతో కూడుకున్నది. కవులను కున్నంతలా ఏ లోపం లేకుండా ముచ్చటగా ఉండేది కాదు. అది పూర్తిగా భేషజాలు లేనిది, ఎన్నో చిన్న చిన్న కఠోరమైన పనులతో కూడుకున్నది. కవులు కోరే మోజు కల్పించేది కాదు. అయితే విప్లవంలో వినాశనం ఉంటుంది, కాని నిర్మాణం దానికి ఇంకా ఎక్కువ అవసరం. అలాగే వినాశనం ముక్కుసూటిగా జరిగితే నిర్మాణం మాత్రం కష్టంతో కూడుకున్న పని.

విప్లవం అంటే తియ్యటి కలలు కనే వారు దాన్ని దగ్గరగా చూసినప్పుడు లేదా వాస్తవంగా ఒక విప్లవం జరిగినప్పుడు గందరగోళానికి లోనవటం చాలా సహజం. రష్యన్ కవి యేసేనిన్ మొదట అక్టోబర్ విప్లవాన్ని మనసారా స్వాగతించి 'భూమ్మీదా, స్వర్గంలోని విప్లవం వర్ధిల్లాలి...! నేను ఒక బోల్షివిక్కుని!' అని నినదించాడట. కాని తరువాత వాస్తవం ఆయన ఊహించిన దానికి భిన్నంగా ఉన్నట్టు ఉందని ఆయన దిక్కుతోచని వాడై క్షీణించిపోయాడు. ఈ దిక్కు తోచని స్థితే తరువాత ఆయన ఆత్మహత్యకు ఒక కారణమైందని అంటారు. పిల్న్యాక్, ఎహ్రెన్‌బర్గ్ ఇతర ఉదాహరణలు. మనకి మన 1911 విప్లవం సమయంలో ఇలాంటి ఉదంతాలు దొరుకుతాయి. సౌత్ సొసైటీ రచయితల్లాంటి వారు పెద్ద విప్లవకారులుగా మొదలుబెడతారు; కాని వాళ్లకు మంచూలను ఒకసారి తరిమికొట్టాక ప్రపంచం మళ్ళీ ఎప్పట్లాగే 'పాత మంచి రోజులకు' తిరిగి వచ్చేస్తుందని, వాళ్లంతా మళ్లీ వెడల్పు చేతుల చొక్కాలు, పొడవాటి టోపీలు, వెడల్పైన వడ్డాణాలు ధరించగలుగుతారని, హుందాగా, నాజూగ్గా నడవల్గుతారని భ్రమలుండేవి. కాని వాళ్ళకి ఆశ్చర్యం కల్గిస్తూ మంచూ సామ్రాట్‌ని తరిమేసి రిపబ్లిక్ (ప్రజారాజ్యం) ఏర్పడిన తరువాత పరిస్థితులు వేరుగా ఉన్నాయి. అందుకే వారు దిగ్భ్రాంతి చెందారు. కొందరు ఉద్యమాన్ని వ్యతిరేకించారు కూడా. విప్లవం నిజమైన స్వభావాన్ని అర్థం చేసుకోలేకపోతే మనం కూడా ఇలాగే చేయడమనేది సులభంగా జరుగుతుంది.

ఇంకొక తప్పు ఆలోచన ఏమంటే కవులు, రచయితలు శ్రేష్టజీవులని, వారు చేసే పని వేరే ఏ పనికన్నా శ్రేష్టమైనదని అనుకోవడం. హేన్ ‌అభిప్రాయం : కవులు శ్రేష్ట జీవులు గనక, దేవుడు చాలా న్యాయప్రియుడు గనక, చనిపోయిన తరువాత కవులు వెళ్ళి దేవుడి పక్కన కూర్చుంటారు, దేవుడు వాళ్ళకి అల్పాహార విందు చేస్తాడు. నేడు దేవుడి అల్పాహార విందు ఇవ్వటం గురించి ఎవరు నమ్మరు అనుకోండి. కాని కొంత మంది ఇప్పటికీ, కష్టజీవుల విప్లవాన్ని కవులు, రచయితలు బలపరుస్తే విప్లవం విజయవంతమైన తరువాత కార్మిక వర్గం వారికి ప్రత్యేక మర్యాదలు చేసి, తిరగటానికి కార్లిచ్చి, తినటానికి ప్రత్యేకమైన తిండి ఏర్పాటు చేసి, ఘనంగా బహుకరిస్తుందని నమ్ముతారు. కార్మికులు వారికి రొట్టె, వెన్న ఇచ్చి 'తినండి, మీరు మా కవులు!' అని అనగలరు. ఇది ఇంకో భ్రమ. ఇలా జరిగే ప్రసక్తే లేదు. బహుశా విప్లవం తరువాత పరిస్థితులు ఇప్పుడున్నవాటి కన్నా ఎక్కువ దుర్భరంగా ఉండొచ్చు. రొట్టె, వెన్న కాదు కదా, నల్ల రొట్టె కూడా దొరక్కపోవచ్చు. రష్యా విప్లవం తరువాత ఏడాది, రెండేళ్ళపాటు జరిగినట్టు. మనం ఇది అర్థం చేసుకోవటంలో విఫలమైతే మనం మితవాదులు అయిపోవటం చాలా తేలిక. లియాంగ్ సికియు 'అర్హులు' అని వర్ణించినవారి లాంటి వారు తప్ప ఏ బుద్ధిజీవి పట్లైనా కార్మికులకు ఎటువంటి ప్రత్యేక గౌరవం ఉండదు. ఫెడెఫెవ్ రాసిన 'ది నైంటీన్ (పంథొమ్మిది మంది)లో మెటిక్ అనే బుద్ధిజీవిని చూడండి, ఆయన్ను మనం తక్కువ అంచనా వేయనక్కర్లేదు. కాని కవులు, రచయితలతో ప్రత్యేకంగా వ్యవహరించే బాధ్యత కార్మిక వర్గానికి లేదు.

ఇప్పుడు మనం గమనించదగిన కొన్ని విషయాలు నేను ప్రస్తావిస్తాను. మొదటిది, పాత సమాజం, పాత శక్తులకు వ్యతిరేకమైన పోరాటంలో దృఢవైఖరి, కష్టనష్టాలకు ఓర్చుకోవటం, శక్తి సామర్థ్యాలపై దృష్టి సారించటం అవసరం. పాత సమాజం వేళ్ళు చాలా లోతు వరకు ఉంటాయి. కొత్త ఉద్యమం చాలా బలంగా ఉంటేనే కాని దాన్ని కదల్చలేం. అది కాకుండా పాత సమాజం వద్ద మన కొత్త శక్తులని రాజీకి వచ్చేట్టు చేసేందుకు చాలా ఉపకరణాలు ఉన్నాయి. తను మాత్రం అది ఎన్నటికీ రాజీకి రాదు. చైనాలో కొత్త ఉద్యమాలు చాలానే వచ్చాయి. కాని ప్రధానంగా కచ్చితమైన సాధారణ లక్ష్యాలు లేకపోవటం, డిమాండ్స్ చాలా మామూలువే కావటం, చాలా సులువుగా సంతృప్తి చెందటం వల్ల ఆ ఉద్యమాలన్ని పాత సమాజానికి లొంగిపోయాయి. ఉదాహరణకి ప్రాంతీయ భాషా ఉద్యమం తీసుకోండి. దాన్ని మొదట్లో పాత సమాజపు శక్తులు ససేమిరా అని వ్యతిరేకించాయి. కొంత కాలానికే ప్రాంతీయ భాషలో వ్రాయటం అనుమతించారు. దానికి ఓ దిక్కుమాలిన హోదా లాంటిది కల్పించారు. కనీ కనపడనట్టు వార్తా పత్రికల్లో వ్యాసాలు ప్రాంతీయ భాషలో అచ్చుపడ్డాయి. ఎందుకంటే ఈ కొత్త విషయాన్ని

మనం ఇంకా చాలా మంది కొత్త యోధులను తయారు చేసుకోవాలి. ఎందుకంటే మనకి ప్రస్తుతం బలగం నిజంగానే చాలా తక్కువ ఉంది. మనకి ఎన్నో పత్రికలు ఉన్నాయి. కొన్ని పుస్తకాలు కూడా అచ్చయ్యాయి. కాని వాటన్నిటికీ ఆ కొద్దిమంది రచయితలే ఉన్నారు కనుక వాటి సారాంశం పల్చగా ఉంటోంది. ఎవరూ ప్రత్యేక కృషి సల్పటం లేదు. అందరు అన్నీ కెలుకుతున్నారు. అనువాదాలు, కథానికలు, విమర్శలు, కవిత్వం కూడా. ఫలితం మాత్రం పేలవంగా ఉంది. కాని దీనికి కారణం రచయితల కొరత. ఎక్కువ మంది ఉంటే అనువాదకులు అనువాదం మీద, రచయితలు రచనల మీద, విమర్శకులు విమర్శల మీద కేంద్రీకరించగలిగేవారు.

అనుమతించటంలో వారికి ఇబ్బంది లేదు. ఎందుకంటే దాని వల్ల ఎటువంటి హాని వారికి లేదు. అదే సమయంలో కొత్త శక్తులు కూడా ఇక ప్రాంతీయ భాషకు బతికే అధికారం వచ్చిందని సంతృప్తి పడిపోయాయి. గత రెండేళ్ళ కార్మిక వర్గపు సాహిత్యోద్యమం విషయంలో కూడా ఇలాగే జరిగింది. పాత సమాజం కార్మికవర్గ రచనలను అనుమతించింది ఎందుకంటే అది వారికి ప్రమాదం ఏ మాత్రం కాదు. నిజం చెప్పాలంటే కొంతమంది ఛాందసులు తామే అటువంటి లేఖలు రాయబూనుకున్నారు. దాన్ని పాత పింగాణి, ఇతర పురావస్తువుల పక్కన కార్మికుడి రాతి చిప్ప పెట్టి గదిని అలంకరించినట్టుగా వాడుకున్నారు. అక్షర ప్రపంచంలో ఓ చిన్న మూల చోటు దొరకగానే, తన పాండులిపిలు అమ్ముకోగలగ్గానే కార్మికవర్గ రచయితలు పోరాటం ఆపేశారు. విమర్శకులు, "కార్మిక వర్గ సాహిత్యం గెలిచింది!' అని విజయగీతాలు పాడేశారు. కాని కొంత మంది వ్యక్తుల సాఫల్యం తప్ప కార్మిక వర్గ సాహిత్యం తానేమి సాధించింది? సమాజంలో కార్మికవర్గపు బలంతోపాటు పెరుగుతూ అది విముక్తి కోసం కార్మిక వర్గ పోరాటంలో అంతర్భాగం కావాలి. సమాజంలో కార్మికుల స్థితి అతి హీనంగా ఉండి అక్షర ప్రపంచంలో కార్మికవర్గ సాహిత్యానికి పెద్ద పీట కలదంటే కార్మికవర్గ సాహిత్యం రాసే వారు కార్మిక వర్గానికి దూరం అయ్యారని, పాత సమాజంవైపు వెళ్ళిపోయారని దాని అర్థం.

మన పోరాట క్షేత్రాన్ని మనం విస్తరించుకోవాలని నేను అనుకుంటాను. గత ఏడాది, అంతకు ముందు ఏడాది సాహిత్యంలో మనం కొన్ని పోరాటాలు చేశాం. కాని చాలా పరిమిత స్థాయిలోనే. పాత సాహిత్యం, పాత ఆలోచనల సంగతి చూడకుండా మన కొత్త రచయితలు ఒక మూల ఒకరితో ఒకరు తలపడటం మొదలుపెట్టారు. పాత గురుకులం వారికి పక్కన ఉండి చోద్యంగా చూడటానికి అవకాశం కలిగింది.

మూడవది, మనం ఇంకా చాలా మంది కొత్త యోధులను తయారు చేసుకోవాలి. ఎందుకంటే మనకి ప్రస్తుతం బలగం నిజంగానే చాలా తక్కువ ఉంది. మనకి ఎన్నో పత్రికలు ఉన్నాయి. కొన్ని పుస్తకాలు కూడా అచ్చయ్యాయి. కాని వాటన్నిటికీ ఆ కొద్దిమంది రచయితలే ఉన్నారు కనుక వాటి సారాంశం పల్చగా ఉంటోంది. ఎవరూ ప్రత్యేక కృషి సల్పటం లేదు. అందరు అన్నీ కెలుకుతున్నారు. అనువాదాలు, కథానికలు, విమర్శలు, కవిత్వం కూడా. ఫలితం మాత్రం పేలవంగా ఉంది. కాని దీనికి కారణం రచయితల కొరత. ఎక్కువ మంది ఉంటే అనువాదకులు అనువాదం మీద, రచయితలు రచనల మీద, విమర్శకులు విమర్శల మీద కేంద్రీకరించగలిగేవారు. అప్పుడు మనం శత్రువుతో తలపడినప్పుడు మన బలగాలు వాళ్ళని సులువుగా అధిగమించేంత బలం ఉండేవి. మాట వరసకి నేను దీన్ని గురించి ఒక ఉదాహరణ చెబుతా, గత ఏడాదికి ముందు ఏడాది క్రియేషన్ సొసైటీ (సృజన సంఘం), సన్ సొసైటీ (సూర్య సంఘం) నా మీద దాడి చేసినప్పుడు అవి ఎంత బలహీనంగా ఉన్నాయంటే కొంత కాలానికి నాకు కూడా వాళ్ళ గురించి ఆసక్తి పోయింది. ప్రతిదాడి చేయటం అర్థరహితం అనిపించింది. ఎందుకంటే వాళ్ళు 'ఖాళీ నగరం ఎత్తుగడ' వేస్తున్నారని నాకు అనిపించింది. శత్రు తన సైనికులచేత కవాతు చేయించే బదులు వట్టి గోల పెట్టటానికే తన శక్తిని వెచ్చించేవాడు. నన్ను దూషిస్తూ ఎన్నో రచనలు ఉన్నప్పటికీ, అవి మారు పేరుతో రాయబడ్డాయని మీరు ఇట్టే చెప్పగలరు. ఆ దూషణంతా కొద్దిపాటి కథనాలకే పరిమితమైపోయింది. మార్క్సిస్టు విమర్శనా పద్ధతిని పట్టుపట్టిన వారెవరైనా నా మీద దాడి చేస్తారేమోనని నేను ఎదురు చూశాను. కాని అలాంటి వారెవరు కానరాలేదు. తరువాత తరం యోధులకు తర్ఫీదు ఇవ్వడం ముఖ్యమని నాకు ఎల్లప్పుడూ అనిపించింది. నా కాలంలో ఎన్నో సాహిత్య గోష్ఠులను ఏర్పర్చాను కూడా, కాని అవేవీ పెద్దగా చెప్పుకోతగినవి కావు. కాని మనం భవిష్యత్తులో దీనిపై ఎక్కువ దృష్టి సారించాలి.

ఎంతో మంది కొత్త యోధులను త్వరగా తయారు చేసుకునే అవసరం మనకు ఉన్నప్పటికీ, ప్రస్తుతం సాహిత్య

## రూ. 50 వేలు చిన్నప్ప భారతి సాహిత్య పురస్కారం- 2011

## తెలుగు రచనలకు ఆహ్వానం

తమిళనాడులోని నామక్కల్‌కు చెందిన ప్రముఖ ప్రజా రచయిత, ప్రగతిశీల వాది చిన్నప్ప భారతి. మంచి రచనలను ప్రోత్సహించేందుకై చిన్నప్ప భారతి ట్రస్ట్ (నామక్కల్) ఏర్పాటు చేశారు. జాతీయ భాషల్లో ప్రతి సంవత్సరం ఎంపిక చేసిన ఒక భాషలోని ఉత్తమ రచనకు రూ. యాభైవేలు నగదు పురస్కారం అందిస్తున్నారు. 2009లో మళయాళ రచయిత గోవింద పిళ్ళె, 2010లో ఢిల్లీ రచయిత్రి చిత్ర ముత్కళ్ (హిందీ) ఈ పురస్కారం అందుకున్నారు. 2011 సంవత్సరానికి సంబంధించి తెలుగుభాషలో ఉత్తమ రచనలకు ఈ పురస్కారం అందజేయాలని చిన్నప్ప భారతి ట్రస్ట్ సంకల్పించింది. ఉత్తమ నవల, కథలు, కవిత్వం సంపుటి, అనువాద రచనలు, నాటకం, జీవిత చరిత్రలు, వ్యాస సంకలనాల నుండి పురస్కారానికి ఎంపిక జరుగుతుంది. 2001 నుండి 2010 లోపు ప్రచురించబడిన రచనల నుండి ఎంపిక చేయడం జరుగుతుంది. ఈ పోటీలో పాల్గొనదలచిన రచయితలు ముద్రిత రచనలు రెండు కాపీలు జూలై 30 లోపు పంపవలసి వుంటుంది. సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఇందుకోసం ఏర్పడిన పురస్కార కమిటీ అర్హమైన రచనను ఎంపిక చేస్తుంది. బహుమతి పొందిన రచయితకు అక్టోబర్-2 గాంధీ జయంతి రోజున చెన్నై నగరంలో తమిళనాడు అభ్యుదయ రచయితల, కళాకారుల సంఘం నిర్వహించే సభలో నగదు పురస్కారం అందిస్తారు. రచనలు పంపవలసిన చిరునామా 'సాహిత్య ప్రస్థానం, ఫ్లాట్ నెం. 21/1, యం. హెచ్. భవన్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, ఆజామాబాద్, హైదరాబాద్- 500 020.

**- తెలకపల్లి రవి**

**రాష్ట్ర అధ్యక్షులు, సాహితీస్రవంతి**

---

రంగంలో ఉన్న మనం కూడా 'పట్టువీడని వార'మై ఉండాలి. పట్టు వీడకపోవడమంటే నా అభిప్రాయం మనం కింగ్ వంశకాలపు పండితుల్లా ఉండకూడదు. వారు 'బాగు' అనబడే అష్టపద వ్యాసాలను 'తలుపులు బాదే ఇటుక రాళ్ళ ఇటికెలు' లా వాడేవారు. ఈ వ్యాసాలు రాసి పండితులు పరీక్షల్లో ఉత్తీర్ణులై కింగ్ వంశ కాలంలో అధికారులుగా నియమించబడేవారు. ఈ 'ప్రతిపాదన, విస్తరణ, వాదన, ఉపసంహారం' ఆధారంగా ఒక్కసారి పరీక్ష ఉత్తీర్ణులైతే, దాన్ని జీవితంలో మళ్ళీ మరోసారి వాడే పని లేకుండా పక్కన పడేసేవారు. అందుకే దాన్ని "ఇటిక" అన్నారు. ఎందుకంటే దీన్ని తలుపు తట్టటానికే ఉపయోగించుకుని, అది తెరవగానే ఇక మోసే పని లేకుండా పక్కన పడేసేవారు. నేడు కూడా అటువంటి పద్ధతులే ఉపయోగించటం జరుగుతోంది. జనాలు ఒకటి రెండు సంపుటాలు కవితలు లేక కథలు ప్రచురించిన తరువాత మళ్ళీ కనపడకుండా మాయమైపోవటం మనం తరచూ చూస్తున్నాం. వారెక్కడికి పోతున్నారు? ఓ రెండు పుస్తకాలు అచ్చు వేయించుకుని కాస్తో కూస్తో పేరు ప్రఖ్యాతులు మూట కట్టుకున్నాక వీరు ఆచార్యులుగానో లేక ఇంకేదో వృత్తిలో స్థిరపడిపోతారు. పేరు వచ్చేసింది కనక, వారికి ఇక రాసే అవసరం లేదు కనక, వారు మళ్ళీ కనబడకుండా పోతున్నారు. అందుకే సాహిత్యం, శాస్త్ర విజ్ఞానానికి సంబంధించి చైనా వద్ద చూపటానికి అతి తక్కువనే ఉన్నది. కాని మనకి కొన్నైనా సాధించటం కావాలి, అవి మనకి ఉపయోగపడతాయి. (లూనా చరస్కి రష్యాలో రైతుల శిల్పకళని సంరక్షించాలని ప్రతిపాదించాడు. ఎందుకంటే విదేశీయులు రైతులు తయారు చేసినవి కొంటారు. దాని వల్ల వచ్చే డబ్బు పనికొస్తుంది. మనం సాహిత్యానికి, శాస్త్ర విజ్ఞానానికి కాస్త తోడ్పడగలిగితే అది సామ్రాజ్యవాదుల నుండి మనల్ని విముక్తి చేసుకోవటానికి మన రాజకీయ ఉద్యమంలో కూడా మనకు సహాయపడగలదని నా నమ్మకం) కాని సాహిత్యంలో ఏమి సాధించాలన్నా మనం 'పట్టువీడని వారం', 'దృఢచిత్తులం' కావాలి.

అంతిమంగా ఒక ఐక్య సంఘటన కోసం మనకి ఒక ఉమ్మడి లక్ష్యం ఉండాలనేది నా అభిప్రాయం. మితవాదులకు ఇప్పటికే వారి ఐక్య సంఘటన ఉంది అని ఒకరు చెప్తుండగా విన్నట్టు నాకు గుర్తు. నిజానికి వారిది ఆలోచించుకుని ఏర్పర్చుకున్న ఐక్య సంఘటన కాదు. కాని వారికి ఒక ఉమ్మడి లక్ష్యం ఉండటం వల్ల, దాని కోసం నిరంతరాయంగా పనిచేస్తారు కనుక మనకి వారికి ఐక్య సంఘటన ఉన్నట్టు అనిపిస్తుంది. అలాగే మనం ఐక్యం కాలేకపోతున్నామంటే మనం లక్ష్యం విషయంలో విడిపోయి ఉన్నామన్నమాట- మనలో కొంత మంది చిన్న బృందాల కోసం లేక ఒక్క విధంగా స్వయం తన కోసమే పని చేస్తున్నారు. మనమంతా కార్మిక, కర్షక జనావళికి సేవ చేయాలనుకుంటే, మన ఐక్య సంఘటన సహజంగానే ఏర్పడుతుంది. •



# నేనెప్పుడూ వాస్తవిక వాదినే

## పికాసో

**(25.10.1881 - 8.04.1973)**

ఆధునిక చిత్రకళా ప్రయోక్త. అభ్యుదయ స్రష్ట.

నేను చిత్రాల ద్వారా నన్ను నేను వ్యక్తీకరించుకుంటాను. పదాల ద్వారా వాటిని వివరించలేను. మీరు ఆ విధంగానే ఎందుకు చేశారంటే నేను వివరించలేను." 'ఇలా అంటూనే ఆయన పక్కనున్న టేబుల్‌ను జరుపుకొని బొమ్మలు గీయడం మొదలెట్టాడు. 'నేను ప్రతిదీ వివరంగా పట్టించుకుంటాను. దాని సైజు, దళసరి వంటివన్నీ నాకు నచ్చిన రీతిలో అనువదించుకుంటాను. "ఇలా మాట్లాడుతూనే ఆయన ఒక పెద్ద పెయింటింగ్ కేసి చూపించారు. ఆ చిత్రం విముక్తి పోరాట కేంద్రంలో కూడా వుండింది. నేనెలా చేస్తానో చూడండి... ప్రజలు చిత్రాన్ని మీరు అనుకోని కోణంలో చూడటం మొదలెట్టడమే విచిత్రమనిపిస్తుంది. ఆ విషయంపై అనేక అల్లికపని చేస్తారు. అవన్నీ ఫరవాలేదు. ఎందుకంటే వారు ఆ చిత్రాన్ని చూస్తే చాలు. వారిలో ప్రేరణ కలుగుతుంది. వారు చూసేది నిజంగా పెయింటింగ్‌నే" అన్నారాయన.

నేను ఆయన దగ్గర సెలవు తీసుకుని వచ్చే ముందు మళ్ళీ ఎప్పుడు కలవొచ్చని అడిగాను. మీరు ఎప్పుడూ వచ్చిన సంతోషమే అని ఆయన జవాబిచ్చారు. కరచాలనం చేసి బయటకు నడిచాను.

నేను అనుకున్నంత త్వరగా పికాసోను కలవలేక పోయాను గాని రెండు వారాల తర్వాత ఒక శనివారం ఉదయం మళ్ళీ కలవగలిగాను.

పది నిముషాల తర్వాత పికాసో పైనున్న స్టూడియో బయటపడి మెట్లు దిగి వచ్చాడు. నేరుగా నా దగ్గరకే. ఒక్కసారి సూటిగా నా కళ్లలోకి చూశాడు. నేనెవరినో పరిచయం చేసుకున్నాను. ఆయన మృదువుగా కరచాలనం చేశాడు. వాతావరణం చాలా తేలికపడేట్టు చేశాడు. ఆయన చిత్రాలు అంటే నాకెప్పుడూ ఆసక్తి వుందని అయితే అంతు పట్టడనీ కూడా చెప్పాను. ఆచిత్రాల గురించిన నా అవగాహన చెప్పి వాటిపై ఆయన అభిప్రాయాలు తెలుసుకోవాలనుకుంటున్నాని, వాటిని అమెరికన్ల కోసం రాయాలను కుంటున్నానని కూడా చెప్పాను. పికాసో నావికుడు చిత్రం గురించిన నా భావనలు వివరించాను. అది ఆయన స్వీయ చిత్రమనుకుంటున్నానని, అందుకని ఎర్రటి సీతాకోకచిలుక మరింత మెరుగైన ప్రపంచం కావాలనే ఆకాంక్షకు ప్రతీక అని భావించాను. ఇక నావికుడి దుస్తులలో వుండటం అంటే ఆ కృషిలో తను భాగస్వామినవుతున్నట్లు చెప్పడమే అనుకున్నాడు. ఇవన్నీ విని పికాసో ఆ నావికుడు తానేనని, అయితే దానికి ఎలాంటి రాజకీయ ప్రాధాన్యత లేదని అన్నాడు. మిమ్మల్ను మీరు నావికుడుగా ఎందుకు వేసుకున్నారు అంటే నేనెప్పుడూ నావికుడు వేసుకునే లాంటి దుస్తులే వేసుకుంటాను గనక అని చెప్పాడు. మరి ఎర్రటి సీతాకోకచిలుకకు రాజకీయ ప్రతీక కాదా అంటే ప్రత్యేకంగా ఏం లేదు. ఉంటే నా ఉప చేతనలో వుండి వుండాలి అన్నాడు. కాని మీరు అలా ఉపచేతనలోనూ వుండి వుండాలి. వాస్తవం నుంచి తప్పించుకునే అవకాశం లేదు గదా అని సాగదీశాను. కావచ్చు అలా జరగడం సాధ్యమే. సాధారణమే కూడా అని అంగీకరించారు.

మీరు రచయితలా అని అడిగితే కాదు అని వున్న విషయం చెప్పాను. పత్రికలకు రాస్తానని, బొమ్మలు గీస్తానని తెలియజేశాడు. నేను మా పత్రిక కోసం మీపై వ్యాసం రాయొచ్చా అంటే అంగీకారం తెల్పుతూనే ఏ పత్రిక అని అడిగాడు. న్యూమాసెస్ అని చెబితే నాకు దాని గురించి తెలుసు అని ఆయన అన్నాడు. తలుపు తీసి చూస్తే బయట ఆయన కోసం చాలా మంది ఎదురు చూస్తున్నారు. పైకి పోదాం అంటూ తన స్టూడియోలోకి తీసుకుపోయాడు. అది ఆయన ఎప్పుడూ చిత్రాలు వేసుకునే చోటు. చాలా శుభ్రంగా వుంది. దుమ్మూ మురికి ఎక్కడా లేవు.

'ఎందుకంటే అది నా ఆలోచనల ఫలితం. ఈ ఫలితం కోసం నేను ఏళ్ల తరబడి పనిచేశాను. నేను గనక ఒక అడుగు వెనక్కు వేయడమంటే అది (అలా అంటూ ఆయన నిజంగానే ఒక అడుగు వెనక్కు వేశారు) ప్రజల పట్ల అపచారమే. ఎందుకంటే అది నా ఆలోచనల సారంగా ఆవిర్భంచిన పద్ధతి. కేవలం అర్థం కావడమనే ఒకే సంతృప్తి కోసం దాన్ని సాదాసీదా పద్ధతుల్లో ఉపయోగించలేను. నా స్థాయి దిగజార్చుకోదల్చలేదు'.

ఇప్పుడు పికాసో సరికొత్త రాజకీయ అనుబంధాల వల్ల చాలామంది ఆయనను రాజకీయ సాంస్కృతిక విషయాలలో ఒక నాయకుడిగా చూస్తున్నారని చెప్పాను. ఆయన గంభీరంగా తల పంకిస్తూ ఆ విషయం తాను గుర్తించానని అన్నాడు. న్యూయార్క్‌లో మేము ఆయన గురించి ప్రత్యేకంగా గుయెర్నికా గురించి తరచూ మాట్లాడుకునే సంగతులు చెప్పాను. అందులో కనిపించే ఎద్దు గుర్రం, చేతులు రేఖలు వగైరాలు, స్పానిష్ పురాణాల ప్రతీకలు వంటి వాటి గురించి ప్రస్తావించాను. పికాసో నా మాటలకు తలాడిస్తూ వచ్చాడు. ఔను. అక్కడున్న ఎద్దు క్రౌర్యానికి సూచన. గుర్రం ప్రజలను చూపిస్తోంది. ఈ చిత్రంలో నేను సింబాలిజం ప్రతీక వాదం వాడిన మాట నిజమే. కాని ఇతర చిత్రాల్లో కాదు అని వివరించారు.

ఆ ప్రదర్శనలో వున్న రెండు చిత్రాల గురించిన నా విశ్లేషణను ఆయన ముందుంచాను. "ఎద్దు, దీపం, రంగుల పళ్ళెం పుస్తకం... ఎద్దు ఫాసిజం ప్రతీక అయి వుండాలి. దీపం, రంగులు పుస్తకం ఇవన్నీ సంస్కృతికి, స్వేచ్ఛకు ప్రతీకలు." ఈ రెంటి మధ్యనా సాగే పోరాటాన్ని ఈ చిత్రం ప్రతిబింబిస్తుంది అని నా భావం చెప్పాను.

కాదు ఎద్దు పాశవికతను చెబుతుంది అంతే. అది ఫాసిజానికి ప్రతీక ఏమి కాదు అని ఆయనన్నాడు. ఇకపైన మరింత మార్పుతో సూటిగా అర్థమయ్యే విధంగా ఆయన చిత్రాలు తయారవుతాయని మేము కోరుతున్నట్టు చెప్పాను.

నా చిత్రకళ ప్రతీకవాదం కానేకాదు అని ఆయన అన్నాడు. గుయెర్నికాలో మాత్రమే అలా వాడాను. కుడ్య చిత్రం మిశ్రమంగా వుంటుంది. కనకనే ఎద్దు గుర్రం వగైరాలన్ని వచ్చాయి. దానివల్ల స్పష్టమైన వ్యక్తీకరణ చేయడం జరుగుతుంది. ఒక సమస్య పరిష్కారం సూచించబడుతుంది. అందుకే నేను ప్రతీకలు వాడాను అని వివరించారు.

"కొంతమంది నా చిత్రకళను కొంతకాలం పాటు సర్రియలిజం (అధివాస్తవికత) అనేవారు. నిజానికి నేను సర్రియలిస్టును కాను. ఎప్పుడూ వాస్తవికతను వదలిపోలేదు. ఎవరైనా సరే యుద్ధాన్ని చిత్రించదల్చుకుంటే విల్లంబులు వేయడం మరింత బాగా ఆకర్షణీయంగా వుండొచ్చు. కాని నేను యుద్ధాన్ని చిత్రించాలనుకుంటే మెషిన్ గన్‌ను వేస్తాను. ఇప్పుడు కాలం మారిపోతున్నది. విప్లవం చిత్రకళను విప్లవకరంగా వుపయోగించాలి" ఇలా అంటూ నా కళ్లలోకి సూటిగా చూసి నా మాటలు నమ్ముతారా అని అడిగాడు.

"కాని నాకు మీ బొమ్మలు కొన్ని అర్థం కావు" అంటూ నేను చూసిన నగ్న మహిళ సంగీత కారుడి చిత్రం గురించి చెప్పాను. "అది నాకేమాత్రం అర్థం కాలేదు" అని చెప్పేశాను. "అందులో వున్నది సంగీతకారుడు. నగ్న మహిళ అంతే" అని ఆయన అన్నాడు. "అది నా కోసం వేసుకున్నాను. కొంతమంది నగ్న చిత్రం వేస్తే సంప్రదాయ సరళిలో ప్రజల కోసం వేస్తారు. నేను విప్లవకర వ్యక్తీకరణనే కోరుకుంటాను. ఇక్కడ ఎలాంటి ప్రతీకాత్మకత లేదు. ఆ నగ్నచిత్రం నగ్నచిత్రమే" అన్నారు. "ప్రజలు అర్థం చేసుకోలేనంత జటిలంగా మీరెందుకు చిత్రాలు గీస్తారు" అని నేనడిగాను.

'ఎందుకంటే అది నా ఆలోచనల ఫలితం. ఈ ఫలితం కోసం నేను ఏళ్ల తరబడి పనిచేశాను. నేను గనక ఒక అడుగు వెనక్కు వేయడమంటే అది (అలా అంటూ ఆయన నిజంగానే ఒక అడుగు వెనక్కు వేశారు) ప్రజల పట్ల అపచారమే. ఎందుకంటే అది నా ఆలోచనల సారంగా ఆవిర్భంచిన పద్ధతి. కేవలం అర్థం కావడమనే ఒకే సంతృప్తి కోసం దాన్ని సాదాసీదా పద్ధతుల్లో ఉపయోగించలేను. నా స్థాయి దిగజార్చుకోదల్చలేదు'.

"మీరు కూడా ఒక చిత్రకారుడు. ఇది ఎందుకు చేశారు అది ఎందుకు చేశారు అంటే చెప్పడం దాదాపు అసాధ్యమని మీకు తెలును. నేను చిత్రాల ద్వారా నన్ను నేను వ్యక్తీకరించుకుంటాను. పదాల ద్వారా వాటిని వివరించలేను. మీరు ఆ విధంగానే ఎందుకు చేశారంటే నేను వివరించలేను." 'ఇలా అంటూనే ఆయన పక్కనున్న టేబుల్‌ను జరుపుకొని బొమ్మలు గీయడం మొదలెట్టాడు. 'నేను ప్రతిదీ వివరంగా పట్టించుకుంటాను. దాని సైజు, దళసరి వంటివన్నీ నాకు నచ్చిన రీతిలో అనువదించుకుంటాను. "ఇలా మాట్లాడుతూనే ఆయన ఒక పెద్ద పెయింటింగ్ కేసి చూపించారు. ఆ చిత్రం విముక్తి పోరాట కేంద్రంలో కూడా వుండింది. నేనెలా చేస్తానో చూడండి... ప్రజలు చిత్రాన్ని మీరు అనుకోని కోణంలో చూడటం మొదలెట్టడమే విచిత్రమనిపిస్తుంది. ఆ విషయంపై అనేక అల్లికపని చేస్తారు. అవన్నీ ఫరవాలేదు. ఎందుకంటే వారు ఆ చిత్రాన్ని చూస్తే చాలు. వారిలో ప్రేరణ కలుగుతుంది. వారు చూసేది నిజంగా పెయింటింగ్‌నే" అన్నారాయన.

ఉదాహరణకు నేను ఒక రసాయన శాస్త్రజ్ఞుడుగా వుండి ఎర్రమందు కలిపితే అది కమ్యూనిజానికి సంకేతమై పోదు. నేను కాస్త ఎర్ర రంగు పూసి సుత్తీ కొడవలి వేస్తే కమ్యూనిజం సూచిస్తున్నట్టేనా? కానే కాదు. కాని నా దృష్టిలో అవి ఆ వస్తువులు మాత్రమే. వాటికి మీరేదైనా అర్థం ఆపాదించుకుంటే అది నిజమే కావచ్చు గాని ఆ అర్థం ఇవ్వడం నా ఉద్దేశం మాత్రం కాదు.

నేను ఆయన దగ్గర సెలవు తీసుకుని వచ్చే ముందు మళ్ళీ ఎప్పుడు కలవొచ్చుని అడిగాను. మీరు ఎప్పుడూ వచ్చిన సంతోషమే అని ఆయన జవాబిచ్చారు. కరచాలనం చేసి బయటకు నడిచాను.

నేను అనుకున్నంత త్వరగా పికాసోను కలవలేక పోయాను గాని రెండు వారాల తర్వాత ఒక శనివారం ఉదయం మళ్ళీ కలవగలిగాను. ఈసారి ఆయన నన్ను బెడ్‌రూంలో కలిశారు. ఏవో రాజకీయ వ్యూహాలకు సంబంధించిన అంశాలు మాట్లాడుతున్నారు. అక్కడంతా పత్రికలు చిందరవందరగా పడి వున్నాయి. ఆయన నన్ను హాయిగా స్వాగతించి మానవీయంగా కరచాలనం చేశాడు. ఆయనతో నేను చేసిన ఇంటర్వ్యూ ప్రచురితమైన ఇంగ్లీషు పత్రిక తీసుకొచ్చాను. దాన్ని ఫ్రెంచి భాషలోకి అనువదించి చెప్పాను. అదంతా ఆయునకు ఆమోదయోగ్యంగానే వుంది. కాని అనువదించే సమయంలో నేను ఎద్దు, దీపం, రంగుల పళ్లెం గురించి చెప్పింది మాత్రం ఆయనకు తేడాగా కనిపించింది. లేదు. ఎద్దు ఫాసిజానికి ప్రతీక అని నేను చెప్పలేదు. అది చీకటికీ పాశవికతకూ ప్రతీక అన్నాను అని కొంచెం కోపంగా చెప్పారు. నేను చెప్పేది అదే. ఆ రెంటికీ తేడా ఏముంది అని నేనడిగాను. అవి రెండూ ఒకటేనని, మీకు నాకు ప్రపంచ ప్రజలందరికీ తెలుసు కదా అంటే నిజమే అని ఆయన అంగీకరించాడు. అయితే నేను ఉద్దేశపూర్వకంగా అలా చేసేందుకు ప్రయత్నించలేదు అని వివరించారు. మీరు వాటిపై లోతుగా స్పందించి వేస్తారు. జీవిత ప్రభావం వల్ల మీ ఉపచేతనలో ముద్రితమైన భావాలేమిటో కూడా గుర్తిస్తారు. కనుక మీరు ఫలానా వస్తువులు ఫలానా వాటికి ప్రతీకలు అని చిత్రించడం అనుకోకుండానే జరుగుతుంది. అదే వాటి రాజకీయ ప్రాధాన్యత అని చెబితే ఆయన అంగీకరించాడు. అయితే మళ్లీ వివరణ ఇచ్చాడు.

నేను ఫలానా వాటినే ఎందుకు ఎంచుకుంటానో నాకు తెలియదు. వాటికి ఫలానా అర్థమే రావాలని నేను అనుకోను. వాటిని వాటిగానే చూస్తాను. చీకటి పాశవికత అంటే సరే, ఫాసిజం అంటే నేననుకున్నది కాదు. అక్కడ వున్న గ్లాసు, నిమ్మకాయలు, రంగులు వాటికి ఏమైనా రాజకీయ ప్రాధాన్యత వుందని మీరనుకుంటున్నారా అని ప్రశ్న వేశాడు. లేదు అని జవాబిచ్చాను. మరైతే ఎద్దు రంగుల పళ్లెం, దీపం వీటి సంగతీ అంతే. ఉదాహరణకు నేను ఒక రసాయన శాస్త్రజ్ఞుడుగా వుండి ఎర్రమందు కలిపితే అది కమ్యూనిజానికి సంకేతమై పోదు. నేను కాస్త ఎర్ర రంగు పూసి సుత్తీ కొడవలి వేస్తే కమ్యూనిజం సూచిస్తున్నట్టేనా? కానే కాదు. కాని నా దృష్టిలో అవి ఆ వస్తువులు మాత్రమే. వాటికి మీరేదైనా అర్థం ఆపాదించుకుంటే అది నిజమే కావచ్చు గాని ఆ అర్థం ఇవ్వడం నా ఉద్దేశం మాత్రం కాదు. మీరు చెప్పే భావాలు నిర్ధారణలు నాకూ వచ్చాయి. కాని అవి వున్న ఫళంగా అనిపించినవే తప్ప వాటికవే అప్రయత్నంగా వచ్చినవే. నేను పెయింటింగులు పెయింటింగుల కోసమే వేస్తాను. అవి నా ఉప చేతనకు ప్రతిబింబాలేమీ కావు. ఒక్కొక్కరూ తాము చూసిన ఒక్కొక్క దాని నుంచి ఒకో అర్థం తీసేట్టయితే మొత్తంగా అందరిలో ఒకే భావన తీసుకురావాలని నేను అనుకోను. నా పెయింటింగులు కావాలని ప్రచారం కోసం వేసినవి కావు."

ఆయన ఇలా చెప్పినప్పుడు నేను 'గుయేర్నికా తప్ప' అని సూచించాను. 'ఔను,' అని ఆయన అంగీకరించాడు. దాంట్లో మాత్రం ప్రజలకు కావాలని పిలుపునివ్వడం వుంది. ప్రచారోద్దేశం వుంది' అని జోడించారు. నేను సిగరెట్లు తీశాను. ఇద్దరం వెలిగించుకున్నాము. ఆయన దమ్ములు పీల్చిన తర్వాత నేనేమైనా మాట్లాడతానా అన్నట్టు చూశాడు. మళ్లీ తనే నెమ్మదిగా హాయిగా ఇలా అన్నాడు: "నేను కమ్యూనిస్టుని, నావి కమ్యూనిస్టు పెయింటింగ్సు' నేను ఒక చెప్పుల తయారీ దారునైతే లేక రాజరిక సమర్థకుడినో కమ్యూనిస్టునో లేక మరైదనా అయినంతా మాత్రాన నా చెప్పులన్నీ నా రాజకీయాలకు అనువైన రీతిలో ప్రత్యేకంగా తయారు చేయడమేమీ వుండదు కదా'

తర్వాత మరికొంత చర్చ నడిచింది. ఆయన కమ్యూనిస్టు పార్టీలో చేరడం కళా ప్రపంచంలో ఎంత సంచలన కారణమైందో నేను చెప్పాను. అయినా ఆయనపై సర్రియలిస్టు ముద్ర కొనసాగిస్తూ కళకూ రాజకీయాలకు మధ్య సంబంధం వుండదనీ, ఆయన చిత్ర లేఖనం కొనసాగించాలని చెప్పడం దృష్టికి తెచ్చాను. దానికాయన నవ్వి లేదు లేదు సంబంధం వుండకుండా పోదు. అయితే నేను మాత్రం అందుకు కావాలని ప్రయత్నం చేయను' అని స్పష్టం చేశాడు.

అమెరికా ఫ్రెంచి చిత్రకళా రీతులపై మరికొంత చర్చ చేసిన తర్వాత నేను సెలవు తీసుకుని బయటకు వచ్చేశాను.

**- జెరోమ్ సెక్లర్, న్యూమాసెస్ పత్రిక 1945 మార్చి 13**



# రచయితా, శిల్పమూ

## ఇల్యా ఎహ్రెన్‌బర్గ్

**(27.01.1891-31.08.1967)**

సోవియట్ రచయిత, విమర్శకుడు. 'స్టామ్' నవల చాలా ప్రసిద్ధమైంది.

సుదీర్ఘమైన నవల రాసిన రచయిత కూడా తన పాత్రల యావజ్జీవితాన్ని చిత్రించలేడు. మరీ చాలా ముఖ్యమైనవి అనుకొనేవాటినే అతడు ఎన్నుకుంటాడు. ఆ పాత్ర జీవితంలోని ఒక రోజు జీవితాన్ని అతి వివరంగా ఒక్కొక్కసారి అతడు చిత్రించుతాడు. ఆ తర్వాత రెండేళ్ళ జీవితాన్ని గురించి ఒక్క ముక్క కూడా చెప్పడు. నవలలోని ఒక పాత్ర నివసించే గృహం గురించి వివరంగా అతడు వర్ణించవచ్చు. కాని ఆ పాత్ర భార్యను వర్ణించవలసిన అవసరంలేదని అతడు భావించవచ్చు. రెండో రకం పాత్ర మూర్తిని అతడు చిత్రించవచ్చు. ఆకురాలు కాలంలోని ఉదయం లేక వసంతకాల సాయంత్రం గురించి రచయిత వర్ణించి పైన చెప్పిన ఆ ఉదయాన్నో లేక సాయంత్రాన్నో! పని చేయడానికో లేక నిర్ణీత స్థలంలో కల్సుకుందామని ముందుగా చెప్పుకొని అక్కడికి వెళ్లే ఆ వ్యక్తి వయస్సును రచయిత వర్ణించకపోవచ్చు.

పాఠకునికి చెప్పిన దానికంటె కూడా రచయితకు తన పాత్రలను గురించి ఎక్కువ తెలుసు. వ్యక్తిస్వభావాన్ని, అతని నడవడినీ విశదపరచేటటు వంటి ఘటనలను, జీవిత వివరాలను, ఆలోచనలను భావనలను రచయిత ఎన్నుకొంటాడు. పాఠకుడు పుస్తకం చదవడం ముగించగానే తనకు ఆ కథలోని పాత్రలతో పరిచయం అయినట్లు వాటి జీవితాన్ని తెలుసుకొన్నట్లు, వారి హృదయాలను తెలుసుకొన్నట్లు భావించాలి. చెకోవ్ "డార్లింగ్" అనే కథ చాలా చిన్నది. కాని ఆ కథ చదివిన ప్రతివాడూ, ఆ కథా నాయికను, ఆమెకు దగ్గరగా ఏండ్ల కొలదీ నివసించిన వానిలాగా, ఊహించుకోగలడు.

పాఠకునికి చెప్పిన దానికంటె కూడా రచయితకు తన పాత్రలను గురించి ఎక్కువ తెలుసు. వ్యక్తిస్వభావాన్ని, అతని నడవడినీ విశదపరచేటటు వంటి ఘటనలను, జీవిత వివరాలను, ఆలోచనలను భావనలను రచయిత ఎన్ను కొంటాడు. పాఠకుడు పుస్తకం చదవడం ముగించగానే తనకు ఆ కథలోని పాత్రలతో పరిచయం అయినట్లు వాటి జీవితాన్ని తెలుసు కొన్నట్లు, వారి హృదయాలను తెలుసుకొనట్లు భావించాలి. చెకోవ్ "డార్లింగ్" అనే కథ చాలా చిన్నది. కాని ఆ కథ చదివిన ప్రతివాడూ, ఆ కథా నాయికను, ఆమెకు దగ్గరగా ఏండ్ల కొలదీ నివసించిన వానిలాగా, ఊహించుకోగలడు.

ఒక్కొక్కప్పుడు ఏమైనాసరే పాఠకుని తన అభిప్రాయాలతో ప్రభావితుణ్ణి చేయాలనే కోర్కెతో, రచయిత చేసే రచనలలో పుట్టే పాత్రలు స్కీమెటిక్ స్వభావం కలిగివుంటాయి. నవల, వారపత్రికలోని వ్యాసం కాదన్న విషయాన్ని అతడు మరిచిపోతాడు ఎంతో బాగా వున్నదనుకొన్న పోస్టర్, కళా చిత్రం (పెయింటింగ్) కాజాలదని అతడు మరచిపోతాడు. ఒక్కోసారి వాస్తవిక జీవితాన్ని కొద్దిగా మాత్రం చూపించితే, రసహీనంగా వుంటుందని భయపడి, తన కల్పిత ఆదర్శకథానాయకునికి అన్ని సద్గుణాలనూ రచయిత అంటగడతాడు.

**ఒక్కొక్కప్పుడు ఏమైనాసరే పాఠకుని తన అభిప్రాయాలతో ప్రభావితుణ్ణి చేయాలనే కోర్కెతో, రచయిత చేసే రచనలలో పుట్టే పాత్రలు (స్కీమెటిక్) స్వభావం కలిగివుంటాయి. నవల, వారపత్రికలోని వ్యాసం కాదన్న విషయాన్ని అతడు మరిచిపోతాడు ఎంతో బాగా వున్నదనుకొన్న పోస్టర్, కళా చిత్రం (పెయింటింగ్) కాజాలదని అతడు మరచిపోతాడు. ఒక్కోసారి వాస్తవిక జీవితాన్ని కొద్దిగా మాత్రం చూపించుతే, రసహీనంగా వుంటుందని భయపడి, తన కల్పిత ఆదర్శకథానాయకునికి అన్ని సద్గుణాలనూ రచయిత అంటగడతాడు.**

ఒక్కొక్కప్పుడు ఏమైనాసరే పాఠకుని తన అభిప్రాయాలతో ప్రభావితుణ్ణి చేయాలనే కోర్కెతో, రచయిత చేసే రచనలలో పుట్టే పాత్రలు స్కీమెటిక్ స్వభావం కలిగివుంటాయి. నవల, వారపత్రికలోని వ్యాసం కాదన్న విషయాన్ని అతడు మరిచిపోతాడు ఎంతో బాగా వున్నదనుకొన్న పోస్టర్, కళా చిత్రం (పెయింటింగ్) కాజాలదని అతడు మరచిపోతాడు. ఒక్కోసారి వాస్తవిక జీవితాన్ని కొద్దిగా మాత్రం చూపించితే, రసహీనంగా వుంటుందని భయపడి, తన కల్పిత ఆదర్శకథానాయకునికి అన్ని సద్గుణాలనూ రచయిత అంటగడతాడు. ఒక్కొక్కప్పుడు తాను చిత్రించుతున్న వ్యక్తిని గురించి పూర్తిగా తెలియదు అర్థంచేసుకోనూ లేడు అలాంటప్పుడు ఆ వ్యక్తి వృత్తిలోని విషయాలను రచయిత వర్ణించుతాడు. ఎందుచేతనంటే మానవ హృదయం పనిచేసే విధానాలను అర్థం చేసుకోడం కంటే తన రచనలోని కథానాయకుడు పనిచేసే యంత్రం పనిచేసే విధానాన్ని అర్థం చేసుకోడం ఆ రచయితకు సులభం.

బూర్జువా ఫ్రాన్స్‌కు చెందిన అధునిక నవలలను చదువుతుంటే, ఒక కోణం ద్వారానే పాత్రలను ప్రదర్శించటం ద్వారా రచయితలు వాటిని యెలా నాశనం చేస్తున్నదీ మనకి స్పష్టమవుతుంది. చమత్కారమైన మనస్తత్వాన్ని చిత్రించడంకోసం, ప్రేమను ఇతి వృత్తంగా తీసుకుని రచించిన ఒక నవలను ఉదాహరణగా తీసుకోండి. ఈ నవలలో నాయకుడు నాయిక, మరొకరు మామూలుగా వుంటారు. మూడవ వ్యక్తిని మొదటిసారి చూసినప్పుడు కథానాయికకు కల్గిన భావాలను వివరంగా రచయిత వర్ణించుతాడు. దానివల్ల నాయకుడు పడే బాధలను కూడా వర్ణించుతాడు. కథానాయిక మూడో వ్యక్తితో వెళ్ళిపోతుంది. మళ్ళా కథానాయకుని వద్దకు తిరిగివస్తుంది. మళ్ళా ఆ మూడో వ్యక్తిని చూడాలని కోరుతుంది. మూడో వ్యక్తికి, యాదృచ్ఛికంగా కథానాయకునితో పరిచయం యేర్పడుతుంది. రచయిత వారిద్దరి మనోభావాలనూ వర్ణించుతాడు. చివరి అధ్యాయాలలో కథానాయికకు ఒక కల వస్తుంది. ఆ కలను గురించి కథానాయకునికి చెప్పనా, వద్దా అని రోజుల్లా ఆమె ఆలోచించుతుంది.

కథానాయిక చేతిమేజోడు తన మేజోబల్లలో వుండటం మూడో వ్యక్తి యాదృచ్ఛికంగా గమనించుతాడు. ఇతడు ఉద్రేకపడుతాడు, పశ్చాత్తాపం చెందుతాడు అంతే కాదు కొంటె ఆనందాన్ని పొందుతాడు. అదే సమయంలో అనిర్వచనీయమైన విసుగూచెందుతాడు. ఇవన్నీ ఒకేసారి అతని మనస్సులో రేగుతాయి. అంతటితో సరి. చేతి మేజోడు విషయం వచ్చేసరికి పాఠకునికి విసుగెత్తుతుంది. ఆవేశం కొద్దీ పుస్తకాన్ని విసిరిపారవేస్తాడు. అలా విసిరివేయడం ఆ పుస్తకం ప్రేమసంబంధ గ్రంథమైనందువల్ల కాదు. ప్రేమస్పర్థలు గల ఇతివృత్తాలు పాతబడిపోలేదు. అసూయను మనం అర్థం చేసుకోలేని ఉద్రేకం అని అనడానికి వీల్లేదు. పై మూడు పాత్రల భావాలను వివరంగా పరిశీలించడమూ కొత్తకాదు. కాని ఇలాంటి మానసిక వ్యాయామాన్ని ఫ్రెంచి వాళ్ళు 'వెంట్రుకను నాల్గు భాగాలుగా చీల్చే' అనే మానసిక వ్యాయామం అంటారు. పోతే ఇక్కడ పైన చెప్పిన రచయిత చేస్తున్న దేమిటంటే, అసలు కోడి గ్రుడ్డు లేకపోయినా, దాని ఈకల్ని పీకడం. అందుచేత ఇలాంటి కథానాయకుణ్ణి, నాయకురాల్ని మూడవ వ్యక్తిని పాఠకుడు అసలు నమ్మడు. రచయిత ఈ ముగ్గురి చుట్టూ వుండే వాతావరణాన్ని చెప్పలేదు. మూడవ వ్యక్తి నివసించిన భవనాన్ని గురించి మేజాబల్లలోని చేతి మేజోళ్ళను గురించి వివరంగా వర్ణించాడు. కాని అతని వృత్తి ఏమిటో, చేతి మేజోడును గురించి అతడు ఆలోచించని సమయంలో అతడు ఏం చేస్తుంటాడో మొదలైనవి ఏవీ తెలుసుకోడం అవసరమని రచయిత భావించలేదు. అతడు ఫాషన్‌బుల్ డాక్టరా? స్టాక్ బ్రోకరా? పార్లమెంటు సభ్యుడా? రచయిత చెప్పే విధానం చూస్తే అతడు జర్నలిస్టుగా కనబడతాడు. కాని మనకు అతడు ఎక్కడ పనిచేసేదీ ఏమి రాసేది మొదలైనవేవీ తెలియజేయలేదు. ఒక ముసలావిడను అతని మేనల్లుడు చంపితే, ఆ శవాన్ని గురించి రాస్తున్నాడో, ఆమె ఉదారతను గురించి రాస్తున్నాడో ఏమీ తెలియదు కథానాయిక ప్రవర్తనకు ఆమె తల్లితండ్రుల వైఖరి ఏమిటి? రచయిత తెలియజేసిన ప్రకారం ఆమె తల్లిదండ్రులు కర్పూరపు ఉండల్నీ, తాళం కప్పల్నీ నీతినియమాల్నీ పూజిస్తారు. అలాంటి తల్లిదండ్రుల పట్ల ఆ కథానాయిక ధోరణి ఏమిటి? సమాజం నుండి ప్రత్యేకంగా ఏరి తీసుకువచ్చిన పాత్రలే గాక, వాటి జీవితాల్నుండి కూడా సంబంధం లేకుండా ఏరి తెచ్చిన పాత్రలు, ప్రత్యేకంగా ప్రేమ కలాపాల్లోనే మునిగి వుండే పాత్రలు, అవాస్తవికంగా కన్పిస్తాయి, పైన చెప్పిన మూడు పాత్రలూ మైనపు బొమ్మలు, వాటిని గురించి పాఠకుడు ఏమీ బాధపడడు అతను కేవలం విసుగెత్తిపోతాడు.

**మరొకరి నుండి నేర్చు కోవడం అంటే, వారిని అనుసరించడం అనికాదు. నూతన కథావస్తువుకు నూతన రూపాలు అవసరమని నా భావన. 19వ శతాబ్దంలోని నవలలో, వ్యక్తుల, లేక కుటుంబాల చిత్రీకరణ మాత్రమే వుండేది. ఆ నవలలో రచయిత తన పాత్రలను ఒక కథానాయకుని లేక అనేక కథానాయకుల చుట్టూ, గుమిగూర్చేవాడు. నేటి ప్రజా జీవితం ఎక్కువగా వ్యక్తి ఆంతరంగిక జీవితంలో ఒక భాగమే.**

రచయిత శిల్పాన్ని గురించి చెప్పేటప్పుడు తరచుగా నేను గత కాలపు రచయితలను పేర్కొన్నాను. వారి నుండి మనం నేర్చుకోవలసిందేమిటి? దీనికి సమాధానం సహజంగా సంపన్నత, అమలినభాష, వాక్య నిర్మాణం, సాహిత్య విధానాలు - అనే.

ప్రామాణిక రచయితల నుంచి ఇదంతా నేర్చు కోవలసిందే. వార్తా పత్రికలలోని దరిద్ర భాషతో నవలలను రాయవలసిన పనిలేదు. టాల్‌స్టాయ్ వ్యక్తి చిత్రీకరణను, నవలలోని ఘటనా క్రమంలో ప్రకృతిని ("లాండ్ స్కేప్") కళ్లకు గట్టినట్లు చిత్రించగల్గిన తుర్జెనెవ్ శక్తినీ మితంగా మాట్లాడినా చక్కగా వ్యక్తం చేయగల సాధనాలు గల చెకోవ్ ప్రత్యేకతనూ అసలు విషయాలకు సంబంధించని వాటిని లయబద్ధంగా వర్ణించడంలో గొగోల్ ప్రతిభనూ లెర్మాన్‌టోవ్ వచనంలో విపులమైన స్పష్టీకరణ, కవితల సమ్మేళాన్ని మనం జ్ఞాపకం తెచ్చుకోవాలి. ఇలాగే ఇంకా చెప్పవచ్చు.

మరొకరి నుండి నేర్చు కోవడం అంటే, వారిని అనుసరించడం అనికాదు. నూతన కథావస్తువుకు నూతన రూపాలు అవసరమని నా భావన. 19వ శతాబ్దంలోని నవలలో, వ్యక్తుల, లేక కుటుంబాల చిత్రీకరణ మాత్రమే వుండేది. ఆ నవలలో రచయిత తన పాత్రలను ఒక కథానాయకుని లేక అనేక కథానాయకుల చుట్టూ, గుమిగూర్చేవాడు. నేటి ప్రజా జీవితం ఎక్కువగా వ్యక్తి ఆంతరంగిక జీవితంలో ఒక భాగమే. కథానాయకుడు లేక కథానాయకులతో సంబంధం వుండే అనేక మందిని చిత్రించకుండా, నేడు ఒక నవలను - అది మనస్తత్వం చిత్రించే నవలైనా సరే - రాయడం అనూహ్యమైన విషయం. నవలా నిర్మాణంలో తప్పకుండా ఈ విషయం పనిచేస్తుంది. జీవిత పద్ధతి కూడా మారింది. పెద్ద పెద్ద వర్ణనలతో నిరంతరం పాఠకుల్ని నిలబెట్టే ఘటనలను ఆధునిక నవలలో ఉండటం నేనూహించలేను, తుర్జెనివ్‌కు అలా వర్ణించడం సహజమే. కాని నేడు అది సంప్రదాయబద్ధశైలిగా కనబడుతుంది.

ప్రామాణిక రచయితల నుండి మనం నేర్చుకోవలసిన విషయం వేరే వుంది. ప్రజలను చిత్రించడంలో ఆ రచయితలు అనుసరించిన పద్ధతులను మనం నేర్చుకోవాలి.

తమ పాత్రలను చిత్రించేటప్పుడు వాటి గురించి తాము చూసినది మాత్రమే వర్ణించి వూరుకొనే వారుకాదు. 19వ శతాబ్దపు మహా రచయితలు కాలానికి వేసిన ముసుగును తొలగించి భవిష్యత్తులోకి చూచేవారు. అయితే వారికి సమాజాభివృద్ధికి చెందిన శాస్త్రీయ సిద్ధాంతం తెలియదు.

బూర్జువా సమాజంలో వాస్తవికతకు కళకు మధ్య అఘాతం వుంటుంది. బూర్జువా యువకుడు ఒకడు ఒక పేద అమ్మాయిని పెళ్లి చేసుకోవాలని తలచాడనుకోండి. లేదా వర్తకానికి బదులుగా కళా సృష్టిలో నిమగ్న మయ్యాడను కోండి. లేదా లాభసాటి బేరం గాని గౌరవృత్తిని ఏదైనా చేపట్టాడను కోండి. వెంటనే అతని తండ్రి చిరాకుగా "జీవితం నవలేమీ కాదు" అని అంటాడు.

ఫ్లాబర్ట్ రాసిన "మదాంబొవారీ" అశ్లీలానికి అసమ్మతి తెల్పినదెవరు? వ్యభిచార గృహాలకు వెళుతూ ఉంపుడుగత్తెలను ఉంచుకోవడం ఒక ఫ్యాషన్ అని అనుకొనే అదే పెట్టుబడిదారులు. బొట్టిసెల్లీ చిత్రాలు యువకులను అవినీతి పాలు చేస్తున్నాయని, వాటిని తీసివేయవలసిందని ఈ మధ్య ఇటలీలో కోరిందెవరు? బూతు ప్రచురణలకు చందా దార్లయిన ముసలి విషయ లాలసులే. చాప్లిన్ ఫిల్ములను అవినీతికరమైనవని అమెరికాలో ఆక్రోశించేదెవరు? ఉన్నతాధికారు లతో వుండి, ఆ అధికారాలతో రక్షణ పొందుతున్న పెద్ద పెద్ద దొంగలూ, బందిపోటు దొంగలూ తుచ్ఛమైన పనుల ద్వారా లక్షలాది ధనం సంపాదించేవాళ్లే.

బూర్జువా వర్గానికి నీతినియమాల విషయాలపై ద్వంద్వ ప్రమాణాలుంటాయి. మామూలుగా ఉండే పది ధర్మాలుగాక (క్రైస్తవ మత ప్రకారం పది ముఖ్య ధర్మాలున్నాయి. అను) బూర్జువా వర్గం పదకొండో దర్మం ఒకటి తెచ్చి పెట్టింది. అది : "ధనాన్ని గౌరవించండి" అని. వారికి సంబంధించినంతవరకు ఈ పదకొండవ ధర్మాన్ని మాత్రమే తమకు అట్టిపెట్టుకొంటారు. అసభ్య నైతిక సూత్రాలకు వారు అతీతులు. వారు దొంగతనం చేయవచ్చు. అబద్ధం అడవచ్చు. నైతికంగా దిగజారిన జీవితం కొనసాగించ వచ్చు. హత్య చేయవచ్చు.

తమకొకటి, ఇతరులకు మరొకటి నైతిక ప్రమాణాలు ఉండాలనే ద్వంద్వ ప్రమాణ పద్ధతిని సోషలిస్టు సమాజం ఖండించు తుంది. మర్యాదగా బ్రతకాలని మాట్లాడుతూనే దొంగతనం చేసేవారు, ఆత్మవిమర్శ కావాలని చెబుతూనే చిన్న తరహా నియంతలాగే వర్తించేవారూ, సత్యాన్ని ప్రేమించుతామని చెబుతూనే అపవాదులు వేసేవారూ, మాకూ వున్నారు. అయితే ఇలాంటివారు

బలహీనతలు గాని, తప్పులుగాని లేకుండా ఒక అద్భుతమైన వ్యక్తి చిత్రాన్ని ఒక రచయిత సమకూర్చుతాడను కోండి. అతనితో పాటు ఒక బద్ధకస్తునీ, దగాకోరునూ నిజమైన మానవ స్వభావాలతో కూడిన వ్యక్తినీ చిత్రించాదనుకోండి. అప్పుడు పరిపూర్ణమై రక్తమాంసాలతో నిండిన ఈ దుష్ట పాత్రకు ఆధిక్యతరాదా? ఒక కోణం ద్వారా మాత్రమే ప్రచురించబడి ముఖం మాత్రం కాంతివంతం చేయబడిన ఆదర్శ పాత్ర, తన నీడను కూడా ప్రసరించక పై చెడ్డ పాత్రచే వెనక్కి నెట్టి వేయబడదా?

చాలా తక్కువ : ఇలాంటివారిని ఎదుర్కొని మా సమాజం పోరాడు తోంది. మా ప్రజలలో ఏ ఒక్క భాగమూ మా దేశంలో ఏ గౌరవనీయుడూ, పైన చెప్పిన రెండు రకాల నైతిక ప్రమాణాన్ని కోరడు. ప్రజలను మోసం చేసే కళపై మా ప్రజలకు అభిరుచి లేదు.

సాహిత్యంలో జీవితం గాఢంగా, వాస్తవికంగా ప్రతిబింబించాలని పాఠకులు తరచుగా నాకు జాబులు రాస్తూ వుంటారు. (ఇతర రచయితలకు కూడా ఇలాంటి ఉత్తరాలు వస్తాయని నాకు తెలుసు.) సాధారణ ప్రజల యొక్క నిజానికి వారు సాధారణ ప్రజలు కాదు - మానవుని ఆత్మికాభివృద్ధికి సంబంధించిన కష్టాలను, అభివృద్ధికి గతకాలపు అవసాన చిహ్నాల భారానికీ మధ్య గల వైరుధ్యాలనూ, సంపూర్ణంగా వాస్తవిక జీవితంలో వలె హృదయపూర్వకంగా చిత్రించాలని రచయితలను పాఠకలోకం కోరుతుంది. దైనందిన జీవితాన్ని, జీవిత శౌర్యాన్ని రచయితలు చిత్రించాలని పాఠకలోకం వాంఛించింది. మన ప్రజల ముఖ్య లక్షణం కాని అసత్యా వేశపరత లేకుండా మన యుగ చైతన్యాన్ని చిత్రించాలని వారు కోరుతున్నారు. అతిశయోక్తులు లేకుండా సోవియట్ స్త్రీ, పురుషుల స్వభావాన్ని చూపించాలని పాఠకులు కోరుతున్నారు. ఔన్నత్యం అంటే పోటీపెట్టి నిలబెట్టే ఊతకాలు కాదు. అలాగే చిత్తశుద్ధి స్థానే పటాటోపాన్నీ ఉంచి గందరగోళ పడి లాభం లేదు. అందుచే కపట ఔన్నత్యాన్ని చిత్తశుద్ధి లేని పటాటోపాన్ని వర్ణించవలదని రచయితలను మన పాఠకులు కోరుతున్నారు.

మన రచయితలంతా ఆదర్శవంతమైన ప్రజలనే చిత్రించాలని కొందరు విమర్శకులు అభిప్రాయపడుతున్నారు. ఆధునిక బూర్జువా నవలలోని పాత్రలు పైకి సంస్కారం కల్గినట్లు కన్పించుతాయి. కాని అంతర్ముఖంగా చూస్తే పశుస్వభావికులు, కొంతవరకు మిధ్యావాదులు, జూదవ్యాపారులు, మోసగాళ్లు, హేమ్లెట్ పాత్రలాంటివాళ్లు. ఇలాంటివారికన్నా నేటి సోవియట్ పౌరుడు ఎంతో ఉన్నత వ్యక్తి, ఉదాత్త చైతన్యం గలవాడు. ఎంతో క్లిష్ట స్వభావం గలవాడు. మన జీవితాన్ని వాస్తవిక రూపంలో చూపించి నట్లయితే ఆ అద్భుత ప్రజలను చిత్రించే పుస్తకాలు మనకు లభ్యమవుతాయి.

ఇప్పుడు తరచుగా : "మాకు దుష్ట (నెగిటివ్) పాత్రలను ఈయండి" అనడం మాములు అయింది. ఆదర్శమైన శిష్ట (పాజిటివ్) పాత్రలను కోరే విమర్శకులే ఈ విషయం అంటుంటారు. బలహీనతలు గాని, తప్పులుగాని లేకుండా ఒక అద్భుతమైన వ్యక్తి చిత్రాన్ని ఒక రచయిత సమకూర్చుతాడను కోండి. అతనితో పాటు ఒక బద్ధకస్తునీ, దగాకోరునూ నిజమైన మానవ స్వభావాలతో కూడిన వ్యక్తినీ చిత్రించాదనుకోండి. అప్పుడు పరిపూర్ణమై రక్తమాంసాలతో నిండిన ఈ దుష్ట పాత్రకు ఆధిక్యతరాదా? ఒక కోణం ద్వారా మాత్రమే ప్రచురించబడి ముఖం మాత్రం కాంతివంతం చేయబడిన ఆదర్శ పాత్ర, తన నీడను కూడా ప్రసరించక పై చెడ్డ పాత్రచే వెనక్కి నెట్టి వేయబడదా? ష్టోల్ట్జ్ పాత్రను మచ్చలేని దానినిగా చేయాలని గోంచరోవ్ తలిచాడు. కాని అది వాస్తవిక పాత్రలాగా లేదు. కాని ఆబ్లోమోవ్ పాత్ర సజీవంగా ఉంది. ఒక పాతికేళ్ల క్రితం నేను రాసిన నవలలో నేను కూడా విఫల మయ్యాను. దుష్ట పాత్రలు చాలా వాస్తవికంగా వున్నాయి. శిష్ట పాత్రలకు నేను అన్నివిధాలా సద్గుణాలనూ, సత్ స్వభావాలనూ అంటగట్టినా వాటికంటే దుష్టపాత్రలే, నిజమైనవిగా వాస్తవికమైనవిగా ఉన్నాయి. ఇతర ఆధునిక రచయితలు కూడా ఇలాంటి అపజయాలనే అనుభవించారు.

సోవియట్ రచయితలు మన సాహిత్యాన్ని గాఢంగా ప్రేమించుతారు. ఈ సాహిత్యం లోని లోపాలకు మనసారా విచారించు తారు. విజయాలకు సంతోషించుతారు. వారు మన సమాజంలో వివిధోన్ముఖమై సంపద్వంతమైన జీవితాన్ని చూస్తున్నప్పుడు, మన నవలలు కొన్ని వాస్తవిక జీవితాన్ని చూపించలేక పోతున్నాయనీ, అతి చులకన చేస్తున్నాయనీ, సాంప్రదాయ ధోరణిలో వుంటున్నాయనీ పాఠకులు గ్రహించుతున్నారు. తమ కామ్రేడ్స్‌ను, తమ సమకాలీనులను, తమను నవలలో చిత్రించాలని వారు కోరుతున్నారు. వారేమీ తమను ఆదర్శ పురుషుల నమూనాలుగా చిత్రించమని కోరడం లేదు. సజీవ ప్రజలుగా చిత్రించాలని కోరుతున్నారు. టాల్‌స్టాయ్, చెకోవ్, గోర్కీల ప్రామాణిక గ్రంథాలను తిరిగి తిరిగి చదువుతూంటే విప్లవానికి పూర్వపు రష్యాలోని ప్రజలను ఎంత సూక్ష్మదృష్టితో, ఎంత చాకచాక్యంతో, ఎంత చైతన్యంతో చిత్రించారో మనకు బోధపడుతుంది. సాధారణ పాఠకులు - వారి ఆంతరంగిక ప్రపంచం ఎప్పుడూ సాధారణమైనది మాత్రం కాదు- సోవియట్ నవలలో తమకు స్థానం ఉండాలని నిత్యం కోరుతున్నారు.

**("రచయిత - శిల్పమూ" పుస్తకం నుండి - అనువాదం : తుమ్మల వెంకట్రామయ్య)**



# కవిత్వం పుట్టుక పరిణామాలు

## క్రిష్టోఫర్ కాడ్వెల్

**(20.10.1907 - 12.02.1937)**

అసలు పేరు క్రిస్టోఫర్ సెంట్ జాన్ బ్రిటిష్ స్ప్రింగ్. కవి, రచయిత, విమర్శకుడు, మార్క్సిస్టు దృక్పథం నుంది విమర్శనా గ్రంథాలు రాశాడు.

**కవిత్వం ఆర్థిక వ్యత్యాసాలు లేని సమాజంలో పుట్టింది. మరి ఇప్పుడు దానికి అస్థిత్వం వుందా? కవిత్వానికి ఆదరణ కుంచించుకుపోతోంది. సాహిత్యంలో ఒంటరిదై పోయింది. ఉద్విగ్న మానస సంభాషణను పట్టుకు వ్రేలాడుతుంది. ఇది పతనం యొక్క మచ్చ కావచ్చు. పెరిగి పెద్దవాడై మానసిక వికలాంగుడైన పిల్లవాడెలా ఆకలని అరుస్తాడో పద్యం కూడా పెరిగి ప్రపంచంలో తన బ్రతుకు తెరువుకు ప్రాకులాడుతోంది. కవిత్వ భాష ఉద్విగ్నం ఇది ఇంకా ఎలా మనగలుగుతోంది? దానిలో సమిష్టితత్వం సంప్రదాయ స్వభావం ఉంది. అదే దాని మనుగడకు కారణం. అయితే భాష యొక్క రెండవ ధృవం సైన్సు. ఈ ధృవం వద్ద శుద్ధ ప్రకటనలే వుంటాయి. ఇవి యదార్థ విషయాల సేకరణ. ఈ విషయాల్లో ఆవేశాలుండవు. వంశాలులు, భౌగోళిక శాస్త్ర గణింపులు, జనాభా లెక్కలు, అతి సాధారణ వాస్తవాన్ని గట్టిగా రుజువు చేసుకొనే లక్ష్యం గల ఇతర సాహిత్యం అంతా వుంటుంది. కానీ భాష యొక్క మొదటి ధృవంలో ఆదిమ మానవుని అస్పష్ట ఆకాంక్షలు, మత భావనలు, ఉద్వేగ వ్యక్తీకరణలూ వుంటాయి. ఆదిమ మానవునికి సైన్సు అంటే ఒక ఆచరణ. ఒక సంప్రదాయం. ఒకచెట్టును నాటడం, పడవను నిర్మించడం.**

మానవుల తొలి దినాల సౌందర్యానంద చర్యల ఆలోచనల్లో కవిత్వం ఒకటి. ఆదిమ సమాజంలోని ప్రజల సాహిత్యం కళల్లో అది ప్రత్యేకంగా కనపడదు. ఆనాటి మొత్తం సాహిత్యంలో, చరిత్ర, మతం, ఇంద్రజాలం, శాసనాలు అన్నిటిలో కలిసే వుంది. భద్రపరిచిన నాటి నాగరిక ప్రజల సాహిత్యం యావత్తూ కవిత్వంలోనే వుంది. ఇండియా, ఈజిప్టు, గ్రీకు, చైనా, జపాన్, ఆంగ్లో - శాక్సెన్, రోమన్ ప్రజలు సంరక్షించుకున్న సాహిత్యం చూస్తే అది మన వేద వాఙ్మయంలో లాగే ఛందోబద్ధం, లయాన్వితం అయి వుండటాన్ని మనం గమనించవచ్చు.

ఆనాటి కవిత్వం ఈనాటి మన అర్థంలో శుద్ధ కవిత్వం కాదు. అది వారి ఉద్విగ్న మానస సాధారణ సంభాషణ. వారి ఉద్విగ్న మానస సంభాషణా క్రమంలో వెలువడే నియంత నిర్మాణ ఛందఃలయ, ప్రాస, సమదీర్ఘ వాక్కుల పక్కాణింపులు, అలంకారాలు, కల్పనలు, పునరుక్తులు అన్నీ ఆ కవిత్వాన్ని అలౌకిక ఇంద్రజాలిక బలాన్నిచ్చేవి.

రైతుల వ్యవసాయక మార్గదర్శకాలు, మత ధర్మశాస్త్రాలు, ఈజిప్టు వారి ఖగోళ జగత్కు సంబంధించిన గ్రంథాలు, ఆర్యుల తాత్విక ఆలోచనలు, దేవతల రాజవంశాల స్తుతి స్తోత్రాల చరిత్ర అన్నీ లయబద్ధంగానే వుండేవి. ప్రజల స్వీయ చైతన్య భాషా పరిజ్ఞానం వలెనే యీ ఉద్విగ్న మానస భాషా సాహిత్య శాఖలో ఒక ప్రత్యేక వాహకమైన పద్యంగా స్థిరపడింది. లిపి ఆవిష్కరణ జరగకముందే లయలు ఒలికే, సంభాషణల వెంట సంగీతం సాగిందని ఊహించి చెప్పవచ్చు. ఆదివాసీల శారీరక కదలికలలో నిలయాలు, ముఖ కవళికలు వారి గంతులు, అరుపులు, రాయి రప్ప, కర్ర కట్టెలతో చేసే వివిధ రకాల ధ్వనులు వారి నృత్య గీత సంగీతాలకు జన్మ స్థానాలు. కవిత్వము సంగీతము నృత్యము ఒక దానికొకటి ముడివేసికొనే వున్నాయి.

**కవిత్వం ఆర్థిక వ్యత్యాసాలు లేని సమాజంలో పుట్టింది. మరి ఇప్పుడు దానికి అస్థిత్వం వుందా? కవిత్వానికి ఆదరణ కుంచించుకుపోతోంది. సాహిత్యంలో ఒంటరిదై పోయింది. ఉద్విగ్న మానస సంభాషణను పట్టుకు వ్రేలాడుతుంది. ఇది పతనం యొక్క మచ్చ కావచ్చు. పెరిగి పెద్దవాడై మానసిక వికలాంగుడైన పిల్లవాడెలా ఆకలని అరుస్తాడో పద్యం కూడా పెరిగి ప్రపంచంలో తన బ్రతుకు తెరువుకు ప్రాకులాడుతోంది.**

భాష యొక్క ఈ ప్రత్యేక లక్షణాలు, భేదాలు నాగరికత పెరిగే కొద్దీ పెరిగాయి. అవి నిరంతరం సాగే శ్రమ విభజనలో నాగరికతాభివృద్ధి కనపడుతుంది. ఇది అవిచ్ఛిన్నంగా ఏకీకరణ పొందుతున్న ఆర్థిక వ్యవస్థకు వ్యతిరేకమైనది కాదు.

మానవ వివిధ శరీరాంగ విధులు దేనికదే స్వతంత్రంగా వుంటాయి. అయినా అవి ఒక విస్తృతమయిన నాడీ మండల వ్యవస్థ ద్వారా సమన్వయాన్ని కలిగి వుంటాయి. జెల్లీ చేపకు నాడీ మండల వ్యవస్థ లేదు. దేనికదే స్వతంత్రమైనది. దాని ఒక శరీరభాగాన్ని తొలగించినా జీవిస్తుంది. సమాజ ఆర్థికాంశం కూడా నిత్యమూ విచ్ఛిన్నతకు గురైనా విస్తృతమవుతూనే వుంటుంది. అదే సమయంలో విస్తృతమౌతున్న ఆర్థిక పునాది ఏకీకరణ కూడా పొందుతుంది. తెగల సరళమైన ఆర్థిక వ్యవస్థలో ప్రతి పని యొక్క సేవిక కవిత. ఆధునిక సమాజం యొక్క కార్యకలాపాలలో చరిత్ర, నవల, నాటకం ప్రక్క ప్రక్కనే ఉంటాయి. సమాజం ఎంత అభివృద్ధి చెందితే కళ కూడా అంతే అభివృద్ధి చెంది వుండాలని మనం ఆశించాలి. యీ అభివృద్ధిని సాధ్యం చేసినా మనిషి, సమాజం సంస్కృతులలోని అస్పష్ట లక్షణాలను మరింతగా కళ స్పష్టపరచాలి.

మానవ లక్షణాల నిర్దిష్ట సంచయం వారసత్వంగా వచ్చాయి. శారీరక సంబంధంగా వచ్చినవి కావు. సామాజికంగా వచ్చాయి. ఆర్థిక ఉత్పత్తి నుండి సంస్కృతిని వేరు చేయలేము. అలాగే కవిత్వాన్ని సామాజిక నిర్మాణం నుండి విడదీయలేము. ఎందుకంటే కవిత్వమంతా భాషామయం, భాషా సమూహం నుంచి సంఘం ద్వారా ఉనికిలోకి వచ్చింది. అంటే భాష సమూహ ఆర్థిక ఉత్పత్తి ద్వారా ఉనికిలోకి వచ్చింది. అందుకనే కవిత్వాన్ని జాతుల, తెగల జన్యుపరంగా చూడరాదు. కవిత్వాన్ని ఒక ఆర్థిక పరమైనదిగానే చూడాలి. మనం సంస్కృతిని, కవిత్వాన్ని, వాటి అభివృద్ధి విస్తృతిని వాటికి మూలమైన శ్రమవిభజన సంక్లిష్టతలోంచి చూస్తాము. సంక్లిష్టత సౌందర్యానందానికి గీటురాయి కాదు. అది శ్రమ విభజనలోంచి వచ్చిన లక్షణం.

ఒక ప్రత్యేక జన్యువు ఫలితంగా మనిషికీ మనిషికీ మధ్య తేడాల జన్యుపరమైనవి. కాని సామాజిక తారతమ్యాలు అంటే సామాజిక ఉత్పత్తిలో ఒక వ్యక్తి నిర్వహించే ప్రత్యేక పాత్ర. వ్యక్తి ఒక మూసలో కార్మికుడుగా, గుమాస్తాగా, న్యాయవాదిగా, పురోహితుడుగా తయారు చేయబడి సహజ వ్యక్తిత్వంలోని కొంతభాగం అణచివేయబడుతుంది. ఆ విధంగా ఒక తరహా మనిషిగా తయారైపోతాడు. ఆర్జించిన లక్షణం వారసత్వమూసలో నిర్బంధించబడుతుంది. పృథక్కృత యెంత అధికంగా ఉంటే మూస మరింత ప్రత్యేకత కలిగి వుంటుంది. వర్గాలతో కూడిన నేటి సమాజంలో స్వేచ్ఛతో కూడిన ఎంపికకు అవకాశం లేదు. ఒక వ్యక్తి తన తల్లిదండ్రుల కంటే ఎక్కువ ఆదాయం వచ్చే వృత్తివైపు ప్రయాణం చేస్తాడు. అంతేకాదు అంతకంటే ఎక్కువ ఆదాయం వచ్చే కంపెనీ సెక్రటరీ కావాలని, అల్పాదాయం వచ్చే కవిత్వాన్ని తోసి పారేస్తారు. అదే సమయంలో నిరుద్యోగమనే ఉద్యోగంలో ఇష్టం లేని చేష్టలలో లక్షలాది ప్రజల ప్రయోజనకరమైన పరివర్తనలు మూగపోతాయి.

కవిత్వం ఆర్థిక వ్యత్యాసాలు లేని సమాజంలో పుట్టింది. మరి ఇప్పుడు దానికి అస్థిత్వం వుందా? కవిత్వానికి ఆదరణ కుంచించుకుపోతోంది. సాహిత్యంలో ఒంటరిదై పోయింది. ఉద్విగ్న మానస సంభాషణను పట్టుకు వ్రేలాడుతుంది. ఇది పతనం యొక్క మచ్చ కావచ్చు. పెరిగి పెద్దవాడై మానసిక వికలాంగుడైన పిల్లవాడెలా ఆకలని అరుస్తాడో పద్యం కూడా పెరిగి ప్రపంచంలో తన బ్రతుకు తెరువుకు ప్రాకులాడుతోంది. కవిత్వ భాష ఉద్విగ్నం ఇది ఇంకా ఎలా మనగలుగుతోంది? దానిలో సమిష్టితత్వం సంప్రదాయ స్వభావం ఉంది. అదే దాని మనుగడకు కారణం. అయితే భాష యొక్క రెండవ ధృవం సైన్సు. ఈ ధృవం వద్ద శుద్ధ ప్రకటనలే వుంటాయి. ఇవి యదార్థ విషయాల సేకరణ. ఈ విషయాల్లో ఆవేశాలుండవు. వంశాళులు, భౌగోళిక శాస్త్ర గణింపులు, జనాభా లెక్కలు, అతి సాధారణ వాస్తవాన్ని గట్టిగా

**ఒక అటవిక తెగకు సమిష్టి ఆవేషం యొక్క అవసరం ఏమిటి? ఒక పులి, ఒక శత్రువు, భూకంపం, ఒక పిడుగు ఆకస్మికంగా మీదపడేప్పుడు సహజాతంగా పుట్టే అసంకల్పిత ప్రతిస్పందన. అందరూ భయపడతారు. అలాంటి సందర్భాలలో సమిష్టి ఆవేశం పుడుతుంది. కష్టాలకు కారణాలను తెలుసుకోలేనప్పుడు అటువంటి పరికరం సామాజిక అవసరం. కనపడని కారణం శక్తివంతమైనది. ఆదిమ తెగల ఆర్థిక జీవితం నుండి యీ విధంగా కవిత్వం పుట్టి పెరుగుతుంది. అలాగే వాస్తవం నుండి భ్రమ జన్మిస్తుంది.**

రుజువు చేసుకొనే లక్ష్యం గల ఇతర సాహిత్యం అంతా వుంటుంది. కానీ భాష యొక్క మొదటి ధృవంలో ఆదిమ మానవుని అస్పష్ట ఆకాంక్షలు, మత భావనలు, ఉద్వేగ వ్యక్తీకరణలూ వుంటాయి. ఆదిమ మానవునికి సైన్సు అంటే ఒక ఆచరణ. ఒక సంప్రదాయం. ఒకచెట్టును నాటడం, పడవను నిర్మించడం. వీటి సందర్భంగా వాడే భాషలో కేవలం వాస్తవికాంశాలు మాత్రమే వుంటాయి. ప్రయోజనం లేని భాష ఆదిమ మానవునికి అర్థం కాదు. లయతో కూడిన భాషతో అతడు ఊహించిన శక్తిని పొందుతాడు. అతని హృదయానికది అమృతం. అయితే లయలేని భాషా ప్రయోజనం కూడా అతనికి తెలుసు. లయలేని సంభాషణ ప్రమేయ కారణం చూపి ఒప్పించేదిగా వుంటుంది. గుంపులోని జనాన్ని తేలికగా పనిలో పెట్టడానికి పనికి వస్తుంది.

కవిత్వం లాక్షణికంగా పాట. పాటలా క్షణికంగా లయతో వుండటం వలన సమిష్టి ఆవేశ అభివ్యక్తితో కూడినది. ఇది ఉద్విగ్నమాన భాషలోని రహస్యం.

అయితే ఒక అటవిక తెగకు సమిష్టి ఆవేశపు అవసరం ఏమిటి? ఒక పులి, ఒక శత్రువు, భూకంపం, ఒక పిడుగు ఆకస్మికంగా మీదపడేప్పుడు సహజాతంగా పుట్టే అసంకల్పిత ప్రతిస్పందన. అందరూ భయపడతారు. అలాంటి సందర్భాలలో సమిష్టి ఆవేశం పుడుతుంది. కష్టాలకు కారణాలను తెలుసుకోలేనప్పుడు అటువంటి పరికరం సామాజిక అవసరం. కనపడని కారణం శక్తివంతమైనది. ఆదిమ తెగల ఆర్థిక జీవితం నుండి యీ విధంగా కవిత్వం పుట్టి పెరుగుతుంది. అలాగే వాస్తవం నుండి భ్రమ జన్మిస్తుంది.

జంతువులు కాకుండా ఒక తెగ జీవితానికి సహజాతం కానట్టే క్రమానుగతమైన కొన్ని ప్రయత్నాలు అవసరం. ఆ అవసరాలు జైవికం కానట్టే ఆర్థిక లక్ష్యాల నుండి పుట్టుకొస్తాయి. పంట మార్పిడికి సామాజిక యాంత్రికతతో చేయడానికి సహజాతమైన శక్తులు పూనుకునే విధంగా పురికొల్పాలి. ఈ సామాజిక యాంత్రికతలో ముఖ్యమైన విషయం గుంపు పండుగ. ఇది కవిత్వానికి మాతృక. ఈ పండుగలో వాస్తవాంశం పంట మార్పిడి. కానీ ఈ వాస్తవ విషయం ఇప్పుడు అక్కడ వుండదు. ఈ వాస్తవం గుంపు సంబరంలో ఓ భ్రమాత్మకమైనది. ఒక అద్భుతమైన వస్తువు భ్రమలో వుంటుంది. ఉగ్రమైన నృత్యం, పాటలు, అరుపులలో మత్తు గొలిపే లయ వాస్తవంలోని వస్తువు భ్రమగా వేరవుతుంది. అసలు పంట నూర్పిడి వుండదు. కానీ భ్రమ నిజమైనదిగా కనపడుతుంది. నాట్యం నిలిచిపోతుంది. పాట ఆగిపోతుంది. అయినా ఇంకా చేతికి రాని పంట అవాస్తవంగా కనపడుతుంది. వాస్తవమైన పంటను పండించాలి. అందుకు అతను కార్యోన్ముఖుడు అవుతాడు. ఆ విధంగా నాట్య సంగీతంలో కలిసిపోయిన కవిత్వం గుంపు యొక్క సహజాతమైన శక్తికి నాడీ కేంద్రంగా పనిచేస్తుంది. ఆ శక్తి సమిష్టి కార్యాచరణకు పురికొల్పుతుంది. అందుకు అవసరమైన కారణం దృశ్యమాన క్షేత్రంలోనూ లేవు, స్వయంచాలక సహజాతాల చేతా నిర్ణయింపబడవు. తేనెటీగలు, చీమలు, ఆహార పదార్థాలను సహజాతంగా నిల్వచేస్తాయి. మనిషి అలాంటి జీవికాదు. శ్రమ అనే మిల్లుకు మానవుని సహజాతాలకు సిద్ధం చేయాలి. అతని ఆవేశాలను పోగెయ్యాలి. వాటిని ప్రయోజనకరమైన ఆర్థిక మార్గంవైపు మరల్చాలి. అది ఆర్థికపరమైనది కాబట్టి సహజాతం కాదు. అందుకే దానికి పదనిర్దేశాన్నివ్వాలి. అందుకు పథనిర్దేశం ఇచ్చే పనిముట్టు ఆర్థికమైనది.

ఈ ఆదేశాలను సమీకరించడమెలా? సాధారణ సామాజిక జీవితంలో ప్రతి మనిషి కొరకు మాట ఆవేశ పూరిత సహవాసాన్ని సంపాదిస్తుంది. ఆ మాటలను జాగ్రత్తగా ఎంపిక చేసి లయలో కూర్చి కలిసి పాడటం సాధ్యమవుతుంది. వాస్తవం నుండి వేరు పడటానికి నాట్యం, సంగీతం సహకరించి మొత్తానికి సామాజిక యంత్రాన్ని నడిపిస్తాయి. సమిష్టి భ్రమలో భాగస్వామ్యం వహించిన ఒక తెగలోని వ్యక్తి మారుతాడు. అతడు తెలివి మీరుతాడు. అంటే గుంపు జీవితానికి పొందుబాటవుతాడు.

సమాజంలో అనేక చలనాలు జరిగాయి. ఆర్థిక పునాది మారింది. ఫ్యూడల్ సమాజం బూర్జువా సమాజంగా మారింది. ఉత్పత్తి రంగంలో బూర్జువా విప్లవం యొక్క ఉపరితల నిర్మాణమే ఈ ఆధునిక సంస్కృతి. దీనిని అధ్యయనం చేయాలి. ఇప్పటి కవిత్వం అర్థం కావాలంటే చారిత్రకంగా దాని చలనం అర్థం కావాలి. అంటే వాటి చలన రూపాలు అధ్యయనం చేయాలి. అలాకాక కేవలం కళా సాహిత్య రూపాలనే అధ్యయనం చేస్తే అవి నిశ్చలమైన శ్రవ్యీకరణ రూపాలుగా కనపడతాయి. సమాజపు అంగ నిర్మాణంలో కవిత్వం కూడా ఒక భాగమే.

పొందుబాటు సంధికాలాలే పండుగలు. ఇవి సమాజంలో కొనసాగుతాయి. విద్యాభ్యాసం, వివాహం, యుద్ధాలు, పండుగలు ఇతరమైనవి. తెగల పండుగలలో కళ ద్వారా సంఘటితపరచబడిన యీ సమిష్టి ఆవేశం శ్రమను తేలిక చేస్తుంది. శ్రమ ఆవశ్యకత దానిని ఉత్పత్తి చేస్తుంది. మరల శ్రమలో ప్రవేశించి దానిని సులభం చేస్తుంది. ఆదిమమానవుడు దున్నేప్పుడు, పంట నూర్చేప్పుడు లయతో పాడతాడు. ఆ లయలో పనికవసరమైన సారం వుంటుంది. పెరిగిన శ్రమ విభజనలో పెరిగిన సమాజ నిర్మాణం కూడా వుంది. అప్పుడు వాస్తవ జీవితం నుండి కవిత్వం దూరంగా జరుగుతుంది. కళ శ్రమకు వ్యతిరేకమవుతుంది. విశ్రాంతి సృష్టిస్తుంది. కవి వంటరివాడవుతాడు. శ్రమ విభజన వర్గ సమాజానికి కారణం. చైతన్యం పాలక వర్గ ధృవం వద్ద పోగవుతుంది. పర్యవసానంగా వారి పాలన సోమరితనాన్ని సృష్టిస్తుంది. కళ శాశ్వతంగా పని నుండి వేరుపడుతుంది. దీనికి తుది పరిష్కారం వర్గ రహిత సమాజంలోనే లభిస్తాయి. ఈ మధ్యకాలంలో యీ చలనం సంపన్నమైన సాంకేతిక అభివృద్ధికి కారణమవుతుంది. సమిష్టిలో పుట్టిన ఆవేశాలు వంటరితనంలో కొనసాగుతాయి. అందుకే పాటను ఒకేవ్యక్తి పాడుతున్నాడు. అయినా అతని ఆవేశాలు సమిష్టి ప్రతిబింబాలే రెచ్చగొడతాయి. కళా ప్రపంచంలో పెరుగుతున్న సంక్లిష్టత మాటలు, ప్రతిబింబాలు అందరి జీవితానుభవాల వలన, అందరికి సాధారణమైన సమిష్టి ఆవేశాల నుండి పోగుచేసినవే. కళా ప్రపంచంలో పెరుగుతున్న సంక్లిష్టత విస్తరిస్తున్న సామాజిక జీవితం నుండి వచ్చినవే.

కవిత్వం భ్రమను సృష్టిస్తుందని గ్రీకులు చెప్పారు. కవి భ్రమను సృష్టిస్తాడు. నాటకరంగంపై కనపడే కథలు సృష్టిస్తాడు. మార్కెట్టులో కనపడిన వాటికంటే నిజమైన వాటిని సృష్టిస్తాడని గ్రీకులు కవి లక్షణాన్ని పేర్కొన్నారు. ఇందువలననే కవి అంటే "తయారీదారు" అని వారన్నారు. కవి మాటలను శూన్యం నుండి సృష్టించాడు. అవి వాస్తవ ప్రతీకాలు. వాస్తవం యొక్క కృత్రిమ అనుకరుణే కవి సృష్టియని గ్రీకులు తలచారు. కవిత్వంతో వినేవారిని మోసం చేస్తాడని ప్లేటో భావించాడు. సిద్ధాంతాన్ని కవిత్వాన్ని వేరు చేసి చూడటం అరిస్టాటిల్‌కు సాధ్యమైంది. అరిస్టాటిల్ సిద్ధాంతం మైకుసిస్. మనం కవిత్వాన్ని నాటకం నుండి వేరు చేశాం. అరిస్టాటిల్ అలా చేయలేదు. ప్లేటో ఏథెన్సులోని పాతతరం వాడు. మార్పులు గమనించలేదు. పద్యం కూడా సరుకుగ్గా మారుతుందనుకోలేదు. సంబరాల్లో ప్రేక్షకులు నటులు మూకుమ్మడిగా నటించే ప్రత్యేకమైన వ్యక్తులు గుంపులు మాత్రమే దాన్ని ఆస్వాదించేవారు. ఆర్థికవ్యవస్థ అభివృద్ధి, లిపిని అభివృద్ధి చేసుకునే అవసరం ఏర్పడింది. సమాచారం ఇక ఏ మాత్రం సామూహిక జ్ఞాపికకాదు. సమిష్టి జీవితం లేదు.

సమాజంలో అనేక చలనాలు జరిగాయి. ఆర్థిక పునాది మారింది. ఫ్యూడల్ సమాజం బూర్జువా సమాజంగా మారింది. ఉత్పత్తి రంగంలో బూర్జువా విప్లవం యొక్క ఉపరితల నిర్మాణమే ఈ ఆధునిక సంస్కృతి. దీనిని అధ్యయనం చేయాలి. ఇప్పటి కవిత్వం అర్థం కావాలంటే చారిత్రకంగా దాని చలనం అర్థం కావాలి. అంటే వాటి చలన రూపాలు అధ్యయనం చేయాలి. అలాకాక కేవలం కళా సాహిత్య రూపాలనే అధ్యయనం చేస్తే అవి నిశ్చలమైన శ్రవ్యీకరణ రూపాలుగా కనపడతాయి. సమాజపు అంగ నిర్మాణంలో కవిత్వం కూడా ఒక భాగమే.

బూర్జువా తనను తానొక హీరోగా తలచుకొంటాడు. వంటరిపోరాటం చేస్తున్నాననుకొంటాడు. మనిషి స్వేచ్ఛగా పుట్టాడు. కాని ఎక్కడ చూసినా సంకెళ్ళు. సహజంగా పుట్టిన మానవుడు సామాజిక బంధాలన్నీ కొట్టిపడేశాయానుకొంటాడు. తానొకడే వీటికి వ్యతిరేకంగా పోరాడుతున్నననుకొంటాడు. వాస్తవంగా తన వ్యక్తిత్వభావన నిరంతర సాంకేతికాభివృద్ధికి దారితీస్తుంది. అది వ్యక్తి స్వేచ్ఛను వృద్ధి చేస్తుంది. భూస్వామ్య సంబంధాల వ్యతిరేక పోరాటం ఉత్పత్తి శక్తుల బంధనాలను త్రెంచుతాయి. బూర్జువా వ్యవస్థ నిత్య నూతన విప్లవకర మార్పులు చెందుతుంది. ఉపరితలం భరించలేనంతగా పెరిగి పెరిగి కుప్పకూలిపోతుంది. బూర్జువా కవి కూడా తానొక స్వేచ్ఛా

బూర్జువాకు సాంకేతిక అభివృద్ధి చాలా ముఖ్యమైనది ఎందుకంటే పెట్టుబడిదారీ వ్యవస్థ మనుగడ దానిపై ఆధారపడి ఉంది. ఇదే సందర్భంలో ఆధునిక కవి యొక్క కవిత్వంలోని టెక్నిక్‌లో మార్పులు వస్తాయి. కానీ సామాజిక సంబంధాల మాటల వాడకం తగ్గిపోతుంది. కవిత్వం ఉపయోగించే మాటలు నానాటికీ వ్యక్తిగతమవుతాయి.

జీవిననుకొంటాడు. తనదైన హృదయోద్వేగంతో మనోప్రాధ్భులంతో అంతర్నిహిత శక్తులు విడుదల చేసి బాహ్య బంధనాలు తెంచుకున్నాన నుకొంటాడు. భూస్వామ్య సమాజం యొక్క నిర్బంధాలను నాశనం చేయాల్సిన అవసరాల నుండి బూర్జువా వ్యక్తివాదం పుట్టింది. ఫలితంగా ఉత్పత్తిలో అద్భుతమైన అవిచ్ఛిన్నమైన సాంకేతికాభివృద్ధి వచ్చింది. అలాగే కవితారీతులు అభివృద్ధి చెందాయి. పెట్టుబడిదారుడు శోకతప్తుడుగా జాలిగొలిపేవాడుగా క్రూరాత్ముడుగా రూపుదాల్చాడు. అతని వ్యక్తివాదం, స్వేచ్ఛ యుద్ధాలకు, అరాచకాలకు, ఆర్థిక మాంద్యానికి కారణమైంది. అది విప్లవాలకు కారణమవుతుందని కూడా తెలుసుకుంటాడు. ఉత్పత్తిని వురకలు పెట్టించే యంత్రం చివరకు బూర్జువానే పరుగులు పెట్టిస్తుంది. బూర్జువా నిత్యం స్వేచ్ఛను గురించే మాట్లాడతాడు. కారణం అదెప్పుడూ తన పట్టు నుండి జారిపోతుంది. బూర్జువా కవి దారి కూడా ఇదే. స్వేచ్ఛకు ఒంటరితనమే షరతు అనుకొన్నా కవి అది భరించరాని పీడనగా గుర్తిస్తాడు. అనుభవం గడిస్తున్న కొద్దీ ప్రపంచం స్నేహ రహితంగా స్వేచ్ఛకు ఆటంకం కనపడుతుంది. ఆర్థిక వ్యవస్థ చలనాలే కవిలో కూడా ప్రతిబింబిస్తాయి. క్రమానుగత భ్రమ స్వీయ ప్రదర్శనే బూర్జువా స్వేచ్ఛా చరిత్ర. అది మాక్‌బెత్ విషాదాంత గాథ. ఫాల్‌స్టాఫ్‌హాస్యం, హెన్రీ వీరగాథలు అన్నీ ఆ పునాది అభివృద్ధి మార్పుల ప్రతిబింబాలే. ఆవశ్యకతల పరిష్కార సమస్యయే విషాదాంతం.

బూర్జువా సంగీతం, సాహిత్యాలు రెండూ ఆవశ్యకతలకు వెన్నుచూపి పారిపోవడానికి ఆలోచిస్తాయి. ఫలితంగా సామాజిక సంబంధాల చైతన్యం యొక్క మరో రూపాన్ని సృష్టిస్తాయి. శ్రామికుల కష్టాలకు వ్యతిరేకమైన పెటీబూర్జువా దీనావస్తకు చూపే సాహిత్యం వస్తుంది. ఇది బూర్జువా అరాచక లక్షణం యొక్క వ్యక్తీకరణ. అధి వాస్తవికత అంటే సంప్రదాయాలకు తిరస్కరించి తనకు తానుగా స్వేచ్ఛను పొందే ప్రయత్నం. సామాజిక సమిష్టితత్వాన్ని నిరాకరించేది అధివాస్తవికత.

బూర్జువాకు సాంకేతిక అభివృద్ధి చాలా ముఖ్యమైనది ఎందుకంటే పెట్టుబడిదారీ వ్యవస్థ మనుగడ దానిపై ఆధారపడి ఉంది. ఇదే సందర్భంలో ఆధునిక కవి యొక్క కవిత్వంలోని టెక్నిక్‌లో మార్పులు వస్తాయి. కానీ సామాజిక సంబంధాల మాటల వాడకం తగ్గిపోతుంది. కవిత్వం ఉపయోగించే మాటలు నానాటికీ వ్యక్తిగతమవుతాయి. చివరకు కవిత్వం వ్యక్తిగతమవుతుంది. గుప్తమై ఎవరికీ అర్థకానిదైపోతుంది. ఆ కారణంగా ప్రజలు కవిత్వాన్ని ఇక ఏ మాత్రం అంగీకరించరు. అది బూర్జువా పరిస్థితులలో మునిగిపోతుంది. వాస్తవ పరిస్థితులంటే బూర్జువా కవిత్వానికి చిరాకు, వాస్తవ జీవితం కంటగింపుగా తోస్తుంది. దానిది తిరుగుబాటు తత్వం. అంతేకాని విప్లవతత్వం కాదు.

మన ఆశలూ ఆకాంక్షలూ కాపురం పెట్టబోయే చోటు భవిష్యత్తు. సంపద్వంతమైన భవిష్యత్తును అడ్డుకునే వర్తమాన సమాజపు సంకుచిత దుష్టత్వంపై కక్ష తీర్చుకునే చోటు భవిష్యత్తు. కవిత్వం చారిత్రకంగా చలనంలో ఉంది. కవిత్వం యొక్క వర్తమానాన్ని అవగాహన చేసుకోవాలంటే దాని భవిష్యత్తులోకి చూడాలి. బూర్జువా సంస్కృతి పతనావస్థలో వుంది. వైరుధ్యాలు ఉత్పాదక శక్తులపై ఒత్తిడి పెంచుతున్నాయి. నూతన శక్తులు పాత సంస్కృతి గర్భంలోనే మొలకెత్తడం ప్రారంభించాయి. ఆ శక్తులే శ్రామిక సమూహం. ఇది ఆదర్శవంతమైన భావన కాదు. పెట్టుబడిదారీ విధానంలోని వైరుధ్యాల కారణంగా అది తప్పనిసరి పరిష్కారం. శ్రామిక జన జీవనం నుండి వచ్చిన నిర్మాణాత్మక శక్తి వలన వీరు స్పష్టమైన అవగాహన కలిగి వుంటారు. వారిలో మిగిలి వున్న బూర్జువా చైతన్యం వారి నుండి విడివడిపోతుంది. దోపిడీ పీడనలకు గురయ్యే వారితోనూ విప్లవకర వర్గంతోనూ వీరు అంటిపెట్టుకుని వుంటారు. బూర్జువా చైతన్యం నుండి విడిపోయే క్రమంలోనే నిర్మాణమైన వున్న చైతన్యం, వ్యతిరేక ధృవం వద్ద తెప్పరిల్లుతుంది. అది శాస్త్రీయమైన చైతన్యం. అది మేథోపరమైన క్రియాశీలంగా ఉంటుంది. ఇది సమాజ వాస్తవ జీవితాన్ని ప్రతిబింబిస్తాయి. ఈ వికాసంలో సమాజం యొక్క నూతన చైతన్యం కనపడుతుంది. సమాజ వాస్తవ జీవితం దీనికి ఆహారం. తెగల జీవితంలో వలె మొత్తం సమాజపు జీవిత పుష్పం వికసిస్తుంది. ఆ సమాజపు కవిత్వం ఆవశ్యకతపట్ల చైతన్యం కలిగి వుంటుంది. కవిత్వం మళ్ళీ సామూహికమవుతుంది.

**(అనువాదం : కె. ఆనందాచారి)**



# నల్లజాతి రచనలకు ప్రణాళికా పత్రం

## రిచర్డ్ రైట్

**(4.09.1908 - 28.11.1960)**

ప్రఖ్యాత నల్లజాతి రచయిత

అణచివేతకు గురైన అల్పసంఖ్యాకులు బూర్జువాలలో కొందరి కన్నా కూడా బాగా బూర్జువా ఎత్తులను ప్రతిబింబించ గలుగు తారని లెనిన్ ఎక్కడో చెప్పాడు. దళిత వర్గ మైనారిటీలు ప్రత్యేకించి వారిలోని పెటీ బూర్జువాలు పై వర్గం ఆలోచనలనే వంటపట్టించు కోవడానికి ప్రయత్నిస్తారనేది గుర్తు చేసుకుంటే ఇది మరింత బాగా అర్థమవుతుంది. ఆ విధంగా చేయడం ద్వారా తాము సామాజి కంగా ఉద్ధరించ బడతామని వారు భ్రమపడతారు. అయితే ఇలా జరిగేది కేవలం దళిత వర్గ మైనారిటీ పెటీ బూర్జువాలలోనే కాదు. దళిత మైనారిటీ తరగతులకు చెందిన శ్రమ జీవులు కూడా దోపిడీకి గురవుతున్న పరిస్థితులలో తమ జీవితాలు మెరుగు పర్చుకోవడం కోసం నిర్మాణ రూపాలు పోరాటాలు రూపొందించు కుంటారు. వారికి విస్తృతమైన సామాజిక దృష్టి, లోతైన సామాజిక చైతన్యం వుంటాయి. పెటీ బూర్జువాలను మించి వారు నాగరికతపైన తమ హక్కును ఇతరుల కంటే మిన్నగా చెప్పుకోగలుగు తారు. సమాజంలోని ఇతర వర్గాలు తరగతుల కన్నా వీరి సంస్థలు, మరింత మెరుగైన శక్తిని, అనుగుణ్యతను సమర్థతను ప్రదర్శించగలుగుతాయి.

మామూలుగా చెప్పాలంటే నల్లజాతి రచనలు గతంలో చాలా పరిమితుల్లో నవలలు కథలు నాటకాలు వగైరాల రూపంలో వుండేవి. శ్వేతజాతి అమెరికన్లను బతిమాలే మర్యాదస్తులైన దూతలుగా ప్రవర్తించడం జరుగు తుండేది. అమెరికా ప్రజావరణంలోకి వారు చాలా నమ్రతగా, మోకాళ్ల వరకూ ధరించిన పంట్లాములతో ప్రవేశించి మర్యాద ప్రదర్శించే రీతిలో వుండేది. నల్లవారు కూడా మనుషులేనని మర్యాదలు తెలిసిన వారేనని చెప్పుకునే రీతిలో నడిచేది. ఏదో తెలివి తేటలు ప్రదర్శించే ఫ్రెంచి దేశ దిమ్మరులను చూసినట్టు వారిని చూస్తుండేవారు. శ్వేత జాతి అమెరికా రచనలను ఏనాడూ తీవ్రంగా తీసుకుని లోతైన విమర్శ చేయలేదు. అసలు నల్లజాతివారు రాస్తే పట్టించుకోనక్కర్లేదని భావించబడింది. అమెరికా సంస్కృతిలో వారికి వుండే పాత్ర ఏమిటన్న ప్రగాఢ చింతన కూడా కనిపించలేదు. వాటిని అనేక విధాల అపహాస్యం చేయడం, కించపర్చేలా వ్యాఖ్యానించడం జరిగేది.

అయితే మరో వైపున తమ రచయితల అద్భుతమైన రచనలను చూసి విద్యాధికులైన నల్లజాతీయులలో అత్యధికులు గర్వపడుతుండేవారు. అయితే అది తమ జీవితాలకు సంబంధం లేని విషయంగానే వారు కూడా తలపోసేవారు తప్ప జీవితానికి మార్గదర్శకమైందని అనుకునే వారు కాదు. ఈ పరిస్థితులలో నల్లజాతి రచన రెండు లక్షణాలు సంతరించుకుంది. మొదటిది- అదో విధమైన నిగూఢాభరణంగా ఒక విజయ సాధనగా పరిగణించబడింది. రెండవది- శ్వేతజాతి అమెరికన్లను విద్యాధిక నల్లజాతీయులు న్యాయం కోసం వేడుకోవడంగా తయారైంది. దీన్ని తమవారికే ఉద్దేశించి రాయడం దాదాపు జరిగేది కాదు. ఈ విధంగా దారి తప్పిపోవడం వల్ల తమ పట్ల తాము వ్యవహరించేదాని కన్నా ఇతరుల పట్లనే ఎక్కువ మెరుగ్గా వ్యవహరించడం మొదలెట్టారు. అందుకే ఈ మొత్తం రచనలు ఈ కాలానికి ఏ మేరకు ఉపకరిస్తాయనేది చర్చనీయాంశమవుతున్నది.

**తమదైన సంస్కృతీ వికాసానికి అవకాశం లేని సందర్భంలో నీగ్రోలు ఎక్కువగా వందల ఏళ్లనాటి జానపద సంస్కృతిపై ఆధారపడ్డారు. దాన్నే తమ రచనలకు నమూనాగా అనుసరిస్తూ వచ్చారు. చిత్రాలు శిల్పాలు కావ్యాలలో అంతగా భద్ర పరచబడని వారి సంస్కృతి ప్రధానంగా ప్రసంగాల రూపంలోనే ఇప్పటికీ కొనసాగుతున్నది. అయితే నీగ్రోల ఈ సంస్కృతిలో ఒక శక్తి కూడా వుంది. వారికి జాతీయ భావన లేదని గేలి చేసేవారికి ఏమాత్రం తీసిపోనిదది. ఆ జీవన శైలిని వారు కోరుకోలేదు.**

అణచివేతకు గురైన అల్పసంఖ్యాకులు బూర్జువాలలో కొందరి కన్నా కూడా బాగా బూర్జువా ఎత్తులను ప్రతిబింబించ గలుగుతారని లెనిన్ ఎక్కడో చెప్పాడు. దళిత వర్గ మైనారిటీలు ప్రత్యేకించి వారిలోని పెటీ బూర్జువాలు పై వర్గం ఆలోచనలనే వంటపట్టించుకోవడానికి ప్రయత్నిస్తారనేది గుర్తు చేసుకుంటే ఇది మరింత బాగా అర్థమవుతుంది. ఆ విధంగా చేయడం ద్వారా తాము సామాజికంగా ఉద్ధరించబడతామని వారు భ్రమపడతారు. అయితే ఇలా జరిగేది కేవలం దళిత వర్గ మైనారిటీ పెటీ బూర్జువాలలోనే కాదు. దళిత మైనారిటీ తరగతులకు చెందిన శ్రమ జీవులు కూడా దోపిడీకి గురవుతున్న పరిస్థితులలో తమ జీవితాలు మెరుగు పర్చుకోవడం కోసం నిర్మాణ రూపాలు పోరాటాలు రూపొందించుకుంటారు. వారికి విస్తృతమైన సామాజిక దృష్టి, లోతైన సామాజిక చైతన్యం వుంటాయి. పెటీ బూర్జువాలను మించి వారు నాగరికతపైన తమ హక్కును ఇతరుల కంటే మిన్నగా చెప్పుకోగలుగుతారు. సమాజంలోని ఇతర వర్గాలు తరగతుల కన్నా వీరి సంస్థలు, మరింత మెరుగైన శక్తిని, అనుగుణ్యతను సమర్థతను ప్రదర్శించగలుగుతాయి.

కఠోరమైన జీవన పరిస్థితుల కారణంగా నల్లజాతి కార్మికులు తమ చైతన్యాన్ని, రాజకీయ ఆర్థిక కార్యాచరణ శక్తిని ప్రదర్శించారనడంలో సందేహం లేదు. కాని ఇది నల్లవారి రచనలలో ఇదే స్థాయిలో వ్యక్తమైందా అంటే లేదు. విచారకరమైన రీతిలో వారు బాగా వెనకబడి పోయారు. స్వీయచైతన్యం, ఆత్మ విమర్శ గురించి మాట్లాడేప్పుడు గత విజయాల గురించిన గొప్పలలో కూరుకుపోకుండా వుండటం చాలా మెరుగు. సమాజం గమనశీలమైందన్న వాస్తవం గుర్తించాలి తప్ప అది ఘనీభవించి పోయిందనుకోవడం సరికాదు. ఆ విధంగా అనుకున్నప్పుడే నల్లజాతి రచయిత స్వజాతి కార్మికుడితో భుజం కలిపి నిలవగలుగుతాడు.

ఇవి అర్థం కావాలంటే నల్లజాతి సంస్కృతిని మొత్తంగా పరిశీలించాలి. తమదైన సంస్కృతి వికాసానికి అవకాశం లేని సందర్భంలో నల్లజాతీయులు ఎక్కువగా వందల ఏళ్లనాటి జానపద సంస్కృతిపై ఆధారపడ్డారు. దాన్నే తమ రచనలకు నమూనాగా అనుసరిస్తూ వచ్చారు. చిత్రాలు శిల్పాలు కావ్యాలలో అంతగా భద్ర పరచబడని వారి సంస్కృతి ప్రధానంగా ప్రసంగాల రూపంలోనే ఇప్పటికీ కొనసాగుతున్నది. అయితే నల్లజాతి ఈ సంస్కృతిలో ఒక శక్తి కూడా వుంది. వారికి జాతీయ భావన లేదని గేలి చేసేవారికి ఏమాత్రం తీసిపోనిదది. ఆ జీవన శైలిని వారు కోరుకోలేదు. వారిపై బలవంతంగా రుద్దబడింది. కనక దానిలోని లోపాలకు వారు బాధ్యులు కారు. శ్వేతజాతి సమాజం వారికి విదిల్చిన కొద్దిపాటి నాగరికతా విశేషాలు వాస్తవంలో పెట్టుబడిదారీ వంటకాలే. వెలివేత మార్గాలలోనే అవి వారికి అందాయి. నల్లజాతికి వున్న చాలా వ్యవస్థలు పిరికి తనంతోనూ అరకొరగానూ వుంటాయి. కాని అవే వారికి వున్నవి. తిరోగమనమైనా పురోగమనమైనా వాటి ద్వారా రావలసిందే. ఎందుకంటే మిగిలిన అన్ని మార్గాలూ మూసివేయబడి వున్నాయి. నల్లజాతీయులు తమ వారి వికాసం కోసం ఏం చెప్పాలన్నా చేయాలన్నా ఈ మార్గాల ద్వారా చేయవలసిందే.

నల్లజాతి వ్యవస్థలన్నీ దక్షిణ అమెరికాలోని జిమ్ క్రో అనే వెలివేత విధానం నుంచే ఉత్పన్నమైనాయి. ఈ జిమ్ క్రో రాజకీయ వ్యవస్థ పునాదులు టీ తోటల భూస్వామ్య విధానంలో వున్నాయి. నీగ్రోలలో కనిపించే సామూహిక వ్యక్తీకరణ పద్ధతులను నల్లజాతి దురభిమానం అని శ్వేతజాతీయులు ఆశ్చర్యంగా చూపిస్తుంటారు గాని వాస్తవంలో అది దక్షిణాదిన గల వ్యవస్థ ఫలితంగా ఉత్పన్నమైనదే. నల్లజాతి రచయితలు తమ జీవితాలతో

జీవితంలోని సంక్లిష్టతలన్నిటినీ సక్రమంగా చిత్రించాలంటే ఆ రచయితలకు సరైన చైతన్యం వుండాలి. చర్చి తన నైతిక అర్హత కోల్పోయిన పరిస్థితులలో నీగ్రో మధ్యతరగతిలో సంధిగ్ధత పెరిగిపోయిన నేపథ్యంలో నీగ్రో రచయితలు దాదాపు విలువలను సృష్టించవలసిన బాధ్యత నిర్వహించాల్సి వస్తున్నది. ఈ రచనలు హృదంతరాళలలో ప్రవేశించి ప్రభావం చూపిస్తాయి గనుక రచయితల పాత్ర చాలా కీలకమవుతున్నది. ఈ కారణంగానే నీగ్రో రచయితల వ్యక్తిత్వం పాత్ర ఏమిటన్న ప్రశ్న ఉత్పన్నమవుతున్నది. అంటే నీగ్రో రచయితలు ఈనాటి ప్రపంచ చిత్రాన్ని అర్థవంతంగా చూపించగల సత్తా పెంచుకోవలసి వుంటుంది.

ముడిపడి వున్న జాతీయ ప్రభావాలను తప్పక ఆమోదించవలసిందేగాని వాటిని ప్రోత్సహించడానికి కాదు, అధిగమించడానికే. నీగ్రో రచనలలో జాతీయ భావన ఎలా వుండాలంటే సామాజిక చైతన్యాన్ని అత్యున్నత స్థాయికి తీసుకుపోయేలా వుండాలి. అంటే దాని మూలాలు తెలిసి వుండాలి. దాని వైఖరుల్లోని విపత్తులు కూడా గుర్తించగలగాలి. పెట్టుబడిదారీ అమెరికా పరిధిలో దాని అంతిమ లక్ష్యాల సాధన సాధ్యం కాదనే గ్రహింపు వుండాలి. స్వీయ చైతన్యం, సమాజంలోని ప్రజల స్వాతంత్ర్యం అనే వాటిని గౌరవించే స్థితి వుండాలి.

సృజనాత్మక వ్యక్తీకరణలో నల్లజాతి రచయితలు అంతకు మించి రాజకీయ వేత్తల ముందు జాతీయ భావన అనే సంక్లిష్టమైన సమస్యగా తయారవుతుంది. ఆ సమస్యను సమగ్రంగా చర్చించడం ఇక్కడ సాధ్యం కాని పని. కాని నల్లజాతి కార్మికులు మధ్యతరగతి వారిలో జాతీయ భావన వంద రకాల దోషపూరిత రీతుల్లో పాదుకొని వుంది. విశాల సామాజిక సందర్భ శుద్ధి లేకుండా ఈ జాతీయ ధోరణులలోని విప్లవకర ప్రాధాన్యత లేకుండా కేవలం తమ జీవితానుభవాలను మాత్రమే వర్ణించడం అనివార్యంగా వారికి నష్టం చేస్తుంది. స్వాతంత్ర్యం కోసం జరిగే పోరాటంలో వారితో పాటు స్నేహితులుగా నిలిచే అవకాశం వున్న వారిని దూరం చేసుకుంటుంది.

ఈనాటి నల్లజాతి జీవితంలోని సంక్లిష్టతలన్నిటినీ సక్రమంగా చిత్రించాలంటే ఆ రచయితలకు సరైన చైతన్యం వుండాలి. చర్చి తన నైతిక అర్హత కోల్పోయిన పరిస్థితులలో నల్లజాతి మధ్యతరగతిలో సంధిగ్ధత పెరిగిపోయిన నేపథ్యంలో ఆ రచయితలు దాదాపు విలువలను సృష్టించవలసిన బాధ్యత నిర్వహించాల్సి వస్తున్నది. ఈ రచనలు హృదయాంతరాళాలలో ప్రవేశించి ప్రభావం చూపిస్తాయి గనుక రచయితల పాత్ర చాలా కీలకమవుతున్నది. ఈ కారణంగానే నల్లజాతి రచయితల వ్యక్తిత్వం పాత్ర ఏమిటన్న ప్రశ్న ఉత్పన్నమవుతున్నది. అంటే ఈ రచయితలు ఈనాటి ప్రపంచ చిత్రాన్ని అర్థవంతంగా చూపించగల సత్తా పెంచుకోవలసి వుంటుంది. అనేక మంది యువ రచయితలు మార్క్సిస్టు దృక్పథంతో పెరిగినవారే. దానివల్ల రచయిత కళ్ళముందు ప్రపంచ చిత్రం ఆవిష్కరించబడుతుంది. అతని వ్యక్తిత్వంలోనూ ఆవేశ ప్రకటనలోనూ ఏకరూపత నిర్మాణాత్మక లక్షణాలు పెరుగుతాయి.

మార్క్సిస్టు దృక్పథం వల్ల ఆలోచనల్లోనూ, అనుభూతుల్లోనూ స్వేచ్ఛా ప్రవృత్తి బాగా విస్తరిస్తుంది. ఇది నల్లజాతి రచయితలకు చాలా మేలు చేస్తుంది. పైగా సరిగ్గా గ్రహించగలిగితే ఇది మరే సిద్ధాంతమూ ఇవ్వలేనంత గౌరవ భావనను కలిగిస్తుంది. అంతిమంగా అది రచయితలను ప్రపంచ విధాతగా మార్చగల వ్యక్తిగా మానవుడి పాత్రను పునరుద్ధరించి పోగొట్టుకున్న వారసత్వాన్ని పునరుద్ధరిస్తుంది. అయితే యువ రచయితలకు మార్క్సిజం ప్రారంభ వాచకమే. ఏ జీవిత సిద్ధాంతమైనా జీవితం నిర్వహించే పాత్రను నిర్వహించలేదు. మార్క్సిజం సమాజ ఆస్తిపంజరాన్ని నగ్నంగా బయటపెట్టిన తర్వాత చేయవలసింది దానికి కండ చేర్చడం రచయిత చేయవలసిన పని. అతను మానవ వ్యక్తిత్వంపై పెట్టుబడిదారీ విధానపు వికృత ప్రభావాలను చూసి విసుగెత్తిపోయి దాన్ని చిత్రించేందుకు నిరాకరించవచ్చు. లేక కొత్తగా వస్తున్న అవకాశాలతో ఆకర్షితుడై దాన్ని గొప్పగా చిత్రించవచ్చు. ఏ విధంగా చిత్రించినప్పటికీ ఆ గొంతును తప్పక వినాలి. దాని వెనుక వున్న విశ్వాసాలను అవసరాన్ని తీర్పును అర్థం చేసుకోవాలి. ఆ దృక్పథం తేలిగ్గా వుండకపోవచ్చు. సూటిగా అగుపించవచ్చు. కాని వారి జీవితమే క్లిష్టమైనది గనక అలా జరగవచ్చు. ఒక రష్యన్ ప్రయోగాన్ని ఎరువు తెచ్చుకోవాలంటే అది క్లిష్టమైన సరళత్వం.

నల్లజాతి రచనలు ఏ విధమైన భవిష్యత్ దృష్టిని చూపించాలి? కొంతమంది ఏ ఇజం వద్దంటారు. అవి మోసం చేయడానికే నంటారు. కాని ఎవరైనా సరే ప్రపంచాన్ని అర్థం చేసుకునే భావజాలాన్ని పెంపొందించుకోకపోతే ఆధునిక సమాజ గమనాన్ని తెలుసుకోకపోతే దాన్ని అర్థం చేసుకోలేరు. దానిపై ఎలాంటి ప్రభావం ప్రసరించలేరు. భావ దృక్పథం అంటే రచయిత నేరుగా కాగితంపై పెట్టేది కాదు. ప్రజల పోరాటాలలో ఆశ నిరాశలలో కష్ట నష్టాలలో రచయిత ఏ వైపున వుంటాడో చెప్పే మేధావరణం. కొన్నిసార్లు అతను పూర్తిగా మమేకమై పోవచ్చు. అప్పుడు చూపు మందగించవచ్చు. కొన్నిసార్లు మరీ దూరమై ముఖ్యమైన విషయాలను తెలుసుకోలేక పోవచ్చు.

ప్రపంచంలో ఉద్యమాలకు దూరంగా వుండిపోయిన రచయితల సమస్యలన్నిటిలోకి దృక్పథానికి సంబంధించిన సమస్యే అత్యంత క్లిష్టమైంది. అది ఒక వైఖరిని ఇస్తుంది. ఏ విషయంలో ఎక్కడ నిలబడాలో చెబుతుంది.

... ఇది జరగాలంటే నల్లజాతి రచయితలు శ్రమ జీవుల జీవితాలను చిత్రించాలి. వారితో పాటు నిలబడాలి. అదే సమయంలో ప్రపంచమంతటా ఇలాంటి పోరాటాలే చేస్తున్న వారితో కలసి చూడగలగాలి.

వారికి ఒక కుటుంబం, ఒక తెగ, ఒక వర్గం, ఒక జాతి వుంటాయి. వారు వుండే సామాజిక విభాగాలకు ఒక కథ ఉంటుంది. చరిత్ర వుంటుంది. అంటే ఆఫ్రికాలో తమ మూల నాగరికతను కోల్పోయి అనాగరికంగా తయారైన క్రమం వరకూ మొత్తంగా వారి గమనంలో వుండాలి. దాన్ని వ్యక్తీకరించేందుకు అవసరమైన శైలిని రూపొందించుకోవాలి. అది ఇతర వృత్తి నిపుణతలకు అనుగుణంగా లేకున్నా సరే, మరీ గొట్టుగా వున్నట్టు అనిపిస్తున్నా సరే అదే దాని ప్రత్యేకత అవుతుంది. వాస్తవికతకు రచయిత భావనకు మధ్య వుండే సంబంధం ఎప్పుడూ క్లిష్టమైందే. అది మక్కీకి మక్కీగా వుండదు. భావన, ఉద్వేగం తమదైన తర్కాన్ని కలిగి వుంటాయి. మరీ మొరటైన సాధారణీకరణ చేయడం వల్ల రచయితకు పరిసరాలకు వుండే పరస్పర ప్రక్రియ దారుణంగా దెబ్బతినే పెద్ద ప్రమాదం వుంది. రచన అన్నది ఒక స్వయం సంపూర్ణమైన వ్యవహారం. అది ఇతర వృత్తులకు దోహదం చేయవచ్చు గాని వాటిలో పడి కొట్టుకుపోకూడదు.

ఇప్పటి లానే నల్లజాతి రచయితలు ఒంటరిపాటు వైఖరిని అనుసరిస్తూ వుంటే ఇవన్నీ సాధ్యం కావు. ఇది ఆ రచయితలలో వారికి వారికి మధ్యన అలాగే వారికీ శ్వేతజాతి రచయితలకు మధ్యన కూడా వుంది. అమెరికా సమాజంలో సంపూర్ణంగా విలీనం కాలేకపోయిన ప్రభావం, ఆ సమాజంలో తమ భావి పాత్ర గురించి వారికి స్పష్టత లేకపోవడం సాహిత్య సృష్టిపై చిందరవందర చేశాయి. దశాబ్దాల తరబడి ప్రచురణ రంగం నుంచి నాటక రంగం నుంచి వెలివేతకు గురైనవారు అమెరికన్ నాగరికతతో విలీనం కావాలనే కోరికనే వదులుకున్నారు. అయితే ఇది ఒక విధంగా అనివార్యమైన ఆత్మరక్షణ స్పందనను సూచిస్తుంది. ఇది రెండు విధాలుగా జరగాలి. నేటి అభ్యుదయ భావాలన్నిటితో వారు చేతులు కలపాలి. మరోవైపున శ్వేతజాతి రచయితలు వీరు కూడా పరస్పర అవిశ్వాసాన్ని ఒంటరిపాటును అధిగమించేందుకు దోహదం చేయాలి.

జీవితానికి సంబంధించిన అత్యధిక భావనలపై భరోసాగా వుండలేని నేటి కాలంలో ఈ కర్తవ్యాలు చాలా తప్పనిసరిగా ముందుకు వస్తాయి. సంప్రదాయం ఇంకెంత మాత్రం దారి చూపలేదు. ప్రపంచం విస్తరించింది. పచ్చిగా తయారైంది. ఏ విధమైన పదార్థంతో కొత్త ప్రపంచాన్ని నిర్మించాలనే దానిపై అనేక ప్రశ్నలు, సిద్ధాంతాలు, వూహాగానాలు సాగుతున్నాయి. గతంలో ఎరుగని ఈ కొత్త మార్గంలో చాలా జాగ్రత్తగా ఆలోచనగా చైతన్యవంతంగా క్రియాశీలంగా ప్రతి అడుగుపడేట్టు చూసుకోవాలి. ఇలాంటి సందర్భాల్లో రచయితల మధ్య దుర్భావనలకు అసూయలకు ఆస్కారం వుండకూడదు. తక్కిన రచయితలందరు చేసే మంచి కృషిపైనే ప్రతి రచయిత పురోగమనం ఆధారపడి వుంటుంది. మంచిదైన ప్రతి నవలా కథా కవితా చైతన్యాన్ని ఉన్నత స్థాయికి తీసుకుపోతాయి.

**('అమెరికన్ ఆఫ్రికన్ లిటరేచర్' నుంచి)**



# కళ, సత్యం, రాజకీయాలు

## హెరాల్డ్ పింటర్

**(10.10.1930 - 24.12. 2008)**

**ఒక రచయిత జీవితం దుర్భలమైనది. అది దాదాపుగా అనావృత కార్యకలాపం. దాని గురించి మేము రోదించనవసరం లేదు. రచయిత ఒక నిర్ణయం తీసుకుంటాడు. దానికి కట్టుబడి ఉంటాడు. అయితే అన్ని పవనాలు నిన్ను తాకుతాయనడం చెప్పడంలో సత్యం ఉంది. ఆ పవనాలలో కొన్ని శీతవాయువులు సుమా. నీవు నీ సొంతంగా వాటిని తట్టుకోవాలి. ఎలాంటి ఆశ్రయమూ నీకు దొరకదు. రక్షణ ఉండదు - అబద్దాలాడితే తప్ప. అటువంటి పరిస్థితిలో నీవు నీ రక్షణ చేసుకోవాలి. ఇందుకై నీవు రాజకీయవేత్తవు కావచ్చు. అద్దంలోకి చూసినప్పుడు మన ఎదుట ఉన్న ప్రతిబింబం కచ్చితమైనదని భావిస్తాము. అయితే ఒక మిల్లీమీటరు కదలండి. ప్రతిబింబం మారి పోతుంది. వాస్తవంగా దరీదాపులేని ప్రతిబింబాల వైపు చూస్తున్నాము. అయితే కొన్నిసార్లు రచయిత అద్దాన్ని పగులగొట్టవలసి వస్తుంది. ఏమంటే అద్దానికి ఆవలివైపున ఉన్న సత్యం మనలను తేరిపార చూస్తుంటుంది. మన మేధో కట్టుబాటు ఎంత దృఢమైనదైనా, అచంచల మైనదైనా, నిష్కాపటమైనదైనా, పౌరులుగా మన జీవితాలు, మన సమాజాల నిజమైన సత్యాన్ని నిర్వచించవలసి ఉన్నదని నేను విశ్వసిస్తున్నాను.**

"యథార్థము, అవాస్తవమూ మధ్య కానీ, సత్యము, అసత్యము నడుమ కానీ అభేద్యమైన తేడాలేవీ లేవు. ఏదైనా విషయం తప్పనిసరిగా సత్యమో, అసత్యమో కావాలని లేదు. అది యథార్థమూ, మిధ్యా రెండూ కావచ్చు.' ఇది నేను 1958లో రాశాను. ఈ వక్కాణింపు ఇప్పుడూ అర్థవంతమైనదేనని, కళ ద్వారా వాస్తవాన్వేషణకు ఇప్పటికీ వర్తిస్తుందని నేను విశ్వసిస్తున్నాను. నలభై ఏడు సంవత్సరాల క్రితం చేసిన ఈ ఉద్ఘాటనకు ఒక రచయితగా నేను నిబద్ధమై ఉన్నాను, ఒక పౌరుడుగా మాత్రం కాదు. ఒక పౌరుడుగా నేను అడిగి తీరాలి. ఏది సత్యం? ఏది అసత్యం?

నాటకంలో సత్యం ఎప్పటికీ అంతు చిక్కదు. నీవు దానిని కనుగొనలేవు. అయితే సత్యాన్వేషణ విధిగా చేయాలి. సత్యశోధన నీ కర్తవ్యం. అంధకారంలో అస్తుబిస్తుగా సత్యం నీకు తారస పడుతుంది. నీవు దానిని ఢీకొంటావు లేదా సత్యాన్ని పోలిన ఒక ప్రతి కృతిని, ఒక రూపును కాంచుతావు – నీవు చేసినదేమిటో గ్రహించకుండానే. అయితే అసలు నిజం ఏమిటంటే నాటక కళలో ఒక సత్యంగా కనుగొనబడే విషయమేదీ లేదు. చాలా సత్యాలు ఉన్నాయి. ఆ సత్యాలు పర స్పరం సవాళ్ళు విసురుకుంటాయి, వివర్తనం చెందుతాయి, ప్రతిబింబిస్తాయి. అలక్ష్యానికి పాల్పడుతాయి, వేధించుకుంటాయి. అవి పరస్పరం గుర్తుంచుకోవు. కొన్నిసార్లు ఒక మహత్వపు సత్యం నీ చేతుల్లోకి వచ్చిందని భావిస్తావు. అంతలోనే అది నీ హస్తాల్లోంచి జారిపోతుంది. నీ నుంచి నిష్క్రమిస్తుంది. నా రూపకాలు ఎలా వచ్చాయని నన్ను తరచు అడుగుతుంటారు. నేను చెప్పలేను. నా నాటకాలను సంక్షేపించలేను – జరిగింది ఇది, అదీ వారు (పాత్రలు) చెప్పిందీ, అదీ వారు చేసింది అని చెప్పడం మినహా.

అప్పటి వరకు ఉనికే లేని పాత్రలను సృష్టించిన క్షణం ఒక అసాధారణ భ్రామకం. ఆ తరువాత సంభవించేది ఔచిత్యపూర్వకమే. అనిశ్చితమే. భ్రాంతికరం కూడా. అయినప్పటికీ కొన్నిసార్లు పాత్రల సృష్టి ఆపలేని ప్రవాహ సదృశ్యమే. రచయిత స్థితి విచిత్రమైనది. ఒక విధంగా పాత్రలు అతన్ని హర్షించవు. ఆహ్వానించవు. అవి ప్రతిఘటిస్తాయి. రచయితతో

> కళలో భాష పూర్తిగా సందిగ్ధ వ్యవహారంగా మిగిలిపోతుంది. అది ఒక ఊబి. ఘనీభవించిన సరస్సులాంటిది. అది ఏ క్షణమైనా నీ (రచయిత) కాళ్ళ కింద నుంచి తొలగిపోతుంది. అయితే నేను చెప్పినట్టు సత్యా న్వేషణ నిలిచిపోదు. అది ముగియ కూడదు. దాన్ని వాయిదా వేయకూడదు. సత్యంతో తలపడాలి – అక్కడికక్కడే, ఆ క్షణాన్నే.

సహ జీవనం చేయలేవు. నిర్వచించడానికి అసాధ్యంగా పాత్రలు పరిణమిస్తాయి. ఖచ్చితంగా నీవు వాటిని ఆదేశించలేవు. కొంతవరకు వాటితో నీవు ఎప్పటికీ పూర్తికాని ఆటకు దిగుతావు. దాగుడు మూతలు ఆడతావు. అంతిమంగా నిలువెత్తు సజీవమూర్తులు – సంకల్పమూ, వ్యక్తిగత అనుభూతులు ఉన్న వ్యక్తులు – నీ ఎదుట ఉన్నట్లు కనుగొంటావు. నీవు మార్చలేని, విరూపం చేయలేని, లొంగదీసు కోలేని మనుష్యులు వారు!

కనుక కళలో భాష పూర్తిగా సందిగ్ధ వ్యవహారంగా మిగిలిపోతుంది. అది ఒక ఊబి. ఘనీభవించిన సరస్సులాంటిది. అది ఏ క్షణమైనా నీ (రచయిత) కాళ్ళ కింద నుంచి తొలగిపోతుంది. అయితే నేను చెప్పినట్టు సత్యా న్వేషణ నిలిచిపోదు. అది ముగియు కూడదు. దాన్ని వాయిదా వేయకూడదు. సత్యంతో తలపడాలి – అక్కడికక్కడే, ఆ క్షణాన్నే.

రాజకీయ యవనిక పూర్తిగా భిన్నమైన సమస్యలను ప్రదర్శిస్తుంది. ఎట్టి పరిస్థితులలోను ధర్మోపదేశాలు చేయకూడదు. నిష్పాక్షికత ముఖ్యం. పాత్రలు స్వంత ఉచ్ఛ్వాసనిశ్వాసలు తీసేలా పాత్రలకు అనుమతి ఇచ్చి తీరాలి. తన సొంత అభిరుచులు, దృక్పథం, దురభిప్రాయాలకు అనుగుణంగా వాటిని పరిమితం చేయడానికి, మలచడానికి రచయిత ప్రయత్నించకూడదు. వివిధ కోణాల నుంచి వాటిని సృజించడానికి అతడు సిద్ధం కావాలి. అవి రూపుదిద్దుకుంటున్న తీరు క్వాచిత్కంగానైనా ఆశ్చర్యపరచవచ్చు. అయినప్పటికీ అవి తమ సంకల్పానుసారం వెళ్ళేలా వాటికి స్వేచ్ఛనివ్వాలి. అన్ని సృజనల లోను ఇలా చేయడం కుదరదు. రాజకీయ ప్రహసనం ఈ సృజన సూత్రాలలో దేనికీ కట్టు బడదు. నిజం చెప్పాలంటే దానిది ఖచ్చితంగా భిన్న దృష్టి. ఏమంటే అదే దాని సరైన విధి.

'ది బర్త్‌డే పార్టీ' అనే నా నాటకంలో పాత్రలను అంతిమంగా లోబరచుకొనే ముందు వాటికి అవకాశాల చిట్టడవిలో అన్ని ప్రత్యామ్నాయ మార్గాలలోను ప్రవర్తించడానికి, స్వేచ్ఛనిచ్చానని భావిస్తున్నాను. 'మౌంటెన్ లాంగ్వేజ్'లో ప్రత్యామ్నాయ కార్యకలాపాలకు అవకాశమివ్వలేదు. దానిలోని పాత్రలు క్రూరంగా వ్యవహరిస్తాయి. ఆ నాటకంలోని సైనికులు తమ ప్రవర్తన ద్వారా వినోదం పొందుతారు. చిత్రవధలు పెట్టడమనేది తేలిగ్గా విసుగుపుట్టిస్తాయని కొన్నిసార్లు మరచి పోతుంటారు. తమ పైశాచికత్వానికి ఉత్తేజం పొందడానికి అవి నవ్వుకోవాల్సిన అవసర మెంతైనా ఉంది. బాగ్దాద్‌లోని అబూ గరీబ్ జైలులోని పరిణామాలు ఈ విషయాన్ని ధ్రువీకరించాయి. 'మౌంటెన్ లాంగ్వేజ్' 20 నిమిషాల పాటు మాత్రమే కొనసాగే నాటకం. అయితే అది అలా అదే పద్ధతిలో మళ్ళీ మళ్ళీ కొనసాగుతూనే ఉంటుంది.

సద్దాం హుస్సేన్ పెద్ద ఎత్తున భారీ విధ్వంసక మారణాయుధాలను సమకూర్చు కున్నాడనే సాకుతో ఇరాక్‌ను ఆక్రమించు కోవడం జరిగిందన్న విషయం ఈ సమావేశం లోని ప్రతి ఒక్కరికి తెలుసు. సద్దాం వద్ద అణ్వస్త్రాలు, రసాయన, క్రిమి ఆయుధాలున్నా యని మనకు చెప్పారు. అది నిజం కాదు. అల్–ఖైదాతో ఇరాక్‌కు సంబంధాలు ఉన్నాయని, సెప్టెంబర్ 11 దాడులకు సహకరించిందని చెప్పారు. ఇది నిజమని మనకు నమ్మబలికారు. కాని ఇది నిజం కాదు. ప్రపంచ భద్రతకు ఇరాక్ ప్రమాదకారిగా పరిణమించిందని చెప్పారు. ఇది నిజం కాదు. సత్యం పూర్తిగా భిన్నమైనది. ప్రపంచ వ్యవహారాలలో తన పాత్రను అమెరికా ఏ విధంగా అర్థం చేసుకొంది. దానినే విధంగా నిర్వర్తించ డానికి నిర్ణయించుకుంది అనేదానితో సత్యం ముడిపడి ఉంది.

వర్తమానాన్ని విలోకించే ముందు ఇటీవలి గతం అంటే ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం అమెరికా విదేశాంగ విధానం పోకడలపై నిశిత దృక్కులు సారించదలిచాను. ప్రపంచ యుద్ధానంతరం సోవియట్ యూనియన్ తూర్పు యూరప్‌లలో ఏమి జరిగిందో అందరికీ తెలుసు. వ్యవస్థీకృత క్రూరత్వం, అంతులేని దురాగతాలు, స్వతంత్ర ఆలోచన అణచివేత, ఈ విషాదాలకు సంపూర్ణ సాక్ష్యాధారాలు ఉన్నాయి? అవి ధ్రువీకరింపబడ్డాయి. అయితే నా వాదన ఏమిటంటే ఇదే కాలంలో అమెరికా పాల్పడిన నేరాలు సరిగా రికార్డు కాలేదు. అమెరికా నేరాలు చేసినట్టు అంగీకరించడం కాదు కదా, అసలు వాటిని నేరాలుగా గుర్తించడమే జరగలేదు! ఈ విషయంపై మనం దృష్టి నిలపాల్సిన అవసరమెంతైనా ఉందని నేను విశ్వసిస్తున్నాను. ఏమంటే ప్రపంచం నేడున్న విధంగా ఉండటానికి, ఈ వాస్తవాలకు మధ్య అవినాభావ సంబంధం ఎంతైనా ఉంది.

ఒక కాన్సర్ వ్యాధి క్రిమిని సృష్టించి వదులుతారు. జనం లొంగిపోయాక లేదా చంపివేయబడ్డాక మీ స్నేహితులు అంటే సైనికాధికారులు, బడా కార్పొరేషన్లు రంగ ప్రవేశం చేసి సుఖంగా అధికార పీఠాలపై కూచుని కెమెరాల ముందుకెళ్లి ప్రజాస్వామ్యం పరిఢవిల్లిందంటూ ప్రకటనలు చేస్తారు. ఇది అమెరికా విదేశాంగ విధానంలో సర్వసాధారణమైన విషయం.

ఒక సార్వభౌమదేశాన్ని ప్రత్యక్షంగా ఆక్రమించుకోవడం ఎప్పుడూ అమెరికాకు ఏమంత ఇష్టమైన విధానం కాదు. ప్రధానంగా అది తక్కువ స్థాయి ఘర్షణ అనేదాన్ని ఇష్టపడుతుంది. దీని అర్థం ఏమంటే వేలాది మంది చనిపోతారు గాని ఒక్కసారిగా బాంబు వేసిన దానికంటే నెమ్మదిగా చనిపోవడం జరుగుతుంది. అంటే మీరు ఆ దేశాన్ని విషపూరితం చేస్తారు. ఒక కాన్సర్ వ్యాధి క్రిమిని సృష్టించి వదులుతారు. జనం లొంగిపోయాక లేదా చంపివేయబడ్డాక మీ స్నేహితులు అంటే సైనికాధికారులు, బడా కార్పొరేషన్లు రంగ ప్రవేశం చేసి సుఖంగా అధికార పీఠాలపై కూచుని కెమెరాల ముందుకెళ్లి ప్రజాస్వామ్యం పరిఢవిల్లిందంటూ ప్రకటనలు చేస్తారు. ఇది అమెరికా విదేశాంగ విధానంలో సర్వసాధారణమైన విషయం.

నికరాగ్వాలో జరిగిన విషాదం ఈ విషయంలో ప్రత్యేకంగా చెప్పుకోదగినది.. 1980లో లండన్‌లోని అమెరికా రాయబార కార్యాలయంలో నేను వున్నాను. అక్కడి వామపక్ష ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న కాంట్రా విప్లవ ప్రతీఘాతకులకు మరింత డబ్బు ఇవ్వాలా అనే విషయమై అమెరికా కాంగ్రెస్ ఆలోచిస్తున్నది. నికరాగ్వా తరఫున మాట్లాడేందుకు వెళ్లిన ప్రతినిధి వర్గంలో నేనూ వున్నాను. అయితే ఆ ప్రతినిధి వర్గంలో అత్యంత ముఖ్యుడు ఫాదర్ జాన్ మెట్కాఫ్. అమెరికా పక్షానికి నాయకుడు రేమాండ్ సిట్జ్. తాము నిర్వహించే పాఠశాలను, ఆరోగ్య కేంద్రాన్ని కాంట్రాలు ధ్వంసం చేశారని, నర్సులపై అత్యాచారాలు జరిపారని చెబుతూ వారికి మీ సహాయం నిలిపివేయండి అని ఫాదర్ మనవి చేశారు. చాలా మర్యాదస్తుడుగా, బాధ్యతాయుతమైన ఆధునికుడుగా పేరు పొందిన రేమాండ్ ఏమన్నాడంటే‘ ఫాదర్, మీకో మాట చెబుతాను. యుద్ధంలో అమాయకులు నష్ట పోవడం ఎప్పుడూ జరుగుతుంటుంది’ అని. ఆ మాటలతో అక్కడ ఒక్కసారిగా మౌనం రాజ్యం చేసింది.

నిజమే, అమాయకులు ఎప్పుడూ బలవుతుంటారు.

చివరకు ఎవరో అన్నారు. ఇక్కడ అమాయకులు మీ సహాయం పొందుతున్నవారి వల్ల బలవుతున్నారు అని. మీరు చెప్పిన విషయాలు వాస్తవాలని నేను అంగీకరించడం లేదు అన్నాడు రేమాండ్. మేము ఆ రాయబార కార్యాలయం నుంచి వచ్చేస్తుండగా అక్కడి అధికారి ఒకరు నా నాటకాలు తాను చూసి ఆనందిస్తుంటానని అన్నాడు. నేనేమీ మాట్లాడలేదు. నికరాగ్వాను పాలించిన వామపక్ష శాండినిస్టాలు లోపరహితులని నేను చెప్పడం లేదు. కాని వారు తెలివైన వారు, హేతుబద్ధమైన వారు. నాగరికులు. ఒక స్థిరమైన బహుళత్వం గల, హుందా అయిన వ్యవస్థను నెలకొల్పేందుకు ప్రయత్నించారు. గొప్ప అక్షరాస్యతా ఉద్యమం నడిపారు. లక్ష కుటుంబాలకు భూమిపై హక్కులిచ్చారు. ఇలాటి అనేక మంచి చర్యలు చేపట్టారు. కాని అమెరికా మార్క్సిస్టు లెనినిస్టు కుట్రగా దాన్ని ఖండించింది. వారి ఉద్దేశంలో నికరాగ్వా చూపుతున్న ఆదర్శం ప్రమాదకరమైంది! చుట్టుపక్కల దేశాలు కూడా అదే మార్గం అనుసరించాలని చూస్తాయి. అప్పటికే పక్కనున్న ఎల్‌సాల్వడార్‌లో యథాతథ స్థితి వద్దంటూ తీవ్రమైన ప్రతిఘటన మొదలైంది.

మన చుట్టూ వున్న అబద్ధాలను గురించి నేను చెప్పాను. అధ్యక్షుడు రీగన్ నికరాగ్వా నిరంకుశ కుహరం అని తిట్టిపోశాడు. మీడియా కూడా మొత్తంపైన అదే ప్రచారం చేసింది. బ్రిటిష్ ప్రభుత్వం సరేసరి. కాని అందుకు ఎలాటి ఆధారాలు లేవు. అక్కడ హంతక దళాలు లేవు. చిత్ర హింసల తాలూకా చిట్టాలు లేవు... నిజంగా చెప్పాలంటే అలాటివి పక్కనే ఎల్‌శాల్వడార్‌లో, గ్వాటిమాలాలో వున్నాయి. గ్వాటిమాలాలో ప్రజాస్వామికంగా ఎన్నికైన ప్రభుత్వాన్ని అమెరికా 1954లో కూలదోసింది. ఆ తర్వాత వెంట వెంట వచ్చిన సైనిక నియంతల చేతుల్లో 2 లక్షల మంది బలయ్యారు. ప్రపంచంలో అత్యంత ప్రతిభా వంతులైన ఆరుగులు జెసూట్లను 1989లో అమెరికాలో శిక్షణ పొందిన సాయుధ దళాలు శాన్‌శాల్వడార్ విశ్వ విద్యాలయంలో దారుణంగా కాల్చిచంపారు. సాహసవంతుడైన ఆర్కిబిషప్ రోమిరోను సామూహిక ప్రార్థన చేస్తుండగానే చంపేశారు. వారినెందుకు చంపేశారు? ఎందుకంటే వారు మరింత మెరుగైన జీవితం సాధ్యమేనని,అందుకోసం కృషి చేయాలని చెప్పారు గనక. అలా అనుకున్న మరుక్షణం వారు కమ్యూనిస్టుల్లా కనిపించడం మొదలెట్టారు... చివరకు ఎట్టకేలకు అమెరికా శాండినిస్టా ప్రభుత్వాన్ని గద్దెదించగలిగింది. దానిపై మొదట్లో కొంత ప్రతిఘటన వచ్చినా కొన్నేళ్ల తర్వాత ముప్పైవేల మందిని బలి,ఆర్థిక వేధింపులు

అమెరికా నేరాలు ఉద్దేశపూర్వకమైనవి. నిరంతరాయమైనవి. పశ్చాత్తాపం లేనివి. అయినప్పటికీ కొద్దిమంది మాత్రమే వాస్తవంగా వాటి గురించి మాట్లాడారు. మానవాళి శ్రేయస్సు పేరిట ప్రపంచవ్యాప్తంగా పలు దేశాలను తన నియంత్రణ లోకి తెచ్చుకొంది. అమెరికా విజయం ప్రతిభావంతమైనది, చమత్కార మైనది, సమ్మోహనపూరితమైనది.

సాగిన తర్వాత చివరకు నికరాగ్వా ప్రజల స్థయిర్యం దెబ్బ తినింది... అలసిపోయి మరో సారి దారిద్ర్యం కోరల్లో చిక్కారు. ఆ వెంటనే కాసినోలు వచ్చేశాయి. ఉచిత విద్య వైద్యం అదృశ్యం. బడా వ్యాపారం మరింత కక్షగా పున:ప్రవేశం చేసింది. ప్రజాస్వామ్యం ప్రవర్ధిల్లింది!

అయితే ఈ విధానం మధ్య అమెరికాకే పరిమితమైంది కాదు. ప్రపంచ మంతటా సాగుతున్న ఒక నిరంతర పోకడ.

ద్వితీయ ప్రపంచ యుద్ధమనంతరం ప్రపంచవ్యాప్తంగా మితవాద సైనిక నియంతృత్వాలన్నిటికీ అమెరికా మద్దతు నిచ్చింది. నియంతలు అధికారంలోకి రావడానికి తోడ్పడింది. ఇండోనేషియా, గ్రీస్, ఉరుగ్వే, బ్రెజిల్, పరాగ్వే, హైతీ, టర్కీ ఫిలిప్పీన్స్, గ్వాటెమాల, ఎల్ సాల్వడార్, చిలీల గురించి నేను ప్రస్తావిస్తున్నాను. 1973లో చిలీ సైనిక నియంతల పాలు కావడంలో అమెరికా పాత్రను చరిత్ర ఎన్నటికీ క్షమించదు. ఈ దేశాలలో వేలాది ప్రజలు హతమారిపోయారు. మరెందరో మటుమాయమయ్యారు. ఇది వాస్తవం కాదా? అమెరికా విదేశాంగ విధానమే ఇందుకు కారణమా? అవును. అయితే ఈ విషయం మీకు తెలియకపోవచ్చు. అది సంభవించదు. ఏదీ ఎన్నడూ సంభవించదు. సంభవించినప్పుడు కూడా అది సంభవించడం జరగదు. ఇది చెప్పుకోదగిన విషయం కాదు. ఆసక్తి కలిగించని విషయం అమెరికా నేరాలు ఉద్దేశపూర్వకమైనవి. నిరంతరాయమైనవి. పశ్చాత్తాపం లేనివి. అయినప్పటికీ కొద్దిమంది మాత్రమే వాస్తవంగా వాటి గురించి మాట్లాడారు. మానవాళి శ్రేయస్సు పేరిట ప్రపంచవ్యాప్తంగా పలు దేశాలను తన నియంత్రణ లోకి తెచ్చుకొంది. అమెరికా విజయం ప్రతిభావంతమైనది, చమత్కార మైనది, సమ్మోహనపూరితమైనది.

అమెరికన్ అధ్యక్షులు చేసే ప్రసంగాలు వినండి. 'అమెరికన్ ప్రజలు' గురించి వారి ఉద్ఘాటనలను నిశితంగా గమనించండి. 'అమెరికన్ ప్రజల హక్కులను రక్షించు కోవాల్సిన సమయ మాసన్నమయిందని అమెరికన్ ప్రజలకు చెబుతున్నారు. మీ అధ్యక్షుడిని విశ్వసించండని అమెరికన్ ప్రజలను అడుగు తున్నాను. అమెరికన్ ప్రజల తరఫున ఆయన తీసుకొనే చర్యలను విశ్వసించండని అమెరికన్ ప్రజలను కోరుతున్నాను.' ఆలోచించే శక్తిని రూపుమాపడానికే వాస్తవంగా ఇటువంటి భాషను ఉపయోగించడం జరుగుతుంది. 'అమెరికన్ ప్రజలు' అనే పదాన్ని పదే పదే పునశ్చరణ చేయడం ద్వారా వారికొక భరోసా కల్పిస్తు న్నారు. ఇక ఆలోచించనవసరమే లేదు. ఆ భరోసాతో హాయిగా ఉండవచ్చు. అయితే ఇది దారిద్ర్య రేఖకు దిగువన జీవిస్తున్న నాలుగు కోట్ల మంది ప్రజలకు, అమెరికా వ్యాప్తంగా వివిధ జైళ్ళలో ఉన్న ఇరవై లక్షల మంది ఖైదీలకు ఈ భరోసా వర్తించదు.

మనం నైతిక స్పృహను కోల్పోయామా? అసలు మనకు వివేకముందా? అంతరాత్మ అనేది ఉందా? మన స్వంత చర్యల గురించి కాక, ఇతరుల చర్యలలో మన పాలు గురించి కూడా అంతరాత్మ పట్టించుకోదేం? గ్వాంటెనామో బే జైలును చూడండి. వందలాది ఖైదీలు గత మూడేళ్ళుగా ఎటువంటి ఆరోపణలు లేకుండానే ఆ జైలులో మగ్గుతున్నారు. ఆ జైలు జెనీవా ఒప్పందానికి పూర్తిగా విరుద్ధం. అయినా దానిని సహిస్తున్నాము. 'అంతర్జాతీయ సమాజం' గురించి అమెరికా ఆలోచిస్తుందా? లేదు. 'స్వేచ్ఛా ప్రపంచానికి నేత'నని చెప్పుకొంటున్న దేశం పాల్పడుతున్న ఘోరమిది. గ్వాంటనామో బే వాసుల గురించి మనమెపుడైనా ఆలోచించామా? మీడియా వారి గురించి చెబుతున్నదేమైనా ఉందా? ఆ ఖైదీలు ఇక తిరిగి రాని వారుగానే పరిగణించడం లేదా? ఆ ఖైదీలను చిత్రవధలకు గురిచేస్తున్నారు. వారిలో బ్రిటిష్ పౌరులూ ఉన్నారు. మరి బ్రిటిష్ విదేశాంగ మంత్రి వారి గురించి ఏమి చెప్పారు? ఏమీ చెప్పలేదు. బ్రిటిష్ ప్రధానమంత్రి ఏమి చెప్పారు. ఏమీ చెప్పలేదు. ఎందుకని? గ్వాంటెనామో బేలో తమ వ్యవహారాలను విమర్శించడం స్నేహపూరిత చర్య కాబోదని అమెరికా స్పష్టంగా చెప్పింది. మీరు మాతో ఉండకపోతే మాకు వ్యతిరేకంగా ఉన్నట్లేనని తేల్చివేసింది. కనుకనే టోనీ బ్లెయిర్ నోరు మూసుకున్నారు.

ఇరాక్ ఆక్రమణ ఒక బందిపోటు చర్య. ఉగ్రవాద దాడి. అంతర్జాతీయ న్యాయాన్ని ఎటువంటి మినహాయింపులు లేకుండా ఉల్లంఘించడమే. సంపూర్ణ అబద్ధాలతో మీడియా ద్వారా ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసి నిర్హేతుకంగా ప్రదర్శించిన సైనిక ప్రతాపం. పశ్చిమాసియా, అరబ్ దేశాలపై సంపూర్ణ సైనిక, ఆర్థిక నియంత్రణను సాధించే లక్ష్యంతోనే ఇరాక్‌ను

'నాకు నా చేతులు తిరిగి ఎప్పుడొస్తాయి' అని వాడు అడిగాడు. ఈ కథ చల్లగా తొలగింప చేయబడింది. ఔను కదా!టోనీ బ్లెయిర్ వాడిని అక్కున చేర్చుకోలేదు. అసలు క్షతగాత్రుడైన పిల్లాడెవరినీ ఆయన దగ్గరికి రానివ్వడు. దిక్కులేని శవాలను అంటుకోడు. రక్తం ఎంత అసహ్యకరమైంది? అది మీ చొక్కాను మురికి మురికిచేసి మీరు టెలివిజన్‌లో ఎంతో గొప్పగా ఇస్తున్న ప్రసంగాన్ని ఖరాబు చేస్తుంది.

ఆక్రమించుకోవడం జరిగింది. అయితే ఒక నియంత పాలన నుంచి ప్రజలకు విముక్తి కలిగిస్తున్నామనే సాకు చూపారు. ఈ 'విముక్తి'లో వేలాది అమాయకులు హతమయ్యారు. లక్షలాది ఇరాకీలు క్షతగ్రాతులయ్యారు. ఇంకెందరో చిత్రవధలకు గురవుతున్నారు. ఇరాక్‌లో ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించామని, ఆ దేశ ప్రజలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కల్పించామని చెబుతున్నారు!

ఈ విషయంలో మృత్యువు అన్నదానికి ఏ విలువా లేదు. బుష్, బ్లెయిర్ ఉభయులూ మారణకాండను పట్టించుకోరు. కనీసం లక్ష మంది ఇరాకీలు అమెరికా బాంబులు, క్షిపణుల దాడిలో మరణించారు. వీరి ప్రాణాలకు ఏ విలువా లేదు. వారు చనిపోయినట్టు కూడా నమోదు కాదు.'మేము శవాల లెక్కలు వేయం' అన్నాడు అమెరికా జనరల్ టామీ ఫ్రాంక్స్... దాడి తొలిదశలో ఒక బ్రిటిష్ పత్రిక మొదటి పేజీలో టోనీ బ్లెయిర్ ఒక ఇరాకీ బాలుడిని ముద్దాడుతున్న ఫోటో ప్రచురించింది.'బాలుని కృతజ్ఞత' అని దానికింద రాసింది. తర్వాత కొన్నాళ్లకు మరో ఫోటో వచ్చింది. ఈ బాలుడికి చేతులు లేవు. వాళ్ల కుటుంబం క్షిపణి దాడిలో సర్వనాశనమై పోగా వాడొక్కడే మిగిలాడన్న కథనం కూడా దానితో పాటు ప్రచురితమైంది. 'నాకు నా చేతులు తిరిగి ఎప్పుడొస్తాయి' అని వాడు అడిగాడు. ఈ కథ చల్లగా తొలగింప చేయబడింది. ఔను కదా!టోనీ బ్లెయిర్ వాడిని అక్కున చేర్చుకోలేదు. అసలు క్షతగాత్రుడైన పిల్లాడెవరినీ ఆయన దగ్గరికి రానివ్వడు. దిక్కులేని శవాలను అంటుకోడు. రక్తం ఎంత అసహ్యకరమైంది? అది మీ చొక్కాను మురికి మురికిచేసి మీరు టెలివిజన్‌లో ఎంతో గొప్పగా ఇస్తున్న ప్రసంగాన్ని ఖరాబు చేస్తుంది.

ఇక 2000 అమెరికన్లు చనిపోవడం చికాకైన విషయం. వారిని చీకట్లో సమాధుల వద్దకు చేర్చాలి. చడీ చప్పుడు కాకుండా అంత్యక్రియలు జరిగిపోవాలి. క్షతగాత్రులైన వారు జీవిత పర్యంతం మంచాలపై మగ్గిపోవాలి. చనిపోయిన వారూ, గాయాలపాలైన వారూ మగ్గిపోవలసిందే. పద్ధతులే వేరు.

ఇక్కడ నేను పాబ్లో నెరూడా కవిత ఒకటి పేర్కొంటాను. దాని ద్వారా చాలా విషయాలు తెలుస్తాయి:

ఒకానొక ఉదయం అంతా తగలబడిపోతోంది
అదో మహాగ్ని కీల
భూమండలంపై విరుచుకుపడింది
మానవాళిని కబళించేయసాగింది

ఇక అప్పటి నుంచి మంటలే
అప్పటి నుంచి మందుగుండే
అప్పటి నుంచి నెత్తుటి ధారలే

విమానాలు, నావలు గల బందిపోట్లు
ఉంగరాలు, దొరసానులను
వెంట పెట్టుకున్న బందిపోట్లు
ఆశీర్వదించే సాధుసంతుల
వెంటవున్న బందిపోట్లు
ఆకాశంలో నుంచి వచ్చారు
చిన్నారులను హతమార్చేందుకు
పసికందుల నెత్తురు వీధుల్లో ఏరులై పారింది
చడీ చప్పుడు లేకుండా పిల్లల నెత్తురు లానే
నక్కలు కూడా అసహ్యించుకునే నక్కలు
బ్రహ్మ జెముళ్లు కూడా భరించలేని బండరాళ్లు
నల్ల తాచులు కూడా చీత్కరించే నల్లతాచులు

నీవు తారసపడ్డాకే నేను నెత్తురు
స్పెయిన్ శిఖరంలా ఎగిసిపడడం చూశాను
అభిమానం, కత్తుల వరదలో ఒక్కసారిగా మీరు మునిగిపోతారు
విద్రోహపూరిత
సైనాధిపతులు
నా భూత గృహాన్ని సందర్శిస్తారు
శిథిలమైన స్పెయిన్‌ను చూస్తారు
ధగ్ధమైన ప్రతి ఇంట్లోంచీ
కాలుతున్న లోహపు మంటలు

**నేనొక విషయం చెప్పాలి. నెరూడా కవితను చెబుతున్నా నంటే సద్దాం ఇరాక్‌ను నాటి స్పెయిన్‌ను పోలుస్తున్నానని కాదు.పౌరులపై బాంబుదాడి భయానకత్వాన్ని అంత శక్తివంతంగా వర్ణించిన పద్యం నేనెక్కడా చదవలేదు కనకే దాన్ని పేర్కొన్నాను.**

**స్పెయిన్‌లోని ప్రతి కుంపటిలోంచీ**
**పూలకు బదులు మంటలు**
**స్పెయిన్ తిరిగి లేస్తుంది**
**ప్రతి మృత శిశువులోంచీ**
**తుపాకీలు కళ్లలో పెట్టుకుని లేస్తుంది**
**నేరస్తుల తూటాలలోంచీ జీవితం ప్రభవిస్తుంది**
**అదే ఒకనాటికి**
**మీ గుండెలు చీలుస్తుంది**
**మీరడుగుతారు: ఆయన కవిత్వం**
**కలలు ఆకుల గురించి గాక**
**తన దేశపు మహాగ్ని పర్వతాల గురించి లేదేం**

**రండి,వీధుల్లో పారే రక్తం చూడండి**
**రండి చూడండి**
**వీధుల్లో రక్తం**
**రండి చూడండి**
**వీధుల్లో రక్తం**

నేనొక విషయం చెప్పాలి. నెరూడా కవితను చెబుతున్నా నంటే సద్దాం ఇరాక్‌ను నాటి స్పెయిన్‌ను పోలుస్తున్నానని కాదు.పౌరులపై బాంబుదాడి భయానకత్వాన్ని అంత శక్తివంతంగా వర్ణించిన పద్యం నేనెక్కడా చదవలేదు కనకే దాన్ని పేర్కొన్నాను.

అమెరికా ఇప్పుడు తన విధానాన్ని బాహాటంగానే ప్రకటిస్తోంది. సర్వసంపూర్ణ ఆధిపత్యం తన లక్ష్యమంటోంది. సర్వ సంపూర్ణంగా. అది ఇప్పుడు ప్రపంచ వ్యాపితంగా132 దేశాలలో 702 సైనిక స్థావరాలను కలిగివుంది. స్వీడన్ ఒక్కటే ఇందుకు గౌరవనీయమైన మినహాయింపు. ఇన్ని చోట్లకు వారెలా చేరగలిగారన్నది ఆశ్చర్యమే. ఏమైనా వారు చేరారు. దాని దగ్గర గట్టిగా పనిచేసేఅణుబాంబులు 8000 వున్నాయి.రెండు వేల బాంబులు పావుగంటలో ప్రయోగించేంత సర్వసిద్ధంగా వున్నాయి. ఇప్పుడది రక్షణ కందకాలను ధ్వంసం చేయగలసరికొత్త అణ్వాస్త్రాల తయారీలో నిమగ్నమై వుంది. వారికి సహకరించేందుకు సదా సంసిద్ధమనే బ్రిటిష్ వారు తమ అణ్వాస్త్రాలను కూడా మార్చి కొత్తవి పె ట్టమని అడుగుతున్నారు. ఇంతకూ ఇవన్నీ ఎవరిపైకి ఎక్కుపెడుతున్నారని నాకు సందేహం కలుగుతుంటుంది. ఒసామా బిన్‌లాడెన్‌పైనా? మీ పైనా? నా పైనా? చైనాపైనా? పారిస్ పైనా? ఎవరికి తెలుసు? ఇదో బాల్యాంక విపరీతమని మాత్రం మనకు తెలుసు. అణ్వాస్త్రాలు కలిగివుండటం, వాటిని ఉపయోగిస్తా మని బెదిరించడం.. ఇదే ఇప్పటి అమెరికా రాజకీయ తాత్వికతకు మూలసూత్రం... అమెరికాలో లక్షలాది మంది తమ ప్రభుత్వ చర్యల పట్ల ఆగ్రహావేశాలతో వున్నారు. మనన్ను కష్టపెట్టుకుంటున్నారు.కాని వారింకా ఒక రాజకీయ శక్తిగా వున్నట్టు కనిపించదు. అయితే ఈ ఆందోళన, అనిశ్చితి,భయం రోజురోజుకూ పెరుగుతున్నదే గాని తగ్గే సూచనలు లేవు.

ఒక రచయిత జీవితం దుర్బలమైనది. అది దాదాపుగా అనావృత కార్యకలాపం. దాని గురించి మేము రోదించనవసరం లేదు. రచయిత ఒక నిర్ణయం తీసుకుంటాడు. దానికి కట్టుబడి ఉంటాడు. అయితే అన్ని పవనాలు నిన్ను తాకుతాయనడం చెప్పడంలో సత్యం ఉంది. ఆ పవనాలలో కొన్ని శీతవాయువులు సుమా. నీవు నీ సొంతంగా వాటిని తట్టుకోవాలి. ఎలాంటి ఆశ్రయమూ నీకు దొరకదు. రక్షణ ఉండదు – అబద్దాలాడితే తప్ప. అటువంటి పరిస్థితిలో నీవు నీ రక్షణ చేసుకోవాలి. ఇందుకై నీవు రాజకీయవేత్తవు కావచ్చు. అద్దంలోకి చూసినప్పుడు మన ఎదుట ఉన్న ప్రతిబింబం కచ్చితమైనదని భావిస్తాము. అయితే ఒక మిల్లీమీటరు కదలండి. ప్రతిబింబం మారి పోతుంది. వాస్తవంగా దరీదాపులేని ప్రతిబింబాల వైపు చూస్తున్నాము. అయితే కొన్నిసార్లు రచయిత అద్దాన్ని పగులగొట్టవలసి వస్తుంది. ఏమంటే అద్దానికి ఆవలివైపున ఉన్న సత్యం మనలను తేరిపార చూస్తుంటుంది. మన మేధో కట్టుబాటు ఎంత దృఢమైనదైనా, అచంచల మైనదైనా, నిష్కాపటమైనదైనా, పౌరులుగా మన జీవితాలు, మన సమాజాల నిజమైన సత్యాన్ని నిర్వచించవలసి ఉన్నదని నేను విశ్వసిస్తున్నాను. ఇదెంతో బృహత్తర బాధ్యత. దీనిని నిర్వర్తించడం మన విధి. మన రాజకీయ దార్శనికతలో ఇటువంటి కర్తవ్యానికి తావు లేనప్పుడు, మనం దాదాపుగా కోల్పోయిన మానవ హుందాను పునరుద్ధరించ గలమని ఆశాభావానికి ఆస్కారమూ లేదు.

**(2007 నోబుల్ స్వీకార ప్రసంగం)**

సాహిత్య ప్రస్థానం వార్షిక సంచికకు

శుభాకాంక్షలతో.......


# ప్రగతి విద్యానికేతన్

## ప్రగతి నగర్

ప్రగతి నగర్ గ్రామ పంచాయితీ

జె.యన్.టి. ఎదురుగా, నిజాంపేట్ పోస్టు

కూకట్‌పల్లి, హైదరాబాద్ - 500 090

ఫోన్ : 040 - 65195968/67



Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**


160



# ఆపన్నులకు ఆసరా.. మహిళలకు అభయ హస్తం



## ఆసరా లేని వారిని ఫించన్లతో ఆదుకుంటున్న రాష్ట్ర ప్రభుత్వం










వృద్ధులు, వితంతువులు, వికలాంగులు తమ జీవనాన్ని కొనసాగించడానికి ఎవరిపైనా ఆధారపడకుండా ఆత్మస్థైర్యంతో బ్రతకడానికి చేయూతనిచ్చే విధంగా మన రాష్ట్ర ప్రభుత్వం నెలనెలా ఫించన్లు అందించి వారికి సామాజిక భద్రత కల్పించి వెన్నుదన్నుగా నిలిచింది. వృద్ధాప్యంలో మహిళలు నిర్లక్ష్యానికి గురి కాకుండా ఉండటానికి ఫించన్లు అందజేస్తోంది. స్వయం సహాయక సంఘాల ద్వారా 60 ఏళ్ళ వయస్సు నిండినవారు గరిష్ఠంగా రూ.2,200/- వరకూ ఫించన్లు అందుకోవడంతో వారికి వృద్ధాప్యం అంటే బెంగ లేకుండా పోయింది. ఇది దేశంలోనే అత్యంత ఆదర్శవంతమైన పథకంగా పేరుగాంచింది. ఈ పథకాల అమలు మెరుగుపరిచేందుకు స్మార్ట్ కార్డుల ద్వారా చెల్లించడంతో నేరుగా లబ్ధిదారులకే చెల్లించబడుతుంది.


**ఎన్. కిరణ్‌కుమార్ రెడ్డి**
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి


### ఫించన్లు కార్యక్రమం అమలు

- వికలాంగులకు రూ.500 ఫించను
- మొత్తం 72 లక్షల మంది లబ్ధిదారులు
- 43 లక్షల మంది వృద్ధులకు ఫించన్లు
- 18.8 లక్షల మంది వితంతువులకు ఫించన్లు
- 8.84 లక్షల మంది వికలాంగులకు ఫించన్లు
- 1.44 లక్షల మంది చేనేత కార్మికులకు ఫించన్లు
- లక్ష మంది గీత కార్మికులకు ఫించన్లు
- రూ.1,574.92 కోట్ల ఫించన్ల చెల్లింపు
- ఫించన్లు స్మార్ట్‌కార్డుల ద్వారా చెల్లింపు
- ఎయిడ్స్ బాధితులకు చికిత్స కోసం ఫించను
- ఎయిడ్స్ బాధితులకై 2010-11 లో రూ.1932 కోట్ల బడ్జెట్ కేటాయింపు

### అభయహస్తం కార్యక్రమం అమలు

- 43 లక్షల మంది మహిళా సభ్యులు
- సభ్యులు జమ చేసిన సొమ్ము రూ.322.08 కోట్లు
- ప్రస్తుతం ఫించను పొందుతున్న వారు 3.8 లక్షలు
- గరిష్ఠంగా రూ.2,200/- వరకు ఫించను
- 14 లక్షల మంది కొత్త సభ్యులు
- అకాల మరణానికి గురైన 13,063 మందికి రూ.36.7 కోట్ల చెల్లింపు
- పథకంలోని సభ్యుల పిల్లలకు రూ.31.87 కోట్లు ఉపకారవేతన చెల్లింపు

జారీ చేసినవారు : సమాచార, పౌరసంబంధాల శాఖ

161

25 X 16=400Sqcm (100CC)



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | VPVM01A108 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 165 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | gayatri |
| పేజీలు విడదీసినది | gayatri |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |